# పోతన

ఉస్మానియా యూనివర్సిటీ వారిచే
డాక్టరేట్ పట్టము పొందిన సిద్ధాంతగ్రంథము

డాక్టర్. హరి శివకుమార్

శ్రీ కృష్ణ ప్రచురణలు
వరంగల్

ప్రమాదీచ – వైశాఖపౌర్ణమి
17-5-1973
ప్రతులు – 1000


రచన :
**కేతన**
(KETANA)

రచయిత :
**డా॥ హరి శివకుమార్**
(DR H SIVA KUMAR)

ప్రచురణ :
**శ్రీకృష్ణ ప్రచురణలు**

ముద్రణ .
**డి. ఎస్ ఎంటర్‌ప్రైజెస్, హైద్రాబాదు**

**మూల్యము 12-00**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు చేసిన ఆర్థికసహాయముతో ముద్రితము.

ప్రతులకు :

1. **శ్రీ హరి రాధాకృష్ణమూర్తి గారు**
   శ్రీ విహార్, శ్రీకృష్ణకాలనీ, వరంగల్.
2. **ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
   రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాదు—3.
3. **మాధవి బుక్ సెంటర్**
   Opp ఆర్యసమాజ్ మందిర్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్-27.

# ఆశీస్సు

తిక్కనగారితో సన్నిహితుడుగా ఉండి ఆయనకు దశకుమారచరిత్రమును వ్రాసి అంకితముచేసిన కేతనార్యు డన్న కవిని గూర్చిన బహువిధములయిన పరిశోధనాఫలితాంశములతో నున్న ఒక సిద్ధాంతవ్యాసమే ఈ గ్రంథము. ఇది మూడు విధములుగా నున్నది. దశకుమారచరిత్రమును గూర్చి ఒకటి. ఆంధ్ర భాషాభూషణమును గూర్చి ఒకటి. విజ్ఞానేశ్వరమును గూర్చి ఒకటి.

దశకుమారచరిత్రము సంస్కృతమున కలదాని కనువాదము. ఈ కథా కావ్యముయొక్క అనువాదమును చేయుటలో కేతనార్యుగు మూలకారుడైన దండిమహాకవికి ఎంతగా న్యాయము చేసినా డన్న విషయ మిందు మూడవ అధ్యాయమున లోతులను స్పృశించునట్లుగా ఉన్నది. మరియు నిట్టి అనువాద కావ్యములలో అనువాదకునియొక్క స్వతంత్రమైన బుద్ధివైభవములక్షణ మిట్టి దని నిక్కచ్చిగా చెప్పుటకు ఎంత జాగ్రత్త కావలయునో ఎంత పరిశ్రమ చేయవలయునో ఆరే డెనిమిది అధ్యాయములు చూచిన తెలియును ఈవిధముగా ఆంధ్రమున కథాకావ్యప్రక్రియకు కేతన ఏమి దోహదము చేసినదియు శ్రీ శివ కుమారుడు చక్కని నిరూపణము చేసినాడు.

ఆంధ్రభాషాభూషణము తెలుగుభాషలో వ్రాయబడిన మొదటి తెలుగుభాషా వ్యాకరణము. ఆంధ్రభాషాసహజలక్షణము నెరిగి కేతన తన వ్యాకరణమును రచించి తరువాత వచ్చిన ఆంధ్రభాషావ్యాకరణరచయితలకు మార్గదర్శకుడైన వైనమును శ్రీ శివకుమారుడు సోపపత్తికముగా నిర్ణయము చేసిచూపినాడు. ఈ విషయమున చేసిన కృషి ముఖ్యముగా రెండు, ఆరు, ఏడు అధ్యాయములం దున్నది.

విజ్ఞానేశ్వరము తెలుగులో వచ్చిన మొదటి ధర్మశాస్త్రగ్రంథము. యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరుని వ్యాఖ్య కలదు. దానిమీది ప్రీతివల్లనే తన యనువాదమునకు ఆ పేరు పెట్టుకొనినాడు. ఈ ధర్మశాస్త్రగ్రంథమును బహు

కోణములనుండి పరిశీలించి మూడు నాలు గైదు అధ్యాయములందు శ్రీ శివకుమారుడు మూలానువాదములను సరిపోల్చియు, మార్పులను చేర్పులను సూచించియు, ఆచార వ్యవహారముల ప్రాధాన్యమును విచారించియు పారిభాషిక పద ప్రయోగ విషయమును నిరూపించియు, తన కూలంకషమైన కృషిని సముచితముగా ప్రదర్శించినాడు.

ఇందుకుతోడు అనేకములయిన ఆసక్తిదాయకములును, పరిశోధనకార్య క్రమ సందర్భమున బయటపడిన స్ఫురించిన విశేషవిషయములతో నున్న అనుబంధములు, ఈ సిద్ధాంతగ్రంథము విలువను పెంచుచున్నవి

ఈ విషయమును గురించిన ప్రత్యేకవ్యాసము లేవియును లేవు. శ్రీ శివకుమారుడు ఈ విషయమున విశిష్టకృషి చేసినాడు. విషయము పరిమితము కావున విస్తృతాధ్యయనము, సునిశితపరిశీలనముల కవకాశము లభించి పరిశోధనా ధ్యేయము నెరవేరినది.

కష్టనష్టముల కోర్చుకొని తదేకదీక్షతో పనిచేసి ఈ సిద్ధాంతగ్రంథమును వ్రాసి డాక్టరేటు పట్టమును పొంది మా విద్యావంశము మర్యాదను నిలబెట్టిన శ్రీ శివకుమారునకు శ్రీరస్తు.

వరంగల్
1౮—5—1973

కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

హరి రాధాకృష్ణమూర్తి                                   శ్రీలక్ష్మి



సౌమ్యహృదికి శ్రీవిద్యా ప్రసంగ మతికి, ప్రదిత సుదికి బహుజ్ఞతానిదికి తండ్రి
కట్టి తండ్రికి దగిన యర్ధాంగలక్ష్మి, నన్ను గని పెంచినట్టి పుణ్యవతి తల్లి
కలషు సాహిత్యకృషిఫలంబైన యట్టి, సుకృతి నర్పణ గావించి సుకృతి నౌదు.

— శివకుమార్

# కృతజ్ఞతలు

కాలేజీలో బి. ఏ. చదివే రోజులనుంచీ, ఎం. ఏ. చేసి, పిహెచ్ డి. చెయ్యాలనే సంకల్పం మనస్సులో బాగా మెదులుతూఉండేది. అయితే ఆర్థికపరిస్థితులు నా సంకల్పాన్ని జంకించేవి ఎందుకంటే- మే ముండేది వరంగల్‌లో. ఎం ఏ చెయ్యాలంటే హైద్రాబాద్ వెళ్లాలి. రెండుసంవత్సరాలు చదవాలి. రెండు సంవత్సరాలు హైద్రాబాద్‌లో ఉండట మంటే మాటలా ? కనీసం రెండు వేలన్నా కావాలి. మా ఆర్థికపరిస్థితి ఈ ఖర్చును తట్టుకోగలదికాదు అయినా ఈ పరిస్థితులలో మేము వృద్ధిలోకి రావాలనే దృఢసంకల్పంతో ఎట్లాగో హైద్రాబాద్ పంపించి ఎం. ఏ. చేయించారు మా నాన్నగారు. రెండేళ్లూ ఎట్లా గడిచాయో- అదంతా భగవత్కృప! తరవాత పిహెచ్. డి కి వెళ్తే కనీసం ఉపకారవేతనమన్నా లభిస్తుంది గదా, దానితో ఇబ్బంది ఉండదు- అనే సంకల్పంతో పిహెచ్. డి.కి దరఖాస్తు పెట్టుకొన్నాను ఆ సంవత్సరమే ఎం. ఏ. పాసైన నాకు బోధనానుభవం లేకపోవటం ఒకటి, వయస్సులో చిన్నవాణ్ణి కావటం ఒకటీ, ఆటంకాలుగా పరిణమించినాయి. ఆ రెండు అడ్డంకులను తొలగింపజేసి నన్ను ఈ పరిశోధనలో ప్రవేశపెట్టినవారు 'కవిసమ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణ' డా॥ విశ్వనాథ సత్యనారాయణగారు వారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు

ఆరోజులలో మద్రాస్ విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా ఉండిన శ్రీ నిడదవోలు వేంకటరావుగారిని ఒకసారి కలిసి, నా పరిశోధనాభిలాషను వెల్లడించి, ఏదైనా ఒక విషయాన్ని సూచింపవలసినదని కోరగా, వారు "కేతన- ఆతని కృతులు" అనే విషయాన్ని సూచించారు. విషయం చిన్నదైనా, విస్తృతాధ్యయనము, నిశితపరిశీలనము చేయటానికి అవకాశం లభిస్తుందనే ధ్యేయము ఆ విషయంలో నాకు ఉత్సాహాన్నిచ్చింది ఇట్టి పరిశోధనావిషయనిర్ణయం చేసిన శ్రీ నిడదవోలు వేంకటరావుగారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు.

నా అభిలాష నెఱిగి, అదే విషయాన్ని గురించి పరిశోధన చేయటానికి నాకు అవకాశం కల్పించినవారు గురుపూజ్యులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు. వారి సహృదయతకు హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు.

మొదటినుంచీ అన్నివిషయాలలోనూ సముచితసలహాల నిస్తూ శిష్యవాత్స ల్యంతో నా భవిష్యజ్జీవనానికి మార్గోపదేష్టలై తీర్చిదిద్దుతూ వచ్చినవారు ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారు వారికి హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనలు.

ఎంతో ఆదరణతో, ఎంతో ఆప్యాయతతో అడుగడుగునా తమ అమూ ల్యోపదేశములతో నా శక్తియుక్తులను వెలికి లాగి.నాచే ఈ పనిని పూర్తిచేయించిన వారు డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రిగారు. వారి ఆదరాభిమానాలకు హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు.

పరిశోధనాకాలమున ఉపకారవేతన మిప్పించిన ఉస్మానియా విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ డి. ఎస్. రెడ్డిగారికి హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనలు.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించటానికి దయతో నాల్గువేల రూపాయ లిప్పించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ పి. వి. నరసింహారావు గారికి ఎంతోకృతజ్ఞుణ్ణి

ఈ గ్రంధప్రచురణకు అనుమతించిన ఉస్మానియా విశ్వవిద్యాలయాధి కారులకు కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంతగ్రంథము పిహెచ్. డి. పట్టమునకు అర్హమైనదని నిర్ణయించిన ఆచార్య శ్రీ గంటిజోగి సోమయాజి గారికి, డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారికి కృతజ్ఞుణ్ణి.

అన్ని విషయాలలోనూ, అన్ని సందర్భాలలోనూ చేదోడువాదోడుగా నిలిచినవారు మా నాన్నగారు బ్రహ్మశ్రీ హరి రాధాకృష్ణమూర్తిగారు; మా అన్న గారు శ్రీ హరి కుమార పద్మనాభశాస్త్రిగారు; మా తమ్ముడు చి॥ హరి సనత్ కుమారు. వారి సహాయసహకారాలకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

పరిశోధనాసమయంలో ఉచితసలహాల నిచ్చి ఈ నా సిద్ధాంతవ్యాసానికి మెరుగులుదిద్దిన పూజ్యులు డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారికి ఎంతో కృతజ్ఞుణ్ణి.

కాగితం కరువుగా ఉన్న ఈ రోజులలో నా పుస్తకానికి కావలసిన కాగితాన్ని అందించటంలోను, ముద్రణవిషయంలోను సహకరించిన ఆప్తులు డా॥ జి. వి సుబ్రహ్మణ్యంగారికి, శ్రీ వి. విశ్వనాధంగారికి ఎంతో కృతజ్ఞుణ్ణి.

ముఖపత్రాన్ని తీర్చిదిద్దిన ఆప్తమిత్రులు శ్రీ మడిపడగ బలరామాచార్యులు గారికి, బ్లాకులు చేసియిచ్చిన 'మూర్తి ప్రోసెస్'వారికి, అందంగా అచ్చువేసి ఇచ్చిన డి. ఎస్. ఎంటర్‌ప్రైజెస్‌వారికి కృతజ్ఞతలు!

ఈ బృహత్కార్యంలో సహకరించినవారు ఎందరో మహానుభావులు!

అందరికీ వందనాలు!

హైదరాబాద్
17–5–1973

హరి శివకుమార్

# విషయసూచిక

# మూలఘటిక కేతన

## కేతనకు పూర్వ మాంధ్రవాఙ్మయ స్థితి

ఆంధ్రవాఙ్మయమున పంద్రెండు, పదుమూడు శతాబ్దములు విజ్ఞాన విషయికముగను, మతవిషయికముగను, మిక్కిలి ప్రాముఖ్యము వహించు చున్నవి.

తెలుగుభాషయందు లభ్యమగుచున్న సాహిత్యగ్రంథములలో నన్నయ కృత భారతభాగమే ప్రప్రథమ మైనదిగా కానవచ్చుచున్నది. అంతకుపూర్వ మా భాషలో నేవైన కావ్యము లుండెనో లేవో స్పష్టముగా తెలియదు. కాని యంతకు పూర్వము ఛందోమయమైన కవిత్వ ముండినట్లు కొన్ని శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. రేనాటి చోళులును, తూర్పు చాళుక్యులును క్రీ. శ. 6 వ శతాబ్దమునుండి వ్రాయించిన శాసనము లన్నియు గద్యమయములుగా నున్నవి. తరువాత వెలసిన కొన్ని శాసనములలో తరువోజ, మధ్యాక్కర, సీసము మొదలగు దేశిఛందస్సుతో గూడిన పద్యములు కనబడుచున్నవి ఇట్లు నన్నయకు పూర్వము కూడ కొంత (ఛందోమయమైన రచన) కవిత్వమున్న మాట నిజమే యైనను కావ్యము లేవియు లభ్యములు కాకుండుటచే నాతడు రచించిన భారతభాగమే యాదికావ్యముగా పరిగణింపబడుచున్నది.[2] నన్నయ భట్టు తనకు పూర్వము శాసనస్థమైన భాషను సంస్కరించి, నిర్దుష్టము చేసి భారతరూపమున గ్రంథస్థము గావించి శబ్ద(వాగను)శాసను డైనాడు.

ఇంతలోనే ఆంధ్రవాఙ్మయము మార్గ దేశి భేదములచే రెండు పాయలైనది. సంస్కృతపద బహుళమైన సమాసభూయిష్ఠమైన భాషయు, చంప కోత్పల మాలాది సంస్కృత వృత్తములును, పురాణప్రసిద్ధమైన యితివృత్తమును గలది మార్గకవిత్వ మనియు, దీర్ఘసమాస రహితమై దేశ్యపద ప్రచురమై

---

1. ప్రా. యు. – పుట 367.

వ్యవహారప్రసిద్ధము లగు ప్రయోగములతో గూడిన భాషయు, దేశీయములైన ద్విపద-తరువోజ-రగడ-సీసము మొదలైనవి గల్గిన చందస్సును, పౌరాణికము గాక స్థానికప్రాధాన్యము కల్గిన ఇతివృత్తమును కల్గినది దేశికవిత్వ మనియు పిలువబడినది[1]. నన్నయ మార్గకవిత్వమునకు దారితీయగా ఆ త్రోవను తప్పించి దేశికవిత్వమునకు దారితీసినవారు శివకవులు. కాని ఈ శివకవులును సంపూర్తిగా దేశిమార్గము ననుసరించి రనుటకు వీలులేదు. ఏలయన పాల్కురికి సోమనాథుని అనుభవసార వృషాధిపశతకములును, మల్లికార్జున పండితుని శివతత్త్వసారమును మార్గకవితయందు వ్రాయబడి దేశిమార్గమున కపవాదములై కన్పట్టుచున్నవి కాని వా రెక్కువ ప్రాధాన్యమును దేశికవిత్వమునకే ఇచ్చుట వలన నన్నయ యసంపూర్ణముగా వదలివేసిన భారత మాగిపోవుటయే కాక, యన లా మార్గకవిత్వము నాదరించి యనుసరించిన కవియే లేకపోయినాడు.

ఇట్టి పరిస్థితులలో దేశకవితామార్గమున బోవుచుండిన కవితాస్రవంతిని తిరిగి మార్గపద్ధతికి మార్చిన వాడు తిక్కన సోమయాజి. అతని యనుచరు లగు కేతన, మారన, బయ్యన మొదలగువారును మార్గపద్ధతినే యనుసరించి దానికి బలము కూర్చినారు.

### కేతనకాలపు రాజకీయ మత పరిస్థితులు

మతవిషయికముగ కూడ నీ రెండు శతాబ్దులును మిక్కిలి ప్రాముఖ్యమును వహించుచున్నవి బౌద్ధము నరికట్టి హైందవధర్మమును పునరుద్ధరించవలె నన్న వైదికమతోద్యమము క్రీ. శ. 8 వ శతాబ్దములో నారంభమైనది. ఆ యుద్యమ ప్రారంభకుడు శ్రీశంకరుడు దానికి మిక్కిలి బలము చేకూర్చిన వాడు కుమారిలభట్టు[2]. అప్పటినుండియు వైదికమతమునకు ప్రాధాన్యము పెరుగజొచ్చినది. బౌద్ధము పూర్తిగా నడుగంటినది క్రీ. శ. 11, 12, 13, శతాబ్దులలో నాంధ్రసామ్రాజ్యము నేకచ్ఛత్రముగా పాలించిన కాకతీయులు పూర్తిగా శివారాధకు లగుటచే వైష్ణవము కూడ నామమాత్రావశిష్ట మైనది. ఇదే సమయమున శ్రీరామానుజు డుద్భవించి క్రీ. శ. 12 వ శతాబ్దియందు విశిష్టాద్వైతమును స్థాపించినాడు. కాని యా రోజులలో ఇంకను జైనము మాత్రము ప్రబలముగా నుండినట్లు శాసనములవలనను, కావ్యములవలనను తెలియు

1. ప్రా యు.—పుట 369. 2. తె వి. స. ౧-331.

చున్నది రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళుని కాలములో గుంటూరు జిల్లాలోని మునుగోడు గ్రామము జైనక్షేత్రముగా నుండినట్లు తెలియవచ్చుచున్నది. అక్కడ జైనమును గూర్చిన మూడు శాసనములు కానవచ్చినవి[1]. కాకతీయరాజులలో కడపటి రాజైన రెండవ ప్రతాపరుద్రుని కాలమున గూడ (క్రీ. శ 1295- 1323) ఓరుగంటి యందు జైను లుండినట్లు అప్పయాచార్యుని 'జినేంద్రకళ్యాణాభ్యుదయ' మను గ్రంథమువలన తెలియవచ్చుచున్నది[2]. దీనివలన 12, 13 శతాబ్దములలో శైవముతోపాటు జైనముకూడ వర్ధిల్లుచుండినట్లు స్పష్టమగుచున్నది. కేతన దశకుమారచరిత్ర పంచమాశ్వాసములో 'క్షపణక విహారము' (బౌద్ధ విహారము)ను 'జైనపల్లె' యని మార్చుట యా నాటి జైనమతముయొక్క యస్తిత్వమునే వ్యక్తపఱచుచున్నది[3].

ఇదే సమయమున ఉత్తరహిందూదేశమునుండి మహమ్మదీయుల దండయాత్రలు దక్షిణదేశమునకు సాగినవి[4].

ఇట్టిదశలో నైతిక న్యాయశాసనబద్ధమైన సాంఘిక జీవిత విధానముల నేర్పరుచుటకు హైందవసంస్కృతి కాటపట్టులైన మను, యాజ్ఞవల్క్య, పరాశరాది ధర్మశాస్త్రములకు వ్యాఖ్యానములు, నూతన ధర్మశాస్త్రములు బయల్దేరినవి.

మత వైజ్ఞానిక పరిస్థితు లిట్లున్న కాలమున నుద్భవించి తదనుగుణముగా గ్రంథరచనము కావించినవాడు కేతన.

### కేతన కాలము

కేతన తన దశకుమారచరిత్రమును తిక్కన కంకిత మిచ్చుటవలన నాతడు తిక్కనకు సమకాలీను డని విశదమగుచున్నది. తిక్కన కాలము దాదాపు క్రీ. శ. 1210 నుండి 1300 వఱకని చారిత్రకులును పరిశోధకులును నంగీకరించియున్నారు[5]. కావున కేతన కూడ అప్పటివాడే కావలయును[6].

---

1. తె వి స. ౧-550.
2. తె వి. స. ౧-551
3. దశకు 5_39.
4. తె. వి స. ౧-335... 337.
5. ఆం. క. త. 2—పుట 239; తి· కా త.—పుట 3.
6. ఆం. క 3—పుట 68.

కేతన గ్రంథములు

దశకుమార చరిత్రము, ఆంధ్రభాషా భూషణము, విజ్ఞానేశ్వరము, అను మూడు గ్రంథములను కేతన రచించెను

కేతన ఆంధ్రభాషాభూషణ పీఠికలో, తిక్కన మెచ్చునట్లుగా తాను దశకుమారచరిత్రమును రచించినట్లు చెప్పికొనినాడు[1]. దీనినిబట్టి దశకుమార చరిత్రము, ఆంధ్రభాషాభూషణము కంటె ముందు రచించబడిన దనుట స్పష్టము. కాని విజ్ఞానేశ్వరమును ఆంధ్రభాషాభూషణములో కాని, ఆంధ్రభాషాభూషణమును విజ్ఞానేశ్వరములో కాని, పేర్కొనకపోవుటచే ఈ రెంటిలో నేది ముందు రచించెనో నిశ్చయించుట కష్టము.

కేతనకు గల 'అభినవదండి' బిరుద మాతని మూడు గ్రంథము లందును కన్పడుచున్నను, ఈ బిరు దాతనికి దండి దశకుమార చరిత్ర నాంధ్రీకరించుట వలననే వచ్చినట్లు కన్పట్టుచున్నది. తరువాత నతడు దానిని దశకుమార చరిత్రలో కూడ వ్రాసికొనియుండవచ్చును.

కేతన స్వవిషయము

దశకుమారచరిత్రను బట్టి కేతన కౌండిన్యసగోత్రు డనియు, మారయ సంకమల కుమారు డనియు, ఇంటిపేరు మూలఘటికవారనియు, అధ్యయన పరు డనియు, వేంగిదేశమునందలి వెంటిరాల యను నగ్రహారమున కగ్రణి యనియు, అభినవదండి బిరుదాంకితు డనియు, సంస్కృతాది భాషల కావ్య కర్తృత్వమున పేరువడసిన వాడనియు, ప్రోలనార్యునికి ననగు దమ్ము డనియు, బండారు కేత దండాధీశునకు మఱది యనియు తెలియుచున్నది[2]. ఆంధ్ర భాషాభూషణ విజ్ఞానేశ్వరములను బట్టి యాతడు వివిధకళానిపుణు డనియు, కవిజనమిత్రు డనియు, ఖ్యాతశుభచరితు డనియు, వృషకేతనపాదద్వయీనికేతను డనియు, సత్కవి యని భూతలమున నతిశయంబు బొందిన వాడనియు, తెలియుచున్నది[3]. ఇంకను విజ్ఞానేశ్వరమును బట్టి యాతడు మితసత్యహిత వచోనిపుణు డనియు, విజ్ఞానానూనమనస్కు డనియు, నానాశాస్త్రజ్ఞు డనియు,

1. ఆం భా. భూ –4. 2. దశకు. 1–23.
3. వి.– ఆ.–2, 4; ఆం. భా భూ.–2,3.

వినయభూషణు డనియు తెలియుచున్నది[1]. అంతేకాక, కవిత్వము చెప్పి, మెప్పించుటకు బ్రహ్మకు కూడ తరము గాని, ఉభయకవిమిత్రుని, దశకుమార చరిత్ర చెప్పి మెప్పించిన ప్రౌఢ యాతడు[2].

కేతన తండ్రి మారయ యని దశకుమార చరిత్రములోను, మ్రానయ యని ఆంధ్రభాషాభూషణ విజ్ఞానేశ్వరములలోను గన్పట్టుచున్నది. ఇట్లే తల్లి పేరు సంకమ యని దశకుమారచరిత్రలోను, గంగమ యని విజ్ఞానేశ్వరములోను గన్పడుచున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయమున గల విజ్ఞానేశ్వర తాళపత్ర ప్రతి యందు 'సంకమ' యనియే యున్నది[3]

మూలఘటికవారు బ్రాహ్మణు లని గుంటూరుజిల్లాలోని నాదెండ్ల మూల స్థానేశ్వరదేవాలయ ముఖమండప శాసనమును (క్రీ. శ 1158) బట్టి తెలియు చున్నది. అదియునుగాక కేతన తా నార్వ్యుడ ననియు[4], అగ్రహారాధిపతి ననియు[5], అధ్యయనపరుడ ననియు చెప్పికొనుటవలన బ్రాహ్మణు డని స్పష్టము.

నాదెండ్ల శాసనములో మూలఘటికాన్వయ వేమనాయకుడు దండనాయకు డని యుండుటవలన కేతనకు పూర్వము దాదాపు ఒక శతాబ్దిముందియు మూల ఘటిక వంశమువారు ప్రభుత్వోద్యోగులై యుండినట్లు స్పష్టమగుచున్నది[6].

కేతన బండారుకేత దండాధీశునకు మఱది నని చెప్పుకొనినాడు. ఈ బండారువా రారువేల నియోగు లనియు, నొక శాసనములో కౌండిన్య గోత్రుడైన మూలఘటిక కామదేవ ప్రెగ్గడ యని యుండుటవలన నీతడు నియోగిశాఖీయు డగుట నిశ్చయ మనియు శ్రీ చాగంటి శేషయ్యగా రభిప్రాయ

---

1. వి.-ఆ -3. 2. ఆం భా భూ -4

3. Mss. Acc. No. 322-1st. leaf.

4. ఆర్యశబ్ద మా కాలమున బ్రాహ్మణుల కుపయోగింపబడెడి దని ఈడుపుగల్లపాడు చెన్నకేశవస్వామి దేవాలయ శాసనము వలన స్పష్టము (S.I.I.-248)

5. అగ్రహారము అధ్యయనపరులకు దాన మీయబడిన గ్రామము

6 S. I. I.-133.

పడినారు[1]. కాని ఆ కాలమున వైదిక నియోగి భేదములుండె ననుట కాధారములు లేవు.

ఈ 'కేతన' యను పేరు ఆ రోజులలో చాల తఱచుగా పెట్టుకొనబడుచుండె నని దశకుమారచరిత్రము వలననే స్పష్టమగుచున్నది. అందలి పీఠికలో వర్ణింపబడిన తిక్కన వంశవృక్షమున నీపేరు నలుగురైదుగురకు కన్పట్టుచున్నది[2] ఈడుపులపాడు చెన్నకేశవస్వామి దేవాలయస్తంభ శాసనమున 'కేతనార్య'యని చాలసార్లు ప్రయుక్తమైనది.అంతేకాక యీ శబ్ద మాడువారికైనచో 'కేత, కేతక, కేతమ, కేతసాని' యనియు, మగవారి కైనచో 'కేతన, కేతమనాయకు'డనియు, ప్రయుక్త మైనట్లు శాసనములవలన స్పష్టమగుచున్నది[3]. కావున కేతన నామ మా రోజులలో సామాన్యముగా పెట్టుకొనబడుచుండెడిదే '

ఈతడు తననుగూర్చి దశకుమారచరిత్ర పీఠికలో వ్రాసికొనిన పద్యములలో 'సంస్కృతాది భాషల కావ్యకర్తృత్వమున నుతిగన్న వాడ' నని చెప్పుకొనినాడు కాని ఆ సంస్కృతాది భాషలన నేవియో, అం దే కావ్యములు రచించెనో తెలియవచ్చుట లేదు. కాని, ఆంధ్రభాషాభూషణముపై ప్రాకృత కన్నడ వ్యాకరణముల ప్రభావము గమనించినచో సంస్కృతాంధ్రములతోపాటు ప్రాకృత కన్నడములందును కేతనకు మంచి ప్రవేశముండినట్లు స్పష్టమగుచున్నది.

ఈతని నివాసము వేంగిమండలములోని 'వెంటిరాల' యని చెప్పికొనినాడు. ఈ పేరు గల గ్రామమిప్పుడు పశ్చిమ గోదావరి - కృష్ణామండలములలో లేదనియు, ఏలూరుతాలూకాలోని 'విజయరాయి' యను గ్రామమే యిది కావచ్చుననియు శ్రీ చాగంటి శేషయ్యగా రభిప్రాయపడుచున్నారు[4].

'అభినవదండి, కవిజన మిత్రుడు' అనున వాతని బిరుదములు.

---

1. ఆం. క. త 3-పుట 59.  2. దశకు 34, 40, 45, 58,64

3 S. I. I —నం. 248. కామసానికేత, కేతమ నాయకుడు-S.I.I.—97
కేతక — ,, —102.
బొల్లె కేతమ - ,, —107
కేతసాని, కేతన — ,, —185.

4 ఆం కం త — 3 పుట 86.

దశకుమార చరిత్రము

దశకుమారచరిత్రము సంస్కృత గద్యకావ్యములలోనేకాక, కథాకావ్యము లలోకూడ మిక్కిలి ప్రసిద్ధమైనది.

ఇది తిక్కన మహాకవి కంకితము చేయబడినది. ఇది యాతనికి తిక్కనపై గల గౌరవాభిమానములను వ్యక్తముచేయుచున్నది.

తిక్కన మహాకవియే కాక, మంత్రియు నై యుండుటచే పలువురు కవు లాతనిని మెప్పించుటకు ప్రయత్నించుచుండెడివారు అనంతామాత్యుని ముత్తాత యగు బయ్యనమంత్రి తిక్కనను మెప్పించి 'భవ్యభారతి' యను బిరుదు సంపాదించినట్లు భోజరాజీయమునందు పేర్కొనబడినది[1]. అట్లే కేతన కూడ తిక్కన కంకితము చేసినా డని చెప్పుటకు వీలున్నది. కాని కేతన అప్పటికే అగ్రహారాధి పతియై వాసిగాంచినవా డగుటవలన నాతడు తిక్కననుండి ధనము గాని, యున్నతపదవులను గాని, యాశించినవాడు కాక, కేవల మాతనిపై గల గౌరవాభిమానములచే నంకితము గావించిన వాని వలె కన్పడుచున్నాడు. అంతే కాక,ఒక సమకాలీన మహాకవికి అంకితము చేసినవారిలో కేతనయే ప్రప్రథముడు.

ఈ దశకుమార చరిత్రములో కొన్ని విశేషాంశము లున్నవి. తిక్కన గృహనామము 'కొట్టరువు' వారని మొట్టమొదటిసారిగా చెప్పినది కేతనయే[2].

ఇట్లే తిక్కన నిజస్థానము నెల్లూ రని కొందఱు, గుంటూ రని కొందఱు భేదాభిప్రాయము గల్గియున్నారు. కేతన తన దశకుమారచరిత్ర పీఠికలో "కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానంబగు విక్రమసింహపురంబు నభివర్ణించెద"నని చెప్పి తిక్కన నిజస్థానము నెల్లూ రని తేల్చినాడు (దశకు.1-10).

తిక్కనకు ఉభయకవిమిత్ర బిరుదము భారతరచనమునకు పూర్వమే వచ్చినట్లు దశకుమారచరిత్రలోని

అభినుతుడు మనుమభూవిభు,
సభ దెనుగున సంస్కృతమున జతురుండై తా

1 తి సో – పుట 68    2 ఆం క త. ౨ – పుట 144.

నుభయకవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కడు దాల్చెన్. (దశకు. 1—92.)
అను పద్యమువలన స్పష్టమగుచున్నది.

కేతన దశకుమారచరిత్ర పీఠికలో తనను గూర్చి సంస్కృతాది భాషల కావ్యకర్తృత్వమున నుతిగన్నవాడ నని చెప్పికొనుటవలన యాతనికి సంస్కృతాంధ్రములయందే కాక కొన్ని యితర భాషలయందును ప్రవేశముండినట్లు తోచుచున్నది. ఆ భాషలలో కర్ణాటకభాష యొకటి కావచ్చు ననియు, దాని ప్రభావ మాతనిపై బడినదనియు, నూహించుట కవకాశము లున్నవి. కేతనకు దాదాపు ఒక శతాబ్ది పూర్వము న కర్ణాటకభాషయందు నాగవర్మ యను నతడు 'కర్ణాటకభాషాభూషణ' మను గ్రంథమును రచించినాడు. దాని ప్రభావ మాంధ్రభాషాభూషణముపై గొంత యున్నది. మఱియు కేతనకు పూర్వమే చౌండరాజు దండి దశకుమారచరిత్రమును 'అభినవ దశకుమారచరిత' యను పేర కన్నడ భాషలోని కనువదించినాడు. దీని ప్రభావమును కేతన దశకుమారచరిత్ర పై కొంత కలదు. కావున కేతన పేర్కొనిన సంస్కృతాది భాషలలో కన్నడమును ఉన్న ట్లూహించుట కవకాశము కల్గుచున్నది.

### ఆంధ్రభాషాభూషణము

కేతన రెండవ కృతి యగు నాంధ్రభాషాభూషణము నిజముగా నాంధ్రభాషకు భూషణప్రాయమైనది. ఏలయన నిది తెనుగున వ్రాయబడిన ప్రథమాంధ్ర వ్యాకరణము. ఈ విషయమును కేతనయే తన ఆంధ్రభాషాభూషణమున చెప్పికొనియున్నాడు[1]. ఇది చాల చిన్న గ్రంథ మయినను, ఇందనేక ప్రయోగములు రూపనిష్పాదన చేయబడి, పద్యరూపమున సూత్రీకరింపబడినవి. కాని యిందు సాధింపబడని యనేక ప్రయోగము లా కాలపు భాషయందు కన్పడుచుండుటచే నిది యసంపూర్ణ గ్రంథ మనియే చెప్పక తప్పదు. ఇది తెలుగున వ్రాయబడిన ప్రథమాంధ్ర వ్యాకరణమగుటచే తరువాతి వ్యాకర్త లందఱకు నిది యొరవడి గ్రంథ మైనది.

1. ఆం. భా. భూ. 5, 6, 10.

### విజ్ఞానేశ్వరము

మతవైషమ్యములచే జీర్ణించిపోయిన వేదోక్తమైన హైందవ సంప్రదాయముల నుద్ధరించుటకు ప్రాధాన్య మీయబడుటవలన, ఆ కాలమున అనేక ధర్మశాస్త్రములు, ధర్మశాస్త్రములకు వ్యాఖ్యలు బయలుదేరినవి. కాని యివి యన్నియు సంస్కృతముననే కలవు. దేశీయు లందఱకు నందుబాటులో నుండుటకుగాను దక్షిణదేశపు సంప్రదాయముల కాటపట్టయిన "విజ్ఞానేశ్వరీయము"ను గ్రహించి కేతన యాంధ్రమున కనువదించినాడు. కాని యాకాలమున పద్యమున కీయబడిన ప్రాధాన్యమువలన నిది కూడ పద్యరూపముననే సాగినది. అంతకు పూర్వ మేయితర దేశభాషలలోనికిని ధర్మశాస్త్రము లనువదింపబడకపోవుటచే కేతనయే ప్రథమ ధర్మశాస్త్రానువాదకర్త యైనాడు.

ఇట్లు కేతన రచించిన మూడు గ్రంథములును మూడు విధములుగా విశిష్టములై యున్నవి. ప్రథమ గద్యకావ్యాంధ్రీకర్తగను, ప్రథమాంధ్రవ్యాకర్తగను, ప్రథమ ధర్మశాస్త్రాంధ్రీకర్తగను, కేతన ఆంధ్రవాఙ్మయమున విలక్షణముగను విశిష్టముగను కన్పించుచున్నాడు.

### కేతన సమకాలికులు

కేతన దశకుమారచరిత్ర పీఠిక (1–12, 19)లో తన కాలమున నెల్లూరును మనుమసిద్ధిరాజు వైభవోపేతముగా పాలించుచుండినట్లు వర్ణించినాడు.

"వేడిన నర్థార్థి వృథపుచ్చ నేరని, దానంబు తనకు బాంధవుడు గాగ"– (దశకు. 1–66) అను పద్యమున తిక్కనకు పెదతండ్రికుమారుడైన ఖడ్గతిక్కనను పేర్కొనినాడు.

ఇట్లే కేతన మఱియొక పద్యమున (దశకు. 1–23) తాను బండారుకేత దండాధీశు మఱది నని చెప్పికొనియున్నాడు. ఈ బండారుకేతనను గూర్చి "చాటుపద్యమణిమంజరి" ప్రదమభాగమున నొక పద్య మున్నది–

"అలములోన నోడమికి నన్య వధూటుల దిక్కు వోమికిన్
మేలమికైన బొంకమికి మెచ్చినచో వృథ గామికిన్ మహీ

పాలన కీర్తిలోలు డగు బండరు కేతన నీతి సాటికిన్
నాలుక మడ్డు పట్టెద మనంబున రాముని నిల్పి వేడుకన్"[1].

ఈ బండారు కేతన కున్న విశేషణములను దశకుమార చరిత్రలోని బండారు కేతన కున్న విశేషణములను (దశకు. 1—23) పోల్చి చూచినచో నిరువురు ఒకరి వలెనే కన్పట్టుచున్నారు. అదియును గాక కేతన యీతనిని 'దండాధీశు' డని పేర్కొనినాడు. కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగా రీతనిని 'బండారు కేత మంత్రి' యని పేర్కొనినారు. కాని ఆ పద్యమున నాతనికి 'మంత్రి' యని యున్నట్లు కన్పట్టదు. అంతేకాక 'అలములోన నోడమికి' యను పద్యారంభ మాతడు దండాధీశుడనియే ఋజువుచేయుచున్నది.

కేతన తన దశకుమారచరిత్రను తిక్కన కంకితము చేయుటవలన తిక్కన ఈతనికి సమకాలీను డని స్పష్టము.

ఇట్లు దశకుమార చరిత్రలో పేర్కొనబడినవారు కాక, మఱికొందఱు కవు లీతని సమకాలమున నున్నవారు ఆంధ్రవాఙ్మయమున గన్పట్టుచున్నారు:—

**పాల్కురికి సోమనాథుడు :** ఇతడు క్రీ. శ. 1160 నుండి 1240 వరకు జీవించిన ప్రసిద్ధ వీరశైవ కవి. బసవని యవతారముగా నెంచబడుచున్నాడు. సమస్త విద్యల నాకళించుకొన్న యుద్దండ పండితుడు. సర్వజ్ఞుడు. సారకవితా విశారదుడు. సంగీతశాస్త్ర పారగుడు. భృంగిరిటి గోత్రుడు. శివ కులీనుడు. అనుభవసారము, బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము, వృషాధిప శతకము, చతుర్వేద సారము, సోమనాథ భాష్యము ఇత్యాద్యనేక కృతులను రచించినాడు[2]. ఈతనిని కేతన సమకాలీనుడనుటకంటె, నీతని వృద్ధాప్యమున కేతన బాలుడై యుండె ననుట సమంజసము.

**యథావాక్కుల అన్నమయ్య :** ఇతడు సర్వేశ్వరశతక కర్త. ఈ శతకము 'సర్వేశ్వరా' యను మకుటముతో 142 వృత్తములు గలది. చూడికొండ సోమేశ్వరారాధ్యులవా రితని గురువు[3]

**బద్దెన :** ఈతడు నీతిశాస్త్ర ముక్తావళీ రచయిత. సుమతీశతకము నీతడు

1. చాటుపద్య ౧ పుట 92.
2. బసవపీఠిక—శ్రీబండారు శమ్మయ్య.
3. ఆం. క. త. 3—పుట 21.

వ్రాసె నందురు. ఇతనికి 'కావ్యబ్రహ్మ' యని బిరుదమున్నట్లు తెలియుచున్నది[1] ఇతని నీతిశాస్త్ర ముక్తావళి 150 పద్యముల చిన్న కావ్యము. కృష్ణామండలము లోని కృష్ణనాయనివరగ్రామ శాసనద్వయమును బట్టి యీతడు క్రీ. శ. 1261 ప్రాంతమువా డని శ్రీ జయంతి రామయ్య పంతులుగారు నిర్ణయించినారు[2].

**విశ్వేశ్వర దేశికులు :** ఇతడు శివతత్త్వరసాయన గ్రంథకర్త. కాకతీయ గణపతిదేవున కీతడు దీక్షాగురువు. కాకతి గణపతిదేవుడు మనుమసిద్ధికి సమ కాలికు డని సిద్ధేశ్వరచరిత్రవలన తెలియుచున్నది[3].

కావున నితడును కేతన సమకాలికుడే యగుచున్నాడు.

**శివదేవయ్య :** ఇతడు గణపతిదేవుని మంత్రి. ఇతని 'పురుషార్థసారము' నేడు లభించుట లేదు. ఇందలి పద్యములు దాదాపు ఎనుబదింటిని మడికి సింగన తన 'సకలనీతిసమ్మతము'న నుదాహరించినాడు. తిక్కన సోమయాజి గణపతి దేవుని జూడబోయినపుడు శివదేవయ్యను జూపుచు గణపతి దేవునితో—

''వసుమతీనాథ ! యీత డీశ్వరుడుగాని
మనుజమాత్రుండు గాడు పల్మారు లితని
యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి నేలు''[4]
మని చెప్పె నని చెప్పుదురు.

**అథర్వణాచార్యుడు :** ఇతడు క్రీ. శ. 1250 ప్రాంతము వాడని యందురు[5]. లిపి స్వరూపమును బట్టి క్రీ. శ. 12 వ శతాబ్ది వాడని డాక్టర్ బెర్నెల్ దొరగారి అభిప్రాయము[6]. లక్షణగ్రంథోదాహృతులను బట్టి యీత డొక ఛందస్సును, భారతమున విరాటోద్యోగభీష్మపర్వములను వ్రాసె నని తెలియుచున్నది కాని ఈ గ్రంథములు నేడు లభించుట లేదు. ఇతడు సంస్కృతమున త్రిలింగ శబ్దానుశాసనము, అథర్వణ కారికావళి యను రెండు వ్యాకరణములను రచించె నందురు[7].

---

1. ఆం. క. త. 3—పుట 13.
2. ఆం. వా చ. స.—పుట 714.
3. సిద్ధే. —పుట 114...118.
4. ఆం క. త. 3—పుట 55.
5. ఆం. వా. చ. స.—పుట 724.
6. ఆం. క. స.—పుట 2.
7. ఆం. క. త. 3—పుట 70.

**కవి భల్లటుడు :** కేతన కాలముననే కవిభల్లటుడు బేతాళపంచవింశతిని చంపూరూపమున నాంధ్రీకరించెనట. కాని అది నేడు లభ్యమగుట లేదు[1].

**భాస్కరుని కేతన :** ఈతడు క్రీ. శ. 1230–1250 ప్రాంతమువాడు. ఈతడు 'కాదంబరి' నాంధ్రీకరించెనట. పెదపాటి జగ్గకవి తన ప్రబంధ రత్నాకరములో నీతనిని పేర్కొనినాడు. కస్తూరి రంగకవియు నీతని పద్యములను రెంటి నుదహరించియున్నాడు. దశకుమారచరిత్ర పీఠికలో, "కవితకు ముఖ్యుడీత డన గామిత వస్తువు లిచ్చువాడు" (1–36) అను పద్యమున నీతనిని కేతన పేర్కొనియున్నాడు. ఈతని గ్రంథ మిప్పు డలభ్యము[2]

**నండూరి కేతన :** ఇతడు 1230 ప్రాంతమువాడు. కువలయాశ్వచరిత్ర రచయిత ఈతడే కావచ్చునని శ్రీ శిష్ట్లా రామకృష్ణ శాస్త్రిగారి యభిప్రాయము[3].

## కేతనపై సమకాలీన రచనల ప్రభావము

ఆంధ్రవాఙ్మయమున కది యారంభదశ. వాఙ్మయమునందలి ప్రక్రియాభేదముల నన్నింటిని గలిగి, యప్పటికే పరిణిత స్థితి నందియుండినది సంస్కృతవాఙ్మయము. అందువలన తెలుగుకవులు సంస్కృతమునందలి ప్రసిద్ధగ్రంథములను గ్రహించి యాంధ్రీకరించుట ప్రారంభించిరి. ఇట్లాంధ్రీకరించుటలో కేవలము కావ్యములనే కాక శాస్త్రగ్రంథములను గూడ వారు గ్రహించి యుండిరి. నన్నయ చంపూపద్ధతికి పునాది వేసినాడు. పాల్కురికిసోమన శతక వాఙ్మయమునకు ద్రోవచూపినాడు. బద్దెన శివదేవయ్యలు నీతిశాస్త్రము వైపునకు దృష్టిమరల్చినారు. పావులూరి మల్లన గణితశాస్త్రము వైపునకు మరలినాడు. కావున నాకాల మొక ప్రయోగాత్మకమైన కాలముగా కన్పట్టుచున్నది. ఇట్లే కేతన కూడ కొన్ని ప్రయోగములను చేసినాడు. అందువలననే యాతని గ్రంథములందు వైవిధ్యమేర్పడి యాతనికి వ్యక్తిత్వము చేకూరినది. అప్పటి కింకను గద్యకథాకావ్యముల నెవ్వరును ఆంధ్రీకరించలేదు. అట్లే ధర్మశాస్త్రము నే యితర భాషలలోనికిని మార్చలేదు. మఱియు తెనుగునకు తెనుగున వ్యాకరణ మెవ్వరును వ్రాయలేదు. అందువలన కేతన తనకు పూర్వ ముండిన ప్రక్రియల ననుసరింపక మూడు క్రొత్త మార్గములను త్రొక్కి ఒక ప్రత్యేకత నార్జించు కొనినాడు. ఈ ప్రత్యేకతయే నాతని కాంధ్రవాఙ్మయమున నొక విశిష్టతను సమకూర్చినది.

---

1. ఆం. వా. చ. స.–పుట 461. 2 ఆం. వా. చ. స.–పుట 755, 756.
3. ఆం. వా. చ. స.–పుట 759.

# 1. కథాకావ్య ప్రక్రియా వివేచనము

కథాకావ్య మన్నంతనే యీ మాటలందు మన కొక వైరుధ్యము గోచరించును. కథలేని కావ్య ముండునా? కావ్యమునకు వస్తు వుండితీరవలయును. వస్తువు లేని కావ్యరచనము ఉండదు. కావ్య చమత్కృతి చూపించుటకు వస్తువాధారము. చిత్రరచనమునకు కుడ్య మెట్టిదో, కావ్యరచనమునకు కథ యట్టిది. వృక్షాది వర్ణనములు బాల్యవిచేష్టాది వర్ణనములు, మొదలైనవి కూడ కావ్యములే కదా! కథ యుండవలసిన యవసర మేమి యని యడుగవచ్చును. కథ వస్తుపర్యాయము. అచ్చట వృక్ష బాల్య విచేష్టాదులు వస్తువు లగుటవలన నవి కూడ కథలే. అందుచేత కథలేని కావ్యముండదు కాబట్టి కథాకావ్య మన్న మాటకు అర్థము వేరు. కథా కావ్యము లన్నంతనే మన దృష్టికి తగులునది కాదంబరి, దశకుమార చరిత్రము, శుకసప్తతి మొదలైనవి. కాని రామాయణ భారతాదులు గావు. రామాయణ భారతాదుల యందలి కథలు ప్రసిద్ధములైనవి. పురాణవ్యక్తులకు సంబంధించినవి. కథాకావ్యముల యందలి కథ లిట్టివి కావు. ఈ కథలన్నియు కల్పితములు. నమ్మరాని అద్భుత సంఘటనలతో అమానుష కృత్యములతో గూడియున్నవి. ఈ కథలయందు పౌరాణికత్వముకంటె లౌకికత్వమే మిక్కుటముగా నుండును. ఈ లౌకికత్వమైన ఆరోపితము కాని స్వభావ సిద్ధము కాదు. ఈ కథలయందు కవికి ప్రధానమైనది కథాకథనము. కథా చమత్కారము. అనగా వస్తురసము అది బహుశః అద్భుతరసము. తత్ర తత్ర తక్కిన రసములు. రచయిత లోకజ్ఞుడైనచో లోకానుభవము నంతయు పఱచి చూపించును కవితాగుణము కలవాడైనచో కావ్యగుణములను సంధానించును. కాని ప్రధానమైనది కథ యుత్పాద్య మగుట. అద్భుతావహ మగుట. ఈ గుణములను బట్టి కథాకావ్యము లన్న మాట పుట్టినది.

కథ యన్న మాటకు 'కథ్యతే ఇతి కథా' యని వ్యుత్పత్తి చెప్పవచ్చును. అనగా చెప్పబడునది యని యర్థము. కాని చెప్పబడినదియెల్ల కథయని వ్యవహ

రింపబడుట లేదు. అందుచేత కధ యనునదొక సంకేతము. ఒక నిర్దిష్టార్థము కలది. సంస్కృతమున పూర్వాలంకారికులు 'కథ, ఆఖ్యాయిక' యన్న పదములను నిర్వచించినారు. భామహుని దృష్టిలో కథ వేరు, ఆఖ్యాయిక వేరు ఆఖ్యాయికయందు నాయకుడు తన స్వచేష్టితమును గద్యమునందు చెప్పికొనును. ఇందలి ప్రకరణములకు ఉచ్ఛ్వాసము అని పేరు. ఎడనెడ వక్త్రాపరవక్త్రము లనెడి వృత్తములు భావ్యర్థశంసులుగా నుపయోగింపబడును. కధయందు వక్త నాయకుడు కాదు. కవి కాని, యితరులు కాని, కధకులుగా నుండవచ్చును. కన్యాపహరణము, సంగ్రామము, విప్రలంభము వర్ణితము కావలెను. ఉచ్ఛ్వాస విభాగ మిందులేదు. వక్త్రాపరవక్త్రము లిందుండవు. భాష సంస్కృతము కాని అపభ్రంశము కాని కావచ్చును[1]. భామహుడు చెప్పిన నీ లక్షణమునందు కథాఖ్యాయికలకు గల భేదము కేవలము చెప్పెడి తీరునకు సంబంధించినది. కాని విషయమునకు సంబంధించినది కాదు. ఈ భేదమును దండి యొప్పికొనలేదు. దండి "తత్కథాఖ్యాయికే త్యేషా యేకా సంజ్ఞా ద్వయాంకితా"[2] అని కథాఖ్యాయికలకు భేదము లేదని చెప్పినాడు. ఆఖ్యాయికలో నాయకుడు వక్తయగుట, కథలో వక్త అన్యుడగుట, ఇది యొక భేద కారణ మని వక్త్రవిశేషము. కాని భేదకారణ మనుటకు వీలులేదు. వక్త యెవడైన కావచ్చు విశేష మేమియు లేదు. వక్త్రాపరవక్త్రములచేత భావ్యర్థమును చెప్పుట కథలో కూడ నెందుకని బంధింపరాదు. కావున నిదియు భేదకారణము కాదు. ఆఖ్యాయికలో పరిచ్ఛేదమున కుచ్ఛ్వాస మనియు, కథలో లంబక మనియు, పేరుపెట్టుటవలన వచ్చిన విశేష మేమియు లేదు. పేరేదైనను పరిచ్ఛేదవాచియే • అందుచేత కథాఖ్యాయికలు ఒక్కటి గాని వేరు కాదు. పేర్లు మాత్రము భిన్నములు. "తత్కథాఖ్యాయికే త్యేషా యేకా సంజ్ఞా ద్వయాంకితా । అత్రైవాంతర్భవిష్యంతి శేషా శ్చాఖ్యాన జాతయః"[3].

దండి దశకుమారచరితలో భామహుని ఆఖ్యాయికా లక్షణములు, కథా లక్షణములు రెండును కన్పించును కొన్నిచోట్ల కథ కవి చెప్పును. కొన్ని చోట్ల యితరులు చెప్పుదురు. కొన్నిచోట్ల నాయకుడు చెప్పును. వక్త్రాపర వక్త్రము లిందు లేవు. గ్రంథమంతయు నుచ్ఛ్వాసములుగా విడదీయబడి

---

1. కావ్యాలంకారము 1-25, 29. 2&3. కావ్యాదర్శము 1-28

యున్నది. కన్యాపహరణ విప్రలంభ శృంగారములు వర్ణితములై యున్నవి. మొత్తము గ్రంథమును మరల రెండు భాగములు చేసి పూర్వపీఠిక, ఉత్తర పీఠిక, యని వానిని దండి వ్యవహరించెను. దండి దీనిని చరిత్ర మనినాడుకాని, ఎక్కడను దీనిని కథయని గాని, ఆఖ్యాయిక యని గాని పేర్కొనలేదు. కేతన దీనిని 'కథానికాయ' (దశకు 2-2) మనినాడు. దండి కించుక పూర్వకాలము వాడైన బాణుడు తన కాదంబరిని 'కథ' యని వ్యవహరించి నాడు. కాదంబరికిని దీనికిని దగ్గర పోలికలు ఇతివృత్తవిషయమున చాల గలవు. ఇతివృత్తములు రెండును నుత్పాద్యములు. శృంగారాద్భుతాది రసభూయిష్ఠములు. అమానుష కృత్యములతో నిండినవి. సామాన్యముగా లోకములో జరుగనివి, విశ్వసింపదగ నట్టివి. అనేకాద్భుత సంఘటనలతో కూడియున్నవి. రెండు కావ్యములందును భాష గద్యమగుట, బహువర్ణనములతో గూడియుండుట యొకటి. ఈ లక్షణము లను బట్టి దశకుమారచరితకు కూడ 'కథ' యను ప్రఖ్యాతి తరువాతి కాలమున వచ్చియుండవచ్చును. లేదా దండి దీనిని కథ యని కంఠోక్తిగా పేర్కొనక పోయినను భామహోక్తములైన కథాఖ్యాయిక లక్షణములు రెంటిని మేళవించి కావ్యాదర్శమునందు తాను చెప్పిన లక్షణములకు లక్ష్యముగా దీనిని వ్రాసియుండ వచ్చును. ఏమైనను అద్భుత సంఘటనలతో నిండి, ఉత్పాద్యవస్తువు కలిగిన ఈ కావ్యమును కథాకావ్యమనుటయే సముచితముగా నుండును.

కథ యనునది యేదియో యొక నీతిని కాని, ఒక సత్యమును గాని, ఒక తత్త్వమునుగాని, తేలికగా బోధించుటకు నుపయోగించు సాధనావిశేషముగా జన్మించియుండును. ఉపనిషత్తులలో గహనమైన జగత్తత్త్వము నుపదేశించుటకు ఆఖ్యాయికలు సాధనములుగా గ్రహింపబడినవి. పంచతంత్రము, హితోపదేశము మొదలైన కథలు కూడ ఒకానొక నీతినో, ధర్మమునో పాఠకుని హృదయము నకు హత్తుకొనునట్లుగా చెప్పుట కేర్పడిన సాధనములు. గుణాఢ్యుని బృహత్కథ లుప్తమైనను, కథాసరిత్సాగరమును బట్టి బృహత్కథయందలి కథాస్వరూపము మనకు తెలియనగును. కథాసరిత్సాగరమునందలి కథలు అనేకాద్భుత సంఘట నలతోడను, అమానుష కృత్యములతోడను, అలౌకిక సన్నివేశములతోడను నిండియుండును. మరియు మానవ స్వభావమునందు నిగూఢములైయున్న బహు విచిత్ర విషయములన్నియు, మానవజీవితమునందలి వైచిత్రియంతయు, మానవ మనస్తత్త్వమందలి లోతుపాతులన్నియు, కథాసరిత్సాగరమునందలి కథలయందు

వ్యాఖ్యాతములై యున్నవి. బృహత్కథ, రామాయణ భారతముల తరువాత, అనంతరకవులపై నెక్కువ పలుకుబడిని సంపాదించినది. భాసుని నాటినుండి కూడ కవులు బృహత్కథవంటి నుత్పాద్యకథను ఆ పరిమితిలో వ్రాయవలయు నని తరువాత కవులకు కోరిక యుండుట యసంభవము కాదు. ఈ కోరిక చేతనే బాణుడు బృహత్కథను తన కాదంబరి పీఠికయందు పేర్కొనె ననుట యసమంజసము కాదు. దండి బృహత్కథను గూర్చి దశకుమారచరిత్రలో చెప్పకపోయినను, అట్టి యాశ యతనికి కూడ నుండవచ్చును. బృహత్కథకు సంగ్రహ స్వరూపములైన బృహత్కథామంజరి మొదలైన సంస్కృత గ్రంథ ములలో, దశకుమారచరిత్రలోని కొన్ని కథలకును, కొన్ని సన్నివేశములకును పోలికలు కన్పించుచున్నవి. కొన్ని నామములుగూడ యథాతథముగ కన్పించు చున్నవి. కాని దండి కేవల కథారచయిత మాత్రమే కాదు. అతని ఆశ యింకను గొప్పది. కేవల అద్భుతరస భూయిష్ఠమైన కథాసృష్టి చేయుట యతని యాశ యము కాదు. దానిని సర్వకావ్య గుణోపేతముగ కూడ తీర్చిదిద్దుట యతని యాశ. దండికి పూర్వము కథ గద్యములో చెప్పబడినను, పద్యములో చెప్ప బడినను, దాని కావ్య చమత్కారముకంటె కథాచమత్కారమే ప్రధానముగా నుండెడి దనవచ్చును. అసలు రచయితకు కావ్యచమత్కారమునందు దృష్టియే లేదనవచ్చును. కథాచమత్కారముతోపాటు కావ్యచమత్కారము గూడ జోడిం చిన వాడు బాణు డొకడు, దండి యొకడు.

దండి నాటికి కథాకావ్యలక్షణ మిట్లుండె నని మనము నిర్ధారించుకొన వచ్చును. కథయం దద్భుతరసము ప్రధానరసము. శృంగార హాస్య కరుణ వీర రౌద్ర భయానకాదులు అంగరసములు. కథయందు అమానుషకృత్యములు, అద్భుతకృత్యములు, సామాన్యదృష్టిచేత నసంభవవిషయములు మిక్కుటముగా వర్ణితము లగుచుండును. అట్లని కేవలము నేల వదలిన సాము కాదు. లోకపు తీరులు, బహువిధ వ్యాపకములు గలిగిన-బహువిధ స్వభావములు గలిగిన జనులు బహువిధములైన సాంఘికాచారములు, మోసములు, దొంగతనములు—ఒకటేమిటి, లోకము లోకమంతయు కథయందు పఱచబడి తళతళ మెరయుచుండ వలెను. ఇంతవర కిది వస్తువునకు సంబంధించినది. తరువాత కవి దీనియందు అష్టాదశ వర్ణనములు, బహువిధాలంకారములు, ఉక్తి వైచిత్రి, సంభాషణాచాతు ర్యము, కథన చాతుర్యము, పాత్ర చిత్రణము మొదలగు కావ్యగుణములను

సంధానము చేయవలయును. ఇది దండినాటి కున్న కథాకావ్య రచనాసామగ్రిగా మనకు గోచరించును. ఇట్టి కథాకావ్యమును వ్రాయవలెనన్న కవికుండవలసిన గుణములు ఎట్టివో మన మూహింపవచ్చును. కవి గొప్ప కల్పనాశక్తి కలవాడు కావలయును. లోకజ్ఞుడు కావలయును. గొప్ప పండితుడు కావలయును. గొప్ప భావుకుడు కావలయును. ఇన్ని గుణము లుండుటచేతనే దండి దశకుమారచరిత మును మహాకావ్యముగా వెలయింపజేయగలిగినాడు. లేనిచో వట్టి జక్కుల కథగా మిగిలిపోయెడిది. కథ కవి ప్రతిభాప్రసూతమే యైనను, కవి దానియందు చేసిన లోకానుసంధానమువలన, రసపోషణమువలన కావ్యమగును. ఇట్టి యద్భుతసంధానమువలన దశకుమారచరితము మహాకావ్యమై శాశ్వతమై నిలిచినది.

# 2. దండి - దశకుమారచరిత

**దండి**

ఆర్యావర్తమునకు పశ్చిమోత్తరదిశగా నున్న గుజరాత్ రాష్ట్రమున ఆనంద పురమను నొక బ్రాహ్మణాగ్రహారము గలదు. అందుండు కౌశికగోత్రులగు బ్రాహ్మణులు కొందరు అచలపురమునకు వలసపోయి యచట స్థిరనివాస మేర్పఱచుకొనిరి. వారిలో నారాయణస్వామి యను నత డొకడు. అతని కుమారుడు దామోదరుడు గొప్పకవి. ఆ దామోదరుడు 'గంధమాదన' మను గ్రంథమును, సంస్కృత ప్రాకృత భాషలలో అలంకారశాస్త్ర గ్రంథములను రచియించెను. అతనికి సింహవిష్ణువు, మనోరథుడు, అతిరోభుడు అను కుమారులుండిరి. వీరిలో మనోరథు డనువానికి దామోదర, సింహవిష్ణు, భవదాస, వీరదత్తులను నలుగురు పుత్రులు కల్గిరి. వీరదత్తుడు మూర్తీభవించిన పాతివ్రత్యమువంటిదై, సుగుణరాశియగు గౌరి నుద్వాహమయ్యెను. కాని వారికి ఆడపిల్లలేకాని మగ పిల్లలు కల్గలేదు. చివరకు దైవానుగ్రహమువలన వారికి ఒక మగశిశువు జనించెను. అతడే దండి.

దండికి సప్తమ వర్షముననే మాతృవియోగము సంభవించినది. ఉపనయనానంతరము పితృవియోగము కూడ సంభవించెను. ఇంతలో తమ కాశ్రయమిచ్చిన పల్లవరాజు శత్రువులచే జయింపబడెను. దక్షిణాపథమున కరువు కాటకములు సంభవించెను. దండి బంధుమిత్రులను వదలి, యనేక దేశములు సంచరించుచు, అనేక విద్యలందు ప్రవీణుడయ్యెను. కంచిలో మరల శాంతి నెలకొనిన యనంతరము దండి స్వదేశమున కేతెంచి, బంధుమిత్రులతో సుఖముగా నుండెను[1].

దండి శిల్పకళయందును మంచి చతురుడు. లలితాచార్యుడను నొక

---

1. అవ.కథా.-పుట 2, 3, 4.

మహాశిల్పి ఒకనాడు దండి వద్దకు వచ్చి, మహామల్లపురమున సముద్రపుటొడ్డున గల శేషశాయి విగ్రహము చేయి యొకటి శిథిలముకాగా తాను దాని నతికించితి ననియు, అపూర్వ కళాఖండములలో నొకటి యగు నా విగ్రహమునకు తన యతుకుదల సరిగా నున్నదో లేదో పరీక్షింపవలసిన దనియు ప్రార్థించెను. మరు నాడు దండి జయంత నారాయణుడు మొదలగు మిత్రబృందముతో బయలుదేరి వెళ్ళి ఆ విగ్రహమును దర్శించెను. దండియు, నతని మిత్రులును, విగ్రహమును మిక్కిలి సమీపమునుండి దర్శించినను, శిల్పి యదికిన హస్త మేదియో గుర్తింప లేక ఆ శిల్పినే యడిగిరి. లలితాచార్యు డంత తన శిల్పకళ సార్థకమయ్యె నని సంతసించి, వారికి నమస్కరించి వెడలిపోయెను[1].

దండియు నతని మిత్రులును నా శిల్పసౌందర్యమును దిలకించుచు మరి కొంత కాలము గడుపునంతలో నొక పెద్ద యెఱ్ఱతామర అలలమధ్య కదలుచు విగ్రహము వైపునకు వచ్చుచుండెను. వారట్లు చూచుచుండగనే ఆ కమలము శ్రీమహావిష్ణువు పాదకమలములంటి యాకస్మికముగా భూషణాలంకృతుడైన ఒక విద్యాధరునిగా మారిపోయి, ఆ మహావిష్ణువునకు ప్రదక్షిణ నమస్కారము లాచ రించి అంతర్హితమయ్యెను. ఇదంతయును గమనించుచుండిన రామశర్మయను దండి యనుయాయి తద్వృత్తాంతమును విశదపఱచవలసినదని కోరెను. అతని కోరిక నెరవేర్చుటకై దండి యనేకదినములు కఠిన నియమములతో మహా విష్ణుని ప్రార్థించెను ఒకనాడు దర్భశాయియగు దండికి, సరస్వతి స్వప్నమున సాక్షాత్కరించి, "కుమారా! ఆదిదేవుడైన శ్రీ మహా విష్ణువు నీ నియమ వ్రత మునకు మెచ్చినాడు. మానవులకు, గంధర్వులకు ప్రభువైన రాజవాహనుని చరిత్ర నీ మనోనేత్రమునకు గోచరమగుగాక!" అని యాశీర్వదించి యదృశ్య మయ్యెను[2]

మరునా డుదయమున దండి సంతోషముతో మేల్కాంచి, నిహితకృత్య ముల నిర్వర్తించి, కథాశ్రవణ కుతూహలురగు తన మిత్రుల రావించి, యవంతి సుందరి కథ సాంతముగ, పద్మము విద్యాధరుడగునంతవరకు చెప్పి తన చెలి కాండ్రను సంతోషపరచెను.

ప్రొఫెసర్ విల్సన్ వంటి పరిశోధకులు కొంద రీతని యసలుపేరు దండి

1. అవ. కథా.—పుట 4, 5   2. అవ. కథా.—పుట 5, 6

కాదనియు, చిన్న తనమున మిక్కిలి శృంగారిగానుండి, తదనంతరము ఆశ్రమ స్వీకారము చేసి, దండధారి యగుటవలన నీతనికి దండి యని పేరు వచ్చిన దనియు, నామార్థమునుబట్టి ఒక వాదమును లేపిరి. కాని వారి వాదము కేవలము ఊహామాత్ర కల్పితము[1]. కాని, ఈతనికి దండి యని పేరు వచ్చుటకు ఒక కారణము చెప్పవచ్చును. దండియను పేరు శివున కున్నది. దండి పితరులకు స్త్రీ సంతతియే కాని, పురుషసంతతి లేమిచే వారు శివునిగూర్చి తపస్సుచేసిరి. అతని యనుగ్రహము వలన నొక కుమారుడు పుట్టగా నాతనికి వారు దండియని పేరు పెట్టియుండవచ్చును[2].

క్రీ. శ. 1924 లో శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు క్రిమి దష్టమై నష్టమైపోవుచున్న 'అవంతి సుందరికథ', 'అవంతిసుందరి కథాసారము' లను సేకరించి దండి కృతముగా నిర్ణయించి ప్రకటించిరి. అవంతిసుందరి కథలో దండి భారవి మనుమడుగా పేర్కొనబడినాడు. భారవి క్రీ. శ. 570 ప్రాంతంలోని దుర్వినీతుని ఆస్థానమున నుండినవా డగుటచే, దండికాలము క్రీ. శ. 650 ప్రాంత మగును. శ్రీ అగషేగారును, శ్రీ జకోబీగారును కూడ పైవిధముగనే నిర్ణయించియున్నారు[3].

దండి దశకుమార చరిత, కావ్యాదర్శము అవంతిసుందరికథ, అవంతి సుందరి కథాసారములను రచించెను.

"ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవమ్ ।
దండినః పదలాలిత్యమ్, మాఘే సంతి త్రయో గుణాః ॥"

అను శ్లోకమును బట్టి దండి పదలాలిత్యమునకు వాసిగాంచినవా డని విశదమగు చున్నది.

"జాతే జగతి వాల్మీకౌ కవి యిత్యభిధా భవత్ ।
కవీతి తతో వ్యాసో కవయ స్త్వయి దండిని ॥"

అను శ్లోకమును బట్టి, ఇతనికి సంస్కృత వాఙ్మయమున వాల్మీకి, వ్యాసుడు, మొదలగు మహాకవులతో సమానమైన స్థాన మున్నట్లు వ్యక్తమగుచున్నది.

---

1. కీత్. ఉపో.—పుట 15.  2. దశకు. పరి.—అధ్యా. 1
3. Kane–H. S. P.-P. 90.

మమ్మటుడు, రుయ్యకుడు, విద్యానాధుడు, విశ్వనాధుడు, జగన్నాధుడు, అభినవగుప్తుడు, విన్నకోట పెద్దన, అప్పకవి, గంగాదేవి మొదలగువారు పలువు రీతనిని తమ గ్రంథములందు ప్రశంసించియున్నారు.

## సంస్కృత కథాకావ్య, గద్యకావ్యములు-దండి దశకుమార చరిత

సంస్కృతమున కథావాఙ్మయము అతి ప్రాచీనమైనది. బౌద్ధ వాఙ్మయ మునకు సంబంధించిన మహావైపుల్యసూత్రము సంస్కృతమున లభించిన కథాసాహిత్యములో మొట్టమొదటిది. ఋగ్వేదములో కథ లున్నవి. ఛాందో గ్యోపనిషత్తు వంటి ఉపనిషత్తులలోను, ప్రాచీన జైనసూత్రములలోను, బౌద్ధ వాఙ్మయమునకు చెందిన అవధానములలోను కథలు గలవు[1].

కాని స్పష్టముగా కథారూపమున నున్న గ్రంథములలో పేర్కొన దగి నది గుణాఢ్యుని "బృహత్కథ". ఇది పైశాచీ భాషలో వ్రాయబడినది. కౌశాంబి రాజైన ఉదయనుని కుమారు డగు నరవాహన దత్తుని సాహసకార్యము లిందు వర్ణింపబడినవి ఈ గుణాఢ్యుడు వ్యాస వాల్మీకుల కోవకు చెందినవాడు. కొంద రీతనిని వ్యాసుని యవతార మందురు. శివుని గణములలో నొకడైన భృంగీశ్వ రుడు శాపవశమున గుణాఢ్యుడై జన్మించి, ఆ శాప విమోచనార్థము బృహత్క థను రచించె నని "నేపాళ మహాత్మ్యము" నందలి ఒక కథవలన స్పష్టమగు చున్నది[2] బాణభట్టు, సుబంధువు, దండి, ధనంజయుడు మొదలగు వారంద రును దీనిని బాగుగా ప్రశంసించుటవలన క్రీ. శ. 10వ శతాబ్దమువఱకును బృహత్కథ యుండినట్లు స్పష్టమగుచున్నది. తదనంతరము కావ్యములలో దీనిని గూర్చిన ప్రశంస కానరాదు. ఈ గుణాఢ్యుని పోషించిన శాతవాహనరాజు క్రీ.శ. 78 వ సంవత్సరమున నివసించియుండినట్లు చారిత్రకులు నిర్ణయించుట వలన ఈ బృహత్కథ క్రీ.శ. 1 వ శతాబ్దపు దని స్పష్టము[3]. దీనిని నేపాళ దేశస్థుడగు బుధస్వామి యను నతడు "బృహత్కథా శ్లోకసంగ్రహ" మను పేరను, కాశ్మీర దేశస్థు డగు క్షేమేంద్రు డను నతడు "బృహత్కథామంజరి"

---

1. H. C. S. L.-P. 412.
2. "భారతీయ కధాసాహిత్యద బునాది-సంస్కృత దల్లియ కథాసాహిత్య"—ప్రజావాణి విశేషాంక—1964—పుట 9.
3. H. C. S. L.-P. 417.

యను పేరను, సోమదేవు డను నతడు "కథాసరిత్సాగర" మను పేరను, సంస్కృతమున వెలయించినారు. తరువాత వచ్చిన సంస్కృత కథాకావ్యములు చాలవఱకు ఈ బృహత్కథ నాధారముగా చేసికొనియే వెలువడినవి.

తరువాత పేర్కొనదగినది విష్ణుశర్మ కృత "పంచతంత్రము". క్రీ.శ.750 ప్రాంతములోనే దీనిని Abdullah Ibnal Mogaffa యను నతడు అరబ్బీ భాషలోనికిని, Burzoe అను పర్షియా వైద్యుడు పహ్లవీభాషలోనికిని అనువదించి యున్నారు. దీని ననుసరించి వెలసిన మఱియొక యుద్గ్రంథము "హితోపదేశము"[1].

ఈ పంచతంత్రము తరువాత చెప్పదగినది "సింహాసనద్వాత్రింశిక" లేక "విక్రమార్క చరిత్ర" మనునది. ఇది 32 కథల సంపుటి.

"శుకసప్తతి" యనునది 70 కథలు గల కథాకావ్యము. దేవసేనుని భార్యను పరపురుషగమనమునుండి తప్పించుటకు చిలుక చెప్పిన 70 కథలిందు గలవు.

"భేతాళ పంచ వింశతి" యనునది 25 కథలు గల్గిన కథాకావ్యము. ఇందలి కథ లన్నియు క్షేమేంద్ర సోమదేవుల గ్రంథములనుండియే గ్రహింపబడినవి. దీనిని జంభాలదత్తుడు గద్యమందు వ్రాసినాడు. దీని ననుసరించి వెంకభట్టు "బేతాళ వింశతి" ని రచించియున్నాడు[2].

మేరుతుంగుని "ప్రబంధ చింతామణి"యు, రాజశేఖరుని "ప్రబంధ కోశము"ను చారిత్రాత్మకములైన కథాకావ్యములు. హేమచంద్రుని త్రిషష్టి శలాకాపురుషచరిత్ర" మఱియు "పరిశిష్టపర్వము"లు దేశీయేతివృత్తము గల్గినవి[3].

పైన పేర్కొనబడిన కథాకావ్యము లన్నియు కేతనకు పూర్వముండినవే! కాని వీనిలో కథాసరిత్సాగరము, బృహత్కథామంజరి, పంచతంత్రము, దశకుమారచరిత అనునవి మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. ఈ గ్రంథరచయితలలో దండికి, సంస్కృత వాఙ్మయమున వాల్మీకి వ్యాస కాళిదాస మయూరాది మహా

1. H. C. S. L.-P. 423 to 428.
2. H. C. S. L.-P. 429.
3. H. C. S. L.-P. 430 & 431.

కవులతో సమానమైన స్థాన మీయబడినది. సంస్కృతాంధ్ర కవులు పలువురు తమ గ్రంథారంభమున సుకవి ప్రశంసలో దండిని ప్రశంసించినట్లు సోమదేవ, క్షేమేంద్ర, విష్ణుశర్మాదులను ప్రశంసించియుండలేదు. కావున దండికి కథాకావ్య కర్తగా నాటికే మంచి పేరు వచ్చినట్లు స్పష్టమగుచున్నది.

అంతేకాక గద్యకావ్యములలో గూడ దండి దశకుమారచరితమునకు విశేషఖ్యాతి గలదు. సంస్కృత గద్యకావ్యములలో హర్షచరితమని చెప్ప బడిన భట్టార హరిచంద్రుని "మాలతి" కాని, బిల్హణుని సూక్తిముక్తావళియందు పేర్కొనబడిన శిలభట్టారక గ్రంథముగాని, భోజుని "శృంగారమంజరి" గాని, రుద్రటుని "త్రైలోక్యసుందరి" గాని, జగన్నాథుని "అశవవిలాసము" గాని, కేవలము నామమాత్రావశిష్టముగనే యున్నవి[1].

ఉపలభ్యమానములై మిక్కిలి ప్రఖ్యాతముగా నున్నవి బాణుని హర్షచరిత-కాదంబరులు, దండి దశకుమారచరితము, సుబంధుని వాసవదత్త యనునవి. ఈ నాల్గు గ్రంథములలో దశకుమార చరిత ప్రసన్నతాగుణము తక్కినవాని యందు లేదు. కథాకావ్యమున కుండవలసిన ముఖ్యమైన గుణమిది. భాష పటువైనను మృదులమైనది. సంస్కృతమునందు (సమాసవిరళమైన రచన) సులభ సరళమైన శైలి వ్రాయుట కష్టము. ఈ రెండును దండియొక్క సొమ్ము. ఈ రెండు గుణములకు తోడు, దీర్ఘ వర్ణనలు లేకపోవుట యొకటి దశకుమారచరితములోని ప్రత్యేకత. వానివలన పాఠకుని దృష్టి కథనుండి భాషపైకి మరలదు. కథ నిరాఘాటముగ సాగిపోవుచుండును. బాణుని కాదంబరియందు—సమాస భూయిష్ఠమైన శైలీ కాఠిన్యము, సుదీర్ఘ వర్ణనలు, కథాగమనమునకు ప్రతిబంధకములై పాఠకునకు మిక్కిలి చిక్కులు కలిగించుచుండును. శ్రీ వీబర్ పండితుడు చెప్పినట్లు—బాణునిశైలి హిందూదేశపు మహారణ్యమువంటిది. అందు ముందునకు సాగిపోవుటకు సమాసము లనెడి వృక్షములను ఛేదించుకొనుచు పోవలయును. అయినను అర్థముకాని పదము లనెడి యనేక క్రూరమృగములు అడ్డువచ్చుచుండును[2]. ఇక సుబంధువు "ప్రత్యక్షర శ్లేషవిన్యాస వైదగ్ధ్యనిధి"[3] యగుటచే యాతని కవిత సర్వజనాదరణమును పొందలేదు. వీని తరువాత వెలువడిన ఆనందధరుని "మాధానల కథ"యు (10 శ.) ధనపాలుని "తిలక

1. H. C. S. L.-P. 445 to 447. 2. H. S. L.-P. 320.
3. H. S. L.-P. 310.

మంజరి"యు (10 శ.), సోడ్ఢలుని "ఉదయసుందరి కథ"యు (11శ.), వాదీభసింహుని "గద్య చింతామణి"యు (12 శ.) విద్యాచక్రవర్తి "గద్యకర్ణ మిత్రము" (క్రీ. శ. 1234) కేతనకు పూర్వమే రచింపబడిన గద్యకావ్యములే యైనను అంత ప్రసిద్ధికి రాలేదు. కావున కేతన వానిని గ్రహింపక ప్రసన్నతా గుణభరితమైన దశకుమారచరితనే గ్రహించి యాంధ్రీకరించినాడు.

ఇట్లు సంస్కృత కథాకావ్యములలోను, గద్యకావ్యములలోను గూడ విశిష్టత గల్గిన దగుటచే దశకుమారచరితమునే గ్రహించినాడు కేతన.

**దశకుమారచరిత వైశిష్ట్యము**

దశకుమార చరితమునకు శివరాముడు, గురునాధ కావ్యతీర్ధ, కవీంద్రాచార్య సరస్వతి, హరిదాస సిద్ధాంత వాగీశుడు, హరిపాద చటోపాధ్యాయుడు, అంబేద్కర్, గజేంద్రగడ్కర్, రేవతీకాంత భట్టాచార్యుడు, జీవానందుడు, తారానాధుడు అనువారు వ్యాఖ్యలు రచించినారు.

శ్రీ అగషేగారు విశిష్ట పరిశోధన సలిపి, దశకుమార చరితమునకును క్షేమేంద్రుని బృహత్కథామంజరికిని సన్నిహిత సంబంధము గలదని నిర్ణయించి యున్నారు. దశకుమార చరితములో బృహత్కథామంజరిలోని నాయకులు కొందరు పేర్కొనబడినారనియు, దర్పసారుడు అందలి (బృహత్కథామంజరిలోని) నరవాహన దత్తునకు సమకాలీనుడనియు, తారావళి, చండసింహుడు, సురతమంజరి, శూద్రకుడు మొదలగు పాత్రలు అందుండియే గ్రహింపబడినవనియు, నితంబవతి కథ యందలి పద్మావతికథ వంటిదే యనియు, అపహారవర్మ చంపానగరములోని ధనవంతుల ఇండ్లను దోచుట యందలి శివమాధవుల కథను బోలి యున్నదనియు, మంత్రగుప్తుడు కపటసన్న్యాసివేషమును ధరించుట యందలి శివుడు కపట సన్న్యాసి వేషమును ధరించుటను బోలి యున్నదనియు, జాతిస్మరత్వము రెంటియందును పేర్కొనబడినదనియు, కావున దశకుమారచరితమునకును క్షేమేంద్రుని బృహత్కథామంజరికిని దగ్గర సంబంధము కలదనియు, బృహత్కథామంజరికి మూలమైన బృహత్కథయే దశకుమార చరితమునకు మూలమనియు వారి అభిప్రాయము. అంతేకాక దండి తన అవంతిసుందరి కథలోను, 'కావ్యాదర్శము' లోను బృహత్కథను పేర్కొని

యుండుట, శ్రీ అగషేగారి అభిప్రాయమునకు బలముకూర్చినది[1]. కామపాలుడు శూద్రక శౌనకాదులతో పోల్చబడుట గమనించినచో వానికి ప్రసిద్ధములైన కొన్ని కథలనుండికూడ దండి తన దశకుమారచరితమునకు కావలసిన ఘట్టములను గ్రహించినాడనుట స్పష్టమని శ్రీ బి. ఆర్. శాస్త్రిగారి అభిప్రాయము[2]. కాని కథావిధానము ( Motif ) మాత్రము బృహత్కథామంజరినుండి గ్రహించినను, కథాకథన నైపుణ్యము ( Skill ) దండిదే[3].

దశకుమారచరితము పదిమంది రాజకుమారుల దిగ్విజయములను వర్ణించు పది కథల సంపుటి. ఇందు ప్రసక్తానుప్రసక్తముగా ఉపకథ లనేకములు ప్రతికథయందును నంతర్లీనమై యున్నవి. ఈ యుపకథలవలన ముందు జరుగబోవు వృత్తాంతమును తెలిసికొనవలెనను ఔత్సుక్యము ( Suspence ) చదువరుల కెక్కువగా నుండును. వీనికితోడు అనేక ఆకస్మిక సంఘటనలు జరుగుచుండును. అయినను ప్రధానకథ వెనుకబడుట యెచ్చటను జరుగదు. ఈ ఉపకథలను జెప్పునప్పుడు, ఆ యా చోట్ల వానికి తగిన ప్రాధాన్య మిచ్చినను తిరిగి ప్రధానకథ కుపక్రమించుట కవియొక్క సంవిధాన చాతుర్యము. ఇది దశకుమార చరితమున సర్వత్ర గోచరించును.

ఒక కథ యందు మరొక కథను ప్రవేశపెట్టుట ఒకానొక ప్రయోజన మాశించి కావింపబడును. విజ్ఞానలోచనుడు, విశాలబుద్ధి యగు మరీచివలన రాజవాహనుని జాడతెలియబరచుటకు, దండి యాతని (మరీచి) కథను అపహారవర్మకథయందు ప్రవేశపెట్టినాడు. ఇట్లే శకునజ్ఞానము ద్వారా రాజవాహనుని జాడ తెలియబరచుటకు పుష్పోద్భవుని కథలో బంధుపాలుని వృత్తాంతము వచ్చినది. అవంతిసుందరీ రాజవాహనుల వివాహముకొరకు విద్యేశ్వరుని కథ కల్పింపబడినది.

భామహ అగ్నిపురాణకర్తలు, ఆఖ్యాయిక కథలకు గల భేదము చెప్పుచు, ఇతివృత్తము ఆఖ్యాయికయందు నాయకునిచేతను, కథయందు కవిచేతను చెప్పబడునని చెప్పినారు. ఈ రెంటికిని భేదమే లేదని చెప్పిన దండి తన దశకుమార చరితములోని ఇతివృత్తమును కొంత కవిముఖమునుండియు, మరికొంత కథా

1. అవ. కథా. శ్లో. 7, 20; కాద.౧-38 2. దశకు. పరి—పుట 382...387.
3. దశకు. పరి.—పుట 389.

నాయకుల ముఖమునుండియు నడిపినాడు. కథ ప్రారంభమై రాజకుమారులు విడిపోవుట, రాజవాహనుడు మాతంగునికి సాయముచేసి తిరిగివచ్చుచు పుష్పోద్భవుని కలియుట వరకును గల కథ కవి చెప్పినట్లు నడచును. తదనంతరము ఒక్కొక్క కుమారుడును కలిసి, తమ తమ వృత్తాంతములను రాజవాహనునకును ఇతరులకును చెప్పుదురు. చివరకు వారందరును వసుమతీ రాజహంసులకు జెప్పుదురు. మరీచి కథ, పాంచాలవర్మ కథ, వసురక్షితుని కథ, కామపాలుని కథ వంటివి వారి ద్వారానే చెప్పబడినవి. ఇట్లనేక ముఖములనుండి నడచినను, కథాగమనమున నే భేదము గోచరింపక, కథలన్నియు ననుస్యూతముగా నుండును.

ఈ కథలను జెప్పు పద్ధతియందు గూడ కొన్ని (కథలు) పరాకాష్ఠ నొందినవి. ఉదాహరణకు— మరీచి తన కథను మఱియొకరు చెప్పినట్లు ప్రారంభించి చివరకు ఆ కథానాయకుడు తానే అని చెప్పికొనును. ఇట్లే అర్ధపాలుని కథలో కామపాలుడు తన కథను పూర్ణచంద్రునకు చెప్పును. పూర్ణచంద్రుడు దానిని అర్థపాలునకు చెప్పును. అర్థపాలుడు రాజవాహనాదులకు జెప్పును. ఆ సందర్భమున కామపాలుడు కూడ యచ్చటనే యుండుట గమనార్హమగు విషయము.

దశకుమారచరితములో ఒక కథయం దనుసరింపబడిన పద్ధతి మరియొక కథయం దనుసరింపబడదు. దేని కదే ప్రత్యేకమైన కథ.

దశకుమారచరితములోని కథలు ప్రారంభించుటయందే యొక ప్రత్యేకత కాన్పించను. ముఖ్యముగా పుష్పోద్భవ అర్థపాలుల కథ లీ సందర్భమున పేర్కొనదగినవి. వీరిరువురును చిన్న వయసుననే తమ తల్లి దండ్రులవద్దనుండి దూరమైనవారు. అందువలన వారి కథలు వారి పితరుల సమాగమముతో ప్రారంభమగును. ఇచట అద్వితీయ కల్పన చేయబడినది. రాజవాహనునికొఱకు వెదుకబోయిన పుష్పోద్భవుడు ఒక ఊరు చేరి యొక చెట్టుక్రింద విశ్రమించును. అది మధ్యాహ్న సమయము. అతనికి సమీపమున మనిషి చందమున ఒక నీడ అకస్మాత్తుగా కన్పించును. దాని కత డాశ్చర్య మొంది యాననమెత్తి భృగుపతనమ్ము చేయబోవు ఒకనిని గాంచును. వెంటనే ఘనమార్గమునుండి పడుచున్న యాతనిని పుష్పోద్భవుడు క్రిందపడకుండ పట్టుకొనును. అతడు చివర కతని

తండ్రియే యగును. తండ్రీకొడుకులు మాట్లాడుకొను సందర్భమున నొక స్త్రీ యార్తనాదము వినబడును. వారిరువురు నచ్చటి కేగుదురు. ఆమె చెప్పిన వృత్తాంతము వలన ఆమె తన తల్లియేయని పుష్పోద్భవుడు గ్రహించును. ఇట్టి సమాగమము కవియొక్క అద్వితీయ కల్పనాచాతుర్య ఘటితము. ఇట్లే యర్థపాలుని కథలో నర్థపాలుడు రాజవాహనుని వెదకుటకై బయలుదేరి, కాశీపట్టణము చేరి, విశ్వనాథుని ఆలయమున విచారగ్రస్తుడైన పూర్ణచంద్రుని గాంచును. అతని విచారమునకు కారణ మడుగగా, నతడు తన జీవితచరిత్రను, తాను మంచి స్థితికి వచ్చుటకు కారణమైన కామపాలుని చరిత్రమును, తత్కాలమున నా కామపాలున కేర్పడిన దురవస్థను, అర్థపాలునకు జెప్పెను. ఆ సందర్భమున అర్థపాలుడు, కామపాలుడు తన తండ్రి యని గ్రహించును. ఈ విధముగా నర్థపాలుని కథలో పూర్ణచంద్రుని కథ, పూర్ణచంద్రుని కథలో కామపాలుని కథ,కామపాలుని కథలో తారావళి కథ, క్రమముగా చెప్పబడి, వారి సంబంధములు వ్యక్తము చేయబడినవి. తారావళి కథ పూర్తియగువఱకును పై కథ లెందుకు చెప్పబడుచున్నవో పఠితలకు తెలియనే తెలియదు. తారావళి కథ పూర్తియైన వెంటనే పఠితల మనస్సున కుమారోత్పత్తిలోని అర్థపాల కథ స్ఫురించి, తారావళి కామపాలు రతని పితరులని తెలియును. ఇది అసామాన్య కల్పనాచాతుర్యము. ఇట్లే దశకుమార చరితములోని కథలు అతిచాకచక్యముతో నిర్వహింపబడినవి.

కథాకావ్యములలో ముఖ్యముగా అద్భుత కల్పనకు ప్రాధాన్య మెక్కువగా నుండును. అందుకొఱకు కొన్ని యలౌకిక సన్నివేశములు కల్పింపబడును. ఇవి సత్యదూరములే యైనను, బఠితలకు మిక్కిలి యుల్లాసమును గల్గించును. ఇట్టివి దశకుమారచరితములో చాలచోట్ల కన్పించును. రాజవాహనుడు పాతాళ లోకమును సందర్శించుట, మానసారుడు తపస్సుచేసి శివునివద్దనుండి యొక గదను పొందుట, అవంతిసుందరీ రాజవాహనులును—తారావళీ కామపాలురును-జాతిస్మరత్వముచే తమ పూర్వజన్మవృత్తాంతమును దెలిసికొనుట, రాక్షసునిచే నపహరింపబడుచుండిన కందుకవతి మరియొక బ్రహ్మరాక్షసిచే రక్షింపబడుట, ఇత్యా ద్యద్భుత సన్నివేశములు దశకుమారచరితములో ననేకము లున్నవి.

ఇతివృత్తము తరువాత కథాకావ్యములలో ముఖ్యమైనది పాత్రపోషణము. దశకుమారచరితములోని పదిమంది కుమారులును నగ్రజాతులవారు. అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వంశస్థులు. కావున వారి వారి ప్రవృత్తుల

ననుసరించి వారి వారి పాత్రలను జిత్రించుటలో దండి విశేష ప్రజ్ఞ చూపించి నాడు. దశకుమారచరితములోని ఇతర పాత్రల పేళ్లు వినుటతోడనే వారి వృత్తులును స్వభావములును వ్యక్తము లగుచుండును ఈ పాత్రపోషణమును స్థలాంతరమున వివరింతును[1].

పాత్రపోషణ తరువాత పేర్కొనదగినది సంభాషణాచాతుర్యము. ప్రసిద్ధాంగ్లసాహిత్య చరిత్రకారుడు హడ్సన్ చెప్పినట్లు — సముచిత సంభాషణము కథను ప్రసన్నముచేయుటయే కాక, అది రచయితయొక్క కథాకథన చాతుర్యమునకు చక్కని నిదర్శనము[2]. దశకుమారచరితములో అంతటను సముచితములు సమయోచితములు నైన సంభాషణలే కాని, మితిమీరిన సంభాషణలు ఎచ్చటను కానరావు. ఉదాహరణమునకు—అర్థపాలునికథలో సింహఘోషునికొఱకు అర్థపాల పూర్ణచంద్రు లిరువురును సొరంగ మొకటి త్రవ్వుచుండుగా నొక భూగ్రహమున మణికర్ణికయు, మరికొందరు స్త్రీలును కన్పిం-తురు. ఏ మహాకావ్యకర్తయో యైనచో నిచ్చట సులభముగా 30, 40 శ్లోకములలో వారిని వర్ణించుచు, ప్రధానకథను మరగుపరచెడివాడు. కాని అర్థపాలుడు ఆ రాత్రే సింహఘోషుని పట్టుకొనుట అవసరము. కావున దండి అతిసూక్ష్మపరిచయముతో వారు విడిపోయినట్లు వ్రాసి ప్రధానకథ కుపక్రమించినాడు. అట్లే కావ్యమం దంతటను సముచిత సంభాషణలే యున్నవి. కథాగమనమునకు కడ్డువచ్చు సంభాషణము లెచ్చటను కానరావు.

కథాకావ్యములందు కథకే ప్రాధాన్యము గాని, వర్ణనములకు గాదు. విస్తృతమైన వర్ణనములు కథాగమనమునకు అడ్డువచ్చును. కావున కథాకావ్య రచయిత సముచిత వర్ణనములనే వ్రాయవలయును. అట్లే దశకుమారచరితము నందు కథ నడ్డుమిత్రిప్పు వర్ణనము లెచ్చటను లేవు.

కథాకావ్యమునందు రచయిత దేశభేదమునుగూడ గుర్తింపవలయును. దశకుమారచరితమునందలి పదిమంది కుమారులును రాజవాహనుని వెదకుటకు పదిదిక్కులకు వెళ్ళినారు. అందువలన దండి ఆ కాలపు భౌగోళిక

1. చూ దశకుమారచరిత్ర-పాత్రపోషణము.

2. "A good dialogue greatly brightens a narrative, and its judicious and timely use is to be regarded as evidence of a writer's technical skill" (Hudson–P. 154).

పరిస్థితులను గూడ దృష్టియం దుంచుకొని దశకుమారచరితమును వ్రాసినాడు. ప్రొఫెసర్ విల్సన్ గారును, మార్క్ కోలిన్స్ గారును, ఇందలి భౌగోళిక పరిస్థితులను గురించి ప్రశంసించియున్నారు.

ఇట్లు అత్యద్భుత కల్పనాచాతుర్యము గల యితివృత్తమును సముచిత పాత్రపోషణ-సంభాషణ-వర్ణనాదులు గలిగినది దండి దశకుమారచరితము. ఇట్టి దశకుమారచరితమును తన యకుంఠిత రచనానైపుణ్యముచే తీర్చిదిద్దినాడు కేతన. అంతేకాక దీని నాంధ్రీకరించి కేతన రెండు ప్రయోజనములను సాధించి నాడు. ఒకటి, ప్రప్రథమముగా కథాసాహిత్యమును ఆంధ్రవాఙ్మయమున ప్రవేశ పెట్టుట. రెండవది, సంస్కృతమునందలి గద్యకావ్యముల నాంధ్రీకరించుటకు త్రోవ జూపుట. ఇవి అతనికి ఆంధ్రవాఙ్మయమున నొక విశిష్టస్థానమును గూర్చినవి.

ఆంధ్రవాఙ్మయమున కేతన ప్రథమ కథాకావ్య కర్తయగుటచే తరువాతి కవులు పలువురు దశకుమారచరిత నొరవడిగా చేసికొనియే తమ కథాకావ్య ములను రచించిరి. వెన్నలకంటి అన్నయ యీ దశకుమారచరిత మాధారమగ చేసికొనియే తన షోడశకుమార చరిత్రమును వ్రాసినాడు. కొంతమంది యితర కథాకావ్యకర్తలును ఈ దశకుమారచరిత మాధారముగా తమ కథాకావ్యము లందలి కొన్ని సన్నివేశములను జిత్రించికొనినారు. అది ముందు ముందు వివరింతును[1].

---

1. చూ. ఆంధ్ర కథాకావ్యములు-దశకుమార చరిత్ర.

# 3. దశకుమారచరిత్రము-అనువాదపద్ధతి

అనువాద మన్న మాటకు పదానుసరణ మను నర్థము సాధారణము. కాని తెనుగు కవు లెవ్వరును నీ పదానుసరణము చేయలేదు. నన్నయ తిక్కనల యనువాదపద్ధతి మిక్కిలి స్వతంత్రమైనది. నన్నయ తిక్కనలు నిజమునకుచేసి నది యనువాదము కాదు. మఱి మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడ తెనుంగున రచియించుట. అనగా వ్యాసమహర్షి అభిప్రాయములు ప్రకటితమగునట్లు భారతకథను తెనుగున చెప్పుట. నన్నయ తిక్కనలు తీసికొన్నది, వ్యాసుని యొక్క కథను, వ్యాసునియొక్క యభిప్రాయములనే గాని, వ్యాసుని పద్ధతిని, వ్యాసుని వర్ణనాదులను కాదు. అందుచేతవారి పద్ధతి స్వతంత్రమైనది. దీనిని యనువాద మన్నచో కథానువాద మనవచ్చును. అనగా నిందు మూలాను సరణము కథవరకు మాత్రమే.

రెండవది శ్రీనాథ పోతనాదులది. వీరి పద్ధతి యటు కథామాత్రాను సరణము కాదు. ఇటు ప్రతిపదానుసరణము కాదు. ఇది మధ్యేమార్గముగా నుండును. అచ్చటచ్చట స్వతంత్రకల్పనలు కల్గియున్నను వీరి పద్ధతియందు మూలగ్రంథములోని వర్ణనాదులు గూడ చాలవరకు ననువదితములుగా నుండును. వీనిని భావానువాదపద్ధతి యనవచ్చును.

మూడవది మక్కికి మక్కిగా వ్రాయుట.తు, వై, న, హి, కూడ పోకుండ ననువదించుట.

ఇవికాక కథను మాత్రము తీసికొని, దానిని పెంచి, స్వతంత్రకల్పనలతో చెప్పుట యున్నది. కాని దీనిని యనువాద మనరాదు ఈ తరగతికి చెంది నవి. మనుచరిత్రము, పారిజాతాపహరణము మున్నగు ప్రబంధములు.

కేతన, తిక్కన కాలమునకు చెందినవాడైనను అతని యనువాదము తిక్కన పద్ధతికి చెందినది కాదు. అతనికి చాల తరువాతి వాడైన శ్రీనాథా

దులకు చెందినది. మరియు కేతన యనువాదమునందు బహువైచిత్రి యున్నది. అది మూలము గద్యమునం దుండగా కేతన యనువాదము చంపువునందు వ్రాయుట ప్రాచీనాంధ్రకవులు, మొత్తముమీద చూచినచో కేవల పద్యమును గాని, కేవల గద్యమును గాని వ్రాసినవారు కారు నన్నయనుండి ప్రబంధా నంతరయుగమువఱకు చంపువే కావ్యపద్ధతిగా స్వీకృతమైనది. దీని కపవాదుగా నిర్వచనోత్తరరామాయణము వంటివి ఒండు రెండు గ్రంథము లున్నవి. కేతన చంపూపద్ధతిని స్వీకరించుటకు కారణ మా పద్ధతికి తెనుగుదేశ మందున్న యాదరము మాత్రమే కాదు చంపూపద్ధతి కథాకథనశిల్పమునకు మిక్కిలి యనుకూలమైనది. కథాకథనమునందు సర్వత్ర వృత్తమునే వాడుట, అందునను నొకే వృత్తమును వాడుట యనునది కథనశిల్పదృష్టితో చూచిన నుచితము కాదు. అట్లే గద్యము కూడ. చంపూపద్ధతిలో సందర్భమునుబట్టి వృత్తవైవిధ్యమును, గద్యమును వ్రాయవచ్చును. అందుచేత రసభావస్ఫూర్తి చంపూకావ్యములందు యెక్కువగా సాధింపవచ్చును. వృత్తౌచిత్య మన నేమియో కొంచె మిచ్చట వివరించుట అప్రస్తుతము కాదు. భావమునందలి గాఢత్వ శిథిలత్వమును బట్టి భాషయందు, దాని వ్యక్తీకరణపద్ధతియందు, గాఢత్వ శిథిలత్వములు దీపింపవలయుట ఔచిత్యవిషయికమైన తర్కము అది భావమునకు తగిన వ్యక్తీకరణము. ఇచ్చట వృత్తము వ్యక్తీకరణవైఖరికి సంబంధించినది. వృత్తముయొక్క నడకను బట్టి భావమునందలి గాఢత్వము దీపించుచుండు నని యొప్పికొనవలయును. అట్లుకానిచో వివిధ వృత్తములకు సార్థక్యము పొసగదు. సంస్కృతమునందు ఒక్కొక్క సర్గమునం దొకే వృత్తము నాశ్రయించుట, తెలుగునందు ద్విపదకావ్యములును ఉన్నవికదా ? వానియందు భావమును బట్టి వృత్తమును మారుటలేదు గదా ?—యన్న ప్రశ్న పుట్టును. ఇది నిజమే. అచ్చట భావమునం దేకత్వమున్నంతవరకు వృత్తౌచిత్య ముండును. ఆ యేకత్వము సర్గమధ్యమున విఘటితమైనచో వృత్తౌచిత్యము లేదన్నమాటయే ! కాని సంస్కృతకవులు సర్గలను భావైకత్వమును విచారించియే విభజించుకొనిరి. భావముయొక్క గాఢత్వమునందు ఛాయామాత్రము లైన భేదములు వృత్తమును బట్టి కాక, వృత్తగతమైన పదసంబంధమును బట్టి వ్యంజింప జేసికొనిరి. ఐనను నీ విషయమున చంపూకావ్యమున కున్న వెసలు బాటు కేవల పద్యకావ్యములకు లేదనియే నిష్కర్ష. మరి ద్విపద కావ్యములకు తెలుగున నిన్న మొన్నటివఱకు కావ్యత్వగౌరవమే లేదు. వానియందు భావమును

బట్టి వృత్తౌచిత్యము లేదనక తీరదు. భిన్న భిన్న భావముల కేకవృత్తమును వాడుట యుచితము గాదని వేరే చెప్పనక్కరలేదు. గద్యవిషయమునకూడ నిది యింతే ! కాని కేవల పద్యమునందు గాని, ద్విపదకావ్యమునందు గాని, గద్య కావ్యమునందు గాని, వృత్తము కాక తక్కిన సామగ్రి— యనగా పదబంధము, సమాసరచన, కూర్పు మొదలైన వానిచేత భావగతమైన ఛాయాభేదములు వ్యంజితములు కావచ్చును. ఒక్క వృత్తము మాత్ర మచ్చట వ్యంజితముగా లేదనక తీరదు.

'యోయశ్శాస్త్రం బిభర్తి' (వేణీ.3- 32)అన్న భట్ట నారాయణుని పద్యమును రౌద్రరసమునకు వ్యంజకముగా నున్నట్లుదాహరించి ధ్వనికారుడు కొంత చర్చ నడిపినాడు. కాని జగన్నాథపండితరాజు రసగంగాధరమునందు—పద్యమునం దర్థము రౌద్రరసమునకు వ్యంజకముగా నున్నది గాని, రచన వ్యంజకముగా లేదనియు, అట్టిచోట్ల సమాసభూయిష్ఠమైన గాఢబంధ ముండితీరవలయు ననియు, అది లేకపోవుటవలన రచన రౌద్రరస వ్యంజకము గాదనియు చెప్పి నాడు (రస.—పుట 66). ఆ సూత్రమును ప్రకృతమునకు పట్టించుకొన్నచో మనకు సమాధానము కుదురును. ప్రశ్నస్థలములందు వృత్తౌచిత్యము లేదు. తక్కిన యౌచిత్యము, తక్కిన వ్యంజక సామగ్రి యుండవచ్చును. రసభావములు అచ్చట వృత్తముఖముగా వ్యంజితములే యని చెప్పుటకు వీలులే దన్నమాట. తక్కిన సమాసాది బహుసామగ్రివలన వ్యంజితమగుచుండవచ్చు నన్నమాట. ఆ వృత్తము గాని, యా ద్విపద గాని, ఆ వచనము గాని,యెంతవరకు రసభావాదుల కుచితమో, యంతవరకు మాత్రమే రసభావాదులకు వ్యంజకములుగా నున్నవన్న మాట. మఱియు ఒకే వృత్తమునందు గాని, ద్విపదయందు గాని, కావ్యమును వ్రాయుటలో కవియొక్క పరిధి సంకుచిత మైపోయినది గదా! ఆ కొలదులలోనే కవి తన ప్రతిభను ప్రకటింప వలయును. చంపూకావ్యమునం దీ పరిధియొక్క వైశాల్య మెక్కువ. కవి కిచ్చట ఒకే వృత్తమునే వాడవలయునని గాని, వృత్తమునే వాడవలయు నని గాని నిబంధనము లేదు. కాన ఔచిత్యమును బట్టి వానిని వాడుకొనవచ్చు నను వెసలుబాటు కలదు కదా ! కేతనయొక్క యను వాదమును జాగ్రత్తగా పరిశీలించినచో నీ విషయము మనకు స్పష్టమగును. ఈ విషయమును ముందు ముందు వివరింతును. ప్రధానముగా కేతన చంపూపద్ధతి నాశ్రయించినది యీ కారణమువలన గాని, కేవల మా కాలమునాటి పద్యకరణ

పద్ధతికి దాసుడై కాదు. అట్లన్నచో నతడు నన్నయాదుల కథానువాద పద్ధతిని గూడ స్వీకరింపవలసియుండును. తనకాలమునాటి కథానువాదపద్ధతిని విడచి భావానువాద పద్ధతిని నూత్నముగా నేర్పాటుచేసికొన్నవాడు. ఈ భావానువాద పద్ధతి నేర్పాటుచేసికొనుట యొకటి, గద్యకావ్యము ననువదించుటకు చంపువు నాశ్రయించుట యొకటి, కేతనయొక్క యనువాదమందలి క్రొత్త పోకడలు.

ఇచ్చట నొక చిన్న ప్రశ్న—ఈ దశకుమారచరిత్ర కల్పితకథ గదా! దీనియందు రచనాచమత్కారము, వర్ణనాచమత్కారముల కంటె, కథాచమత్కారమే ప్రధానము గదా! కాబట్టి దీనికి వచనమే యోగ్యముకదా—యని.

ఇది నిజమే! కాని దండి దీనిని వట్టి కథాచమత్కారముకొఱకే వ్రాయలేదు. దండి దానియందు కావ్యచమత్కారమును గూడ సంఘటించినాడు రచనాచమత్కారమును, వర్ణనాచమత్కారమును, ననంతముగా జూపినాడు. గద్యమునందు గూడ, పద్యమునందు వలెనే, రచనాశిల్పమును జూపవచ్చు నని నిరూపించినాడు 'గద్యం కవీనాం నికషం వదంతి'— యన్న మాటకు హేతుభూతుడైనాడు. 'దండినః పదలాలిత్యం' అన్న ప్రశంస కర్హుడైనాడు. దశకుమార చరిత శైలి కాదంబరి శైలికంటెను బహుభిన్నమైనది. బాణునిది బహుదీర్ఘ సమాస భూయిష్ఠమగు రచన. దండి రచన వ్యస్త పదబహుళమైనది. లలితపద బంధుర మైనది. బాణునియందు లాలిత్యము కన్న ప్రౌఢిమ యెక్కువ. దండి యందు ప్రౌఢిమ కంటె లాలిత్య మెక్కువ. బాణునిది గాఢబంధము, దండిది శిథిలబంధము. సంస్కృతమునం దీ రెండు గద్యకావ్యములు రెండు విశిష్టము లైన రచనామార్గములకు ఉదాహరణములు. ఈ రెండు మార్గములలో దేని వైశిష్ట్యము దానికున్నను, దండి మార్గము కథచెప్పుట కెక్కువ యనుకూలమైనది. సుకుమారమైన దగుటచేత మిక్కిలి కష్టమైనది. దండి కథాకథనమునందు బాణుని కంటె మిక్కిలి దక్షుడు దండి బాణునివలె కథకు విఘాతము కల్పించి వర్ణనలలో మునిగిపోవు స్వభావము కలవాడుకాడు. కథను ముందుపెట్టి, వెనుక నుండి వర్ణనాదుల నతడు నడిపించును. దీని కనువైనపద్ధతిలోదండి తన శైలిని మలచుకొనినాడు. కథను ప్రధానము చేసి, సర్వకావ్యగుణములను తదనుగుణముగా తన శైలియందు దండి సంతరించుకొనవలసివచ్చినది. వృత్తి, రీతి, పాకాదులు, శయ్యాలంకారాదులు దండి పద్ధతియందు ఏకముగా పోత పోయబడి యున్నవి. అందుచేత దండి వట్టి కథకొఱకే వ్రాయలేదు. తన కావ్యరచనాశిల్ప

నైపుణ్యమును జూపించుటకు దశకుమారచరితమును వ్రాసినాడు. అందువలననే దశకుమారచరితమునకు సంస్కృతమున మర్యాద కల్గినది.

కేతన దండి దశకుమారచరితమువంక కాకృష్టుడగుటకు కారణ మిది వట్టి కథను జూచి మాత్రమే యాకృష్టుడు కాలేదు కథయందలి క్రొత్తదనముతో బాటు అనంతమైన కావ్యశిల్పమునుగూడ కేతన దశకుమారచరితమునందు చూపినాడు. కాబట్టి కావ్యమార్గమునందు దశకుమారచరితమును వ్రాయుటకు సంకల్పించినాడు. ఇది కేతన చేసిన యొక క్రొత్తప్రయోగము. నన్నయాదుల వలె పురాణకథను చంపువులో జెప్పిన క్రొత్తదనము లేదు. దండివలె కల్పిత కథను గద్యములో జెప్పిన క్రొత్తదనము రాదు. రెంటిని గలిపి యంటగట్టుటయే కేతన చేసిన క్రొత్తదనము.

కేతన తన కావ్య రచనావిషయమున నెంత జాగరూకత వహించినాడో యించుక వివరింతును.

దండి నిర్మించిన కథ యేమాత్రము మార్పుల నంగీకరించునది కాదు. కథయొక్క పూర్వాపరసంబంధములందు వ్రేలుపెట్టి చూపించుటకు కొంచమైనను సందులేని రీతిగా దండి జాగ్రత్తపడినాడు. కాని యచ్చట కూడ యలతి యలతి మార్పులు చేయుటకు వీలున్న దని కేతన గ్రహింపగలిగెను. ఈ మార్పులలో ప్రధానమైనది నామసామంజస్యము.

1. రాజహంసుని మంత్రి యగు సితవర్మను (మూలము- పుట 4) మతిశర్మ (దశకు. 2-4) గా మార్చినాడు కేతన. ఇతడు సత్యశర్మ (సత్యవర్మ యని మూలము) తండ్రి. ఈ సత్యశర్మ తీర్థయాత్రల కేగి అచ్చట కాళియను నొక విప్రకన్యను బెండ్లియాడినాడు. కావున సత్యవర్మ బ్రాహ్మణుడే కావలయును. వర్మశబ్దము క్షత్రియుల కుండ వలసిన దగుటచే దానిని మార్చి బ్రాహ్మణోచితమైన శర్మ శబ్దమును దగిలించి, మతిశర్మ, సత్యశర్మలుగా మార్చినాడు కేతన. ఇది అవంతిసుందరి కథాసారము ననుసరించి కావింపబడిన మార్పు (4-68).

2. మూలమున సుమిత్రుని కొడుకు మంత్రగుప్త డనియు, సుమంత్రుని కొడుకు మిత్రగుప్త డనియు నున్నది(మూలము—పుట 10). కేతన వీనిని సుమిత్రుని కొడుకు మిత్రగుప్త డనియు, సుమంత్రుని కొడుకు మంత్రగుప్త డనియు

మార్చినాడు (దశకు. 2-60). నామసాజాత్యమును బట్టి చూచినచో కేతన కావించిన మార్పు సమంజసముగనే కన్పట్టును. మూలమునందలి పేర్లు కడు జాగ్రత్తతో పెట్టబడినవి. కామపాలుని కొడుకు అర్థపాలుడు. సుశ్రుతుని కొడుకు విశ్రుతుడు ప్రహారవర్మ కుమారులు ఉపహార, అపహారవర్మలు ఇట్టి నామ సాజాత్యమును బట్టి చూచినచో కేతన మార్పు కావించినట్లు సుమిత్రుని కొడుకు మిత్రగుప్తుడును, సుమంత్రుని కొడుకు మంత్రగుప్తుడును సమంజసములుగనే గోచరించును.

కాని, ఈదృశ నామసాజాత్యమును కేతన గూడ పాటింపని కొన్ని చోట్లు గలవు. అవి కేతన దృష్టి నీ సందర్భమున తప్పించుకొని పోయియుండ వచ్చును. లేదా, కవికి వానియందు ఔచిత్య వివక్ష లేకపోయియుండవచ్చును. ఉదాహరణకు—సోమశర్మచేత గొనిరాబడిన రత్నోద్భవుని కొడుకును సోమ దత్తు డనక పుష్పోద్భవుడనియు, కీర్తిదేవునిచేత సమర్పింపబడిన సత్యశర్మ కొడుకును సోమదత్తు డనియు చెప్పినాడు కేతన. ఆ వివక్ష యెచ్చట నున్నదో యచ్చట మాత్రమే సామంజస్యము వ్యక్తీకరించుట సంప్రదాయము. నన్నయ గారు— "తన్వి పయోజదళాక్షి శకుంతల యను కన్యకన్ గనియె తన్మని వల్లభు మందిరమ్మునన్" (ఆది. 4—25). ఇచ్చట 'తన్వి' త్యాది విశేషణముల కును, 'మునివల్లభ' శబ్దమునకును అవయవార్థ వివక్ష గలదు. కాని గరుత్మం తుడు తల్లిని 'పయోరుహానన' (ఆది. 2—49) యని సంబోధించుటలో నన్నయగారికి అవయార్థ వివక్ష యున్నదనలేము. అచ్చట 'పయోరుహానన' యన్న శబ్దము కేవలము స్త్రీపర్యాయము. వట్టి సంబోధనమాత్రార్థక మని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. అర్జునుడు కుమారాస్త్రవిద్యాప్రదర్శనము నందు కర్ణుని 'కానీన' యనుట గూడ నట్టిదే ! అచ్చట కవికి అవయవార్థ వివక్ష లేదు. 'కానీన' శబ్దము కర్ణశబ్ద పర్యాయ మని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు తేలిన సారాంశము—కవి కవయార్థ వివక్ష యొకచోట నుండును; మఱియొక చోట నుండక పోవచ్చును. ఉన్నచోట దాని సామంజస్యమును వ్యాకరింతుము.

3. కిరాతులనుండి రక్షింపబడిన వాడు ఉపహారవర్మ యని మూలము (మూలము—పుట 11). కేతన దానిని అపహారవర్మ యని మార్చినాడు(దశకు. 2—77). మృత్యుముఖమునుండి మునిచేత ఉపాయముచే అపహరింపబడినవాడు కావున అపహారవర్మ యని యుండుటయే సమంజసముగ నున్నది. అవంతి

సుందరి కథాసారమున నచ్చోట అపహారవర్మ యనియే యున్నది (3–92).

4. రాజహంసుడు పుణ్యదినమున పావన తీర్థసేవ కరిగి నపుడు అచ్చట కిరాతులపల్లెయందు గాంచిన బాలుని నృపతనయునిగా నెఱింగి, యా కిరాతుని బ్రీతు జేసి, యాతనివద్దనుండి గైకొనినాడు. ఉపహార మనగా కానుక. ఆ కిరాతుని వద్దనుండి కానుకగా నతనిని పొందినాడు గావున ఆ బాలునికి ఉపహారవర్మ యని యుండుటయే సమంజసము.

5. అపహారవర్మకథలో రాగమంజరి పరిచారిక 'శృంగారిక' (మూలము—పుట 82) అని యుండగా కేతన దానిని 'సృగాలిక' (దశకు. 6—113) అని మార్చి వ్రాసినాడు. వావిళ్లవారి ప్రతిలో 'శృంగారిక' యని యున్నదే కాని, కాలేగారి ప్రతిలోను, గాడ్బోలేగారి ప్రతిలోను (పుట 82) 'శృగాలిక' యని యున్నది. ఈ శబ్దమునకు అర్థము సరిగా కుదరదు. అందుచేత దాని నించుక మార్చి (శృగాలిక—సృగాలిక) 'నక్కజిత్తులమారిది' యను నర్థమున 'సృగాలిక' యని చేసియుండవచ్చును. అది స్వభావముచే గూఢకృత్యనిపుణయు, శంక సంభాషణయు గాన నామెకు సృగాలిక యను పేరెంతయు దగియున్నది.

6. ఏకాదశాశ్వాసములో విదర్భ రాజ్యమును బాలించుచుండిన రాజు పుణ్యవర్మ (మూలము—పుట 173) అని యుండగా కేతన దానిని 'ధర్మవర్మ' (దశకు. 11—79) అని మార్చి వ్రాసినాడు. రాజు పుణ్యవంతుడైన ప్రజల కేమి ప్రయోజన ముండును? అతడు ధర్మమూర్తి కావలెను. అందువలన నిచ్చట ధర్మవర్మ యని యుండుటయే సమంజసము.

ఇవికాక మఱికొన్ని చిన్న మార్పులును గలవు. ఇట్టివి యక్షరవ్యత్యయమువలన నేర్పడినవిగా దోచుచున్నవి :—

1. దశమాశ్వాసములో రత్నావతికి నింబవని (మూలము—పుట 151) అని యుండగా, తెలుగు దశకుమారచరిత్రములో (10—114) నింబవని అని యున్నది.

2. పుష్పోద్భవుని దాది సువృత్త అని మూలము (పుట 14). సుపుత్ర యని తెలుగు దశకుమారచరిత్రము.

3. సోమదత్తుని చరితమున వీరకేతుని కూతురు వామలోచన యని మూలము (పుట 26). వామనయన యని తెలుగు దశకుమారచరిత్రము(1—7).

4. ప్రమతిచరితములో శ్రావస్తీనగర మహారాజు ధర్మవర్ధను డని మూలము (పుట 133) ధర్మవర్తను డని తెలుగు దశకుమారచరిత్రము (9—69).

ఈ నామసామంజస్యము తరువాత చెప్పదగినది కథావిషయికమైన మార్పులు. ఈ కథావిషయమున దండి యనన్య సామాన్య ప్రతిభ జూపి, అది యెట్టి పెద్దమార్పులు నంగీకరించనట్లు రచించినాడు. కేతన కథలో పెద్ద మార్పు లేమియు జేయకున్నను, సన్నివేశములలో నచ్చటచ్చట చిన్న మార్పు లను గావించినాడు

1 మూలమున సోమదత్తునికథ యనంతరము పుష్పోద్భవుని కథ యున్నది. కాని కేతన దానిని మార్చి, పుష్పోద్భవుని కథ యనంతరము సోమ దత్తుని కథ వ్రాసినాడు. బహుశః ఈ మార్పు కన్నడ దశకుమారచరిత ననుసరించి చేసినట్లు తోచుచున్నది. కేతనకు పూర్వమే చౌండరాజు కన్నడ మున నొక దశకుమారచరిత్రమును వ్రాసినాడు. అందు పుష్పోద్భవ చరితము చతుర్థాశ్వాసముగను, సోమదత్తచరితము పంచమాశ్వాసముగను నున్నవి. కేతన పుష్పోద్భవుని కథతోపాటే అవంతిసుందరీ రాజవాహనుల విరహము వఱకును గల కథ చెప్పి తరువాత సోమదత్తుని కథ చెప్పి, తదనంతరము అవంతిసుందరీ పరిణయమును జెప్పినాడు. అవంతిసుందరీ రాజవాహనుల సమాగమమున కవసర మగు బాలచంద్రికను (పుష్పోద్భవుని భార్యను) కథయందు ప్రవేశపెట్టుటకు పుష్పోద్భవుని కథను ముందు చెప్పి, వారి యన్యోన్యానురాగము నభివృద్ధిపఱచు టకు దగిన వ్యవధి నీయదలచి, సోమదత్తుని కథను మధ్యలో చెప్పినాడు కేతన.

2. తారావళి తన కొడుకగు నర్థపాలుని రాజవాహనునికి పరిచర్య కావించుటకు వసుమతి కిచ్చినట్లు మూలము (పుట 16). తారావళి యక్షి కాన అర్థపాలుడు దేవాంశసంభూతుడు. అట్టి వానిని మానవమాత్రుడైన రాజవాహ నునకు పరిచర్యకొఱకు వినియోగించుట యనుచితమని తలంచి, కేతన దానిని మార్చి, యక్షనాథానుమతమున రాజవాహనునితో గలిపి పెంచబడుటకు వసు

మతీదేవి కీయబడినట్లు వ్రాసినాడు. ఇదే విషయము అర్థపాలునికథలో గూడ సవరింపబడినది (మూలము—పుట 115——దశకు. 8-38).

3. రాజహంసుడు యుద్ధమున మరణించినా డని తలచి రాణి వసుమతీదేవి యనుగమనము చేయబూనినది. ఇంతలో నామెను ఆ ప్రయత్నమునుండి వారించు గొంతొకటి వినబడినది. అచట వసుమతీ రాజహంసుల పునస్సమాగమము జరిగినది. ఇంతలో రాజహంసుని సచివులును నచటికి వచ్చినారు. వారు రాజహంసుని చూచి, యాశ్చర్య సంతోషభరితులై జరిగిన వృత్తాంతము చెప్పవలసినదిగా కోరినట్లు మూలమున నున్నది. కాని కేతన దాని నించుక మార్చి ఆ సచివు లాతనిని తమ నివాసస్థలములకు జేర్చి, యాతని సేద తీర్చి, కుశల ప్రశ్న లడిగినట్లు వ్రాసినాడు. ఇది మూలముకంటెను సమంజసముగా నున్నది.

4. చండవర్మచేత రాజవాహనుడు బందీకృతు డైనాడు. చండవర్మ దర్పసారుని ఆజ్ఞానుసార మతని నేనుంగుకాలి పీనుంగుం జేయదలంచినాడు. అట్టివాడు రాజవాహనునకు భక్ష్య భోజ్యాదుల నిచ్చి పోషించుట యసంభవము. ఈ పరిస్థితులలో రాజవాహనుని స్థితిగతులను పరితల యూహలకే వదలివేసినాడు దండి. కేతన ఇచ్చట "మాతంగదత్తమైన చూడామణిప్రభావనిరంజన వపనమస్తకుండై" (దశకు. 4-90) యుండినట్లు వివరించినాడు.

5. మూలమున కథయంతయు పూర్తియైన పిదప కులపాలిక పేరు చెప్పబడినది. దీనివలన కథాంతమువఱకును నాయిక పేరు పరితలకు తెలియనే తెలియదు. అదియునుగాక, మూలమున అపహారవర్మ "కుబేరదత్త మార్యస్య కులపాలికా వివాహం మాసావధిక మకల్పయత్" (పుట 75) అనునంతవఱకును ఆమె పేరే తెలుపకపోవుటవలన కులపాలిక యెవరోకూడ తెలియని పరిస్థితి యేర్పడుచున్నది. అందువలన కేతన దాని నించుక మార్చి, ధనమిత్రునితో జరిగిన 'సముచిత సంభాషణములలో నబ్బాలిక పేరు కులపాలిక' (దశకు. 5-89) యని గ్రహించినట్లు వ్రాసినాడు. ఇది చాల సమంజసముగా నున్నది. దొంగవేషమును ధరించిన అపహారవర్మ అకస్మాత్తుగా కులపాలికను గాంచినాడు. కులపాలిక యాతనిని జూచి భయపడి, యేమియు జెప్పక నగలు తీసి యిచ్చి, వదలివేయు మని బ్రతిమాలినది. కాని అపహారవర్మకు ఆమెపై సహజమైన యనురాగము కలుగుటవలన, ఆమెకు సహాయముచేయుటకు నిశ్చయించుకొని ఆమెను ధనమిత్రునివద్దకు తీసికొనిపోయినాడు. అంతవర కామె పేరు

తెలిసికొనుటకు అవకాశమే లేకపోయినది. అచ్చట ధనమిత్రునితోడి సముచిత సంభాషణములలో నామె పేరు తెలిసికొనుట సమంజసముగా నున్నది.

6. కులపాలికా వివాహము నపహారవర్మ మాసావధికముగా చేసిన యనంతరము మూలమున—"ఉత్తిష్ఠ సఖే ! ఏకాంత ఏవ చర్మరత్నభస్త్రికా మిమాం పురస్కృత్యాంగరాజమాన చక్ష్వ" (పుట 75) అని పూరారప్వ సంబంధము లేకయే మొదలగుచున్నది. కేతన దీనిని గ్రహించి, చర్మభస్త్రి కోపాయమును (దశకు. 5-132, 133) చెప్పి దానిని ఉపయోగించు తెఱం గెఱింగించినట్లు వ్రాసినాడు

7. అపహారవర్మ మరీచివద్దనుండి వెడలి యొక క్షపణక (బౌద్ధ) విహారమును చేరినట్లు మూలము (పుట 68). కేతన దానిని జైనపల్లె (దశకు. 5-39) యని మార్చినాడు. దీనికి కారణము కేతన కాలమునాటికి బౌద్ధము పూర్తిగా క్షీణించి జైనము వ్యాప్తిలో నుండుటయే కావచ్చును.

8. సృగాలిక వెంట రాగమంజరి యింటి కేగుచు అపహారవర్మ దారిలో నగర రక్షకులనుండి తప్పించుకొనుటకు పిచ్చివానివలె నటించినాడు. ఇచట మూలముకంటె అనువాదము మిక్కిలి స్వాభావికముగ నున్నది (6—157).

9. ఉపహారవర్మ రాజవాహనుని కొఱకు వెదకుచు, విదేహరాజ్యమును ప్రవేశించి యచ్చట గాలించు సందర్భమున విచారగ్రస్తురాలైన ఒక స్త్రీని జూచినాడు. ఆమె తన కథ నంతయు జెప్పిన తరువాత నామెను తన దాదిగా గ్రహించి, తానే ఆమెచేత పెంచబడిన బిడ్డగా తెలిసికొనినాడు. ఆమె వెంటనే విశ్వసించినది. ఇంత తేలికగ విశ్వసించుట అస్వాభావికము. అందువలన కేతన దానిని మార్చి "రాజహంసుడు తమ్ము జేకొనియున్న తెఱం గెఱింగించి నృపతి వృత్తాంతంబును, వసుమతి ప్రముఖులైన యంతఃపుర కాంతాజనంబును బరివారంబు బేళ్ళును సాభిజ్ఞానంబుగా జెప్పి" (దశకు. 8-26) ఆమెను నమ్మించినట్లు వ్రాసినాడు. ఎవరినైనను తమ నెఱుకపఱచుకొనుట కిది లోకసామాన్యమైన పద్ధతి. ఇది మిక్కిలి సహజముగా నున్నది.

10. వికటవర్మను జంపుటకు ఉపహారవర్మ కల్పసుందరి కొక యుపాయమును జెప్పినాడు ఆ ఉపాయము ప్రకారము కల్పసుందరి భర్తచేత నొక

మిధ్యాహోమము చేయింప సమకట్టినది. ఉపహారవర్మ దానికి ఋత్విక్కు. దానికి అర్ధరాత్రమున నేకాంతసమయమున నొక ముహూర్త మేర్పాటు కావింప బడినది. ఆ సమయమున నొక ఘంట మ్రోగినది. మూలమున నుపహారవర్మ కల్పసుందరి కీ ఘంటవిషయమును చెప్పినట్లు లేదు. అకస్మాత్తుగా వికటవర్మ మరణమునకు ముందు మాత్రమే పేర్కొనబడినది (మూలము-పుట 107). కేతన దీనిని ముందుకూడ చెప్పినట్లు కల్పించినాడు (దశకు. 7-120; 7-139).

11. అర్థపాలుని చరితములో కామపాలుడు తాను కుసుమపురరాజగు రిపుంజయుని మంత్రియగు సుపుత్రుని కూర్మియనుజుండుగా తెలుసుకొనినట్లు మూలము (పుట 113). సుమిత్రుడు రాజహంసునకు మంత్రికాని యాతని తండ్రియైన రిపుంజయునకు కాదు. అందువలన మూలమునందలి యీ యవక తవకను సరిచేసినాడు కేతన (దశకు. 8-13).

12. అర్థపాలుని తల్లి అనుమరణసమయమున సఖీజనులను గూడ పిలిచి నట్లు మూలమున నున్నది ఇట్లు పిలుచుటవలన అర్థపాల పూర్ణచంద్రుల రహ స్యము బయటపడిపోవుచున్నది. అందువలన కేతన మూలములోని "సకరుణాం సఖీ రామంత్ర్య" (పుట 120) అనుదానిని వదలి మిగిలిన భాగమును మాత్రమే యనువదించినాడు.

13. అర్థపాలుని కథయందు కామపాలునికి విధింపబడిన మరణదండ మును ఊరియందు చాటినది మాతంగస్త్రీ యని మూలము (పుట 113). కాని కేతన దానిని 'మాలలకుమేటి' (దశకు. 8—67) యని మార్చినాడు.

14. అష్టమాశ్వాసములో నర్థపాల పూర్ణచంద్రులు భూగృహమును బ్రవే శించినప్పు డొక ముదుసలి వారి కాళ్ళపైబడి, శరణు వేడి, వా రచ్చటికి వచ్చు టకు గారణ మేమని యడిగినది. అప్పుడు సమాధానము నర్థపాలుడే చెప్పినట్లు మూలమున నున్నది (పుట 122). అనుచరుడు ప్రక్కనుండగా తనంతట తనే యెఱుకపఱచుకొనుటకంటె, ఆ యనుచరు డెఱింగించుట యుచితమని కేతన దాని నట్లు మార్చినాడు (దశకు. 8—81).

15. నవమాలికావివాహసందర్భమున పాంచాలశర్మ ప్రమతిని వెంట బెట్టుకొని ధర్మవర్తన మహారాజు వద్దకు పోయి యాతడు తన యల్లు డనియు,

సకలకళానిపుణు డనియు జెప్పి, కూతు నిచ్చి పెండ్లిచేయు మని కోరినాడు. పాంచాలశర్మ ధూర్తబ్రాహ్మణుడు. అట్టివాని యల్లునికి, తన కూతు నిచ్చి వివాహము చేయుటకు ధర్మవర్తను డంగీకరింపకపోవచ్చును. కాని మూలమున నిచ్చట నంగీకరించినట్లున్నది. ఇట్టి సంశయముల కాస్పదము లేకుండ చేయుటకు కేతన ఈ సందర్భమున చిన్న మార్పు చేసి స్వయంవరమును ప్రవేశపెట్టినాడు. స్వయంవరము క్షత్రియులకు ధర్మశాస్త్ర విహితమైనది. స్వయంవరమునకు బ్రాహ్మణ క్షత్రియులు వెళ్ళుదురు. కన్య తనకు నచ్చిన వానిని కులవిచక్షణలేక వరింపవచ్చును. నవమాలికాస్వయంవరము నట్టిదే. భూపతులు, విప్రకుమారులు పలువురు వచ్చినారు (దశకు. 9—76). ప్రమతి విప్రకుమారుడైనను అతనిమీది వలపుచే నవమాలిక యాతనినే వరించినది.

16. భీమధన్వుడు మిత్రగుప్తుని సముద్రమున ద్రోయింపగా కందుకవతి విరహవేదన భరింపలేక క్రీడావనమునకు బోయినప్పుడు ఎవరో ఒక రాక్షసు డెత్తుకొని పోయినట్లు మూలమున నున్నది (పుట 159). ఇచట కేతన చిన్న మార్పు చేసి కందుకవతి సౌధతలమునందలి యేకాంతభాగమునకు బోయినట్లు వ్రాసినాడు.

17 మూలమున నపహారవర్మ చండవర్మను జంపిన తరువాత నాడు అంబాలికను పరిగ్రహించినట్లున్నది (పుట 92). కాని కేతన దాని నచ్చట చెప్పకుండుటచే వారి వివాహము రాజవాహనాది దశకుమారుల సన్నిధిని జరిగినట్లు ద్వాదశాశ్వాసమున వ్రాసినాడు (దశకు. 12-43).

ఈ మార్పుల తరువాత కేతన మూలమును తగ్గించిన చోట్లును, మూలమును పెంచివ్రాసిన చోట్లును చెప్పకోదగినవి. దశకుమారచరిత్రము కథాకావ్యమగుటవలన అందు వర్ణనాదుల కెక్కువ ప్రాముఖ్య ముండదు. మూలమున కొన్నిచోట్ల నీ వర్ణనములు కొంచెము పెద్దగా నున్నవి. కేతన వానిని తగ్గించినాడు. అట్టివానిలో కుసుమపుర వర్ణనము, వసుమతీదేవి వర్ణనము, మణికర్ణిక వర్ణనము, కందుకనృత్య వర్ణనము, గోమిని వర్ణనము, ధర్మవర్మ వర్ణనము పేర్కొనదగియున్నవి.

ఇట్లే మూలమున లేని కొన్ని విషయములను కేతన పెంచివ్రాసినాడు. పీఠిక, షష్ఠ్యంతములు, అశ్వాసాంత పద్యగద్యములు మొదలగున విట్టివి. ఇవి పూర్తిగా

అమూలకములు. కాని మూలములో సూచనామాత్రముగా నున్న కొన్నింటిని గూడ కేతన పెంచి వ్రాసినాడు. మూలమున నవంతిసుందరికి విరహవేదన నుపశమింపజేయుటకు శీతక్రియలు జరిపినట్లు చెప్పబడినదే కాని, ఎట్లు జరుప బడినదో వర్ణితము కాలేదు. కాని ఆమె ప్రముఖ కథానాయకుని భార్య కావున విపరముగా వర్ణించినాడు కేతన (దశకు. 3-124...131). ఇట్లే సూచనా మాత్రములుగా నున్న అపహారవర్మ కథలోని సూర్యోదయ (దశకు. 5-123, 6-64) సూర్యాస్తమయ వర్ణనలను (దశకు. 6-53), ఉపహారవర్మకథలోని చంద్రోదయ వర్ణనమును (దశకు. 7-90, 91) కేతన చక్కగా వర్ణించినాడు.

మూలమున వికటవర్మ దర్పసారుని కడకు ఏణిజంఘునితో ఒక ఉత్తరము పంపినట్లున్నది (పుట 55). కాని యేమని జాబు పంపినాడో చెప్పబడ లేదు. కేతన రాచమర్యాదల ననుసరించి యొక యుత్తరము మూలమున లేకున్నను సృష్టించి, వికటవర్మ దురుద్దేశ్యమును వ్యక్తపఱచినాడు.

మూలమున నపహారవర్మ చరితము అంబాలికాసమాగమముతో పూర్తి యైనది. కాని కేతన అపహారవర్మనోటినుండియే జరిగిన వృత్తాంతమంతయు నంబాలికకు చెప్పించి (దశకు 6-166...180),ఆమెకు సంతోషము కలుగునట్లు చేసినాడు.

ప్రమతికొఱకై తపించుచుండిన నవమాలిక విరహము మూలమున సువ్యక్తము చేయబడలేదు. కేతన నవమాలికద్వారానే ఆ వృత్తాంతము నామెకు చెప్పించి ఆమెకు ప్రమతిపైగల యనురాగమును వ్యక్తముచేయించినాడు (దశకు. 9—53···63).

మూలమున ఉత్తరపీఠికయందు మానసారునకు సమ్మానము చేయబడి నట్లు లేదు. కేతన దీనిని క్రొత్తగా కల్పించినాడు మానసారుడు ఎంత దుర్మార్గుడైనను, రాజవాహనునకు మామగారు. తనకు కావలసిన యాతని కూతురు అవంతిసుందరి, తనకు లభించినది. తమ రాజ్యమును చేకూరినది. మానసారుడు లొంగిపోయినాడు. అట్టి సందర్భములో మామగారిని కూడ సంతుష్టుని జేయుట రాజవాహనుని వంటి ఉత్తమగుణసంపన్నునకు తగిన పని. కావున కేతన దానిని కల్పించి వ్రాసినాడు (దశకు. 12-72).

ఇట్లే, తమ కిదివఱలో సహాయముచేసి ఆ సమయమున కచ్చటికి వచ్చిన విశ్వేశ్వరుని (దశకు.12-76), బంధుపాలుని (దశకు. 12—79), తదితర బంధు మిత్రాదులను (దశకు 12-79) సమ్మానించినట్లు కల్పించి వ్రాసినాడు కేతన.

ఇట్లే తన కాలపు పరిస్థితుల ననుసరించి కూడ రెండు మూడు చోట్ల మూలమున లేని విషయములను గల్పించి వ్రాసినాడు కేతన పుష్పోద్భవుడు ఆడువేషమును ధరించి, బాలచంద్రికతో కలిసి, దారువర్మను జంపుటకు బోయి నప్పుడు, మూలమున నాతడు కేవలము ఆడువేషము ధరించినట్లు మాత్ర మున్నది కాని కేతన అతడు ధరించిన వివిధాభరణములను పేర్కొని తన కాలపు జనులు ధరించుచుండిన ఆభరణములను వ్యక్తపఱచినాడు. అపహారవర్మ కథలోని జూదవర్ణనమును, ప్రమతి కథలోని కోడిపోరు వర్ణనమును, సాంఘిక పరిస్థితుల ననుసరించి మూలములో కన్న విస్తృతముగా వర్ణింపబడినవి.

కొన్నిచోట్ల కేతన మూలములోని సన్నివేశములను పూర్తిగా విస్మరించి నాడు:—

1. అవంతిసుందరి రాజవాహనునకు వ్రాసిన ప్రేమపత్రము (మూలము-పుట 47), ఆంధ్రదశకుమారచరిత్రలో లేదు.

2. మరీచి ఉద్ధరణమును గన్పట్టదు (మూలము-పుట 91).

3. కామపాలుడు పూర్ణచంద్రునకు తన వృత్తాంతమును జెప్పుచు తాను కుసుమపురమునకు రాజైన రాజహంసుని మంత్రియగు 'సుమంత్రుని' కూర్మి యనుజుడ నని చెప్పికొనినట్లు ఆంధ్రదశకుమారచరిత్రమున (8—14) నున్నది. కాని ఇచ్చట మూలమున 'సుమిత్ర' (పుట 113) అని యున్నది. ద్వితీయాశ్వాసములో తారావళివలన లభించిన కుమారునకు అర్థపాలు డని పేరుపెట్టి రాజహంసుడు సుమిత్రుని పిలిచి యతని కా బాలుని యప్పగించినట్లున్నది (దశకు. 2-105). కావున నిచ్చట సుమిత్రుని కూర్మియనుజు డని యుండుటయే లెస్స.

4. ఆంధ్ర దశకుమారచరిత్రమున (6—121...123) అంబాలికా సృగాలికలకు స్నేహము కలిసిన విధము చెప్పబడలేదు. కాని మూలమున అంబాలిక ధాత్రియైన మాంగలికకు లంచమిచ్చి స్నేహము కలుపుకొనిన ట్లున్నది (మూలము—పుట ౧౮౫). కేతన దీనిని విస్మరించినాడు.

5 ఆంధ్ర దశకుమారచరిత్రమున ప్రహారవర్మ వృత్తాంతము సందర్భము తెల్పకయే చెప్పబడినది. మూలమున నిచ్చట "విదేహేశ్వరో ప్రహారవర్మ" (పుట 11) అని యున్నది. కేతన దీని మరచిపోవుటవలన నత డెవరో పాఠకులకు తెలియుట కష్టమగుచున్నది. దీనిని కేతన విస్మరించుట అసమంజసము.

ఇట్లే మూలమునందలి కృత్యాది శ్లోక మగు 'బ్రహ్మాండ చ్ఛత్రదండం' అనునది ఆంధ్రదశకుమారచరిత్రమున కన్పట్టదు దీనిగూర్చి పలువురు పండితులు భిన్నాభిప్రాయములను గల్గియున్నారు. కొన్ని సంస్కృత తాళపత్రప్రతులం దిది కన్పట్టక పోవుచుండటవలన నిది దండి వ్రాసినది కాదనియు, తరువాతివా రెవరో పూర్వపీఠికతో సహా చేర్చియుండవచ్చు ననియు, తలచుచున్నారు. ఆంధ్ర దశకుమారచరిత్రమునకు కొంచెము పూర్వపుదైన కన్నడదశకుమారచరిత యందును నీ శ్లోకము కన్పట్టకపోవుచుండుట పై పండితాభిప్రాయమునే దృఢ పఱచుచున్నది.

దశకుమారచరిత్రములో నొక్కచోట మాత్రము ఒకదోషము మూలముగను అనువాదమునను గూడ నట్లే యున్నది. రాజహంసునిపై దండెత్తిన మానసారుడు ఓడిపోయి తిరిగి రెండవసారి దండెత్తినాడు. ఈసారి యతడు తపోబలసంపన్నుడు, శివదత్త శక్తిసారుడు నగుటచే, రాజహంసు డోడిపోయి యుద్ధరంగమున మూర్ఛిల్లినాడు. రథవాజు లాతని శరీరమును వింధ్యారణ్యములోనికి లాగుకొనిపోయినవి. రాజహంసుని సైన్యము చెల్లాచెదురైనది. మానసారునకు కుసుమపురము వశమైనది. కాని యత డేల దాని నాక్రమించుకొన లేదో దురూహ్యము. తిరిగి తన రాజ్యమునకు వెళ్లిపోయినాడు. పదిమంది కుమారులును లభించిన పిదప, వామదేవుడు కుసుమపురమునకు వచ్చుసరికి రాజహంసుడే రాజుగ నున్నట్లు వర్ణింపబడినది. రాజహంస మానసారులకు నడుమ సంధియైన జరిగినట్లు వర్ణింపబడలేదు. మరి రాజహంసుడు తిరిగి రాజ్యము నెట్లు సంపాదించుకొనినా డనునది ఊహాతీతము. ఈ దోషము మూలమునగూడ యున్నది (పుట 8). కేతనగూడ దీనిని మార్చలేదు (దశకు. 2-57). కన్నడ దశకుమారచరితమును వ్రాసిన చౌండరాజుకూడ దీని నట్లే వదలివేసినాడు (2—31).

ఇట్లు దండి దశకుమారచరితమును కేతన "అంచిత భావ రసోదయాభిరామమ్ముగునట్లు" ఆంధ్రీకరించినాడు.

# 4. దశకుమారచరిత్రము-పాత్ర చిత్రణము

కథాకావ్యములందు, ఉత్తమ మధ్య మాధమ భేదములు గాని, సజీవ నిర్జీవ భేదములుగాని పాటింపక, యనేక పాత్రలు సంఖ్యానియమరహితముగా ప్రవేశపెట్టబడవచ్చును. కొన్ని సమయములందు కవి తన కాలపు సాంఘిక పరిస్థితులను గూడ సృష్టించును గాన ఆ సందర్భములందు వివిధ రకములగు పాత్ర లాతని కెంతయును దోడ్పడును.

దశకుమారచరిత్రము కథాకావ్య మగుటవలన నం దనేక రకములగు పాత్రలు కల్పింపబడి, తత్తదుచిత రీతిని పోషింపబడియున్నవి.

దశకుమారచరిత్రము పదిమంది కుమారుల విజయయాత్రలు చిత్రింప బడిన కథల సంపుటి. ఈ పదిమంది కుమారులును అగ్రజాతులవారే! కామ పాలునకు తారావళియందు జన్మించిన యర్థపాలుడు బ్రాహ్మణుడు. సత్యవర్మ కుమారుడైన సోమదత్తుడు బ్రాహ్మణుడు. సత్యవర్మ సుమతి తమ్ముడు (దశకు. 2—115) గాన, సుమతి కొడుకగు ప్రమతియు బ్రాహ్మణుడే యగును. కామపాలుడు సుమిత్రునకు తమ్ముడు (దశకు. 2-106) కావున సుమిత్రుని కొడుకగు మిత్రగుప్తుడును బ్రాహ్మణుడే యగును. వీరు నలుగురును బ్రాహ్మణ వంశములనుండి గ్రహింపబడిన వ్యక్తులు. ఇక రాజవాహనుడు, అపహారవర్మ, ఉపహారవర్మ, మంత్రగుప్తులు, క్షత్రియవంశములనుండి తీసికొనబడినవారు. ఇట్లే, రత్నోద్భవుని కుమారుడగు పుష్పోద్భవుడు వైశ్యుడు. సుశ్రుతుడు రత్నోద్భవుని తమ్ముడు (దశకు. 2—99). కాన సుశ్రుతుని కుమారుడగు విశ్రుతుడును వైశ్యుడే యగును. ఇట్లే దశకుమారచరిత్రములోని పదిమందియు అగ్రజాతులవారై యున్నారు. ఈ పదిమంది కుమారులకును సహాయముచేసిన వారిలో అన్ని కులములవారును ఉన్నారు.

దశకుమారచరిత్రములోని పాత్రలకు పేళ్లుపెట్టుటయందే మిక్కిలి ఔచిత్యము పాటింపబడినది. మత్తపాలుడు, ధర్మవర్తనుడు, వికటవర్మ, కామ

మంజరి, ఉపహారవర్మ, అవంతిసుందరి, కలహకంటకుడు, ధర్మవర్మ, మంత్రగుప్తుడు, వామదేవుడు —ఇత్యాది పెళ్ళే వారి శీలమును చెప్పకచెప్పుచున్నవి.

కొన్ని పాత్రలను ప్రవేశపెట్టుటకు పూర్వమే కేతన వారి గుణగణములను సూచించుచుండును. "చంద్రపాలు తండ్రి సకలసద్గుణనిధి బంధుపాలుదు" (దశకు. 3-59) "మానధనుడైన యా మానపాలుడు" (దశకు. 4—10) "ధర్మవర్తనుం డనియెడి పేరు సార్థమవునట్టుగ" (దశకు. 9—39).

దశకుమారచరిత్రము మొత్తముమీద 131 పాత్రలు గలవు. అందు 12 మంది బ్రాహ్మణులు, 31 మంది క్షత్రియులు, 27 మంది వైశ్యులు, ముగ్గరు మునులు, 5 గురు వేశ్యలు, 23 మంది స్త్రీలు, నలుగురు దేవయోనులు, ముగ్గరు సన్న్యాసులు, 20 మంది యితరులు (ఏ కులమో తెలియనివారు) గలరు. ఇందలి ముఖ్యమగు పాత్రలను గూర్చి మాత్రమే ఈ వ్యాసమున చర్చింతును.

దశకుమారచరిత్రములోని ముఖ్య మగు బ్రాహ్మణపాత్రలు సోమదత్తుడు, అర్థపాలుడు, కామపాలుడు, మిత్రగుప్తుడు, మాతంగకుడు, విద్యేశ్వరుడు, పాంచాలశర్మ యనువారు. సోమదత్తుని కథలో మత్తపాల మానపాలురకు యుద్ధము సూచింపబడినదే కాని, హత్యాకాండ యేమియు ప్రదర్శింపబడలేదు. అర్థపాల, మిత్రగుప్తుల కథలలో యుద్ధములే లేవు. కామపాలుడు కాశీపతిగా తన కుమారునిచే చేయబడినాడు. కాని యతని కథయందును హత్యాకాండ యేమియు గన్పట్టదు. దీనికి కారణము పై వారందఱును బ్రాహ్మణులగుటయే అని చెప్పవచ్చును. విద్యేశ్వర, మాతంగక, పాంచాలశర్మలు పతనమైన బ్రాహ్మణసమాజమునకు ప్రతీకలు. విద్యేశ్వరుడు క్షుద్రమైన ఇంద్రజాలికవిద్య నభ్యసించినాడు. మాతంగకుడు పొట్టపోసికొనుటకై తన కులాచారములను విడనాడి బందిపోటుదొంగ యైనాడు. పాంచాలశర్మ వీరందరిలోను పేరు మోసిన పతితుడు. అతడు వేశ్యాసక్తుడే కాక, కోడిపందెములందును సాహస క్రియలందును కడు నేర్పరి.

"నిండు మనంబు నవ్యనీత సమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులందు నిక్క మీ
రెండును"— (భార—ఆది. 1—101)

అని నన్నయ్య గారు చెప్పినట్లు బ్రాహ్మణుల మనస్సు వెన్న వంటిది. ఇందుకు

మాతంగక కామపాలుర చిత్తవృత్తులు చక్కని నిదర్శనములు. మాతంగకుడు ఎంత నీచవృత్తి నవలంబించినను చిట్టచివరకు సహజమైన దయవలన, తోడి బ్రాహ్మణునకు సహాయముచేయుచు ప్రాణము వదిలినాడు. కామపాలుడు రాజాజ్ఞను శిరసావహించి పూర్ణచంద్రుని మత్తకరితచే త్రొక్కించి చంపదలచినవాడయ్యును, అతని ధైర్యసాహసములకు మెచ్చికొని, దయదాల్చి, ఆ దుర్మరణము నుండి రక్షించుటయే కాక, అతని కిష్టార్థంబుల నిచ్చి పోషించినాడు.

దశకుమారచరిత్రములోని క్షత్రియపాత్రలును ఇట్టి విశిష్టతను కల్గియున్నవి. రాజహంసుడు నిజముగా రాజశ్రేష్ఠుడు. గర్వాంధకారముచే తన పైకి దండెత్తివచ్చిన మానసారుని ఓడించియు, ఆతనిని క్షమించి వదలివేసినాడు. ధర్మవర్తనుడు అన్వర్థ నామధేయుడు. ధర్మవర్మ రాజున కుండవలసిన గుణము లన్నింటిని కల్గినవాడు. మత్తపాల, చండవర్మ, వికటవర్మలు దుష్టస్వభావు లని వారి పేళ్ళవలననే తెలియుచున్నది. వీరిలో మత్తపాలుడు రాజ్యగర్వాంధకారుడు. చండవర్మ కామాంధుడు. వికటవర్మ మోహాంధుడు. అనంతవర్మ వ్యసనలోలుడు. వ్యసనములకులోనై,రాజ్యపరాఙ్ముఖులైన రాజుల కీతడు చక్కని తార్కాణము.

ఇక యిందలి రాజకుమారు లగు రాజవాహన, మంత్రగుప్త ఉపహార వర్మలు, అద్వితీయ పరాక్రములు, పరోపకార శీలురు. అపహారవర్మ కార్య సాధనపరత్వమున మంచి నేర్పరితనము కలవాడు. తన తెలివితేటలచేత కామమంజరి, మాధవసేనలకు బుద్ధివచ్చునట్లు చేసి, ధనమిత్రుని వద్దనుండి వారు తీసికొనిన ధనము నంతను మాయోపాయముచే తిరిగి వారికి చేరునట్లు కావించినాడు. దొంగతనము చేసియైనను బీదలను రక్షించుట ఆతనియందు ప్రశంసింపదగిన ఉదారస్వభావము. ఉపహారవర్మ, మంత్రగుప్తులు మంచి యుక్తిపరులు. వివిధ తంత్రములచేత వికటవర్మ జయసింహులను మట్టుపెట్టి, క్రమముగా కల్పసుందరీ కనకరేఖలను వివాహమాడుటయే కాక, వారిరాజ్యములను గూడ లాగుకొని స్వయముగా రాజులైనవారు. వీరిరువురును క్షత్రియ కులజు లగుటవలన వీరికథలలో వీరోచిత సన్నివేశములు కల్పింపబడినవి.

కవి వైశ్యకులమునుండి గ్రహించిన పాత్రలలో పేర్కొనదగినవారు, పుష్పోద్భవుడు, విశ్రుతుడు, విరూపకుడు, ధనమిత్రుడు, కోశదాసుడు అను

వారలు! పుష్పోద్భవ విశ్రుతులు వైశ్యకుమారులగుటవలన వారి కథలలో పోరు యుద్ధాదులతో కాక యుక్తులతో రాజ్యమును సంపాదించినట్లు వర్ణింపబడినది. వైశ్యులు వేశ్యాలోలురై యుండి చనుటకు మంచి నిదర్శనములు విరూపక కోశదాసులు. విరూపకుడు కామమంజరిపైని మోహమువలన తన ఆస్తి నంతయును పోగొట్టుకొని జైనసన్న్యాసి యైనాడు. కోశదాసుడు వేశ్యాలోలతవలన వేశ్యదాసుడన బరగినాడు. ధనమిత్రుడు ఉదారస్వభావుడు, గొప్పదాత. తన ఆస్తి నంతటిని పేదలకు దానము చేసి, తుదకు తానే పేదయైనాడు.

దశకుమారచరిత్రములో ప్రభుత్వోద్యోగుల మనఃప్రవృత్తులు కూడ కడుజాగ్రత్తతో చిత్రింపబడినవి. సుమతి, సుశ్రుతుడు, కామపాలుడు, వసురక్షితులు ప్రశంసింపదగిన మంత్రివర్యులు. మానసారుడు రెండవసారి దండెత్తిరాగా, తమ బలములను శత్రుబలములను ఊహించి రాజహంసునకు సరియైన హితబోధ కావించినవాడు సుమతి (అవ. కథా.సార. 2-89). అనుమాన్యమైన పతిమరణమునకు అనుమరణము తగదని వసుమతిని అగ్నిముఖమునుండి రక్షించినవాడు సుశ్రుతుడు (అవ. కథా. సార. 2-98). పూర్ణచంద్రుని దుర్మరణమునుండి రక్షించుటయే కాక, అతని బలపరాక్రమములకు సంతసించి, యిష్టార్థముల నిచ్చి, సన్మార్గమున పెట్టిన ధర్మబుద్ధి కామపాలుడు. వసురక్షితుడు వీరందరికిని తలమానికము వంటివాడు. అనంతవర్మకు అతడు గఱపిన విద్యాబుద్ధులు అతని రాజనీతి విశారదత్వమును సువ్యక్తము చేయుచున్నవి

కాంతాలోలురైయుండి రాజులు ప్రభుత్వోద్యోగులు మొదలగువారు శత్రుబాధ్యతలనుండి యెంతవఱకు విముఖులైయుండిరో తెలిసికొనుటకు అనంతవర్మయు, కాంతకుడును చక్కని నిదర్శనములు. అనంతవర్మ కుంతలాధీశ్వరుడైన అవంతిదేవుని ఉంపుడుకత్తెను వలచి ఆతనితో శత్రుత్వము తెచ్చిపెట్టికొనినాడు. కాంతకుడు అంబాలికమీది వలపుచే తన కారాగృహాధ్యక్షపదవిని ఉపేక్షించి ప్రహారవర్మను బంధవిముక్తుని గావించినాడు

కొన్ని సాధారణపాత్రలు (Characters of little importance) కూడ దశకుమారచరిత్రలో మిక్కిలి జాగ్రత్తగా చిత్రింపబడినవి. బంధుపాలుడు సకల సద్గుణనిధి; శకునజ్ఞానసంపన్నుడు. బంధువుల పట్లను, అతిథులనుపట్లను

అతను జూపు గౌరవాభిమానములకు అతనికి పెట్టినది పేరు. పరదారాసంగ మాభిలాషులైనవారు ఎంత నీచపు బనులకైనను దిగజారుదు రనుటకు కలహకంటకుని పాత్రయే నిదర్శనము. అనంతవర్మ నర్మసచివుడగు విహార భద్రునిద్వారా మంత్రుల దుర్బోధలు,రాజుల దుష్ప్రవర్తనములు చక్కగా వ్యక్త పరచబడినవి.

ఇట్లే దశకుమారచరిత్రములోని స్త్రీపాత్రలు గూడ ప్రత్యేకమైన జాగ్రత్తతో చిత్రింపబడినవి. రాజు దుష్టుడై నప్పుడు రాజబంధువులు ఎట్టి కష్ట ములకు గుఱికావలసివచ్చునో నిరూపించునది మణికర్ణిక పాత్ర. రాణివాసములో దురలవాట్లను వ్యక్తముచేయునది కల్పసుందరి పాత్ర. కామమంజరి రాగమంజరుల పాత్రలు వేశ్యల జీవితమును విశదపఱచునవి. విమలమైన సాంసారిక జీవన మును స్పష్టపఱచునవి కులపాలిక గోమినుల పాత్రలు. స్త్రీహృదయ మెంత కఠినము, ఎంత క్రూరము నైనదో వ్యక్తముచేయునది ధూమిని పాత్ర.

వీరు కాక దశకుమారచరిత్రములో జైన తాపసులు, సిద్ధులు, జటిలురు, కాపాలికులు - మాంత్రికులు,-- సన్న్యాసులు మొదలగు వా రనేకులు ప్రవేశపెట్ట బడినారు. మునుల పవిత్రజీవితమునకు ప్రతీక వామదేవుడు. కాని కొందరు తాపసులు గూడ దురలవాట్లకు లోనై నైతికపతనము జెందినవారును గలరనుటకు మరీచి పాత్ర నిదర్శనము. దౌర్భాగ్యమువలన జనులు జైనమతము స్వీకరించెడి వారు— "మిండాట మాడి వొలసిన మిండలకును జైనవృత్తిమే" లను (దశకు. 5—59) స్థితికి, దిగజారినది జైనము. దీనిని వ్యక్తపఱచునది వసు పాలితుని పాత్ర. పొట్టగడచుటకు కష్టమైనవారు, మోసగాండ్రు మొదలగువారును సిద్ధమాంత్రిక కాపాలికవేషములను ధరించుచుండిరి.

ఇట్లు దశకుమారచరిత్రలో అనేక రకములగు పాత్రలు తత్తదుచితరీతిని జిత్రించబడియున్నవి. దశకుమార చరిత్రలో గల పాత్రలలో ముఖ్యమైన వానిని గూర్చి పైన చర్చించితిని. ఇక ఈ కథలోని పాత్రలు సామాన్యమైనవా **(Individuals)** లేక విశిష్టవ్యక్తులా **(Types)** యను విషయమును విచారింప వలసియున్నది. ఇందలి పాత్ర లన్నియు వేని కవే ప్రత్యేకములైనవికాని, కొన్ని కులములకు ప్రతీకలుగ గాని, కొన్ని విశిష్ట లక్షణములకు ప్రతీకలుగ గాని గ్రహింపబడినవి కావు. కావున ఇందలి పాత్రలు సామాన్యమైనవి **(Individuals)**

అగును. కాని యిందలి పాత్రలన్నియు జీవితములోని విభిన్నమార్గములకు జెందినవి.వాని వాని ప్రత్యేక వ్యక్తిత్వము వాని కున్నను, ఈ పాత్ర లన్నియు లోకమునందలి, జీవితమునందలి మానవప్రవృత్తియందలి, బహు విభిన్న మార్గములకు, లక్షణములకు, ప్రతీకలు. అందుచేత నివి శాశ్వతపాత్ర లైనవి. ఇవి యెల్లకాలములకును సంబంధించినవి. ఈ మానవప్రవృత్తిలోని ఈ విభిన్నత, ఈ చిత్తవృత్తి వైలక్షణ్యము, సర్వకాలములందును మార్పు చెందక యేకముగా నుండును. పరిస్థితులను బట్టి వాని వ్యక్తీకరణము భేదించవచ్చును. కాని చిత్తవృత్తులు మాత్రము మారవు. మానవప్రవృత్తియం దాసురగుణములు లుండును, దైవీగుణము లుండును. ఇవి మాత్రము సర్వకాలములకు సమానములు. వీని యభివ్యక్తి ఒక్కొక్క సందర్భమున నొక్కొక్క విధముగ నుండవచ్చును. దశకుమారచరిత్రములోని యితివృత్తము కల్పితమే యైనను దానియందు మానవజీవితములోని లోతుపాతులు, వైలక్షణ్యములును, వైచిత్రి యంతయును ప్రదర్శింపబడినది. అందుచే నందలి పాత్ర లన్నియు మనకు నిత్యజీవితమునం దెదురగుచుండును. పరిస్థితులనుండి నేర్పుగా విడదీసినచో మనకు కన్పించు ప్రతిమానవుడును దశకుమారచరిత్రములోని యేదియో యొక పాత్రతో నేకీభావము చెందుచుండును. ఇది ప్రధానముగా దశకుమారచరిత్రములోని పాత్ర చిత్రణమునందున్న మహాగుణము.

# 5. దశకుమార చరిత్రము - రసభావములు

కథ ప్రతివారికిని ఆహ్లాదజనకముగ నుండుటకు రచయిత దానియందు కల్పనకు ప్రాధాన్య మిచ్చి, ఊహాతీతములగు అలౌకిక సన్నివేశములను గల్పించుచుండును. అవి కొన్ని యధార్థములు గావచ్చును. కాని కథకుడు వానికి విభేదము చూపడు. ఊహాతీతకల్పనాశక్తితో అద్భుతసన్నివేశములను సృష్టించి పరితల కాహ్లాదమును గూర్చుటయే యాతని యుద్దేశ్యము. కావున కథకు ప్రాణభూతమైనది అద్భుతరసభరితమగు కల్పన.

కథయందు సమయానుకూలముగా వివిధములగు రసములు పోషింపబడవచ్చును. కాని అద్భుతమునకే ఎక్కువ ప్రాధాన్యము. కావున నిది అంగిరసము, మిగిలినవి అంగరసములు.

ఈ అద్భుతమును అలంకారికులు అంగిరసముగా నంగీకరింపలేదు. దీనిని ప్రప్రథమముగ స్థాపించినది సాహిత్యదర్పణకర్తయగు విశ్వనాథుని పూర్వీకుడు, నారాయణుడు. సత్త్వగుణాధిక్యమువలన మనకు బాహ్యప్రపంచమును మఱపించు నొక యానందము కల్గుననియు, అది బ్రహ్మానంద సదృశమైన దనియు దీనికి లోకోత్తరచమత్కారమే ప్రాణ మనియు, చమత్కార మనగా మనస్సు విస్తరించుటయే యనియు, మనోవిస్తార మనగా విస్మయమే కావున విస్మయ మెల్ల రసములకును కారణ మనియు, కాబట్టి అద్భుతరసముననే మిగిలిన రసము లన్నియు నిమిడియున్న వనియు, నాతని సిద్ధాంతము(కావ్య.సంగ్ర. పుట 309).

భరతుడు తన నాట్యశాస్త్రములో రసప్రకరణమున అద్భుతమును పేర్కొని, దానికి విస్మయము స్థాయిభావ మని చెప్పినాడు. అసామాన్యమైన కార్యములు జూచుటవలన అద్భుతరస ముత్పన్నమగు నని యాతని సిద్ధాంతము (నాట్య. 6—77).

అద్భుతజనకములైన యట్టి యలౌకిక సన్నివేశములు దశకుమార చరిత్రలో చాలచోట్ల గలవు. అర్థపాలుడు యక్షిణియైన తారావళికి పుట్టుట, రాజవాహన మాతంగకుల పాతాళలోక విజయము, రాజవాహనుడు ఆకలి దప్పులు లేకుండజేయు దివ్యమణిని పొందుట, విద్యేశ్వరుడు ఇంద్రజాల నెపమున అవంతిసుందరీరాజవాహనుల వివాహము చేయుట, అర్థపాలుడు నాగేంద్ర విద్యచే తండ్రిని రక్షించుట, ప్రమతి తారావళి సహాయమున నవమాలికాంతఃపుర మును జేరి సుఖించుట, కందుకవతి బ్రహ్మరాక్షసిచే రక్షింపబడుట, కింకరుడు కనకలేఖామంత్రగుప్తులను ఆకాశమార్గమున గొంపోవుట, ఇత్యాది అలౌకిక సన్నివేశము లిందు గలవు.

ఈవిధముగా కథయందు అంగిరసము అద్భుతమే యైనను, అంగరసము లుగా మిగిలిన రసము లన్నియు నుండవచ్చును. పదిమంది కుమారుల వివాహ ఘట్టములందు శృంగారమును; పుష్పోద్భవుడు స్త్రీవేషమును ధరించుట, మరీచి చంపానగరవీధులలో వేశ్యయగు కామమంజరితో నడచుట వంటి సన్నివేశము లందు హాస్యమును, అర్థపాలుని దాది శ్మశానమునందు వదలిపెట్టుట, ధూమిని తన భర్తను నూతిలోనికి త్రోయుట వంటి చోట్ల కరుణమును;పుష్పోద్భవుడు దారు వర్మను చంపినప్పుడు రౌద్రమును; వికటవర్మను, ఉపహారవర్మ ముక్కలు ముక్కలుగా ఖండించిన సన్నివేశమున భయానకమును, రాజహంస మానసారుల యుద్ధఘట్టమున బీభత్సమును చక్కగా పోషింపబడినవి. వీనికి సన్నివేశ ప్రాధాన్యమే కాని, అంతకు మించిన ప్రాధాన్యము లేదు. ప్రధానమైనది అద్భుత రసమే !

# 6. దశకుమార చరిత్రము - వర్ణనములు

కథాకావ్యములందు వర్ణనముల కెక్కువ ప్రాధాన్యము ఉండదు. ఒక వేళ నచ్చటచ్చట ఋతువర్ణనముల వంటివి యున్నను నవి విస్తృతములు కాక కేవలము సూచనప్రాయముగ నుండును. అంతేకాక అవి కథాసన్ని వేశమునకు ప్రోద్బలకములై యుండును. దశకుమార చరిత్రలోని వర్ణన ములు ఇట్టివే. కాని, కేతన తాను చేయ దలచినది కేవలము అనువాదమే యైనను, ఈ వర్ణనముల విషయమున కొంత స్వతంత్రించి కల్పించి వ్రాసి నాడు. వీనివలన ఆకాలపు స్థితిగతులు కొన్ని సువ్యక్తమగుచున్నవి. అందు వలన కేతన వర్ణనములు దశకుమారచరిత్రయం దొక ప్రత్యేకతను వహించు చున్నవి. కాని, యిట్టి స్వతంత్ర వర్ణనములు, సాంఘికపరిస్థితుల నను సరించి చేయబడినవి, రెండుమూడు చోట్ల మాత్రమే యున్నవి పుష్పోద్భ వుడు దారువర్మను జంపుటకుగాను నాడువేషమును వేసికొని, బాల చంద్రికతో నతని యింటి కేగెనప్పుడు, పట్టియలు, ఉజ్జ్వల మణినూపుర ములు, మొలనూలు, వస్త్రములు, కట్టువడములు (కట్టిన పూలదండలు), గట్టినూపు, సుద్దసరితీగె (శుద్ధమైన బంగారుతీగెలు), మినుకులు (తాళి బొట్టు), సందిదండలు (హస్తాభరణములు), అంగుళీయకములు, మనోజ్ఞ మైన కంకణములు, చేకట్టు (హస్తభూషణము), పాలెలు (బంగారుబిళ్ళల ఒడ్డాణము వంటిది), మెరియుచున్న టాకులు (ఉంగరములు జారిరాకుండ బంగారముతో చేసి వేసుకొను సాదా ఉంగరము), సిరివెణలు (బంగారు గొలుసులు), అలక్తకము పూత (పారాణి), కాటుక, తిలకము, కమ్మ పువ్వు మొదలగు వానిని ధరించి వెళ్ళినాడు. ఇది అమూలకమైన వర్ణ నము. దీని వలన కేతనకాలపు ఆభరణములు వ్యక్తమగుచున్నవి. మరీచి శృంగారమును గూర్చి తెలిసికొన గోరి కామమంజరి నడుగగా నామె చెప్పిన అలరులు, పూతలు, అంబరములు, ఆభరణములు, తమ్మలము, నెచ్చెలులు, మృదూపధానములు (మెత్తని తలగడలు), సెజ్జలు, కేళీగృహము మొద

లగు వాని పట్టిక ఆ కాలపు భోగ భాగ్యములను వ్యక్తము చేయుచున్నది. ఇట్లే మూలమున కంచె మించి వర్ణితములైన అపహారవర్మకథలోని జూద వర్ణనము (దశకు. 5—64 . 69) మరియు ప్రమతికథలోని కోడిపందె ముల వర్ణనములు (దశకు. 9—29 ... 33) ఆనాటికి ప్రజలలో ప్రబలముగా వ్యాపించియున్న దురలవాట్లను వ్యక్తముచేయుచున్నవి.

కొన్నిచోట్ల కేతన మూలమున విస్తృతముగా నున్న వర్ణనములను తగ్గించి వ్రాసినాడు. గ్రంధారంభములోని కుసుమపుర వర్ణనము (పుట 3) మఱియు వసుమతీదేవి వర్ణనమును (పుట 4), అంబాలికాంతఃపురవర్ణనము (పుటలు 88, 89), మణికర్ణిక వర్ణనము (పుట 122), కందుకనృత్య వర్ణ నము (పుటలు 140, 141), గోమిని వర్ణనము (పుట 148), ధర్మవర్మ వర్ణనము (పుట 173) ఇట్టివి. వీనిని తగ్గించుటవలన మూలమునకు గలిగిన అపకార మేమియును లేదు. మూలమున విస్తృతమైన ఋతువర్ణనము లెచ్చ టను లేవు. అవి కేవలము సూచనా మాత్రములుగ నున్నవి. అవంతిసుందరి కథయందు వసంతసమయము రాగానే, అవంతిసుందరి, బాలచంద్రిక మొదలగు సఖులతో నగరోపాంతవనమునకు విహారమున కేగినది. అదే సమయమున పుష్పోద్భవుడు వెంట రాగా రాజవాహనుడు మధుసహాయుం డగు పుష్పబాణునివలె ఆ వనమును ప్రవేశించినాడు. ఇది వారి భావి సమాగమమునకు వ్యంజకముగా నున్నది. ఇట్లే మంత్రగుప్తుని కథలో గూడ వసంతాగమనము సూచింపబడినది.

సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములు, చంద్రోదయ చంద్రాస్త మయ వర్ణనములు గూడ మూలమున కేవలము సూచనామాత్రముగ నుండగా కేతన వానిని ఒక్కొక్క పద్యములో చక్కగా వర్ణించి కథ నందుకొనును. అపహారవర్మకథయందలి "ప్రాచీన శైలాగ్రభాగస్థ మగు నశోకంబున జిగురుజొంపం బనంగ" (దశకు. 5 — 128) అను పద్యమునందలి ప్రభాత వర్ణనము, అపహారవర్మ చేసిన కార్యము లన్నియు నా రాత్రి సఫలము లైన వన్న యుత్సాహమునకు వ్యంజకముగా నున్నవి. ఈ వర్ణనమునందు వక్త కవి గాదు. ఉపహారవర్మ యగుటయే విశేషము. ఒక పని చక్కగా నిర్వర్తించిన తరువాత గలిగిన తృప్తితో తెల్లవారినది. సూర్యు డుదయించి నాడు. ఆ సూర్యోదయమునందలి సౌందర్య మంతయు, రమణీయత

యంతయు, అతని మనస్సునకు అనుభోగ్య మైనది. ఈ పద్యములోని ఉత్ప్రేక్షలన్నియు, ఆ భావమునకు వ్యంజకముగా నున్నవి. ఆ సూర్యుడు అశోకంబున చిగురుజొంప మని, ఉదయాచల గైరికగండశిల యని, ఇంద్రుడు విడిచిన గాలిపట మని, వర్షాదిపతియైన ఇంద్రుని గొలువఁజేరిన ఆరుద్ర కీటకముల సమూహ మని, ఉత్ప్రేక్షించుట ఎంతయో రమణీయ ముగ నున్నది. "జక్కవలు చెదర గమలము" (దశకు. 6-58) లను పద్యములో చేసిన సూర్యాస్తమయ వర్ణనము కూడ నిట్టిదే! ఇది యంతయు స్వభావోక్తిగా నున్నది. రాత్రి చేయవలసిన తంత్రమునకు మంత్రము పగలు నడచినది. మరల ప్రౌద్దుగ్రుంకినది. ఆ ప్రౌద్దుగ్రుంకుటవలన జక్కవలు చెదరినవి, కమలములు మొగిడినవి, కలువలు విచ్చినవి. ఇచ్చటి తమోవర్ణ నము (దశకు 6-60) అతిరమణీయమైనది. ఇది కూడ స్వభావోక్తియే. చీకటిలో దూరమున పదార్థములు గన్పింపవు. ప్రక్కనున్న పదార్థములును కనుమరుగగును. లోచనవృత్తి ఉడుగదు లోకమున భయము, ఆశ్చర్యము, రెండును చీకటివలన గలుగును. జారులు, చోరులు సంతసింతురు. ఈ జార చోరుల కార్యముకూడ భయమును, ఆశ్చర్యమును గలిగించును అదియే ఆ రాత్రి జరిగినది. అది ఈ తమోవర్ణనమునందు వ్యంగ్యముగా నున్నది. తరువాత ఉపహారవర్మకథలోని "వారిజ బాంధవు డను నంగారం" బను పద్యము (దశకు. 7—90), సూర్యాస్తమయ వర్ణనము. ఉత్ప్రేక్ష మిక్కిలి ప్రతిభావంతమైనది. సూర్యు డన్న అంగారము అపరాబ్ధిలో బడగా పైకిలేచిన ధూమమువలె చీకటి వ్యాపించినదట! ఇట్లూహించుట మిక్కిలి కష్టము. తరువాతి పద్యము (దశకు. 7—91) చంద్రోదయవర్ణనము. ఆ చంద్రు డెంపు కుదయించినాడు? జారకేళి యతనికి గూడ యిష్టమే! ఇచ్చట వక్తకూడ జారుడే కావున వానికి ఉపాయము కల్గించుటకై ఉదయించినాడు. ఇట్లు కథలో కలిపి వర్ణనములు చేయుట మహాకవి లక్షణము. సామాన్య కవియైనచో కథకు కథ, వర్ణనములకు వర్ణనములు వేరువేరుగ నుండును. కేతన చేసిన వర్ణనములు కథలో కలయికను బొంది కథావిషయకమైన ప్రయోజనమును సాధించినవైయున్నవి.

వ్యక్తులను వర్ణించు నప్పుడు కేతన వారి స్వరూపముతో బాటు స్వభా వములను గూడ వర్ణించి చెప్పును. అపహారవర్మకథలోని పసుపాలితుడు కామ మంజరివిషయమై సుందరకునితో పందెమొడ్డి చివరకు నిర్ధనుడై జైనసన్న్యాసి

యగును. అతని స్వరూపమును వర్ణించునపు డాతని దీనావస్థను గూడ చక్కగా వర్ణించినాడు కేతన (దశకు. 5—40).

ఇట్లే మంత్రగుప్తుని కథ యందలి—

"తెల్లని వాలుగడ్డమును దీర్ఘజటాలియు గ్రూరదృష్టులుం
బల్లశరీరముం భసితపాండులలాటము గల్గు తాపసుండు" (11—7)

అను తాపసివర్ణనమును, మంత్రగుప్తునికథలోని—

"పేరిన కోఱమెంట్రుకలు బీటలువారిన దీర్ఘకాయమున్
మీఱిన కోఱదౌడలును మీసల నూనిన రక్తపంకముల్
వీఱిడి చూపులం గుఱచవీపును గల్గిన బ్రహ్మరాక్షసుండు"(ద.10—67)

అను బ్రహ్మరాక్షసవర్ణనమునను వారి క్రూరత్వమును మూర్తీభవింప జేసినాడు.

కథాకావ్యములందు అష్టాదశవర్ణనము లుండవలె నన్న నియమము లేదు. సమయానుకూలముగా నవి వర్ణితము లైనను కావచ్చును. కాని వాని కెక్కువ ప్రాధాన్య ముండదు. దశకుమారచరిత్రమునందును ఇట్టి వర్ణనము లు కొన్ని గలవు. గ్రంథారంభమున కుసుమపుర వర్ణనము (2—3), రత్నోద్భవుని జన్మ వృత్తాంతమున సముద్రవర్ణనము (2—89), ప్రమతికథయందు పర్వతవర్ణనము (9—2), మిత్రగుప్తునికథయందు ఉద్యానవనవర్ణనము (10—5), అవంతిసుందరి కథయందలి విరహవర్ణనము (3—123...130), అపహారవర్మకథయందలి విప్రలంభవర్ణనము (6—33), అపహారవర్మకథయందే మద్యపానవర్ణనము (6—106), గ్రంథారంభమున కుమారోత్పత్తివర్ణనము, చాలచోట్ల వివాహవర్ణ నములును గలవు.

వర్ణనీయవిషయముల సమగ్రస్వరూపములను ప్రదర్శించవలసివచ్చి నప్పుడు కేతన సీసపద్యమును గాని, వచనమును గాని ఉపయోగించును. మాతంగకుడు దర్శించిన నరకము (3—16), వసుపాలితుని తాపసవేషము (5—40), అపహారవర్మ నగరరక్షకులనుండి తప్పించుకొనుటకు చూపిన పిచ్చి వాని చేష్టలను (6—157) సీసపద్యములలో వర్ణితములైనవి. సోమదత్తుని సైనిక వేషము (4—30), నవమాలిక కన్యాంతఃపురవర్ణనమును (6—6) వచనములలో వర్ణితములు. ఇట్లు వర్ణనముల విషయమున గూడ కేతన మంచి ఔచిత్యమును జూపినాడు.

# 7. కేతన కవితాశక్తి

కావ్యోద్భవమునకు ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసముల మూడింటిని మమ్మటుడు హేతువులుగా పేర్కొనెను—

"శక్తి ర్నిపుణతా లోకశాస్త్ర కావ్యా ద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే". [కా.ప్ర. 1—3]

కాని జగన్నాథు డీ వాదమును ఖండించి ప్రతిభ యొక్కటే కావ్యహేతు వని నిర్ణయించినాడు.

"తత్ర చ కారణం కవిగతా కేవలా ప్రతిభా"— [రస. గం.]

ఈ ప్రతిభ జన్మాంతరీయక మనియు, వ్యుత్పత్త్యభ్యాసజనిత మనియు, ద్వివిధముగా జగన్నాథుడు పేర్కొనెను. రెండును కావ్యకారణములు కావచ్చు ననెను. కారణమునందలి వైశిష్ట్యమును బట్టి కార్యమందలి వైశిష్ట్య ముండు నని జగన్నాథుని తీర్పు. జన్మాంతరీయకమైన ప్రతిభవలన పుట్టిన కావ్యముయొక్క తీరు వేరు. వ్యుత్పత్త్యభ్యాసజనితమైన కావ్యముయొక్క తీరు వేరు. రాజశేఖరు డీ ప్రతిభను మరల ద్వివిధముగా పేర్కొనినాడు—భావయిత్రి, కారయిత్రి యని. భావమున కుపయోగించునది భావయిత్రి. కవి కుపకరించునది కారయిత్రి. న్యాయమునకు రెంటికిని భేదము లేదు. కవి తొలుతగా భావించిన తరువాతనే కావ్యకరణమునకు గడంగును. భావుకుడు కాక కవి కాలేడు. అందుచేత కారయిత్రీప్రతిభలో భావయిత్రిగూడ నంతర్గర్భితమై యుండు నన్నమాట. భావయిత్రీప్రతిభయొక్క పరిపూర్ణదశయే, లేక పరిణతదశయే కారయిత్రి యని చెప్పవచ్చును. ఈ భావయిత్రీప్రతిభ కవిత్వమున కాత్మ వంటిది. ఇదియే కవిత్వమునం దొక సమాధిని కల్పించును. భావయిత్రి యనగా భావింపజేయుశక్తి. కవియందుగాని భావకునియందు గాని, ఒకానొక శక్తి యుండును. ఆ శక్తి వలన నతడు భావనావ్యాపారమునకు గడంగును. భావన యనగా పునఃపున

రసంధానముచేయుట. బాహ్యప్రపంచములోని కారణసామగ్రి, ఈ పునఃపున రనుసంధానాత్మక మగు భావనావ్యాపారముచే హృదయమునందు ప్రతిబింబించి విభావానుభావములై చర్వణాస్థితిని బొందును. ఈ భావన గుణాలంకారముల వలన కొనసాగుచుండును. కారణసామగ్రియందు గుణాలంకార సంయోజనము చేయుటవలన నది పునఃపున రనుసంధానయోగ్యమై విభావానుభావత్వము నొందు నన్నమాట ఇందుచేతనే గుణాలంకారములు భావనాజనకములని అభినవ గుప్తు డనినాడు. ఆ గుణాలంకారములు కవిభావనలోనుండి జన్మించినవి, భావు కుని హృదయమున మరల భావనను పుట్టించుచున్నవి యనినాడు. ఇందుచేత తేలిన సారాంశ మేమనగా—కవియొక్క భావనయంతయు గుణాలంకార సంయో జనగా నుండును. ఈ భావుకతా పుష్టి యెంత యుండునో కవిత్వ మంత పుష్ట ముగా నుండును. ఈ భావనయే రసానుసంధాయకము——అని.

దశకుమార చరిత్రము అనువాద మగుటవలన కేతన యొక్క భావు కతను ప్రత్యేకముగా తీసిచూపుటకు ఆయన స్వతంత్రముగా రచించిన పద్యములను, చేసిన ఊహలను గ్రహింపవలయును. అట్టివి దశకుమార చరిత్రలో కొన్నిచోట్ల తిలతండుల న్యాయమున గన్పించుచుండును. అందు ప్రధానములైన కొన్ని పద్యములను గ్రహించి ఆయన భావుకత యొక్క ఉదాత్తతను ఈ క్రింద వివరింతును. ఇది అనువాదమగుటవలన కథాగత సన్నివేశములందు కేతన మూలమునే యనుసరించినాడు. కనుక అట్టి సందర్భములను ప్రత్యేకించి చూపుట అనవసరము. అది హేతువుగా ముఖ్య ములైన కేతన కవితాశక్తిని పట్టి యిచ్చు పద్యములు మాత్రమే గ్రహించి, వెనుక చెప్పిన అలంకారికమార్గమున ఆతని కవితాశక్తిని నిరూపింప యత్నింతును :—

1. రాగపల్లవితమై రాజనందను చూపు
 తీగెలతాంగి మైతీఁగెఁ బెనఁగ
లజ్జావిభూతమై లలనచూడ్కి మెఱుంగు
 పతిమూర్తి మేఘసంగతి జరింపఁ
గౌతు కావహలీఢ కాంతుచిత్తము నాతి
 డెంద మత్తఱి నున్న చంద మరయ
సంక్షోభకలితమై సతి నెమ్మనము పతి
 హృదయవికాసంబు నెఱుఁగకుండ

లోలతాలోలమాన విలోచనలును
మన్మధాధీన పరతంత్ర మానసులును
నగుచు నేకాసనాసీను లైరి తగ వ
ధూవరులు సౌఖ్యరసముల దోయి వోలె. (దశకు. 4—57).

ఈ పద్యము అవంతిసుందరీ రాజవాహనుల సమాగమ సందర్భము లోనిది. ఇది మూలమున లేదు. కేతనయొక్క భావుకతాశక్తిని పట్టియిచ్చు నది. పద్యము శృంగారరసమునకు వ్యంజకము. ఇచట శృంగారము అనుభావ ముఖమున ధ్వనించుచున్నది. అనుభావముఖమున శృంగారరసము ధ్వనింపజేయుట మిక్కిలి కష్టమైనది. శృంగారరస విషయమున మాత్రము అనౌచిత్యము వచ్చినను రసభంగ మగును. అట్లనౌచిత్యము రాకుండ శృంగారరసమును నిరూపించుట మిక్కిలి కష్టమైనది. ఎంతో సుకుమారముగ, లలితముగ, సున్నితముగ, నిర్వహించిన గాని రసప్రతీతి గలుగదు. ఈ గుణములు లేనిచో శృంగారరసము వట్టి బూతుగా పరిణమించును. దీని లోని కష్ట మిది. ఇందలి భావుకతను కొంచెము వివరింతును. నాయకుని చూపు తీగె. అది రాగపల్లవిత మైనది. నాయికశరీరము తీగె. ఆ తీగెతో నాయకుని చూపుతీగె పెనవైచికొన్న దట. చూపును తీగెతో రూపించుట సామాన్యమైన కవి చేయునది కాదు. ఇట్లు రూపించిన కవు లెవ్వరును లేరు. దీనికి రాగపల్లవిత మైన దని ఒక విశేషణము. అందుచ్చేత దానికి అల్లుకొనుటకు కొక యాధారము కావలెను. ఆ యాధారము లతాంగి మైతీగె. స్త్రీశరీర మును తీగతో పోల్చుట యున్నది. కాని మొదటి రూపకము వలన నీ రెండవ రూపకము నందలి యౌచిత్యము తళతళలాడుచున్నది. కవు లూరక స్త్రీ శరీరమును తీగతో పోల్చుదురు. ఆ పోలికలలో సార్థక్యమేమున్నది? దానికి సార్థక్యమును కేతన తెచ్చినాడు. ఇది మిక్కిలి సొగసైన యూహ. మఱి యొకటి — చూపు తీగె, మైతీగెతో పెనగె ననుటచేత ఆ చూపు మరల నాయిక శరీరమును వీడి యీవలకు వచ్చుట యసంభవ మని వ్యంగ్యము. ఇది నాయకుని చూపు. అందుచేత పెనగుట; నాయకునియందున్న భోగ లాలసత, నాయిక యందున్న భోగ్యత వ్యంగ్యములు. రెండవది—

లజ్జా విభూతమై లలన చూడ్కి మెఱుంగు
పతిమూర్తి మేఘ సంగతి జరింప (దశకు. 4—57).

దీనిలో లలన చూడ్కి మెఱుంగు అనుటచేత, అది పతిమూర్తియందు క్షణప్రసారము కలదనియు, ఆ పతిమూర్తి మేఘ మగుట దానిని వదలిన స్థితి దీనికి లేదనియు వ్యంగ్యమై, స్త్రీ పురుష భావమును చమత్కారముగా ధ్వనింపజేయుచున్నది.

ఈ రెండు చరణములును వధూవరుల చూపులను, అనగా శారీరక ములైన యనుభావములను జెప్పుచున్నవి. తక్కిన రెండు చరణములు వారి మనోలక్షణములను జెప్పు నట్టివి. వీనియందు కూడ స్త్రీపురుష స్వభావము లందలి భేదము వ్యక్తమగుచున్నది. వరుని చిత్తము వధువు చిత్తలక్షణమును ఎరుగ గోరును. వధువు హృదయము మౌగ్ధ్యమువలన సంక్షుభితమైయుండి కూడ కాంక్షాపరాధీనమై యుండును. ఇట్టి శారీరక మానసిక లక్షణములను పుంస్త్రీవిభిన్నస్వభావ ద్యోతకములను, రెండేసి రెండేసి చరణములయందు చెప్పి, తేటగీతయందు మొదటి రెండుచరణములలో ''లోలతాలోలమాన విలోచనులును, మన్మథాధీన పరతంత్ర మానసులును—'' అని వ్రాసి, తాను పైన చేసిన రచనయందలి సొగసును విస్పష్టము చేయుచు వారియందలి సమాన భావలక్షణమును గూడ చెప్పినాడు. లోలతాలోలమాన విలోచనత్వము, మన్మ థాధీన పరతంత్రమానసత్వము, నిట యుభయులయందు సమానమే మొదటిది శారీరకము. రెండవది మానసికము. కాని ఇవి శరీరమానసములందు, వారి వారి పుంస్త్రీ స్వభావములను బట్టి యభివ్యక్తి నొందినవి. ఆ అభివ్యక్తియందు భిన్నత్వమున్నను, వాని లక్షణములందు సామ్య మున్నది. అందుచేతనే వా రేకాసనాసీను లగుట. ఈ యేకాసనాసీనులగుట యన్నపదములో పూర్వభావము లన్నియు వచ్చి పర్యవసించుచున్నవి. మఱియు మొత్తము పద్యమునందు ఆ పుంలక్షణ మీ స్త్రీలక్షణమును, ఈస్త్రీలక్షణ మా పుంలక్షణమును సమాకర్షింకొను చున్నట్లు వర్ణితమైనది.అందుచేత నీ యేకాసనాసీనత్వ మన్నది ఆ సమాకర్షణము యొక్క ఫలము. ఈ యేకాసనాసీనత్వము కొలికపూస. దీయందు స్త్రీ పుంభావమంతయు పర్యవసన్నమగుచున్నది. అందుచేతనే సౌఖ్యరసముల దోయి యన్న యుపమానము నిచ్చట కవి వాడినాడు. ఈ ఉపమాన మిచ్చట వాడుట బ్రహ్మ వంటి కవికి గాని కుదురునది గాదు. ఎందుచేత ననగా వధూవరులలో నెవరి సౌఖ్యము వారిదే ! అందుచేత 'సౌఖ్యరసముల దోయివలె' యన్నాడు. దోయి యనగా జంటయని యొక యర్థము. వేఱువేఱుగా వధువు

సౌఖ్యరసమే, వరుడును సౌఖ్యరసమే యన్న మాట. కాని. ఇరువురియందును వేరువేరుగా భాసించినను, ఈ సౌఖ్యమునం దేకత్వము కూడ యున్నది. అభివ్యక్తియందు భిన్నత్వము గాని, స్వభావమునందు ఏకత్వము. కాబట్టి యిచ్చట అభివ్యక్తియందున్న భిన్నత్వము నీ యర్థము పట్టి యిచ్చుచున్నది. దోయి యనగా దోసిలి యని ఇంకొక యర్థము. దోసిలి ఒకటియే గాని రెండుగావు. రెండు చేతులు కలిసినగాని దోసిలి కాదు. సౌఖ్యరసములు దోసిట పట్టినట్లున్నది. ఈ యర్థము సుఖమునందలి స్వభావైక్యమును పట్టి యిచ్చుచున్నది. మఱియు సౌఖ్యరసములు అని బహువచనము వాడినాడు. సౌఖ్య మనగా దైహికమైనది; మానసికమైనది. దాంపత్యము యొక్క దైహిక మానసిక పరతంత్రమైన, సావచ్ఛిన్నమైన యానందము సౌఖ్యము. రస మనగా నిట్టి యానందము కాదు—నిరవచ్ఛిన్నమైనది. మొదట చెప్పిన జంటయను నర్థము, మానసిక దైహికావచ్ఛిన్న సుఖలక్షణమును జెప్పునట్టిది. దోసిలి యన్న రెండవ యర్థము శృంగార రసానందమును నిరస్తాహంకారమై విగళితవేద్యాంతరమైన రసస్వరూపమును జెప్పునట్టిది. దాంపత్యము ఇచ్చటినుండి యచ్చటివఱకు వ్యాపించినది. ఈ యన్నింటికి కూడివచ్చునట్లు, ఇంత యర్థమును పట్టియిచ్చునట్లు, ఈ యుపమానమును కేతన వాడినాడు. నాయికానాయకుల ప్రథమసమాగమమందలి పరస్పర భావాకర్షణలక్షణమును మిక్కిలి చమత్కారముగా ధ్వనింపజేయు చున్న దీ పద్యము.

2. విభుమూర్తి యేమియు వెలివోవగా నీక
తన కన్నుఁగవఁ ద్రావికొనఁగ నిచ్చు
రమణు లీలాలాపరసము విచ్చలవిడి
వీనులఁ దనియంగ నాన నిచ్చు
భూవల్లభుని మేనిపొందు లింపెసలార
సొగయ మైతీఁగెకుఁ జూఱయిచ్చుఁ
బ్రాణేశవీకమును బడయ నానందభ
రావేశ మర్థి కెమ్మోవి కిచ్చుఁ
జొక్కి సతిమనంబు సొచ్చు నుల్లంబున
నాదవు కప్పు తనకు నొజ్జ గాఁగ
మదన తంత్రములు క్రమక్రమంబునఁ దగ
నభ్యసించు బాలహరిణనయన. (దశకు. 4-34)

ఇదియును అవంతిసుందరీ రాజవాహనుల సమాగమ ఘట్టములోనిది. ఈ పద్యమునందు నాయికయొక్క ముగ్ధత్వము త్రావికొనగనిచ్చు, అననిచ్చు మొదలైన మాటలవలన వ్యంగ్యమగుచున్నది. నాయికయొక్క ముగ్ధత్వము లెస్సగా భావించిన గాని యిట్లు వ్రాయుట కష్టము. నాయిక ముగ్ధ కావున తానై శృంగారచేష్టలకు దిగదు. కాని ఆమెకు మనస్సునందు రతియున్నది. ఆమె శరీరము శృంగారానుభవమును కోరుచునేయున్నది. ముగ్ధ యగుటవలన లజ్జా వతి. నాయకుడు చతురచేష్టలవలన ఆ లజ్జయొక్క యుల్బణమును వారించి నాడు. అప్పు డామె నాయకునిమూర్తిని తన కన్నులను జూడనిచ్చిన దట. అతని వాక్కులను చెవులను విననిచ్చినది. అతని మేని పొందును శరీరమునకు జూఅనిచ్చినది. అనుభవవిషయమున స్త్రీ పురుషగతమైన నీ భేదము నింత సొగసుగా చెప్పుట కష్టము. స్త్రీకి అనుభవింపబడుటలో నానందము. పురుషున కనుభవించుటలో నానందము. అనుభవమునందు స్త్రీపురుషులు కర్తృకర్మలు. స్త్రీపురుష సంగతియందున్న యీ విషయమునందు ఏ విధమైన మోటుతనము రేఖామాత్రముగనైన పొడచూపినచో నది జుగుప్స కలిగించును. ఇంత యుదాత్తముగా కేతన వ్రాసినా డిచ్చట.

8. లక్ష్మిహస్తమునకు లాంఛనం బబ్జంబు
హస్తంబ యబ్జ మీ యబ్జముఖికి
సిరి పురాతనుడైన పురుషుని మును గూడె
జెలువుని గూడ దీ చిగురుబోడి
జనులకు నిందిరాసతి పొడచూప దీ
పద్మాక్షి కన్నులపండు వయ్యె
నింత ప్రాయం బని యెఱుగము కమల కీ
నాతికి నెలజవ్వనంబు హెచ్చె
గాన నీ లక్షణమ్ములు కమలనిలయ
లక్షణములకు గడు నగ్గలంబు నిట్టి
వనితకన్ను మనంబు నెవ్వాని దగిలె
నతడె కాడె మన్మథునకు ననుగలంబు. (దశకు. 10-29)

ఈ పద్యము దశమాశ్వాసములో మిత్రగుప్తుడు కందుకవతిని జూచిన సందర్భమున ఆమె సౌందర్యము నిట్లు వర్ణించినాడు కేతన.

ఈ పద్యమునందు వ్యతిరేకాలంకారము వ్యంగ్యము. కాని వ్యంగ్యమైన యీ యలంకారమును, "ఈ లక్షణములు కమలనిలయ లక్షణములకు కడు నగ్గలంబు" లని వాచ్యము చేసినాడు. ఈ మాట లేనిచో పద్య మెంతయో సొగసుగా నుండెడిది.

4. "ప్రాచీన శైలాగ్ర భాగస్థమగు నశో
కంబున జిగురుజొంపం బనంగ"— (దశకు. 5-128)

ఈ పద్యము అపహారవర్మకథలోని సూర్యోదయవర్ణనము పద్యమునందలి యుత్ప్రేక్షలు కవి రమణీయ దర్శనమున కుదాహరణములు

5. భావజు పట్టపుదేవియై రూపున
సడిసన్న రతివిలాసములఁ గెల్చి
యతనుధనుర్గుణంబైన భృంగావలి
నీలాలకచ్ఛాయ నేలుదెంచి
యంగసంభవుని కట్టనుఁగైన యమృతాంశు
నాననాంబుజకాంతి నూనపఱచి
కందర్పుసేన ముంగిలియైన నునుఁ గమ్మ
దనుగాలి నూర్పు గాడ్పున జయించి
యున్న నిన్నుఁ జిత్తోద్భవుఁ డెన్ని విధులఁ
బఱచు టరయంగ నుచితంబె పంకజాక్షి
యెన్నరాని బన్నంబుల నన్నుఁ బఱచె
నేను వానికిఁ జేసిన యెగ్గు గలదే — (దశకు 7-111).

ఈ పద్యమునందు అలంకారకృత రసధ్వని వ్యంగ్యము. ఈ అలంకారము కవి నిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధము. ఇందు మన్మధుని పరివారము నంతయు తన సౌందర్యలక్షణములచేత నాయిక జయించినట్లు వర్ణితమై యున్నది. ఇట్లు మన్మధుని పరివారమునంతయు నామెను జయించినందులకు ఆమెను మన్మథుడు బాధించుట యుచితమే అని తాత్పర్యము సంపదకు హేతుత్వము చెప్పబడినది నాయిక మన్మధుని పరివారమును గెల్చుట యన్నది, నాయక ప్రౌఢోక్తిసిద్ధము. యధార్థము గాదు. యధార్థమైనది యతిలోకసౌందర్యము. ఆ సౌందర్య లక్షణముల కుపమానములు—రతి, భృంగ, చంద్ర, మలయానిలాదులగు మన్మథ

పరివారము వానికి 'గెల్చి, ఏలు దెంచి, న్యూనపఱచి, జయించి' యను పదములు న్యూనతాపాదకములై, వ్యతిరేకాలంకారవాచకములుగా నున్నవి. ఈ వ్యతిరేకాలంకారము పూర్వముచెప్పిన హేతుకల్పనమునందు పర్యవసన్నమగుచున్నది. ఇప్పుడు నాయకుని ప్రౌఢోక్తి రెండు భాగములు—ఒకటి, వ్యతిరేకాలంకారము. రెండవది దానిచేత అనుప్రాణితమగు హేత్వలంకారము. ఈ ప్రౌఢోక్తివలన నాయకాలంబికమైన రతి విభావముఖమున వ్యజ్యమాన మగుచున్నది తేటగీతియొక్క యుత్తరార్ధమైన– "ఎన్నరాని బన్నంబుల నన్నుఁ బఱచె, నేను వానికిఁ జేసిన యెగ్గు గలదె" యను రెండు చరణములచేత ద్యోతమానము లగు అనుభావ, సాత్త్వికభావ, వ్యభిచారిణులచేత అట్లు విభావముఖమున వ్యజ్యమానమైన రతిభావము, అయోగవిప్రలంభరసరూపముగా పరిణమించుచున్నది. ఇంతవఱ కిది యంతయు అలంకారికమైన వ్యాఖ్యానము. అర్థగతమైన రమణీయత. ఇవిగాక రచనయందున్న సొగసు ఈ పద్యమునందు నిరవధికముగ నున్నది. సీసపద్యరచనలో నీ కవి యెంత నేర్పరియో ఇదియును, ఇంతకు పూర్వము వ్యాఖ్యానము చేసిన పలికొన్ని పద్యములును చెప్పుచున్నవి. పరమ సుకుమారముగ, పరమ నాగరకముగ, రమణీయమైన పదవిన్యాసముతో, తెలుగు పలుకుబడుల బెహళింపులతో నీతని సీసపద్యరచన సాగును పద్యములయొక్క నడకలో నొక తూకము, నొక రీవి, ఒక సుకుమారత, ఒక నాగరకత, ఉత్తమకోటిలో రూపుదేరియుండును.

కేతనయొక్క కవితాశక్తినిరూపణమున కాతడు పీఠికలో తిక్కనను గూర్చి రచించిన పద్యములు చక్కని నిదర్శనములు :—

6 గర్భితనవసుధాకర పయోనిధి మాడ్కి
సతిమేను పాండురచ్ఛవి వహించెఁ
గలిత భృంగాబ్జకుట్మలయుగ్మకము పోల్కిఁ
గాంతచన్మొక్కులఁ గప్పు మిగిలె
మకరందసంవాహమలయానిలుని క్రియ
నంబుజాననగతి యలస యయ్యె
యుచితకాలాగమనోజ్జ్వలకుసుమంబు
గతి నింతినాభి వికాస మొందె

వళులు విరిసెఁ గౌను బలిసెఁ గోర్కులు మది
సందడించె నారు నందమయ్యెఁ
ననుపమానభాగ్య యగు నన్నమాంబకు
వర్ణనీయ గర్భవైభవమున. (దశకు. 1—37)

ఇది తిక్కన తల్లియగు నన్నమాంబను గూర్చి వ్రాసినది. ఈ పద్యమునందు ఉపమానములు తెచ్చుటలో కవియొక్క ప్రతిభ వ్యక్తమగుచున్నది. శరీరములు తెల్లబడుట, చూచుకములు నల్లనగుట, గతి యలసమగుట, నాభి వికాసమందుట ఇత్యాదులు గర్భిణీలక్షణములు. వీనికి ఉపమానములుగా తెచ్చిన, 'పయోనిధి, అబ్జకుట్మలయుగ్మకము, మలయానిలము'—ఈ మూడును గర్భమునందు 'సుధాకరుడు, భృంగములు, మకరందములు' గలవియే. అందుచేత ఉపమానత్వము వీనియందు చక్కగా కుదిరినది. నాల్గవది ఉజ్జ్వలకుసుమము. గర్భమునందు దాని యుజ్జ్వలత్వద్యోతకముగా నేమియు లేనిదే. మఱి ఇచ్చట నీ యుపమానము పై యుపమానములతో నేకకోటిపతితము చేయుటలో కవిప్రతిభ యున్నది. ఉచితకాలాగమనముచేత కుసుమ ముజ్జ్వలమైనది. అనగా ఋతు సంపర్కమువలన కుసుమము పూసిన దని తాత్పర్యము. ఈ యర్థము చూచినపుడు పై వానితో నీ యుపమానము భేదించుచున్నది. నాభి వికాసమందుట గర్భిణీలక్షణము. కుసుమ ముజ్జ్వలమగుట కుసుమగర్భమునందు మఱియొక పదార్థముండుటచే గాదు మఱి యుచిత కాలాగమనమువలన. ఇట్లర్థము విచారించినపుడు పైవానితో నతగకున్నను, పై చరణములందువలెనే ఉపమానములను సమాసములతో పొందుగుటవలన దీనికి వానితోడి సామ్యము కుదిరినది. ఇది పద్యరచనావిషయికమైన ప్రతిభ. నాల్గు చరణములందును ఉపమానములను చెప్పుటకు సమాసములు వాడి, ఉపమేయమును జెప్పు సందర్భమున వ్యస్త పదములను వాడుట. సీసపద్యమునకు వ్రాసిన అటవెలదియందు వళులువిరిసె, కౌను బలిసె అను తక్కిన లక్షణములను ఉపమాన రహితముగా జెప్పుచు యొక చమత్కారమును సంపాదించుట. ఎట్లో మూడు లక్షణములకు సరియైన యుపమానములు కుదిరినవి. నాల్గవ లక్షణమునకు గూడ అవిచారితసుందరమైన ఉపమానమును సంపాదించవచ్చును. కాని అది విచారిత సుస్థముకాదు. వళులు విరియుట, కౌను బలియుట, కోర్కులు సందడించుట, నారు నందమగుట అనుపమానములు. వీనికి లక్షణములు ఎచ్చట దొరకును ? పూర్వము చెప్పిన లక్షణము లన్నియు కాకపోయినను, ఆ మొదటి నాల్గులక్షణములైన ఒకేచోట సమ

కూడునవి కావు. ఒక్కొక్క లక్షణ మొక్కొక్క వస్తువునం దున్నచో నుండ వచ్చును. కాని ఈ అన్ని లక్షణములును అన్నమాంబను పట్టినవి ఇంపులో కొన్ని అనుపమానములు గూడ పద్యరచనవల్ల ఈ యర్థమునంతను కవి సంపాదించినాడు. ఇంత యర్థము రచనలో నున్నదని పద్యరచనాశిల్పము ఎంతయో తెలిసినవారికి గాని స్ఫురించెడిది కాదు ఈ యర్థమునంతయు తా నింత సొగసుగా పద్యరచనాచమత్కృతియం దిమిడ్చితిని, చూచుకొనుడన్నట్లు 'అనుపమానభాగ్య' యని యన్నమాంబకు విశేషణము వేసినాడు. ఇచట 'అనుపమానభాగ్య' యన్న మాట పైన చేసిన వ్యాఖ్యానమున కంతకు గ్రాహకముగా నున్నది కేతనయొక్క పద్యరచనాశిల్పమున కీ పద్యము పతాక వంటిది.

కేతనయొక్క భావుకతాశక్తికి, పద్యరచనకు గూడ తిక్కనపై నీతడు రచించిన సీసములు నాన్యతోదర్శనీయమై వెలయుచున్నవి:—

7 సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
  డను నాలుకకుఁ దొడ వైనవాఁడు
చిత్త నిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన వీఁ
  డను శబ్దమున కర్థ మైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన వీ
  డని చెప్పుటకుఁ బాత్ర మైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన వీఁ
  డని చూపుటకు గుఱియైనవాఁడు
మనుమసిద్ధిమహేశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి— (దశకు. 1—39)

అన్ని గుణములకును తిక్కన నుదాహరణముగ నిర్దేశించుటలో తిక్కన యొక్క గొప్పతనము ధ్వనించుచున్నది. ఊరక యా గుణములుగలవా డని చెప్పినచో నట్టి గుణములు గలవారు పలువు రుండవచ్చును కాని తిక్కన యట్టివాడు కాడు. ఉదాహరణ స్థానీయుడు. 'సుకవీంద్రబృందరక్షకుడు, చిత్త నిత్యస్థితశివుడు, దశదిశావిశ్రాంతయశుడు, సకలవిద్యాచణుడు'— ఇవి

సంస్కృత సమాసములు. సీసమునందలి నాల్గుచరణములలో అర్ధార్ధవ్యాప్తి గలవి. తక్కిన దంతయు తెలుగు. ఈ రచనయంతయు మణులు ముత్యములు కలిపి దండగ్రుచ్చుట వంటిది. సంస్కృతములో నా సమాసము లట్లుచేయుట మిక్కిలి నేర్పరితనము. వానిలో 'చిత్త నిత్య స్థితశివు' డన్న సమాసము చేయుటలో కష్ట మెక్కువ. 'నిత్యచిత్త స్థిత శివు' డని సమాసము చేయుట సామాన్యము. దానినిమార్చి 'చిత్తనిత్యస్థితశివు' డని సమాసము చేయుటలో సమాసరచనమునం దొక వైశిష్ట్యము బిగి వచ్చినది. అర్థమునందు మార్పు లేదు. ఇట్లు చెప్పుటవలన అర్థమునం దొక దీప్తి వచ్చినది. శబ్దములయొక్క పరుసనుబట్టి యర్థగతనైశిత్యము భాసించును చిట్టచివరకు పద్యమును 'దీన జనతా నిధానంబు తిక్కశౌరి' యని పూర్తి చేయుటలో నొక పరిపూర్ణత యేర్పడినది. 'తిక్కసుకవి' యన్న గాని, 'తిక్కమంత్రి' యన్నగాని పూర్తి యగును. కాని శౌరి యన్నాడు. శౌరియనగా శ్రీమహావిష్ణువు. ఇంతకు పూర్వమే శ్లేషవలన తిక్కనకు నారాయణునితో ఔపమ్యమను సాధించినాడు— "నారాయణుండునుం బోలె ననంతభోగ సంశ్లేషశోభితగాత్రుండును" (ద 1-౨౦). అంతమాత్రముతో కేతనకు తృప్తిలేదు అందుచేత నిప్పుడు (1 —౨9) కేవలము నారాయణుడే యని చెప్పినాడు. ఆ నారాయణుడే తిక్కనరూపమున నున్నా డని 'తిక్కశౌరి' యనుటలోని భావము. 'తిక్కశౌరి' యన్నప్పుడు 'శౌరి' యనునది శ్రేష్ఠవాచక మని చెప్పికొనుట ఒక పద్ధతి. ఈ పై యర్థమును విశే షార్థముగా చెప్పికొన్నచో నిది వ్యంగ్యార్థ మగును. కేతన వ్రాసిన పద్యములలో నెల్ల మిక్కిలి గొప్ప పద్య మిదియే తక్కిన వన్నియు దీని తరువాతవే. ఈ పద్యము ఆంధ్రభాషలో నున్న మిక్కిలి సొగసైన పద్యములలో నొకటి. బహు ప్రసిద్ధమైన పద్యమిది.

ఇట్టిదే తిక్కనను గూర్చి రచించిన మఱియొక పద్యమును—

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
 గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పు నుభయ భా
 షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కుళ్ళ నగ్రహారంబులు
 గా నిచ్చు ననుట పొగడ్తపొలము

మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనము చొప్పు
పరుని కొకనికి నిన్నింటఁ బ్రకటవృత్తి
నిజములై పెంపుసొంపారి నెగడు నెట్లు
కొమ్మనామాత్యు తిక్కని కొలది సచివు
డింక నొక్కరు డెన్నంగ నెందుఁ గలడు — (దశకు. 1—93)

కేతన వ్రాసిన మిక్కిలి సొగసైన పద్యములలో నిదియును నొకటి. పద్యము యొక్క సొగసంతయు రచనయందు పలుకుబడియందు నున్నది. ఈపద్యము ప్రధానముగ నాకర్షకముగ నుండుటకు హేతువు ఈ పలుకుబడి. 'అధిక కీర్తనకు దెరవు, ప్రశంసత్రోవ, పొగడ్తపొలము, వర్ణనముచొప్పు' — ఈ నాల్గు పదబంధములు క్రమముగా సీసము యొక్క నాల్గుచరణములయం దున్నవి. వీని యన్నింటికిని అర్థమొక్కటే. ఒకే యర్థమునందు నాల్గు పదబంధములను భాష లోని సొగసును వెలార్చువానిని, వాడుట మిక్కిలి కష్టమైనపని. మఱి నాల్గు మాటలను ఏకార్థమునందు వాడుట యేల? ఒక్కటే వాడవచ్చును గదా యనగా, నాల్గు చరణములందును, భిన్నభిన్నములైన ఔదార్యలక్షణములు ప్రతిపాదితములైనవి. అట్లగుటచేత ఆ ఔదార్యలక్షణములు ఒకనికి కలవన్నచో అది కేవలము అతిశయోక్తి మాత్రమే. యథార్థము మాత్రము కాదు— అని చెప్పుటకు ఒకే యర్థమునందు భిన్నశబ్దగ్రహణములు చేయవలసివచ్చినది. కొంచెము వివరించి వ్రాసినచో నా యభిప్రాయము వ్యక్తమగు ననుకొందును. 'నీ వా కవిని మహాకవుల కావ్యములు కృతిగొన్నా' డన్నచో అది నీవు వానిని పొగడుట. అట్లనుట వానిని కైవారము చేయుటకు మార్గము. మఱి మరల నీ వందువుకదా— అతడు రెండు భాషలయందును కావ్యములు చెప్పును- అని. నేను మరల అదికూడ పొగడ్తయే యని చెప్పవలెను. నీ వా పొగడ్త మరియొక లక్షణమును దీసికొని వచ్చి చేసితివి. అందుచేత నేను పూర్వమన్న ట్లన్నచో బాగుండునా? అందుచేత ప్రశంసత్రోవ యంటిని. మరి నీవు మరియొక లక్ష ణముత్రోవ చెప్పితివి. నేను మరియొక మాటతో దానిని పొగడ్త యంటిని. ఇట్లు భిన్న లక్షణములకు భిన్న భిన్నములైన ఔదార్యలక్షణములను ప్రతిపాదించి, అవి యన్నియు నితరులయందు ప్రశంసామాత్రములే యగునని భిన్నవాచకము లను వాడి పరిహరించుట సొగసు. ఇంతవరకు చేసిన వ్యాఖ్యానము పద్యరచన మందున్న రామణీయకమును విషయీకరించినది. అర్థమునందు మఱియొక

సొగసున్నది ఎత్తుగీతియందు పైన చెప్పిన లక్షణములన్నియు మఱియొకనికి పిండితార్థముగా చెప్పుట. పరుడనగా నెవరు ? ఎవరికంటె పరుడు ? ప్రకరణము చేత తిక్కనకంటె పరు డని యర్థము లభించును ఆ తిక్కనవంటి మంత్రి యెవ్వరును లేరని పద్యము ముగిసినది. మహాకవులు ప్రబంధములు గొనుట, ఉభయభాషలయందును కావ్యముల చెప్పుట, అనేకాగ్రహారములు నిచ్చుట. గొప్ప దక్షిణలతో యాగములు చేయుట పరునియందు నిజము కాదు. పొగడ్త యగును తిక్కనవంటి మంత్రి మరియొక డెవడు గలడు ? ఇది పద్యార్థము. పద్యమునందు దెచ్చుటగాని తిక్కన కీ గుణము లున్న వని కంఠోక్తిగా చెప్పలేదు. కాని పరునియం దీ గుణములు నిజములు గావనుటవలన, తిక్కనయందు నిజములని ధ్వనించుచున్నది. ఇట్లు ధ్వనిమయముగా తిక్కనను కేతన తళతళ లాడించినాడు. ఇది అర్థగతమైన సౌందర్యము కాని అర్థమునందు కంటె రచనయే అధికచమత్కారహేతువుగా నున్న దని చెప్పుట శాస్త్రీయ మను కొందును ధ్వన్యర్థముకంటె వాచ్యార్థమే ఆకర్షణీయముగా నిచ్చట నున్నది. ఈ వాచ్యార్థము భాషాగతమైన సొగసైన పలుకుబళ్ళచేత సంపాదితమైనది కాబట్టి !

ఇట్లు కేతన దశకుమారచరిత్రము కేవల మనువాదమే యైనను, అచ్చటచ్చట తన కవితాశక్తికి నిదర్శనము లనదగిన పద్యములను రచించి, తన ప్రతిభను, పాండిత్యమును ప్రదర్శించినాడు.

# 8. కేతన రచనా పాటవము

కావ్యమునకు ఆత్మ రసము. రసమునకు ఔచిత్యము ప్రాణము వంటిది. ఔచిత్యము భంగింపబడినచో రసమును భంగింపబడును.

"అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా-"(కావ్యా.సంగ్ర. పుట 494)

అని ధ్వనికారుడు జెప్పినాడు అనౌచిత్యముకంటె రసభంగమునకు కారణము మఱొండులేదు ప్రసిద్ధమైన ఔచిత్యము నిబంధించుట రసమునకు ఉపనిషత్తు — అనగా పరబ్రహ్మతత్త్వమును ఉపనిషత్తులు నిబంధించినట్లు, రసమునౌచిత్యము స్ఫురింపజేయుచుండును. కావ్యమంతయు సర్వలక్షణసంపూర్ణముగా నున్నను, ఈ ఔచిత్య మొకించుక తక్కువ యైన, నీరసమై, 'ఉప్పు లేని కూర వలె' పరిహార్య మగును ఇది కథాకథనౌచిత్యము, పాత్రౌచిత్యము, వర్ణనౌచిత్యము, సంభాషణౌచిత్యము, వృత్తౌచిత్యమును అని యనేక విధములుగ నుండును. వానిని కేతన యెట్లు పాటించినాడో ఈ వ్యాసమున చర్చింతును.

మహాకవి దండియొక్క దశకుమారచరితను అనువదించుటలో కేతన ఎంతో జాగ్రత్త వహించినాడు. అతని యనువాదమునందలి యుక్తాయుక్తములను గూర్చి 'దశకుమారచరిత్రము-అనువాద పద్ధతి' యను వ్యాసమున వివరించితిని. కథా విషయమున కేతన జూపిన ఔచిత్యమునకు ఒకటి రెండు ఉదాహరణములను మాత్ర మిచ్చుట చూపెదను.

1. చండవర్మచేత రాజవాహనుడు బందీకృతు డైనాడు. చండవర్మ దర్పసారుని అజ్ఞానుసార మాతని నేనుంగు కాలిపీనుంగుం జేయ దలంచినాడు. అట్టివాడు రాజవాహనునికి భక్ష్యభోజ్యాదుల నిచ్చి పోషించుట యసంభవము. ఈ పరిస్థితులలో రాజవాహనుని స్థితిగతులను పరితల యూహలకే వదలి వేసినాడు దండి.కాని యిచ్చట కేతన రాజవాహనుడు మాతంగకదతమైన చూడా

మణి ప్రభావనిరంజన వపనమస్తకుండై (దశకు. 4—90)యుండినట్లు వివరించుట ఎంతయు నౌచిత్యవంతముగ నున్నది.

2. అర్థపాలుని తల్లి అనుమరణమసయమున సఖీజనులను గూడ పిలిచినట్లు మూలమున నున్నది. ఇట్లు ఉంచుటవలన అర్థపాలపూర్ణచంద్రుల రహస్యము బయటపడిపోవుచున్నది. అందువలన కేతన మూలములోని'సకరుణం సఖీరామన్త్ర్య' (పుట 20) అనుదానిని పరిహరించి యనువదించినాడు.

ఇట్లే నవమాలికావివాహ సందర్భమున పాంచాలశర్మ ప్రమతిని వెంట బెట్టుకొని ధర్మవర్తన మహారాజు వద్దకు బోయి, యాతడు తన అల్లు డనియు, సకలకళానిపుణు డనియు చెప్పి, కూతు నిచ్చి పెండ్లిచేయు మని కోరినాడు. (పుట 135) పాంచాలశర్మ ధూర్తబ్రాహ్మణుడు. అట్టివాని అల్లునికి ధర్మవర్తన మహారాజు తన కూతు నిచ్చి వివాహముచేయుట కంగీకరింపకపోవచ్చును. కాని మూలమున నిచ్చుట నంగీకరించిన ట్లున్నది. ఇట్టి సంశయమునకు తావులేకుండ చేయుటకు కేతన ఈ సందర్భమున చిన్న మార్పు చేసి స్వయంవరమును ప్రవేశపెట్టినాడు. స్వయంవరము క్షత్రియులకు ధర్మశాస్త్ర విహితమైనది. దానికి అగ్రజాతులవారు పెద్దలకు కన్య రసను నచ్చినవానిని కులవిచక్షణ లేకుండ వరింపవచ్చును నవమాలికాస్వయంవరము నట్టిదే. భూపతులు, విప్రకుమారులు పలువురు వచ్చినారు (దశకు. 9—70). ప్రమతి విప్రకుమారుడైనను ఆతనిమీది వలపుచే నవమాలిక యాతనినే వరించినది ఇట్లు అమూలక విషయములను గల్పించి తన ఔచిత్యబుద్ధిని ప్రదర్శించినాడు కేతన. ఇట్టివో ట్లనేకములు 'దశకుమారచచరిత్రము—అనువాద పద్ధతి' యను వ్యాసమున నిరూపింపబడినవి.

ఇట్లే కేతన కథయందు పాత్రలను ప్రవేశపెట్టు నపుడే వారి గుణగణములను, ప్రవృత్తులను సూచించుచుండును.

1. చంద్రపాలుతండ్రి సకలసద్గుణనిధి బంధుపాలుడు (ద. 3—53)

2. మానధనుండైన యా మానపాలుడు (ద. 4—10)

3. వసుపాలితుండును విరూపకుండును నను నామద్వయంబున కను రూపంబులైన ధనరూపంబులు గలుగువాడ (ద. 5—43)

4. అర్థపతి యనగ నిం దొక డర్థపతి ప్రతిము డున్న (ద. 5—83)

5. ధర్మవర్తనుం డనియెడు పేరు సార్థమవునట్లుగ (ద. 9—69)
6. నీతివిదుండు వైరి ధరణీవర భీకర శౌర్యు డార్యసం
ప్రీతివిధాశరీరు డధరీకృత కల్పతరుండు రూపవి
ఖ్యాతుడు దరవర్మ యనగా నొక రాజు (ద. 11—79)

వర్ణనముల విషయమున గూడ కేతన చక్కగా నౌచిత్యమును పాటించినాడు. మూలమున కొన్నిచోట్ల విస్తృతముగ నున్న వర్ణనలను కథాగమనమున కడ్డురాకుండ తగ్గించినాడు గ్రంధారంభములోని కుసుపురవర్ణనము (పుట 3), వసుమతీదేవి వర్ణనము (పుట 4), అంబాలికాంతఃపురవర్ణనము (పుట 88,89), మణికర్ణిక వర్ణనము (పుట 122), కందుకనృత్య వర్ణనము (పుట 140,141), గోమిని వర్ణనము (పుట 113), దర్మవర్మ వర్ణనము (పుట 173) ఇట్టివి.

ఇట్లే కొన్నిచోట్ల సూర్యోదయ (ద. 5—123), సూర్యాస్తమయము (ద. 6—53) లను విస్తృతముగా వర్ణింపక ఒకే పద్యమున వర్ణించి ప్రధానకథ కుపక్రమించినాడు.

ప్రసిద్ధ ఆంగ్లసాహిత్య చరిత్రకారుడు హడ్సన్ చెప్పినట్లు సముచిత సంభాషణము కథను ప్రసన్నముచేయుటయే గాక, అది రచయితయొక్క కథా కథన చాతుర్యమునకు చక్కని నిదర్శనము ఈ విషయమునగూడ కేతన ప్రదర్శించిన ఔచిత్యము ప్రశంసనీయము. ఉదాహరణను అర్థపాలునికథలో సింహఘోషునికొఱకు అర్థపాల పూర్ణచంద్రు లిరువురును సొరంగముత్రవ్వుచుండ వారి కొక భూగృహమున దేవకామినులవంటి స్త్రీలు కనపడుదురు. కాని, అర్థపాలుడు సింహఘోషుని యానాడే పట్టుకొనుట అత్యవసరము అందువలన నిచ్చట కేతన మణికర్ణికవృత్తాంతము నొక్క పద్యము (ద 3—35) లోనే పూర్తి చేసినాడు.

ఇట్లే పద్యరచనావిధానమునందును కేతన ఔచిత్యమును ప్రకటించినాడు. వేనినైన కొన్నింటిని మాలగ్రుచ్చినట్లు చెప్పదలచినచో నాతడు చంపకమాలావృత్తమును వాడుచుండును—

అలరులు బూత లంబరము లాభరణంబులు దమ్మలంబు (ద. 5—23)
పొయితల నీలిదిం డొలికిబూడిద ముందులబంతి గాల చీరయు.(5- 72)

జడలును బూది బొక్కాణము జన్నిదముం బులితోలు చీరయు
(ద. 5—6)

వర్ణనీయ విషయముల సమగ్రస్వరూపమును ప్రదర్శించుటకు కేతన సీసపద్యమును గాని, వచనమును గాని ఉపయోగించును. మాతంగకుడు దర్శించిన నరకము (ద. 2—36), వసుపాలితుని తాపస వేషము (ద. 5-10), అపహారవర్మ నగర రక్షకులనుండి తప్పించుకొనుటకు చూపిన పిచ్చివాని చేష్టలును (ద. 6-157) సీసపద్యములలో వర్ణతములైనవి. సోమదత్తుని సైనిక వేషము (ద. 4—30), నవమాలికాంతఃపుర వర్ణనమును (ద. 6—6) వచనములలో వర్ణితములు.

ఇట్లు కేతన దండి దశకుమారచరిత ననువదించుటలో చక్కని ఔచిత్యమును పాటించినాడు.

పూర్వకవు లందఱివలెనే కేతన సంస్కృతాంధ్రములు రెంటియందును గొప్ప పండితుడు. కావున అతని కవిత్వమంతయు చక్కని సంస్కృతాంధ్ర సమాసములతోడను, తెనుగు నుడికారముతోడను, జాతీయములతోడను, సామెతలతోడను, అలంకారములతోడను, చక్కని పద్యరచనాశిల్పముతోడను, నిండియున్నది.

గర్భితనవ సుధాకర పయోనిధి (ద. 1—87), చిత్తనిత్య స్థిత శివుడు (ద. 1—39), సతత స్వాహా స్వధాది శబ్దద్వయ సంస్కృత హవ్య కవ్య సంతర్పిత మఖ శిఖి ముఖ నిలింప పితృవర్గునకున్ (ద. 1—96), అంభోనిధి వేష్టిత క్షితివిభుత్వము (ద. 2—101), ఘనశబ్దోన్ముఖ చాతకంబుగతి (ద. 3—30), చంద్రాతపశ్రీ సౌధానలదీప్తులు (ద. 4—103), దుష్టోరగ దుష్టుడు (ద. 5—97), మందస్మిత జ్యోత్స్నలు (ద. 6—37), గురుబంధక్లేశమోక్షార్థి (ద. 7—93), శారద మేఘకాంతి భంజనపటు కీర్తిజాల (ద. 8—94), ఉచిత స్నానాసనాదిక్రియా జనితాహ్లాదుడు (ద. 9—35), సూక్ష్మభావరసభావన నైపుణ రూపము (ద. 10—139), సాముచ్యత్కృపాహీనుడు (ద. 11—10), సరభస దుర్నిరీక్ష్య ఘనశాత నిరర్గళ హేతి నిష్ఠురస్ఫురణదవాగ్ని (ద. 12-63) వంటి సంస్కృత సమాసములు కేతన రచనము నందు బహుళములు. ఇట్లే యెడనెడ నెయ్యపు బోటి కత్తెలు (ద. 3-27), దూఱగు నాఱడి చావు

(ద. 3—140), తుమ్మెద పిండు మ్రోత (ద. 6-33), మామిడిమోక లేదలిరు మంట (ద. 6-33), కనకంపు గోర (ద 6-125), మచ్చికతోడి నడవడి (ద. 7-37), మోడుఁ గన్నుంగవ (ద.9—54), తెల్లని వాలుగడ్డము (ద.11-7) వంటి తెనుగు సమాసకములును గలవు.

సమాసభూయిష్ఠమైన పద్యరచనావిధానమునందును కేతన మంచి నిపుణుడు·—

చటులస్యందనఘట్టనం దెరలి యశ్వవ్రాతచంచత్ఖురో
ద్భటపాదాతపదాహతిన్నెగసి యుద్యద్వారణశ్రేణికా
కటనిష్యందిమదాంబువృష్టినడవంగా మారజఃపుంజ ము
త్కటవర్ప్విధతవృత్తిఁగొత్తి నడచెన్ దండెత్తి యుద్దండుడై (11—119)

సైన్యంబుల్ మదమెక్కి బాహుబలముల్ శౌర్యంబులుం జూపి ని
ర్దైన్యస్ఫూర్తి గదంగి పోరఁ బటుశస్త్రప్రౌఢిమై నిష్ఠురా
న్యోన్యాస్త్రాహవశోత్థితాగ్నికణరౌద్రాకారతన్ లోక
సామాన్యాతీతమహోగ్రవిక్రమరణోన్మాదప్రకారంబులై (ద 12—32)

ప్రతి అశ్వాసాంతమునను తిక్కననుగూర్చి ఈతదు వ్రాసిన పద్యములు ఈతని రచనానైపుణ్యమునకును, సమాసనిర్మాణచాతుర్యగరిమకును చక్కని నిదర్శనములు.

ఇట్లే కేవలము తెలుగుపదములతో కూడిన పద్యరచనమునందును అతడు మిక్కిలి నేర్పరి—

ఇంచుకయేని బెంపెఱుగ డెంతయు వేడుక నేను బుత్త్రిగా
బెంచిన మావిమోక కడ బ్రీతి మదీయ వయస్యయైన యి
క్కాంచనమాల నెల్ల చెలికత్తెలు నవ్వగ నంటబట్టి నా
పంచన కాలనై పడనిపాటుల నే బడితిం దపస్వినీ— (ద. 7 -71)

అను పద్యమున 'పుత్త్రి, మదీయ, వయస్య, కాంచనమాల' అనునవి తప్ప మిగిలిన పదములన్నియు తెలుగు పదములే.

ఇట్లే—

అయిదిగానిఁ దంత్రి సచివాగ్రణిఁ జేసినఁ గూర్మి సొంపునన్
మీటె దురాశతన్ జెలిచి మేటిగ రాజ్యము సేయఁ జూచినం
బాలుని జంప దోస మను పల్కునకుం బతి యుద్ధురాత్మునిం
గాలియపెట్టగాఁ దలచి కన్నులు పుచ్చగ బంచె జెచ్చెరన్— (ద.8—68)

అను పద్యమునను 'సచివాగ్రణి, దురాశతన్, రాజ్యము, పతి దురాత్మ' అనునవి తప్ప మిగిలినవన్నియు తెనుగుపదములే

ఒక్క సంస్కృతపదముకూడ లేని పూర్తి తెనుగుపద్యములును కొన్ని దశకుమారచరిత్రమున గలవు—

ఒకనా డొక ముదిపాలుని
నొకచో నా తోడి బోయ లొలిచికొనంగా
నకటా! తగదని పలికిన
మొకమోడక నన్ను బన్నముల బలచి రొగిన్. (ద. 3—12)

నేల జేతులు సమరి మై నిక్కమెల్ల
నలచి యుంకించి యవుడులు గలచుటయును
వార లద్దిరో! యని విచ్చి వలియబాలఁ
దోలికొని వారి నిలిపితి సూల వొడిచి. (ద. 6—163)

ఇవికాక "డెందమునందు గూటమి" (ద. 9-25) అను పద్యము, "చదువులు విడిచి యాచారంబు దిగద్రావి" (ద. 3—9), "పల్లము మిట్టు వేలుపరుపన్" (ద. 9—3) వంటి పద్యములును కేతనకు గల తెనుగుపద్యరచనావిధానమునకు చక్కని నిదర్శనములు.

చతుర్థాశ్వాసములోని—

మీ రరుగుడు మీ రేగుడు
మీరు చనుడు మీరు పొండు మీ మీ పను లొ
ప్పారగ సలుపుడు నావుడు
బోరన నయ్యింద్రజాలపుంబ్రజ వోయెన్. (ద. 4—61)

అను పద్యములో ఒకే అర్థమును బోధించు వివిధ తెనుగు క్రియాపదములను ప్రయోగించుటవలన అతని వైదగ్ధ్యము వెల్లడియగుచున్నది.

కేతనరచనయందు—పొగడ్తపొలము (ద. 1-93), పెంపుసొంపారు (ద. 1-93), మగపంతము (ద. 2-31), వికావికలగు (ద. 2—64), చుఱ చుఱ స్రుక్కు (ద. 3—16), చెవి యొగ్గు (ద. 3-52), చిన్నవోయియున్న (ద. 3-64), గ్రుమ్మి చంపు (ద. 3-32), దేవికొనివచ్చు (ద. 4-19), జాను మీఱు (ద. 5-17), గోచి యిచ్చు (ద. 5-56), చావుకు దెగు (ద. 5-64), బ్రతుకుఁదెరువు (ద. 5-91), కూలజల్లు (ద. 6-125), ఉఱ్ఱూతలూగు (ద. 10-63), పఱిపఱియై ఎడిచిపోవు (ద. 10-75), వేతవేచియుండు (ద. 11-112), తుదిముట్టం జెడనాడు (ద. 11—126), ప్రొద్దుపుచ్చు (ద. 12-43) వంటి తెనుగు పలుకుబళ్ల కోకొల్లలు.

ఇట్లే— గోవతనము (పెంకెతనము), పీనుగుపెంట (వృథాబరువు), చట్టలు (జబ్బలు), చిడిముడిపడు (చిరాకుపడు), త్రిప్పులఁబెట్టు (తిప్పలు బెట్టు), తొడుసులు (చిక్కులు), మొగవడు (సిద్ధపడు), వయ్యాళి (షికారు), చూఱగోలు (కాజేయు), అసవసలేమిటికి (సందేహమెందుకు)—వంటి దేశీయము లనేకములు కలవు

ఇవికాక, గుండెలు కుళ్లు (ద. 3-16), నీడయుబోలె దోదిరుగు (ద. 6-26), కోర్కులు కోసితింట (ద. 6—33), గుంట్రగుడ్లను జూపుట (ద. 6-157), కూడు జీరయ జక్కబెట్టుట (ద. 7—22), ఏటికి నెదురీదుట (ద. 3-120), తలప్రాణము తోకకు వచ్చుట (ద. 3—129), అందని మ్రానిపండ్లకును నఱ్ఱులు సాచుట (ద. 3-131), తేనియబడ్డ యీగ (ద. 6—30), కుక్కకుఁ దెంకాయ దక్కదు (ద. 6-36)—వంటి జాతీయములును బహుళములు.

అంభోవాహంబుల యట్ల సంపదలొగిం బుట్టున్ జెడున్ మాత్రలోన్ (ద. 2—54)

పరహితచరితులకు శుభంబరుదే (ద. 2—76).

సజ్జనులకు నెల్ల సఖ్య మాభాషణపూర్వము (ద. 4—42).

సౌఖ్యసిద్ధిఁ దెలుపన్ వశమే యనుభూతి దక్కగన్ (ద. 5—28).

విధివర్తనం బ్రపలిక ర్తప్పంబు (ద. 5—101)
లేమికంచె నరయస్ మృతి మేలగు (ద. 6—7).
పూర్వకర్మఫలంబున్ గుడువక పోవు (ద. 6—112)—
వంటి సూక్తులుదశకుమారచరిత్రమున పెక్కు గలవు

ఇట్లే— పిడుగదిచెనవాని గొంటి వడిజూచుట (ద. 2—111), అందని మ్రానిపండ్లకును నట్టులు సాచుట (ద 3—13), ఆడబోయిన టీర్థ మెదురగుట (ద. 3—142)—మొదలగు సామెతలు నెడనెడ దశకుమారచరిత్రలో గలవు.

కేతన—చంపకమాల, ఉత్పలమాల, మత్తేభము, శార్దూలము, సీసము, ఆటవెలది, తేటగీతి, కందము, మత్తకోకిల, తరువోజ మొదలైన సామాన్య వృత్తములనే వాడినాడు. విశేషవృత్తముల జోలికి పోలేదు. అశ్వాసాంతమున మాత్రము ఒక మాలినీవృత్తమును వాడినాడు. ద్వాదశాశ్వాసమున నొక్కచోట ఉత్సాహవృత్తము వాడబడెనద (దశకు 12-౮). విశ్రుతుడు తన బావగా రగు భాస్కరవర్మను గాంచినాడు. అతనిని పరిచయము చేసికొను ఉత్సాహములో అతనివెంట నున్న వృద్ధు నడిగినాడు. అందువలన నిచ్చట ఉత్సాహవృత్తము ప్రయోగింపబడియున్నది.

పద్యరచనాశిల్పమునందును కేతన మంచి ప్రవీణుడు. అతని పద్యము ఎక్కడను విరుగక అమృతధారగా సాగిపోవుచుండును—

కర్ణునికంటె దాత రతికాంతునికంటెను రమ్యమూర్తి సౌ
పర్ణునికంటె వీరుడు ప్రభాకరుకంటె బ్రతాపశాలి దృ
క్కర్ణకులారినాయకునికంటెను సత్త్వసమగ్రు డంద్రు సం
పూర్ణవితీర్ణమంత్రి జనపుంగవు సిద్ధయతమ్ముం గొమ్మనిన్ (ద. 1—71)

ఇట్లే—

రెండవ పుష్పబాణు డధరీకృత కిన్నరభర్త (ద. 1—47).

స్వారాజ్యపూజ్యుడో కౌరవాధీశుడో
నాగ భోగమున మానమున నెగడె (ద. 1- 82)

సుకవీంద్రబృందరక్షకు డెవ్వ డనిన పే
డను నాలుకకు దొడవైనవాడు (ద 1-39)

రారానబ్ధిఁ గలంబు డిందుటయు(ద. 2—99)
సామజవైరియున్ గజము జంపుచు(ద. 2—96)
తల్లి పిఱుందబోక యుచితంబని పోయెద (ద. 3—119)
చిలుకా ! పల్కకుమీ లతాంతశరుడా ! చెల్వంగ నృపంజూడుమీ
(ద. 3-123)
చెఱకటె విల్లుపువ్వు లటె చిక్కని యమ్ములు (ద. 3—120)
రాజితశృంఖలం బెనగి రాజపదద్వితయంబు (ద. 4—68)
తల్లీ ! ప్రాణముతోడి చావు మగడున్ దవ్వైన నిల్లాలికిన్(ద.10—117)
అల్లనపోయి సాంద్రవిపినాంతర (ద. 11—7).
హాహాకారము లుద్భవిల్ల నొక కన్యారత్నముం దెచ్చె (ద. 11—10).
ఆ లీలావతి గ్రక్కునం జెలుల డాయంబోయి (ద. 11—20).
దేవసమానమూర్తి కులదీపకు దేవచక్రవర్తి (ద. 12—48).
పటుతూర్యధ్వను లాకసం బలమ (ద. 12—60)—

వంటి పద్యము లెన్నియేనియు నాతని పద్యరచనమున కుదాహరింపవచ్చును.

కొన్ని పద్యముల యెత్తుగడలందే కేతన పద్యరచనానైపుణ్యము వ్యక్తమగుచున్నది.

ఉదరస్థుండు సుతుండు వాడును జరాయుశ్శ్రీయశస్సౌకుమా
ర్యదయాధైర్యపరాక్రమంబుల జనారాధ్యుండు లోకత్రయీ
హృదయాహ్లాదకరుండు నిక్క మని ని న్నేకాంతదుర్గంబులో
బ్రదికింపన్ మది గోరె భర్త యది దప్పం జూడగా బాడియే (2—41).

వసుమతీదేవి భర్త మరణించినాడను ఉద్దేశ్యముతో నాత్మహత్య గావింపదలచిన సందర్భమున మంత్రులు వారించుచున్న ఘట్టమునందలి పద్య మిది. ఆమె గర్భములోని శిశువు జిరాయువు, యశస్సు, సౌకుమార్యము, ధైర్యము, పరాక్రమములు గల్గి, జనారాధ్యుడు, లోకత్రయీహృదయాహ్లాదకరుడు అగు నని

వామదేవుని వరమును (ద. 2-16) జ్ఞప్తికి దెచ్చి చివర కట్టి శిశువు కొఱకైన బ్రతికియుండవలసినదనియు. ఆ ఉద్దేశ్యముతోడనే రాజహంసు డామెను కాంతారు దుర్గంబులో దాచియుంచినాడనియు ఆ మంత్రులు చెప్పినారు. 'ఉదరస్థుండు సుతుండు' అను ఎత్తుగడలోని భావ మిది. ఇట్లే పుష్పోద్భవుడు దారువర్మను చంపి యాతడే ఆడువేషమున బయటకు వచ్చి 'రండి ' రండి ! రాజుగారి మరిదిని యెవరో క్రూరుడు చంపివేసినాడు' అని పిలిచినాడు. ఈ ఆత్రుతయే "రండీ ! రాజమబంది నొక్కరుడు ఘోరస్ఫారగాత్రుండు యాక్రోశించి చంపెడు బెట్టు గట్టి" (ద. 3-84) అను పద్యములోని యెత్తుగడయందలి చాతుర్యము.

చండవర్మ రాజహంసుని బందీచేసి దర్పసారుని కడకు ఏణీజంఘుడను వానితో నొక యాజ్ఞాపత్రిక నిచ్చి పంపినాడు. ఇచ్చట కేతన వ్రాసిన అమూలకమైన సీసపద్యమును (ద. 4-89)— "స్వస్తి. సమస్త రాజన్య చూడామణికిరణరంజితపదసరసిజాతుడగు దర్పసారధరాధిపు డానతి చండ వర్మన కిచ్చె. సంతసమున గన్యాపురము జొచ్చి గాసిసేసిన దుష్టు జంపెడు చోట విచార మేల ? దుశ్శీలయగు కూతుతోడి నెయ్యంబున దల్లిదండ్రులు మతి తప్పి యేమి పలికిరేనియు, మదిలోన భయము గొనక, దుష్టకన్యక జెఱబెట్టి, ద్రోహియైనవాని, లేఖ గన్నపుడె వధ మొనర్చి, చెవులపండువ మా కర్థి జేయ వలయు" నని వచనరూపమునగూడ చదవవచ్చును. ఇట్లా లేఖను వచన రూపమునగాక పద్యరూపమున వ్రాయుట, కేతనయొక్క పద్యరచనావైదగ్ధ్యము నకు చక్కని నిదర్శనము.

కేతన మారుమూల వృత్తములకు పోనట్లే, మారుమూల అలంకారము లకును బోలేదు. అతని రచనయందు, ఉపమ, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, అర్థాం తరన్యాసము, ప్రశ్నాలంకారముల వంటి సామాన్యాలంకారములే యెక్కువ.

ఉపమా:—గర్భితనవసుధాకరపయోనిధి మాడ్కి,
సతిమేను పాండురచ్ఛవి వహించె...(ద. 1-37)
మంచువిరియించిన పతంగుండునుంబోలె (ద. 4-117)
చుంబకశిలాప్రతిమం దగులు నయోరూపంబునుం బోలె (ద. 5-33)
లేటిపిండు క్రోల్పులి గనినట్లు (ద. 3-25)
లంకకు వానరవీరు డేగునట్లు (ద. 8-59)

ఉత్ప్రేక్ష:—వారిజబాంధవు డను నంగారం బపరాబ్ధి ... (7-90)

నిధిసాధనక్రియానిమ్నోన్నతంబైన
ప్రాంతపట్టణమున బాడు వోలె (ద. 3-4)

ప్రాచీనశైలాగ్రభాగస్థమగునశో
కంబున జిగురుజొంపం బనంగ (ద. 5-12౦)

కరుణపొడవైనయ ట్లొక సరసిజాక్షి ... (ద. 9-16)

స్వభావోక్తి:—జక్కవలుచెదర గమలము లొక్క మొగిన్ ... (ద. 6-58)

చేసంకుపట్టుచు జిడుపలు వెదకుచు
నొరిగాం దేవుచు సులికిపడుచు ... (ద. 6-157)

దూరమునం బదార్థములు దోపకయుండగ ... (ద. 6-60)

అర్థాంతరన్యాసము:—వేరంపెత్తిన ధాతచెయ్ది యుడుపన్ వెజ్జెవ్వ
డూహింపగన్ (ద. 2-89)

విపినభూభాగసంచరణరతులు గారె ధరణిపతులు (ద. 4-9)

వ్యతిరేకము:—భావజుపట్టపుదేవియై రూపున
సడిసన్న రతి విలాసముల గెల్చి ... (ద. 7-111)

ప్రశ్నము:—సుకవీంద్రబృందరక్షకు డెవ్వ డనిన
వీడని నాలుకకు దొడవైనవాడు (ద. 1-89)

ఒక్కచోట మాత్రము శ్లేషను వాడినాడు — "నిను నే రూపసిగా వేల్చిన" (ద. 7-125). ఇది వికటవర్మను చంపుటకు పన్నిన ఉపాయము. కల్పసుందరితో ఉపహారవర్మ చెప్పుచున్న సందర్భము. 'రూపసియగుటకొఱకు వేల్చుట' యనియు 'రూపసియగుటకొఱకు అతనినే వేల్చుట' యనియు నిచట రెండర్థములు చెప్పవచ్చును. దీనివలన కల్పసుందరి హృదయములోని తలంపు వికటవర్మకు తెలియకపోయినను, అందలి గుఢార్థము పరితలకు శ్లేషఘటనవలన భాసించుచున్నది.

దశకుమారచరిత్రలో ఒండు రెండు దోషములు కన్పించుచున్నవి.

**1. యతిదోషములు:**—"లన్నిజగాత్రముల్ కడు వడంక"(ద. 8-79) అను ప్రయోగమున ల-డ లకు యతి వేయబడినది. ఇట్లే "మగపంతంబును దక్కినన్ జనము లేమంద్రీ భయం బేటికిన్" (ద.12-50) అనుచోట అఖండ యతి ప్రయుక్తము. ఈ రెంటిని అప్పకవి ఒప్పుకొనలేదు.

**2 ప్రాసదోషములు:—**

ధ, ఛలకు : వృథగతి నొక్కొక వెరవున
నధిపతికిం జెప్ప కంత కంతపఁ జెచిచెన్ (ద 11—116).

ర, ఱ లకు : పేరిన కోఱవెంట్రుకలు బీఁటలువాఱిన దీర్ఘకాయమున్
మీఱిన కోఱదౌడలను మీసల నూనిన రక్తపంకముల్
పీఱిడి చూపులం గుఱుచ వీపును గల్గిన బ్రహ్మరాక్షసుం
డీరములోన నన్ను గని యిట్లని పల్కెఁ గఠోరవాక్యుఁడై.
(ద. 10–67)

**3 పునరుక్తి దోషములు:—**

"ఈడగు మాటలం బనుల నిచ్చలు నిచ్చకువచ్చు భంగి గి
లాడ్బి తదంతరంగము బయల్పడ మా కెఱిగించు నిచ్చలున్."
(ద. 6–26)

ఇచ్చట 'నిచ్చలు' శబ్దము పునరుక్తము.

**4 వ్యాకరణ దోషములు:—**

వాహినితీరము (ద. 4—15) — వాహినీతీర మని యుండదగును.
ప్రతికారము (ద. 6—7) — ప్రతీకారమని యుండదగును.
వృథగతి (ద. 11—116) — వృథాగతి యని యుండదగును.

ఇట్లే అసూయశబ్దము గుణవాచకము. దీని మీద ప్రత్యయము చేరదు. కాని కేతన అసూయతనము (ద. 5–45) అని ప్రయోగించినాడు.

చోద్యశబ్దమునకు సంస్కృతమున ఆశ్చర్య మను నర్థము లేదు. ఇది తెలుగున అశ్చర్యార్థకముగా వాడబడుచున్నది. చోదనచేయదగినది యని సంస్కృతమునం దర్థము. అప్పుడు 'తర' ప్రత్యయము చేరుటలో నర్థము ఉండదు. కాని ఆశ్చర్యార్థమున తెనుగులో వాడుచున్నాము. కావున దీనిపైన కవి తరప్రత్యయముచు చేర్చినాడు. ఇది పెద్ద దోషము కాదు— చోద్య తరంబుగ (ద. 5-62).

ఉజ్జయినికి 'ఉజ్జేని' (ద. 3-59) యని. శ్రావస్తీనగరంబునకు 'శ్యావస్తీ నగర' మనియు (ద. 9—19), కేతన వాడినాడు. వీనిని తద్భవరూపములుగనో వ్యావహారికరూపములుగనో గ్రహింపవచ్చును.

# 9. ఆంధ్ర కథాకావ్యములు-దశకుమారచరిత్రము

ఇతర సాహిత్యప్రక్రియలవలెనే ఈ కథాకావ్య ప్రక్రియయు తెలుగునకు సంస్కృతమునుండియే గ్రహింపబడినది. "గద్యమ్మున దండి చెప్పిన కథా క్రమ మొప్ప దెనుంగుబాస గద్యమ్మును బద్యముం బెరయ నంచితభావ రసోదయాభిరామమ్మగునట్లుగా" (దశకు 1—25) కేతన దశకుమారచరిత్రము నాంధ్రీకరించి, ఆంధ్రులకు ప్రప్రథమముగా కథావాఙ్మయమును రుచిచూపించినాడు. దీని నొరవడిగా జేసికొని తెనుగున అనేక కథాకావ్యములు వెలసినవి. వానిలో కొన్నింటిలో దశకుమారచరిత్రలోని కథలను స్ఫురింపజేయు కథల వంటి కథలు కొన్ని గలవు దీనిని బట్టి కేతన దశకుమారచరిత్ర ప్రభావము నూహింపవచ్చును.

కేతన దశకుమారచరిత్రము, మంచెన కేయూరబాహుచరిత్రము, వెన్నెల కంటి అన్నయ షోడశకుమారచరిత్రము, జక్కన విక్రమార్కచరిత్రము, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయము, పెదపాటి యెఱ్ఱయ సకలనీతికథానిధానము, దూబగుంట నారాయణకవి పంచ తంత్రము, భానుకవి పంచతంత్రి, వెంకటనాథకవి పంచతంత్రము, పాలవేకరి కదరీపతి శుకసప్తతి, పతివ్రతా చరిత్రము, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి యనునవి ఆంధ్రవాఙ్మయమున ప్రసిద్ధికెక్కిన కథాకావ్యములు. వీనిలో షోడశకుమారచరిత్రము, సింహాసనాద్వాత్రింశిక, సకలనీతి కథా నిధానము, పతివ్రతాచరిత్రము అనువానిలో దశకుమారచరిత్రను బోలిన కొన్ని కథ లున్నవి:—

షోడశకుమారచరిత్రము దశకుమారచరిత్ర నొరవడిగా చేసికొని వ్రాయ బడిన గ్రంథము. ఇందు జనమేజయుని రెండవకుమారు డగు కమలాకరుడు

నాయకుడు. అతనికి బుద్ధిసహాయ్య, వివేకనిధి, కాంతిమంత, యశఃకేతు, కరుణాకర, ప్రభాకర, చిత్రకర, నీతిమంతు లను ఎనిమిదిమంది మంత్రి కుమారులును, భీమభట, దీర్ఘబాహు, దృఢముష్టి, విక్రమకేసరు లను నలుగురు దండనాయకతనూజులును, మతిమంత, కళానిధి, వసంతకు లను ముప్వురు పురోహితపుత్త్రులును మిత్రులు. వీరు పదునార్వురు జైత్రయాత్రకు బయల్దేరి, వింధ్యాటవిలో ఒక సాధకునకు సహాయముచేయబోయి విడిపోవుటవఱకును గల కథ, దశకుమారచరిత్రలోని 'ద్విజోప్రకృతి' వఱకునుగల కథనుబోలియున్నది. తరువాత కమలాకరుడు చెలులను వెదకుచు ఒక కిరాతుని జలగ్రాహమునుండి రక్షించి, అతనితో కిరాతపల్లె కేగుట, తిరిగి వారిరువురు కాననమార్గమునపోవుచు ఒక చెట్టుక్రింద కూర్చుండగా మునిశాపవశమున చెట్టయిని కరుణాకరుడు నిజ రూపమును దాల్చుట, ఇంతలో చిత్రకరుడు వచ్చి కలియుట — ఇత్యాదిగా గల కథ ఇంచుక మార్పుతో దశకుమారచరిత్రను తలపించుచున్నది.[1]

ఇందలి దేవసేనకథలో[2] దేవసేన ధనదత్తుని వరించుట- కాని తల్లి దండ్రులామెను సముద్రదత్తున కిచ్చి పెండ్లిచేయుట- ధనదత్తున కిచ్చిన మాట ప్రకారము భర్త యనుమతిపడిసి దేవసేన యాసతికై పోవుచు దొంగచే పట్టు బడుట వఱకును గల కథ దశకుమారచరిత్రలోని అపహారవర్మకథలోని కుల పాలికవృత్తాంతమున కనుకరణముగా కనిపించుచున్నది.

కొఱవి గోపరాజు తన సింహాసనద్వాత్రింశికలో[3] సుకవిప్రశంసయందు కేతనకవిని గూడ పేర్కొనియున్నాడు. ఇందలి 10 వ అశ్వాసములోని 23 వ బొమ్మకథలో రత్నావళీనగరరాజైన జయదేవుని కుమారుడు గుడిలో నుండగా దొంగలు పసిడిపేరు నాతనిపైకి విసరుట - రాజభటు లీతడే దొంగ యని బంధించుట- చివరకు రాజకుమారిని వరించి పెండ్లియాడి రాజ్యమును సంపా దించుట— అనుకథ దశకుమారచరిత్రలోని సోమదత్తునికథను బోలియున్నది.

ఇట్లే 12 వ అశ్వాసములోని 31 వ బొమ్మకథలో కాశీరాజు కుమారు డైన వజ్రమకుటుడు పద్మావతికొఱకు కుంతలదేశమున కేగి, ఆమెను వలచి, తాపసివేషమున శ్మశానవాటికయొద్ద నుండుట- ఒకనా డామెను ఆ శ్మశానవాటిక

---

1 షోడశ 2 ఆ. 2 షోడశ 5-60...75

3. సింహాసన. 1-161.

వద్దకు వచ్చునట్లు చేసి, ఆమె కాలియందె లాగికొని తొడపై గీరుట- తరువాత వజ్రమకుటు డామెను పెండ్లియాడుట— అను కథ మిత్రగుప్తుని కథలోని నితంబవతికథను బోలియున్నది.

సకలనీతికథానిధానము ద్వితీయాశ్వాసములోని చంద్రికకథలో చంద్రిక ఘనస్వామిని ప్రేమించుట- ఘనస్వామి యాడువేషము ధరించి ఒక పవిత్రుని సహాయమున చంద్రిక యంతఃపురమును చేరి సుఖించుట వఱకును గల కథ నవమాలికాప్రమతులకథను బోలియున్నది.

ఇందలి చతుర్థాశ్వాసమున దశకుమారచరిత్రలోని కథలు కొన్ని గలవు. ఆదినుండి కుమారోత్పత్తివఱకును గల కథాభాగము యథాతథముగనేయున్నది. తరువాత రాజహంసుడు మంత్రులును వారికి సకలనీతులను బోధించుట (4—12...142)అమూలకము. ఇది 'సకల నీతికథా నిధాన' మగుటచే నిట్లు కల్పింపబడియుండవచ్చును. తదనంతరము జైత్రయాత్ర, ద్విజోపకృతి మొదలుగాగల పూర్వపీఠిక కలదు. దశకుమారచరిత్రవలె యథాతథానువాదము కాక యతిస్వతంత్రానువాద మగుటచే నిందు చాలవఱకు అన్ని కథలును ఒకే ఆశ్వాసములో చెప్పబడినవి. ఇందు నిజమునకు మంత్రగుప్తునికథ లేదు. మిత్ర గుప్తునికథయే మంత్రగుప్తునికథగా చెప్పబడినది.

పతివ్రతాచరిత్రమునందలి చండప్రతాపుని[1] కథలోని విక్రమకేసరి శివ దత్తగదాధరుడై చండప్రతాపుని జయించుట దశకుమారచరిత్రలో రాజహంసుని మానసారుడు జయించు ఘట్టమును బోలియున్నది.

మరియు 'శయ్యాగానం'[2] అను కథలో విజయసేనుడు కమలరేఖ తల్పముపై పరుండబెట్టబడుట, చివరకు వారిరువురును బెండ్లియాడుట అను కథ దశకుమారచరిత్రలోని విశ్రుతునికథను బోలియున్నది.

ఇట్లు తరువాత కవులు పలువురు తమ కథాకావ్యములను కేతన దశ కుమారచరిత్రను ననుసరించియే వ్రాసియున్నారు.

1. పతివ్రతా. పుట 12...17. 2 పతివ్రతా. పుట 61...64.

# 1. ఉపోద్ఘాతము

ఆంధ్రభాషాభూషణము కేతన రచించిన రెండవ గ్రంథము. ఆ కాలమున వెలువడిన వివిధాంధ్రప్రక్రియాభేదములలో నిది యొకటి. ఇది తెలుగున వ్రాయ బడిన ప్రథమాంధ్ర వ్యాకరణము. ఆంధ్రశబ్దచింతామణి మొదటి దని కొంపటి వాదము ఇది వివాదాస్పదమైన విషయము. కాని ఆంధ్రశబ్దచింతామణియే మొదటి గ్రంథమైనను దానికిని దీనికిని (ఆం. భా. భూ.) ఏమియు సంబంధము లేదు. ఈ విషయమును అప్పకవి కూడ అవతారికలో చెప్పికొనియున్నాడు. లేదా, దాని యునికి కేతనకు తెలియకపోవచ్చును. ఏమైనను నది సంస్కృత మున వ్రాయబడిన వ్యాకరణము. తెనుగు వ్యాకరణమును తెనుగున ప్రప్రథమ ముగా వ్రాసినది కేతనయే. ఆనాటి భాషను, సంస్కృత ప్రాకృత కర్ణాటకాది వ్యాకరణములను ఆధారముగా జేసికొని, పారిభాషికపదములను కొన్నింటిని వానినుండి గ్రహించియు, కొన్నింటిని తానే కల్పించుకొనియు, వాని సహాయ మున నొక ప్రణాళిక నేర్పఱచుకొని, దీనిని రచించినాడు కేతన.

ఆంధ్రభాషాభూషణ పీఠికాపద్యములలో కేతన తన తొలి వ్యాకరణ మును గూర్చి కొంచెము చెప్పికొనియున్నాడు.

**పీఠిక**

మున్ను తెనుగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రే జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్. (ఆం.భా.భూ. ౕ)

సంస్కృత ప్రాకృతాది లక్షణము జెప్పి
తెనుగునకు లక్షణము జెప్పకునికి యెల్ల
కవిజనంబుల నేరమి గాదు నన్ను
ధన్యు గావింప దలచిన తలపుకాని — (ఆం.భా.భూ. ౬)

అని కేతన ఆంధ్రభాషాభూషణ పీఠికాపద్యములలో జెప్పికొనుట పై విషయమునే నిర్ధారించుచున్నది.

ఈ వ్యాకరణ రచన నాటి ప్రయోగాత్మక ప్రక్రియాభేదములలో నొకటి కాన, కంచి-నెల్లూరు-ఓరుగల్లు-అయోధ్యల మీదుగా గంగ కేగు మని యొక త్రోవచూపినట్లు తానును దిగ్దర్శకముగా నాంధ్రభాష కొక త్రోవచూపదలచి నట్లు చెప్పికొనినాడు (ఆం.భా.భూ -12)

ఇట్టి ప్రక్రియావైవిధ్యము నా కాలమున నిరసించెడివారును కొంద ఱుండి యుండవచ్చును. లేక కేతన క్రొంగ్రొత్తగా వ్యాకరణమును సృష్టించుచున్నా డని యాక్షేపించువా రుండినయుండవచ్చును. అందువలననే కేతన—

క్రొత్తగ నాంధ్రభాషకు నొకం డొక లక్షణ మిట్లు చెప్పె నే
యుత్తమబుద్ధి వీడ యని యొరలు నోవక విన్న మేలు మీ
రొత్తిన మీకు మాఱుకొని యుత్తరమిచ్చుట చాల ప్రేగు మీ
చిత్తమునందు నన్నెరవు సేయకుడీ కవులార మ్రొక్కెదన్–

(ఆం.భా.భూ.-10)

అని ప్రార్థించినాడు.

ఆంధ్రవ్యాకరణరచనమున తనది ప్రథమ ప్రయత్నమగుటచే నందు కొన్ని తప్పులు కూడ యుండియుండవచ్చుననియు, వాని నెఱింగి సరిగా దిద్ద వలసినదనియు, ఒప్పులను మాత్రము తప్పు లని నిరసింపవలదనియు, విజ్ఞప్తి చేసికొనినాడు (ఆం.భా.భూ.-9).

తప్పులు కాళిదాస మయూరాది మహాకవుల గ్రంథములందు నుండగా నితరులను గూర్చి చెప్పనేలయనియు, కావున తనయందు కరుణజూపవలసిన దనియు, సుకవులను ప్రార్థించినాడు (ఆ.భా.భూ.-11).

అంతేకాక, భాషావేదులు తనను "అషణ్ముఖ పాణినులకు సగు నెన" యని మెచ్చికొనునట్లు ఆంధ్రభాషాభూషణ మను శబ్దశాస్త్రమును రచియించు చున్నట్లు పేర్కొనినాడు (ఆ.భా.భూ.-7).

ఇట్లు కేతన ఆంధ్రభాషాభూషణమున తన ప్రథమ వ్యాకరణ రచనా ప్రక్రియను గూర్చి చెప్పికొనినాడు.

**పారిభాషిక పదములు**

కేతన సంధి, సమాసము, విభక్తి, క్రియ, తత్సమము, తద్భవము, దేశ్యము, భూతభవిష్యద్వర్తమానకాలములు, ప్రశ్నార్థక ప్రార్థనార్థకములు- అను పారిభాషికపదములను కర్ణాటక ప్రాకృత సంస్కృతములనుండి యథా తథముగ గ్రహించి తన వ్యాకరణమున వాడుకొనినాడు. ఇవికాక కొన్ని పారి భాషికపదములను తెలుగులోని కనువదించుకొనియు, కొన్ని క్రొత్తగా సృష్టించియు, ఒక ప్రత్యేక ప్రణాళిక నేర్పఱచుకొనినాడు. ఇట్లు క్రొత్తగా తా నేర్పఱచుకొనిన ప్రణాళికను లాక్షణికులు నిరసింతురేమో యని ముందుగనే—

లక్షణములు దెలిపెడిచో
నక్షరములు దెలియుకొఱకు ననువైన క్రియన్
శిక్షార్థముగా బల్కెద
లాక్షణికులు తప్పుగా దలంపకుడు మదిన్. (ఆ.భా.భూ.-32)

అని వారిని ప్రార్థించి తన వ్యాకరణరచనమున కుద్యుక్తుడైనాడు.

1. కేతన వాడిన సంజ్ఞలలో ప్రప్రథమముగా జెప్పవలసినది 'ఙ్ఱు' అను సంజ్ఞ. దీని నాత డాంధ్రభాషాభూషణమున ననేకచోట్ల వాడియున్నాడు[1]. తరువాతి వ్యాకర్తలలో దీనిని గ్రహించినవారిలో విన్నకోట పెద్దన, గణపవరపు వేంకటకవులు గలరు. పెద్దన యీ సంజ్ఞ నొకే యొక పద్యమునందు వాడినాడు[2]. మిగిలిన గ్రంథమం దెచ్చటను వాడియుండలేదు. ఆ యొక్క పద్యము కూడ పూర్తిగా లభింపలేదు. ఇట్లే గణపవరపు వేంకటకవి కూడ తన 'ఆంధ్రకౌముది' యందు—

"అఙ్ఱుంతములకు షష్ఠ్యర్థమౌ నిఙ్ఱుంతముల కట్లు కూరిచి పలుకుతరిని"[3]

అని యొకేచోట ఆ సంజ్ఞను వాడుకొనినాడు. తరువాత నెచ్చటను దీనిని వాడ

1 ఆం.భా.భూ.—33, 37, 40, 45, 49, 50, 66, 70, 77, 84, 86, 90, 127, 171, 182.

2. కావ్య చూడా. 9—55.

3. ఆం. కౌ. పుట 4.

లేదు. అత్—ఇత్—ఉత్—మొదలైన సంస్కృత వ్యాకరణసంజ్ఞలు వదలి, అఙ్—ఇఙ్—ఉఙ్——అని ప్రత్యయాదులు చెప్పుటకూడ కన్నడవ్యాకరణములో కనిపించెడి రేఫాంతకృత్తద్ధితప్రత్యయముల యనుసరణమే కావచ్చు'——నని శ్రీ తిరుమల రామచంద్రగారి యభిప్రాయము[1].

2. పూర్ణానుస్వారమునకు 'బిందువు' అనియో (56), 'నెఱబిందువు' అనియో (57), 'సున్న' అనియో (29) వాడును

3. దీర్ఘములకు 'నిడుపు' లనియు (30, 56, 57), హ్రస్వములకు 'కుఱుచ' లనియు (55, 57) వాడును. ఒక్కచోట మాత్రము 'హ్రస్వ' మనియే వాడినాడు (101).

4. కొన్నిచోట్ల 'ఇత్వము, ఉత్వము' అనియు (73, 101), కొన్ని చోట్ల 'ఇఙ్, ఉఙ్' అనియు (33), మరికొన్నిచోట్ల 'గకారము, వకార' మనియు వాడినాడు.

5. మహద్వాచకములకు 'పురషాఖ్య'లనియు (33), మహతీ వాచకము, లకు 'స్త్రీశబ్దము'ల కనియు, రెంటిని కలిపిచెప్పునపుడు 'స్త్రీపురుషశబ్దముల' (82) కనియో లేక 'మానవాఖ్య'ల (45) కనియో చెప్పును

6. ఆదేశముగా వచ్చుననుటకు 'గదిసి నిల్చు' (49) ననియో, 'త్రోచి నిల్చు' (61) ననియో చెప్పును.

7 వికల్ప మనుటకు 'పొడచూపు బోవు' (103, 172) ననియో 'ఊదుచు దేలుచు' (55) ననియో వాడును. ఒక్కచోట మాత్రము 'వికల్ప' మని వాడినాడు.

8. పరుషములకు 'కచటతపల్' (61, 53) అనియు, సరళములకు 'గజడదబల్' (53) అనియు వాడును.

9. ఆశీరాద్యర్థకమునకు ఎదులు 'దీవెన' (160) యని వాడినాడు.

10. ద్విత్వాక్షరములకు 'జడ్డ' లని (120, 123) వాడినాడు.

11. కచటతపలు 'వర్గము' లని (15) యితడే మొదట చెప్పినాడు.

---

1. 'కావ్యావలోకనం'—నాగవర్మ—భారతి, మార్చి, 1959.

సంస్కృత వ్యాకర్తలు 'కు, చు, టు, తు, పు' లనియే వాడినారు[1]. దీనిని కేతన కన్నడ వ్యాకరణములనుండి గ్రహించినట్లు తోచుచున్నది.[2]

12. బహుళ మనుటకు 'నిల్చును— విచ్చలవిడిపోవు' (51) నని వాడినాడు.

13. హ్రస్వదీర్ఘము లగు ననుటకు 'కుదియు సాగు' నని (135) వాడినాడు.

ఇట్లు కొన్ని పారిభాషికపదములను కేతన సంస్కృత కర్ణాటక వ్యాకరణములనుండి గ్రహించియు, కొన్నింటిని తానే కల్పించుకొనియు, ఆంధ్రభాషాభూషణరచనమున కుద్యుక్తుడైనాడు

### రచనాప్రణాళిక

ఆకాలముననే సంస్కృతసాహిత్యము వివిధ మార్గములందు నడిచి పరిపూర్ణదశకు వచ్చినది. దానినుండియే తెలుగువారు వివిధపద్ధతులను గైకొనినారు. కావున సంస్కృతమే తల్లిభాషగా పరిగణింపబడుచు వచ్చినది ఇదికాక కొన్ని స్వతస్సిద్ధమైన తెలుగుపదములు కూడ యిందు చేరి యంతయు గలసి తెనుగు భాష యైనవి. ఈ విషయమునే కేతన "తల్లిసంస్కృతంబె యెల్లభాషలకును" (ఆం. భా. భూ--13) అనుపద్యమున చెప్పినాడు. తరువాతి వైయ్యాకర్తలుగూడ ఇదే విషయమును తమ లక్షణగ్రంథములందు వ్యక్తపటచినారు[3]. శ్రీనాథాదులును "జనని సంస్కృతంబె యెల్ల భాషలకును" అని వ్రాసినారు[4]. ఇటీవలి శ్రీ చిలుకూరి నారాయణరావుగారును తమ 'ఆంధ్రభాషాచరిత్రము'న తెలుగు సంస్కృతభాషాజన్య మనియే నిరూపించుటకు ప్రయత్నించినారు. కాని 19 వ శతాబ్దినుండియు తెనుగు ద్రావిడభాషాజన్యమను వాదములు ప్రబలినవి· బిషప్ కాల్డ్వెల్‌గారితో ప్రారంభింపబడిన యీ వాదము శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ గంటిజోగి సోమయాజిగారు మొదలగు భాషాశాస్త్రపరిశోధకులచే

---

1. అష్టా -1-1-69.
2 శబ్దమణి – అక్షర సంజ్ఞా—4; క·భా భూ. – సంధి – 28
3. కావ్యా. చూదా. – 9 అ–8; అప్ప 5–5; 1–71, 74, 75
4. క్రీడా - పుట 13.

ప్రతిష్ఠాపింపబడినది. కాని కేతనాది పూర్వలాక్షిణికులు మాత్రము సంస్కృతమునే తల్లిభాషగా నెంచియుండిరి. అంతియకాక తెలుగువ్యాకరణములోని సంధి, విభక్తులు, సమాసము, క్రియ, ఇత్యాది పారిభాషికపదములను, రచనా విధానమును, సంస్కృతమునుండియే గ్రహింపబడినవి. దీనినే కేతన—

తెలుగున గల భేదంబులు
దెలుగై సంస్కృతముచెల్లు తెఱగులు దత్సం
ధులు విభక్తులు నయ్యై
యలఘుసమాసములు గ్రియలు నవి యెఱిగింతున్.

(ఆం.భా.భూ.—14)

అను పద్యమున వ్యక్తపఱచినాడు. అందువలననే తన వ్యాకరణారంభమున కేతన సంస్కృతపదములను తెనుగు గావించు పద్ధతిని గూడ వివరించినాడు (ఆం.భా.భూ. 27 ... 41).

తదనంతరము కేతన –

అదులు స్వరములు నచ్చులు,
కాదు లొగిన్వ్యంజనములు హల్లులు ననగా
మేదిని నెల్లెడ జెల్లును,
కాదుల నైదైదు కూర్ప నగు వర్గంబుల్. (ఆం.భా.భూ. 15)

యరలవలును శషసహలును,
నరయగ నంతస్థ లూష్మ లనగా జెల్లున్
సరవి నివె పేళ్ళు పెట్టుదు,
తిరముగ దల్లక్షణములు దెలిపెడి చోటన్. (ఆం.భా.భూ.—16)

అను పద్యములలో వర్ణసమామ్నాయమును జెప్పినాడు. మొదటిపద్యములో అకారాదులు అచ్చులు లేక స్వరములనియు, కకారాదులు హల్లులు లేక వ్యంజనములనియు చెప్పినాడు. 'అదులు, కాదులు' అనియే వ్యవహరించినాడు కాని, వాటిని పూర్తిగా వివరింపలేదు. అంతకుపూర్వము పాణిన్యాదులు వివరముగా చెప్పుటచే నవి ప్రసిద్ధమైనవి. కావున వివరముగా చెప్పకపోయి యుండవచ్చును. ఈ విషయమునే మొట్టమొదటి కన్నడవ్యాకర్తలగు నాగవర్మ, కేశి

రాజు మొదలుగువారును పేర్కొనియున్నారు నాగవర్మ తన కర్ణాటకభాషా భూషణమున "ఆకారాదయః ప్రసిద్ధా వర్ణాః"[1] అనియు, కేశిరాజు తన శబ్దమణి దర్పణమున—

వర్ణంగళ్ పారక్రమ
మర్ణవవృత ధాత్రియొళ్ ప్రసిద్ధం నిజదిం
వర్ణంగ ళకారాద్యా
పూర్ణతేయం పదెవువా ళకారం బరెగం[2]—

అనియు చెప్పి, ప్రసిద్ధమైన వర్ణసమామ్నాయమును వివరింప నేల యని వదలి పెట్టినాడు కన్నడ లాక్షణికుల ప్రభావముచే కేతన కూడ వర్ణసమామ్నాయ మును వివరింపలేదు.

హల్లులైన 'కాదులలో' నైదింటిని గూర్చగా వర్గము లగును. మిగిలిన వానిలో యరలవలు అంతస్థలు; శ ష స హ ళ ఊష్మలు.

క చ ట త ప వర్గములను ప్రప్రథమముగా చెప్పినది కేతనయే • పాణి నీయమునందుగూడ 'కు, చు, టు, తు, పు' లనియే వ్యవహరింపబడినది. (అష్టా. 1—1—69 సూ. వార్తికము.)

అనంతరము కేతన తెలుగుభాషయందు దాఱు సమాసములు, ఇరువది యాఱంతములు, ఆఱు సంధులు, పెక్కవ్యయములు, మూడు రీతులు, ఏడు విభక్తులును గలవనిచెప్పినాడు (ఆం.భా.భూ—17). కాని వివరించుసందర్భమున క్రమమంతయు మాఱిపోయినది. పూర్వోత్తరాన్యోన్యోభయభేదములచే సమాస ములు నాల్గు రకము లనియే చెప్పినాడు (అం.భా.భూ—100). మిగిలిన రెండు నేవియో చెప్పనే లేదు. వాని నెందైన యంతర్భవింపజేసినట్లయినను చెప్పలేదు. అంతేకాక సంస్కృతమున పెట్టబడిన కర్మధారయ తత్పురుషాది నామములను గూడ పెట్టలేదు. తెలుగునందలి ఇరువదియాఱంతములు నేవియో చెప్పనే లేదు[3]. అఱుసంధులను గూర్చియు చెప్పనే లేదు[4]. తెలుగున పెక్కవ్యయములు

1. క.భా భూ — సంజ్ఞా—2 సూ 2. అక్షరసంజ్ఞా — 4
3. తరువాత అనంతుడు వానిని వివరించినాడు (ఛందో. 4-109, 110).
4. తరువాత అనంతుడు వానిని వివరించినాడు (ఛందో. 4-39); ఇవికాక 'పరిశిష్టి' (ఛందో. 4-85) అను మఱియొకదానినిగూడ అతడు చెప్పినాడు

గలవని చెప్పినాడేకాని, యవి యేవియో ప్రత్యేకముగ చెప్పలేదు. మూడు రీతులని చెప్పి తిరిగి వానిని వివరింపనే లేదు సప్తవిభక్తులను గూర్చి మాత్రమే కాక సంబోధనప్రథమావిభక్తిని గూడ చెప్పినాడు (అం.బా.భూ. – 67). ఇట్లే పద్యములోని ప్రక్రియయంతయు తలక్రిందులగుట గమనించినచో నీ పద్యము ప్రక్షిప్తమని తోచుచున్నది. 1914 సంllలో నావిళ్ళవారిచే ప్రచురింపబడిన ఆంధ్రభాషాభూషణప్రతియందు – "ఈ పద్యము కొన్ని ప్రతులలో లేదు" అని అధోజ్ఞాపికయందు వ్రాయబడినది (పుట 7).

తరువాత కేతన ఆంధ్రభాషను తత్సమము, తద్భవము, అచ్చతెనుగు, దేశ్యము, గ్రామ్యము అని ఐదు తెఱగులుగా విభజించి, సంస్కృత నామములపై తెలుగువిభక్తులను జేర్చి చెప్పిన 'ధనము, వనము, పురుషుడు' ఇత్యాది పదములు తత్సమము లనియు, సంస్కృతమునుండి పుట్టిన 'లచ్చి, విచ్చుడు, అగ్గువ, గొనములు, సిరి, జముడు, దోసము' ఇత్యాది పదములు తద్భవము లనియు, తెలుగున ప్రసిద్ధములై యందఱకు దెలిసెడి 'తల, నెల, వేసవి, గుడి, పులి' ఇత్యాది పదములు దేశ్యము లనియు, 'పంచాకుమయ్య, ఏదాలు, పంపేరు, ఆడ, ఈడ' ఇత్యాది పదములు గ్రామ్యము లనియు చెప్పినాడు (ఆ.భా.భూ–18...25). కేతనకు పూర్వమే యిట్టి భాషావిభజనము, కన్నడ తమిళ ప్రాకృతములందు కన్పట్టుచున్నది. కన్నడభాషను కేశిరాజు 'సమ సంస్కృతము, తద్భవము, దేశీయము' అని మూడు విధములుగా విభజించినాడు. తమిళమున ప్రథమవ్యాకరణమగు 'తొలుకాప్పియము'న–

1. ఇయఱ్ చొల్ – తమిళమునకు స్వాభావిక పదములు
2. తిరి చొల్ – రూపాంతరము నొందిన పదములు
3. తిచై చ్చొల్ – అన్యదేశ్యములు
4. వడ చొల్ – తత్సమ, తద్భవములు –

అను విభజనము కన్పట్టుచున్నది. ఇట్లే ప్రాకృతమును తత్సమ, తద్భవ, దేశ్యములుగా విభాగింపబడినది[2]. కాని ఆ భాషలయందు 'అచ్ఛిక, గ్రామ్య' విభజనములు గానరావు. కేతన ఈ రెంటిని క్రొత్తగా చెప్పినాడు.

---

1. ఆం.భా.వి - పుటలు 581, 582. 2. అప్ప. 1 – 101.

తరువాత తత్సమము కాక మిగిలిన నాల్గును తెలుగుయొక్క రూపాంతరములే కాన —

"తత్సమంబు దక్క తక్కిన నాలుగు
నచ్చతెనుగు లందు రఖిల జనులు" (ఆం.భా.భూ. — 26)

అని చెప్పినాడు. తరువాతి లాక్షణికులలో దీనిని చెప్పినవాడు అప్పకవి[1]. చిన్నయసూరి తన బాలవ్యాకరణమున "తత్సమేతరంబైన భాష యచ్చ యనంబడు"[2] నని సూత్రించుటకు ఆంధ్రభాషాభూషణములోని కేతన పద్యమే మూలమువలె గన్పట్టుచున్నది.

ఈ భాషావిభజనానంతరము కేతన సంస్కృతపదములను తెలుగు కావించుపద్ధతి నెఱింగించుచు, 'వృక్షేణ, దక్షాయ, పక్షిభిః, ఇత్యాది విభక్తులను, 'అస్తి, ప్రయాతి, గాయంతి' ఇత్యాది క్రియలును, 'గత్వా, హసిత్వా, ప్రకాశ్య, సంత్యజ్య' ఇత్యాది త్వాంత ల్యబంతములును, 'గంతుం పురీం, రిపుం హంతుం, సుతం పాతుం' ఇత్యాది తుమున్నంతములును, 'అపి, చ, తు, హి, వై, న, వా, నను ఇత్యాది యవ్యయములును, సంస్కృతమునుండి యధాతధముగా తెలుగున ప్రవేశపెట్టరా దని నిషేధించినాడు (ఆం. భా. భూ.—23). ఇట్టి నిషేధము నృపతుంగాది కన్నడలాక్షణికులును తమ భాషయందు గావించినారు. "ఈ దేశభాషలలో సంస్కృతశబ్దముల నెట్లు చేర్చుకొనవలె ననునదే యా కాలపు శిష్టకవులను, లక్షణకర్తలను బాధించిన ప్రధానవిషయముగా కన్పట్టుచున్నది. కేవల దేశ్యభాషకు కావ్యరచనార్హమైన విస్తృతి లేదనియు, సంస్కృతమునుండి శబ్దములను గ్రహించిననే కాని దానికి బుష్టియు సౌష్ఠవమును జేకూరదనియు, అసలు సంస్కృతశబ్దములే వాడుట సంభవించినచో వాని కెట్టి వికారమును గల్గింపక వానిని సుబాద్యంతములుగా సంస్కృతమున నుండు స్థిరరూపములతోనే వాడవలయుననియు, కొందఱి యుద్దేశ్యము. అట్లు సుబాద్యంతములైన సంస్కృత సిద్ధరూపములను తెలుగుదేశ్యముతో గలిపి వాడు పద్ధతికే మణిప్రవాళ మని పేరు. ఇట్టి శైలి యప్పు డుండెననుట కాధారముగా నందు వ్రాయబడిన శాసనములు గాని, కావ్యములు గాని

1. అప్ప. 1–101 2. బాల. అచ్చిక–1.

లభింపకపోవుట నిజమే యైనను, పాల్కురికి సోమనాథుడు తన 'వృషాధిప శతకము'న నట్టి భాషలో నొక పద్యమును వ్రాసిచూపుటయు, తిక్కన నిర్వచనోత్తరరామాయణమున "జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెచ్చట జొన్ప" నని ప్రతిజ్ఞ చేయుటయు, నట్టి భాష యొకప్పు డుండె ననుటకు సాక్ష్యము లగుచున్నవి. తెలుగుననే కాక యట్టిది కన్నడమున గూడ నొకప్పు డుండినట్లు తోచుచున్నది. ఏలయన నృపతుంగుడు 'కవిరాజమార్గము'న నట్టి ఫక్కి ఆగమకోవిద నిగదిత మార్గము కాదనియు, 'అహరహః, ఉచ్చైః, నీచైః, ముహుర్ముహుః, ఇత స్తతః, అంతః, బహిః' మున్నగు సంస్కృతావ్యయములు కన్నడమున యథాతథముగ వాడగూడదనియు, వాడినచో గరతెయు, మద్దెలయు గలిపి వాయించినప్పటి జర్ఝరధ్వని కలుగుననియు, నిరసించినాడు. 'అరసకుమారం, ఆయతతరకడెగణ్ణం' మున్నగు నా సమాసములను గూడ బ్రయోగింపరా దని యాత డందు శాసించెను[1]. ఇట్టి సంస్కారమే తరువాతి కాలమున నన్నపార్యు డాంధ్రభాషకు జేసి శబ్ద(వాగను)శాసను డైనాడు. ఇట్లు నృపతుంగాది కన్నడ లాక్షణికులనే యాదర్శముగా గొని, కేతనాది లాక్షణికులు గూడ, తత్సమభాష యెట్లు కల్పింపవలెనో యను విషయమును దెలుపుటలోనే చాల శ్రద్ధవహించినారు. అందువలననే కేతన ఆంధ్రభాషాభూషణారంభమున తత్సమభాష నేర్పరచుపద్ధతిని వివరించినాడు. ఇట్టి వానికి నన్నయ భారతభాగమున ప్రయోగములు గలవు.—

1. ఏకాక్షర పదములు – శ్రీ, ధీ, స్త్రీ వంటివి తప్ప తక్కిన పదములు తెలుగు చేయబడినప్పుడు వాని చివరి దీర్ఘము హ్రస్వమగును.
   మణీ-మణి, వాణీ-వాణి, గౌరీ గౌరి (ఆం.భా.భూ.-31).
   నన్నయ– రాజ్యశ్రీ (అర. 1–238); భాష (ఆది. 1_17), ప్రజ (ఆది 1–72); నది (ఆది. 1–32)
2. ఉకారాంతశబ్దములకు 'వు' అనునది చేరును[2].
   తరుః_తరువు, తనుః_తనువు.
   నన్నయ_రజ్జువు (ఆది. 5_215); క్రతువు (ఆది. 2–127).

---

1 ప్రా.యు.–పుటలు 396, 396.

3. అకారాంతరశబ్దముల చివర 'ము' వర్ణము చేరును[1].
ధనః_ధనము; అర్థః—అర్థము.
నన్నయ - నభము (అర. 1-235), తపము (ఆది. 1-149).

4 పురుషవాచకములకు చివర 'డు' వర్ణము చేరును.
గురుః_గురుడు.
అట్టియెడల నామము చివర అకారమున్నచో నది ఉకారమగును.
పురుషః_పురుషుడు; ఉత్తమః – ఉత్తముడు[2].
నన్నయ - ప్రభుడు (ఆది.5_40), పురూరవుడు (ఆది. 2-235).

5 వాన్ అంతమందుగల శబ్దములకు వంతుడనియు, మాన్ అంతమందుగల శబ్దములకు మంతుడనియు నగును.
గుణవాన్_గుణవంతుడును; మతిమాన్—మతిమంతుడు; హనుమాన్-హనుమంతుడు. కొన్ని సందర్భములందు చివరి నకారము లోపించి విభక్తులు మాత్రము చేరును—హనుమడు (ఆం.భా.భూ—34).
నన్నయ_ మతిమంతుడు (ఆది. 5-226), హనుమంతుడు (అర. 3_319), హనుమ (అర. 3_314).

6 మకారాంతములైన పదముల చివర మకారస్థానమున ద్విత్వవర్ణము కాని, బిందుపూర్వక బువర్ణముకాని వ్రాయవచ్చును.
ఖగము—ఖగమ్ము—ఖగంబు. ఝషము—ఝషమ్ము—ఝషంబు.
(ఆం. భా. భూ.—36).

7. 'హోత, ధాత,' ఇత్యాది ఋకారాంత పదముల ప్రథమైకవచనము చివరి దీర్ఘము హ్రస్వ మగును. ఇవికాక మిగిలిన పురుషవాచక శబ్దములకు చివర ఉత్వడుజ్ఞులు చేరును.
హోతృ—హోతా_హోత, ధాతృ-ధాతా_ధాత.
పూరితాత్ముడు, పుణ్యకర్ముడు (ఆం. భా. భూ._37).
నన్నయ - ధాత (ఆది. 1-118); కర్త (ఆది. 1_14); మహాత్ముడు (ఆది. 1_95).

---

1, 2. ఆం.భా.భూ.-33.

8. గురువు, ప్రభువు శబ్దముల చివర డుజ్వర్ణకమును, శర్మ, వర్మ శబ్దములచివర ఉత్వడుజ్ఞులను చేర్చవచ్చును.
గురువు _ గురుడు; ప్రభువు - ప్రభుడు; శర్మ _ శర్ముడు; వర్మ— వర్ముడు (ఆం భా.భూ.–39).
నన్నయ _ గురులు (ఆది. 7_132), ప్రభుడు (ఆది. 8–11).
కాని వటువు, మనువు, బటువులకు మాత్రము డువర్ణకము చేరదు[1].

9 ద్విట్ పదమునకు ద్విషడనియు, విత్ పదమునకు విదుడనియు, భుక్ పదమునకు భుజుడనియు, దిక్ పదమునకు దిక్కనియు నగును (ఆం.భా.భూ.-40).
నన్నయ _ దిక్కులు (ఆది. 2–13).

ఇట్లు సంస్కృతపదములు తెలుగు కావించు పద్ధతులను కొన్నిటిని చెప్పి, యింకను తెలుపని వనేకములు కలవనియు, వానిని గూడ గ్రహింప వలయు ననియు కేతన చెప్పినాడు.

తదనంతరము కేతన సంధిశబ్దమును నిర్వచించి ఉత్వసంధి, మధ్యమ పురుషేకారసంధి, కిషష్ఠిసంధి, అది_ఇదిల సంధి, యడాగమము, నుగాగమము. ద్రుతసంధి, సరళాదేశము, గసడదవాదేశము, పుంప్వాదేశము, కర్మధారయము నందు టుగామము, ఇరు–ము–నలు అనునవి సమాసోత్తరపదములుగా ప్రయోగింపబడుపద్ధతి, 'క్రా, నె, కెం, చెం'లు చేరు పద్ధతి, టుగామము, రుగాగమము, ప్రథమేతరశత్రర్థకచువర్ణముపై జరుగు సంధికార్యక్రమములను వివరించినాడు (ఆం.భా.భూ.—42...66).

సంధి నిరూపణము తరువాత సప్తవిభక్తులు, ఏకవచనపదములు బహువచనములగు పద్ధతి, విభక్తులు చేరు పద్ధతి వివరముగా చెప్పబడినది (ఆం. భా. భూ.—67...103)

విభక్తులను చెప్పు సందర్భముననే సర్వనామములను గూడ చెప్పి వానిపై కూడ విభక్తు లెక్కుపద్ధతిని చెప్పినాడు కేతన(ఆం భా.భూ.-104..108).

---

1 కేతన తరువాతివాడైన విన్నకోట పెద్దన భాగవతమునందలి "చండస్ఫూర్తి వటుండు గాంచె" (8–529) అను పద్యమును జూచియే కాపలయు, 'వటు' శబ్దమును నిపతించినాడు

సంధిని గుఱించి చెప్పిన యనంతరము, సమాస నిర్వచనము, సమాస భేదములు, వైరిసమాసములు మొదలగునవి చెప్పినాడు కేతన (ఆం.భా. భూ.—109...136).

పిదప క్రియాపదమును నిర్వచించి, భూతభవిష్యద్వర్తమానకాలములందు వచ్చు ప్రత్యయములు, ఇంచుగాగమము, క్త్వార్థక-వ్యతిరేకార్థక_ఆనంతర్యార్థక-ఆశీరర్థకములను విశదీకరించినాడు (ఆం. భా. భూ.—137...160).

చిట్టచివరకు కొన్ని కృత్తద్ధిత ప్రత్యయములను, కొన్ని విశేషరూపములను చెప్పినాడు (ఆం. భా. భూ.—161...188).

ఇట్లు ఒక ప్రణాళికను తయారుచేసికొని, తనకు పూర్వ ముండిన భాషను చాలవఱకు ఆవరించునట్లు పెగ్గర్శఃముగా కేతన తన ఆంధ్రభాషాభూషణమును విరచించినాడు.

## ఆంధ్రభాషాభూషణ రచనమున కేతన కుపకరించిన వ్యాకరణములు

ఆంధ్రభాషాభూషణము తొలి తెలుగు వ్యాకరణమగుటచే కేతన తద్రచనమునకు తనకు పూర్వ ముండిన సంస్కృత, ప్రాకృత, కర్ణాటక వ్యాకరణముల నాధారముగా జేసికొనినట్లు కన్పట్టుచున్నది. ఇట్లాతనికి ఉపకరించినవి పాణిని 'అష్టాధ్యాయి', షణ్ముఖవ్యాకరణము, రెండవ నాగవర్మ 'కర్ణాటకభాషాభూషణము', కేశిరాజు 'శబ్దమణిదర్పణము', నృపతుంగుని 'కవిరాజమార్గము', నాగవర్మ 'కావ్యావలోకనము' అనునని కావచ్చును. వీని ప్రభావము ఆంధ్రభాషాభూషణముపై కనుపించుచున్నది.

సంధి, సంజ్ఞ, విభక్తి, సమాసము, భూతభవిష్యద్వర్తమాన కాలములు, ప్రశ్నార్థకప్రార్థనార్థకములు, అంతస్థలు, ఊష్మలు, వికల్పము— అను పారిభాషికపదముల నాతడు సంస్కృతవ్యాకరణములనుండియే గ్రహించినాడు.

తత్సమము, తద్భవము, దేశ్యము అనునవి ప్రాకృతవ్యాకరణముల నుండి గ్రహించినాడు.

"భాషావేదులు నను విని" అను పద్యమున కేతన తాను "ఆ షణ్ముఖపాణినుల కగు నెన" యని భాషావేదులు పొగడునట్లు రచించితినని చెప్పికొని

నాడు (ఆం.భా.భూ.—9). ఇచట పేర్కొనబడిన షణ్ముఖవ్యాకరణ మతి ప్రాచీనమైనది. ఇది కాతంత్రవ్యాకరణముల కోవకు చెందినది. జడబుద్ధియగు పాణిని విద్యాకాముకుడై శివునిగూర్చి తపస్సు చేసి, అతని ఆదేశమున కుమార స్వామివలన ఈ వ్యాకరణమును బొందుటచే దీనికి షణ్ముఖవ్యాకరణ మని పేరువచ్చినది[1]. శాతవాహనరాజుకొఱకు శర్వవర్మ శివునిగూర్చి తపస్సుచేసి అతని ఆదేశమువలన కుమారస్వామినుండి ఈ వ్యాకరణమును బొందె నని మఱియొక ఐతిహ్యము కలదు. ఇది కుమారస్వామి వాహనమైన కలాపి ముఖతః శర్వవర్మకు జేరుటచే దీనికి 'కలాపివ్యాకరణ' మనియు పేరు[2]. ఈ షణ్ముఖవ్యాకరణము, అగ్నిపురాణమునం దున్నది. ఇది కాత్యాయనునకు సులభముగా నర్థమగుటకొఱకు స్కందునిచే చెప్పబడిన దని యందే కలదు[3]. ఇది 232 శ్లోకములు మాత్రము గలిగిన చిన్నవ్యాకరణమే యైనను, పాణినీయము నందు చెప్పబడిన–సంజ్ఞ (3), సంధి (12), సుబ్విభక్తిసిద్ధరూపమ్ (73), స్త్రీలింగశబ్దసిద్ధరూపమ్ (13), నపుంసకశబ్దసిద్ధరూపమ్ (9), కారకము (25), సమాసము (18), తద్ధితము (30), ఉణాదిసిద్ధరూపమ్ (11), తిఙ్విభక్తి సిద్ధరూపమ్ (30), కృత్సిద్ధరూపమ్ (8) - అను క్రియాభేదము లన్నియును ఇందు వివరింపబడినవి. సులభముగా నర్థమగుటకు స్కందుడు శబ్దరూపము లను జెప్పుచు వెనువెంటనే ఉదాహరణముల నిచ్చినాడు. ఉదా.—"కర్మ ధారయః సప్తధా–నీలోత్పలముఖాః స్మృతాః; వ్యతీహారలక్షణార్థ కేశా కేశి నఖా నఖి" — మొదలగునవి. కేతనగూడ తన ఆంధ్రభాషాభూషణమున నిట్టి పద్ధతినే యవలంబించినాడు. అంతేకాక కేతన యవలంబించిన సంజ్ఞ, ఆంధ్ర శబ్దరూపసిద్ధి, సంధి, విభక్తి, సమాస, క్రియా, కృత్తద్ధితములు అను వరుస పరిశీలించినచో స్కందుని అనుసరించినట్లే కన్పట్టుచున్నది. కాని ప్రక్రియా పద్ధతిని మాత్ర మితడు షణ్ముఖవ్యాకరణమునుండి గ్రహింపలేదు. సమాస ప్రకరణములో నిది స్పష్టముగా గానవచ్చును. షణ్ముఖవ్యాకరణమున కర్మ ధారయము, తత్పురుషము మొదలగున వన్నియు విడివిడిగా సోదాహర ణముగ చెప్పబడినవి. కాని కేతన పూర్వోత్తరాన్యోభయార్థ ప్రాధాన్య భేద ములచే నాల్గు విధము లని చెప్పుట పాణినీయానుసరణమే కాని, షణ్ముఖ

---

1. కథాసరి. 1 లం-4 త -87, 88. 2. S.S.G. – పుట 82, 83
3: అగ్ని. 349-1.

వ్యాకరణానుసవణము గాదని స్పష్టము. మిగిలిన సంధి, విభక్తి, క్రియా, కృత్, తద్ధిత ప్రకరణములు తెలుగున సంస్కృతపద్ధతికంటె భిన్నములైనవి. కాన వీనినిబట్టి నిశ్చయించుటకు వీలులేదు.

తిఙ్విభక్తిసిద్ధిరూపమున గూడ—

"స్థి ఫ స్థ మధ్యవనరో మి ప్వ స్మస్ చోత్తమః పుమాన్ ।
త ఆతామ్ అంతాత్మా నేముఖ్యః ధా స్థాం ధ్వఞ్చ మధ్యమః ।
ఉత్తమ ఇ వహి మహి భువాద్యాః ధావతః స్మృతాః॥"[1]—

అని ధాతువులపై ప్రత్యయములు వచ్చు పద్ధతి చెప్పి వెంటనే—

"...భవతి సః భవత స్తౌ భవంతి తే।
భవసి త్వం యువాం భవాథో భవథ చాప్యహమ్ ॥
భవా మ్యావాం భవావశ్చ భవామో హ్యేధతే కులమ్॥"[2]

అని ఉదాహరణముల నిచ్చినాడు కేతనకూడ క్రియలకు ప్రథమ మధ్యమోత్తమ పురుషలందు వచ్చు ప్రత్యయములను ముందు చెప్పి వెంటనే ఉదాహరణములను గూడ నిచ్చినాడు. ఇట్లే విభక్తిప్రకరణములోని "గౌః గావౌ గాం గా గవా చ గో ర్గవో శ్చ గవాం గవి"[3]—ఇత్యాద్యుదాహరణముల ననుసరించియే కేతన వుఙ్ఙంత ముఙ్ఙంత లాంత ర్వంత శబ్దములపై విభక్తు లెక్కు పద్ధతిని చెప్పినాడు (ఆం భా.భూ.—91...93).

ఇట్లు రచనావిషయమున షణ్ముఖవ్యాకరణపద్ధతి నవలంబించిన వాడగుటచే ఆంధ్రభాషాభూషణమున కేతన షణ్ముఖుని పేర్కొనియున్నాడు.

నాగవర్మ తన 'కర్ణాటకభాషాభూషణమున' సరళాదేశమును చెప్పినాడు[4]. ఇట్లే కేశిరాజును చెప్పినాడు[5]. వారి ననుసరించియే కేతన కచటతపలకు గజడదబలగు నని సరళాదేశమును విధించినాడు (ఆం.భా.భూ.—53).

ఆంధ్రభాషాభూషణములోని కారకవిధానమునకును, అష్టాధ్యాయి కర్ణాటకభాషాభూషణములలోని కారకవిధానమునకును చాల సన్నిహితసంబంధము కనిపించుచున్నది[6].

---

1. అగ్ని—అధ్యా 358—6, 7.
2. అగ్ని—అధ్యా 358—10, 11.
3 అగ్ని—351—53
4. క భా.భూ.—సంధి—28.
5 శబ్దమణి_65
6. చూడు: విభక్తిప్రకరణము.

ఇట్లే సమాసవిభజనమున గూడ వానితో నెక్కువ సంబంధము గోచరించుచున్నది[1].

ప్రథమ కర్ణాటకవ్యాకరణమైన 'కర్ణాటకభాషాభూషణము' ననుసరించి తన వ్యాకరణమునకు 'ఆంధ్రభాషాభూషణ' మని పేరుపెట్టుకొనుటకూడ దాని ప్రభావ మాతనిపై బడినట్లు వ్యక్తముచేయుచున్నది.

కేతన కేశిరాజు లిరువురును తమ వ్యాకరణములను 'శబ్దశాస్త్రము' లనియే చెప్పుకొనినారు[2].

ఆంధ్రభాషాభూషణములోని—

ఒప్పులు గల్గిన మెచ్చుడు
తప్పులు గల్గిన నెఱింగి తగ దిద్దుడు త
ప్పొప్పునకు డొప్పు తప్పని
చెప్పకు డీ పవు లుపాస్తి చేసెద మిమ్మున్— (ఆం.బా భూ—8)

అను పద్యమునకు శబ్దమణిదర్పణములోని-

అవధరిపుదు విబుధర్ దో
షవిదూరాశే నాను ముళ్గొడం ప్రియదింతి
ర్ద్ద విదుగుణయుక్త ముందో
పవిదూర మాగె మెచ్చి కైకొళ్వుదిదమ్[3]—

అను పద్యమే మూలముగా కన్పట్టుచున్నది.

కేతన వర్ణసమామ్నాయమును చెప్పుచోట, అచ్చులను హల్లులను 'ఆదులు, కాదులు' అని వ్యవహరించినాడు (ఆం.భా.భూ.—15). దీనికి కారణము నాగవర్మ కేశిరాజు లట్లు వ్యవహరించుటయే అని తోచుచున్నది. నాగవర్మ 'అకారదయః ప్రసిద్ధా వర్ణాః'[4]—అనియు, కేశిరాజు—

వర్ణంగళ్ పారక్రమ
మర్ణవవృత ధాత్రియొళ్ ప్రసిద్ధం నిజదిం

---

1. చూడు: సమాసప్రకరణము, క.భా.భూ.—133,138
2. ఆం.భా.భూ.—7; శబ్దమణి—పీఠిక —3
3. శబ్దమణి, పీఠిక—4.
4 క.భా.భూ. సంజ్ఞా—2.

వర్ణంగ శకారాద్యా
పూర్ణతేయం పడెవువా శకారం బరగెం[1]—

అనియు చెప్పినారు. కేతన వారినే యనుసరించినట్లు తోచుచున్నది.

నృపతుంగుడు తన 'కవిరాజమార్గము'న సంస్కృతక్రియలు, విభక్తులు మొదలగువానిని యధాతథముగ కన్నడమున ప్రవేశపెట్టరాదనియు, అది ఆగమకోవిదనిగదితమార్గము కాదనియు, అట్లు చేసినచో మద్దెలయు, గరెడెయు కలిపి వాయించినప్పటికి జర్ఝరధ్వని కలుగుననియు నిరసించినాడు[2]. దీని ననుసరించియే కేతన—"వృక్షణ దక్షాయ పక్షిభిః పుత్రస్య యను విభక్తులు దెనుంగునకు జూరవు" (ఆం.భా.భూ—23) అను పద్యమును వ్రాసినాడు.

ఇట్లే ఆంధ్రభాషాభూషణములోని "కరి వచ్చెన్ గరి నెక్కెన్" అను పద్యము నాగవర్మకృత 'కావ్యావలోకనము'లోని "కరియివు కరి కరి యల్లివు" అనుదాని ననుసరించియు, "లలి నేకాక్షరపదములు" అను పద్యము "అకారాక్కే లఘూకృత" (39) అనుదాని ననుసరించియు, "పేరని యెడు శబ్దం" బను పద్యము "పెర్మరననడిర్దననలతె (217) అను దాని ననుసరించియు, వ్రాయబడినట్లు స్పష్టమగుచున్నది[3].

ఆంధ్రభాషాభూషణము ప్రారంభమునందలి "శ్రీవాణీ గిరిజేశ" యను పద్యమునందలి యెత్తుగడ నన్నయ భారతమునందలి "శ్రీవాణీ గిరిజాః" యను యెత్తుగడకు అనుకరణముగా నున్నది.

ఇట్లు ఆంధ్రభాషాభూషణ రచనమున కేతనకు అయనకు పూర్వముండిన సంస్కృత కర్ణాటక వ్యాకరణములు కొంతవఱకు తోడ్పడినట్లు కన్పట్టుచున్నది.

---

1. శబ్దమణి—అక్షరసంజ్ఞా-4 2. ప్రా.యు.—పుట 397.
3 'కావ్యావలోకనం – నాగవర్మ' – భారతి మార్చి, 1959.

# 2. సంధి ప్రకరణము

చాళుక్యయుగమునందలి వచనశాసనములలో సంధి చేయబడిన చోట్లును, విసంధిగా వ్రాయబడిన చోట్లును, యడాగమములు వచ్చిన చోట్లును గూడ కనిపించుచున్నవి. వీనిలో విసంధిగా వ్రాయబడిన చోట్లే చాల హెచ్చు. సంధి పాటింపబడనిచోట్ల సైతము నిశ్చితమైన నియమమేమియు గానవచ్చుట లేదు. పద్యశాసనములందు సంధి పాటింపబడుటయే సార్వత్రికముగా గనవచ్చుచున్నది.[1] ఇట్లు అవ్యవస్థితరూపములో నున్న సంధులను సంస్కరించి నన్నయ తన భారతరూపమున గ్రంథస్థము చేసినాడు. ఇట్లు నన్నయ సంస్కరించిన వానిని సూత్రబద్ధము కావించినాడు కేతన. కేతన చెప్పిన లక్షణము లన్నియు నన్నయ భారతమున యథాతథముగ కన్పించుచున్నవి. దీనినిబట్టి కేతన నన్నయ భారతము నెంత జాగ్రతగ పరిశీలించి వ్యాకరణరచనమున కుపక్రమించెనో తెలియనగును.

**సంధి నిర్వచనము** :—వర్ణద్వయ సంవిధానమున గలిగెడు కార్యము నుపదేశించు వ్యాకరణ విభాగము సంధి యనబడును

పాణిని 'సంహిత' యను శబ్దమును 'సంధి' యను నర్థమున నుపయోగించినాడు[2]. ఈ సంహిత యేకపదమునందును, ధాతూపసర్గలకును, సమాసము నందును నిత్యముగా విధించబడినది[3].

కేతనాది తెలుగు లాక్షణికులు లెవ్వరును ఈ 'సంహిత' శబ్దమును గ్రహింపనేలేదు. అందఱును 'సంధి' యను దానినే ఉపయోగించినారు.

ప్రథమ వ్యాకర్తయగు కేతన మొదలి పదము తుది వర్ణము పై పదము

---

1. ప్రాయు — పుట 285.
2. అష్టా. 1-4-108.
3. ముగ్ధ. దుర్గా. వ్యాఖ్యా.—77 సూ.

మొదలి వర్ణముతో గలియుట సంధి యని నిర్వచించినాడు (ఆం.భా.భూ.—43). కేతన ననుసరించి విన్నకోట పెద్దన (కావ్యా. చూడా. 9–45), అప్పకవ్యాదులు (అప్ప. 5-33) వర్ణసంయోగమే సంధి యని నిర్వచించినారు. అథర్వణుడును వర్ణసంయోగమే సంధియని నిర్వచించినాడు (అథ.కారి.—సంధి-1).

చింతామణి, ఛందోదర్పణములు సంధులను వివరించినను సంధి నిర్వచన మీయలేదు చిన్నయసూరి వంటి లాక్షణికులు "పూర్వ పరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి"యని చెప్పినారు[1]. ప్రౌఢవ్యాకర్తయు (ప్రౌఢ. సంధి-1), ఆంధ్రభాషానుశాసకర్తయు (ఆం. భా. శా. సంధి—1) చిన్నయసూరినే యనుసరించినారు.

ఇట్లు ప్రాచీన యర్వాచీన లాక్షణికుల నిర్వచనములను బరిశీలించినచో వర్ణసంయోగము సంధి యని నిర్వచించిన ప్రాచీన లాక్షణికుల మార్గమును, స్వరసంయోగమే సంధి యని నిర్వచించిన యర్వాచీన లాక్షణికుల మార్గమును, భిన్నము లని స్పష్టమగుచున్నది[2]. ఒకానొక కాలమున ప్రాచీనభాషలోని హలంతశబ్దములన్నియు నుచ్చారణసౌకర్యము కారణముగా తుది నొక యచ్చును గ్రహించి యీ భాషలో నజంతశబ్దము లైన వని (వాక్—వాక్కు, మన్—మన్ను, పల్—పల్లు) తలంచినవారు, ఆదేశ ఆగమ సంశ్లేషాదులను సంధులుగనే గ్రహించి పూర్వలాక్షణికులను సమర్థించినారు. తెలుగు కేవల మజంతభాషయే యనియు, నందు హలంతరూపములు లేవనియు, ఆదేశ ఆగమ సంశ్లేషాదులు సంధులలో జేరవనియు, అవి రూపభేదములే యనియు, "సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (బాల. సంధి -4) అను సూత్రములో చిన్నయసూరి 'సంధిలేనిచోట' యని విశదముగా జెప్పినాడనియు, కావున స్వరసంయోగమే సంధి యనియు చెప్పుచు సూరి మొదలగు అర్వాచీన లాక్షణికులను కొందఱు సమర్థించినారు.[3]

కేతన చెప్పిన లక్షణము విస్తృతమైనది. అది అజ్ఝల్లులను రెంటిని విషయీకరించినది. చిన్నయసూరి సంధిలక్షణము అజ్విషయికము మాత్రమే.

---

1 బాల సంధి—1.

2 సంధి—పుట 266; ఆం భా చ. పుటలు- 344, 345.

3 రమణీయము-పుటలు 185, 186

అతడు చెప్పిన ఆగమము లన్నియు సంధి కలుగునప్పుడుగాని, కలగనప్పుడు గాని వచ్చు నని సరిపెట్టుకొనవలయును. కేతన వాని నన్నియు సంధికార్యముల లోనే కలిపిచెప్పుటవలన ఆతని లక్షణము సంధి విషయకము లగు ఆగమాదేశా దులకు, వర్ణపరిణామాదుల కన్నింటికి వ్యాప్తమగుచున్నది. సూరి లక్షణమునం దీ యాగమము లన్నియు సంధిని పురస్కరించుకొనియో, లేక సంధి లేమిని పురస్కరించుకొనియో కలుగు నని చెప్పవలయును. కేతన లక్షణమునందు ఇవి యన్నియు సంధికార్యములే. అందుచేత కేతన సంధి శబ్దమున కిచ్చిన యర్థము వ్యాపకమైనది.

ఈ సందర్భమున డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు, కోరాడ రామ కృష్ణయ్యగారు, దూసివారు మొదలగు అర్వాచీను లందఱును చిన్నయసూరి వంటి అర్వాచీన లాక్షణికుల నిర్వచనము కంటె కేతనాది ప్రాచీన లాక్షణికుల నిర్వచనము అధికవ్యాప్తిని కల్గియున్న దని నుడివియున్నారు[1]. ద్రావిడ కర్ణాటక లాక్షణికులును వర్ణసంయోగమే సంధి యని నిర్వచించినారు. అరవమున ప్రథమవ్యాకర్తయగు తొల్కాప్పియనారు—'అచ్చు కచ్చు పరమైనను, హల్లున కచ్చు పరమైనను, అచ్చునకు హల్లు పరమైనను, హల్లునకు హల్లు పరమైనను, సంధికార్యములు గలుగునని నిర్వచించినాడు[2]. కన్నడ వ్యాకర్తయగు కేశిరాజు తన 'శబ్దమణిదర్పణమున'న—

ఎరడుం పలవుం వర్ణం
పరస్పరం కూడువంద మదు సంధివలం
స్వరరహిత వ్యంజనమవు
పరవర్ణమనైదు తిర్పువా సంహితయొళ్—

అని వర్ణసంయోగమే సంధి యని నిర్వచించినాడు[3].

ఇట్లు కేతనాది పూర్వలాక్షణికుల సంధినిర్వచనమే విస్తృతవ్యాప్తి కల్గి యున్నది.

**కేతన సంధి నిరూపణము**

సంధి నిర్వచనానంతరము, ఉత్వసంధి, మధ్యమపురుషేకారసంధి,

---

1. ఆం భా చ.—పుట 343, 345; సంధి_37, 41; పేటికావ్యాఖ్య—పుట 40.
2. ఆం భా.వి._పుట 310 3. శబ్దమణి_49.

కిషష్ఠిసంధి, అది—ఇదెల సంధి, యడాగమసంధి, నుగామమసంధి, ద్రుతసంధి, శత్రర్థకచువర్ణముపైని ద్రుతలోపము, సరళాదేశము, గసడదవాదేశము, పుంప్వాదేశ రుగామములు, త్రికసంధి, ఇరు-ము-నలు అనునవి చేరుపద్ధతి, పేరు—ఆలు అనునవి సమాసపూర్వోత్తర పదములైనప్పుడు వచ్చు విశేషములు కేతన వివరించినాడు.

**1. ఉత్వ సంధి:**—ఈ ఉత్వ సంధి నన్నయకు పూర్వపు శాసనభాషలో కొన్నిచోట్ల నిత్యముగను, కొన్నిచోట్ల విసంధిగను కన్పట్టుచున్నది.

నిత్యము · బలగర్వంబొప్ప- అద్దంకి శాసనము

ఘూరోకంబెఱుంగ— చళుక్యభీముని ధర్మవరశాసనము.

వైకల్పికము : వాఱుయిఱ్ఱుకొను- విప్పర్లశాసనము

చేబ్రోలు యేలెడు— యుద్ధమల్లుని బెజవాడశాసనము.

నన్నయ ఉత్వసంధిని నిత్యముగ జేసినాడు. కావున కేతన దానిని నిత్యముగనే చెప్పినాడు (ఆం.భా.భూ.—41). కేతననుండి చిన్నయసూరివఱకును గల లాక్షణికు లందఱును దీనిని నిత్యముగనే గ్రహించినారు.

**2. మధ్యమపురుషేకార సంధి:**— కేతన మధ్యమపురుషేకారమునకు సంధి నిత్యముగా జరుగు నని చెప్పి, 'సత్వము జెందితి రూరి కతిత్వరితముగా' నను దాని నుదాహరించినాడు (ఆం.భా భూ -44). నన్నయ భారతమున నిది నిత్యముగనే యున్నది—ఉదా:—తాల్చి తభిషిక్తుడవై (ఆది. 2—198); నీవు వచ్చి తిందులకు (ఆది. 4—230). కూచిమంచి తిమ్మకవి "ఇదె యమునాజ్ఞ ద్రోచితిరి యెచ్చటనుం డిటు వచ్చినారలు" అను 'కవులషష్ఠము' లోని ప్రయోగమును జూపి, దీనిని వైకల్పిక మనినాడు[1]. కాని యీ కవులషష్ఠము నేడు నామమాత్రావశిష్టమైనది. శ్రీనాథుడు తన 'శృంగారనైషధములో "కూర్చుండిరి యొండురుం గదిసి" (నైష·—3 ఆ.) అని యడాగమము చేసినాడు (వ్యా.సం.స. —I—పుట 23). అందువలన అప్పకవి యాతనిని అధిక్షేపించినాడు[2]. కాని యిక్కడ 'కూర్చుండిరి' యనునది ప్రథమపురుషబహువచనముగాని, మధ్యమపురుషబహువచనము కాదు. సూరి మాత్రము దీనిని నిత్యము

---

1. సర్వలక్షణ—1—19, 20·  2 అప్ప —5 ఆ

గనే విధించినాడు[1]. నన్నయ ప్రయోగము లాధారముగా కేతన దీనిని నిత్యముగ విధించినాడు.

**3. అత్వ సంధి:**—నన్నయకు బూర్వశాసనములందు అత్తునకు సంధి బహుళముగనే జరిగినది. నన్నయకూడ దీనిని బహుళముగనే ప్రయోగించినాడు[2]- ఓపకయుచుచు (అర. 2–13), మేనయత్త (ఆది. 5–17) కేతననుండి సూరివఱకునుగల లాక్షణికులందును దీనిని బహుళముగనే గ్రహించియున్నారు.

**4. అది–ఇది.**—వీనికికూడ సంధి వైకల్పికమనియే చెప్పినాడు కేతన (ఆం.భా.భూ.-15). నన్నయ గూడ దీనిని సర్వత్ర వైకల్పికముగనే చేసినాడు- విషయమైనది (అర. 1–257) నీవు చెప్పిన యది (అర.1–267). ఈవిషయమున కేతననుండి సూరివఱకును గల లాక్షణికు లందఱు నేకాభిప్రాయమునే గల్గియున్నారు.

**5. కిషష్ఠి సంధి:**—కేతన దీనిని గూడ వైకల్పికముగనే చెప్పినాడు (ఆం.భా.భూ.-44). నన్నయలో నిది వైకల్పికమే—వాని కర్జనుండు (అర. 3–273); వానికి నర్జనుండు (ఆది.2–66). ఈ విషయమునగూడ కేతననుండి చిన్నయవఱకు బేధాభిప్రాయము లేదు.

**6. యడాగమము:**—కేతన యడాగమమును నిత్యముగ విధించినాడు (ఆ.భా.భూ.-48). నన్నయ దీనిని సార్వత్రికముగనే వాడినాడు. చిన్నయసూరి "సంధి లేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబునకు యడాగమం బగు" నని చెప్పినాడు. చిన్నయసూరిమతంబున సంధి యనగా అచ్‌సంధియు, నందును పరరూపసంధియు గావున ఈ లక్షణము కుదురును. కాని కేతన మతమున సంధి యనగా నొక పదమునందలి తుదివర్ణమునకు మఱియొక పదమునందలి మొదటివర్ణము పరమగునపుడు సంభావితమగు వ్యాకరణకార్యము. కావున యతని మతమున యడాగమము సంధి లేనిచోట వచ్చునది కాదు. ఈ యడాగమము యెట్టి సందర్భములందు వచ్చు నని కేతన చెప్పినాడో యట్టి సందర్భములందు నిత్యముగా నన్నయయందు యడాగమము కన్పించుచున్నది.

---

1 బాల. సంధి –7

2. ప్రౌ.యు – పుట 289.

7. నుగాగమ సంధి:—"కేతన షష్ఠిసమాసమునందలి ఉత్తున కచ్చు పరమగునపుడు నుగాగము మగు నని చెప్పినాడు (ఆ.భా.భూ —49). గూడూరు శాసనమున 'నృపునంగన' యను నుగాగమ రూపము కలదు. చిన్నయసూరి కూడ దీనిని నిత్యముగనే యంగీకరించినాడు[1]. కాని శ్రీ కల్లూరివారు— గోకుల మిల్లులు (హరి — 5 ఆ), మొగమంచము—(విజయవిలాసము), బచ్చింట (పాండు.-3 ఆ), ఓరసందము (కళా.—2 ఆ) ఇత్యాది ప్రయోగములను చూపి, ఈ నుగాగమము వైకల్పిక మని చెప్పినారు. కాని ఇట్టివి కేతనకు పూర్వము లేకపోవుటచేతను, నన్నయ దీనిని నిత్యముగనే విధించుటచేతను, కేతన నిత్య ముగనే చెప్పినాడు. కాని సూరికూడ వానిని గ్రహింపలేదు.

7. ద్రుత సంధి:—కేతన ద్రుతసంధిని నాల్గు భాగములు చేసెను (ఆం. భా.భూ.—52, 59, 60, 61).

1. ద్వితీయాదులకు అచ్చుపరమైన నకారము నిల్చును.
2. నకారాంతపదములకు కచటతపలు పరమైన అవి గజడదబలగును. నకారము సున్న యగును.
3. నన్ను, నిన్ను, తన్ను, కును, కిను—వీనిపై నున్న నకారము అచ్చు పరమగునపుడు వికల్పముగ లోపించును.
4. నకారాంతపదమునకు పరుషేతరహల్లు పరమగునపుడు లోపము గాని, పూర్ణబిందువుగాని వచ్చును.

కేతన చెప్పిన, ఈ సంధిలక్షణములను పరిశీలించితిమేని మన కీ క్రింది విషయములు స్పష్టమగును: కేతన దీనిని ద్రుత మనలేదు. కాని నకారము నతడు ఆ యర్థములోనే వాడినాడు. కాని ఇత డిచ్చిన యుదాహరణములను బట్టియు చేసిన ప్రయోగములను బట్టియు చూచినచో ప్రత్యయాగమావ్యయా త్మకమైన నకారమునకే ఈ సంధి చెల్లు నని స్పష్టము.

1. ప్రత్యయాత్మకము : సుతునడిగె, వాని గనియె (53).

---

1. బాల. సంధి.—34.

2. ఆగమాత్మకము : అంతయు నేకమై (14), అలఘుసమాసములు గ్రియలు (15).

3. అవ్యయాత్మకము నెఱయగ నూదుచు (58), పన్నుగఁ బోఁజూపు (59). మఱియు నీతడు 'నేను, తాను' పదములలో 'నువర్ణకము ద్రుతమని భావించినట్లు కన్పించుచున్నది— తా ఘనుడు (57); ఏఁ జెప్పెద (6).

సరళాదేశసంధియందు సంశ్లేషము నితడొప్పలేదు. అట్టి ప్రయోగము లితనిలోనే కాక నన్నయలో కూడ కన్పింపవు. కాబట్టి సంశ్లేషరూపము అర్వాచీన మని తోచుచున్నది.

**9. శత్రర్థక చువర్ణకము:**—శత్రర్థక చువర్ణకముపై నకారమున కచ్చు పరమగునపుడు లోపమును చెప్పినాడు కేతన (ఆం.భా.భూ.—173). ప్రథమేతర విభక్తులయందున్న ఉన్నంతముల కచ్చు పరమగునపుడు కూడ లోపము వైకల్పికముగ నితడు చెప్పెను (59). కాని సూరి మాత్రము వానిని ఉత్వసంధిలో చేర్చినాడు. ఇక్కడ ఉత్వసంధిని చెప్పుట కంటె నకారలోపమునకు వైకల్పికము చెప్పుటయే శ్రేష్ఠము.

**10. సరళాదేశము:**—నన్నయ్యకు బూర్వపు శాసనములలో గూడ నిది కానవచ్చుచున్నది. ప్రభు బణ్డరంగంబఌచ్చిన-ఆద్దంకి శాసము, ఆజిలోం జూపె-చళుక్య భీముని ధర్మవరశాసనము.ఇట్లీ శాసనములందు ద్రుతముపై సరళాదేశము కానవచ్చుచున్నది. కేతనకు పూర్వమే యిది యితర ద్రావిడభాషలలోను స్థిరపడిన ప్రక్రియ. కేశిరాజు తన శబ్దమణి దర్పణమున దీనిని చెప్పినాడు. నన్నయ 'వినం బొలుచు' (ఆది. 1–45) వంటి వానిని ప్రయోగించియున్నాడు.

కేతన మతమునందు సరళాదేశ సంధియందు ద్రుతమునకు బిందువు మాత్రమే వచ్చును. ఇది నన్నయ ప్రయోగములకు నెంతయు ననుగుణమగు సూత్రరచన. సంశ్లేషరూప మొక్కటియు నన్నయలో కనిపించదు. ఇందువలన సంశ్లేషరూప మర్వాచీన మనవలెను. సూరి వానిని కూడ సంగ్రహించెను.

**11. గసడదవాదేశము:**— శాసనములందు ప్రథమావిభక్తి యందున్న తెలుగుమీది తెలుగుశబ్దములకు—మాడలు వెట్టె, తమ్మెణ్డు వ్రోలణ్డు; తెలుగుమీది సంస్కృత శబ్దములకు- అరియ పట్టనమున, వెన్నమ ప్రకాశముగాన్,

సంస్కృతములమీది సంస్కృతశబ్దములకు— అమృతాంశుండు వయః పయోధి, సంస్కృతములమీది తెలుగుశబ్దములకు -జగజ్జిగీషుండు వేమ్మిరని—అని బహుళముగా విధింపబడినది. ఇట్లే నన్నయ భారతమున గూడ— పెద్దవోయె (ఆది.6—290), పెద్దగాలంబు (ఆర. 3—31), ధారుణి వాలింతె (సభా.1—41), సురుపుపల్లియ (ఆది. 7—252) అని బహుళముగా విధింపబడినది. అందువలననే కేతన—

పొసగం బల్కెడు నెడ బొ
ప్పెసగిన ప్రథమాంతముల పయిం గదిసి కడున్
బసనారు కచటతపలును
గసడదవల్ ద్రోచి వచ్చు గవిజనమిత్రా — (ఆం.భా.భూ.—62)

అను పద్యమున ఇచట తెలుగు పదము లని గాని, సంస్కృతపదము లనిగాని, విశదముగా చెప్పక, అన్నిటికిని సరిపోవునట్లు పద్యరచన గావించినాడు. చిన్నయసూరి ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళముగా విధించియు, తరువాతిసూత్రమున "తెనుగులమీది సాంస్కృతికపరుషములకు గసడదవలు రా" వని నిషేధించినాడు. కేతన మాత్రము ఎంతో జాగ్రత్తగా సూత్రించినాడు.

**12. పుంప్వాదేశము :**—కుపమ ద్రాక్షారామశాసనమున 'లోహపు దివియ' యనుదానిలో 'పు' అనునదియు, మంగిదొర లక్ష్మీపుర శాసనమున 'మిరియమ్పుబోళ' యనుదానిలో 'ంపు' (మ్పు) అనునదియు ప్రయుక్తములైనవి. నన్నయ కూడ విరుద్ధంపువరము (ఆది. 7—260), పాపంపువేళ (ఆర. 1—49) అనువానిని ప్రయోగించియున్నాడు.లక్ష్మీపుర శాసనమున 'ఉరుపుటురిబోళ' (ఉరుపు + ఉరి) యను ప్రయోగమున 'టు' గాగమము కానవచ్చుచున్నది. ఇట్లు తనకు పూర్వముండిన ప్రయోగములను బట్టి కేతన 'వు' వర్ణక 'పుట' వర్ణకము లను విధించినాడు (ఆం.భా.భూ.—118). సూరికూడ దీనిని కర్మధారయసమాసములందే చెప్పినాడు.[1] కాని యీ టుగాగమము కర్మధారయేతరస్థలములందును వచ్చుచుండుటచే ప్రౌఢవ్యాకర్త చిన్నయ్యసూరిసూత్రమును సవరించినాడు[2]. ఈ సందర్భమున శ్రీ చిలుకూరి నారాయణరావుగారు టుగాగమమును సమర్థించుచు 'పట్టపేనుగు' (ఉ.రా. 5—97), పట్టమేనుగు (పాండు. 1—77) అను

1 బాల. సంధి — 32, 28. 2. ప్రౌఢ. సంధి — 24

వానిలో బహుళముగా వచ్చుచున్న దని చెప్పినారు. కాని యిట్టివి నన్నయ భారతమున లేకపోవుటచే కేతన నిత్యగమునే విధించినాడు.

**13.** త్రికసంధి:— నన్నయకు పూర్వశాసనములలో 'ఇన్నెలకు'(యుద్ధ బెజ.శాస.), 'ఎవణ్డు'(గ.రిందగుంటశాసనము),'అచ్చోన'(S I I – IV – 738) అను రూపములు కన్పించుచున్నవి. ఇట్లే త్రికసంధి 'అ, ఈ, ఏ'లను వాని పైననే కన్పించుచున్నది. నన్నయ 'అక్కడన' (ఆది. 5—133), 'ఇమ్మహా భారతంబు' (ఆది. 1—23), 'ఎయ్యది' (ఆర. 2 -224) 'ఆ గిరిరాజ' (అది 7—76), 'ఈజగతి' (సభా. 2- 235), 'ఏయది' (ఆది.1—29) అని వికల్పముగ వాడినాడు కావున కేతన దీనిని వికల్పముగనే సూచించినాడు (ఆం. భా. భూ —135).

తరువాత కేతన కొన్ని రూపములను సాధించు సందర్భమున, ఒకే విధముగ నుండు శబ్దములను కొన్నింటిని గ్రహించి, అందు సమానాంశము లను విడదీసి, అట్లు విడదీసిన సమానాంశములు వచ్చు స్థానములను నిర్దేశించి, అవివచ్చు పద్ధతిని తెల్పినాడు. ఇట్టివానిని బాలవ్యాకరణమున సూరి సంధి ప్రకరణముననే సాధించినాడు.

1. రెండు, మూడు, నాలుగు, అను పదములు పూర్వపదములైనచో నవి 'ఇరు, ము, నలు' అని క్రమముగా నగు ననియు, 'ము' వర్ణకము పైని యక్షరము మాత్రము ద్విత్వము నొందుననియు చెప్పి, కేతన ఇరువది, ముప్పది, నలువది యనువాని నుదాహరించినాడు (ఆం. భా. భా. 123). ఇట్లు సంఖ్యా వాచకములుగనె కాక,నన్నయ వీనిని వ్యస్తముగ గూడ ప్రయోగించియున్నాడు— ఇరుదగలు (ఆది. 4-94), ముయ్యేడు (ఆది. 1—79), ముమ్మడుగు (ఆది. 1—81), నలువురు (ఆది. 3—4), నలుగడల (ఆది. 8—200). ఇట్టి వ్యస్త ప్రయోగములు పై మూడు పదములకు మాత్రమే కన్పట్టుచున్నవి. 'ఐదుగురు, ఆరుగురు, ఏడుగురు,' ఇత్యాది స్థలములలో ఆ సంఖ్యావాచకపదములు పూర్ణ రూపములతోనే యున్నవి. అందువలన కేతన పై మూడు శబ్దములకే విధించినాడు.

2. కొన్ని తెనుగు పదముల వెనుక 'క్రొ, నె' యనునవి నిలిచి తమ ముందున్న యక్షరములను జడ్డలు గావించు నని కేతన చెప్పినాడు (ఆం. భా.

షూ —121) ఇచ్చుచూడ కేతన 'క్రొన్నెల, క్రమ్మెఱుగులు, క్రొన్నన, క్రొక్కారు, క్రొత్తమ్ములు' ఎంచె వానిలోని సమానవాచకమగు 'క్రొ'అనుదానిని, నెన్నడుము, నెమ్మొగము, నెప్పడ, నెత్తావి ఇత్యాదులలోని సమానవాచకమగు 'నె' అను దానిని గ్రహించి పైరీతిగ సూత్రించినాడు. ఇతని మతమున క్రొందమ్మి, క్రొంజాయ, క్రొంబసిడి ఎంటి రూపములు సిద్ధింపవు. దీనికి కారణము నన్నయ భారతమున నిట్టి ప్రయోగములు లేవు.

ఈ సందర్భమున శ్రీ కోరాడవారు- "ఈ క్రొత్తశబ్దముయొక్క ప్రాచీన రూపము 'కొఱ్' అనునది. ఈ 'కొఱ్' అనునది 'క్రొ' అను నక్షరముగా మారినట్లు కొఱకు + చాయ=క్రొమ్‌జాయ=క్రొంజాయ అను ప్రక్రియవలన స్పష్టమగుచున్నది" —అని వ్రాసినారు[1].

3. ఇట్లే కెందలిరాకు, కెందమ్ములు ఇత్యాది ప్రయోగములందలి 'కెం' అను సమానాంశమును, చెంగల్వ, చెందొవ ఇత్యాది ప్రయోగములందలి 'చెం' ను, సమానాంశములుగా గ్రహించి కొన్ని పదముల కవి ముందు చేరి యరుణ కాంతిని తెల్పు నని చెప్పినాడు (ఆం.భా.భూ.—125). నన్నయ 'కెందమ్మి' (ఆది. 4—75) అని ప్రయోగించినాడు.

ఇచ్చట పరుషమునకు సరళాదేశ మెట్లు కలుగునన్న ప్రశ్న యున్నది. పరుష పరకత్వమువలన బిందువునకు సవర్ణానునాసికత్వము ప్రసిద్ధము. తెనుగున నకార, ణకార, మకారములు మాత్రమే యనునాసికములు. ఒక్క మకారపరకత్వమున తప్ప తదితర పరుషపరకత్వమున, బిందువునకు నకార లక్షణము కలిగి, ఆ పరుషమునకు సరళాదేశము భాషాస్వభావముచేత సిద్ధించును. ఈ స్వభావము నకారసంధి చెప్పినప్పుడు కేతన వివరించెను. అందుచేత నిచ్చట మరల చెప్పుట పునరుక్తి యగును. కేతన వీలైనంత సంగ్రహముగ గంభీరస్వభావముతో చెప్పు స్వభావముకలవాడు.

ఈ సందర్భమున శ్రీ కోరాడవారు తమ 'సంధి' గ్రంథమున, 'కెంధూళి, కెంజడలు' అనునవి కూడ పువర్ణ మా శబ్దములలో జేరకమునపే 'కెం' శబ్దముతో గూడి యేర్పడిన సమాసములై యుండు నని నుడివియున్నారు[2].

---

1 సంధి —పుట 182. 2. సంధి—పుట 186.

4. కేతన 'పేరు' అనునది తెలుగు శబ్దము మొదట నున్నచో నది యాధిక్యమును సూచించునని చెప్పి 'పేరాకలి, పేరామని, పేరాముదపాకులు, పేరింపు' ఇత్యాద్యుదాహరణముల నిచ్చినాడు (ఆం.భా.భూ–127). నన్నయ ఆయుర్వర్ధనము నగు బేరు సంతతి' యని ప్రయోగించినాడు ఇచట 'పేరు' అనునది విశేషణము కాదు– క్రియ. దీనికి 'పెరుగు' అని కాని 'పేర్చు' అని కాని యర్థము చెప్పికొనవలెను. 'పెరుగుసంతతి' యని కూడ దీనికి పాఠాంతరము కలదు. కావున రెండును పర్యాయ పదములేకాని భిన్న పదములు కావు. 'పెరుగుమొక్క, పెరుగుతోటకూర' మొదలైన స్థలము లందు పెరుగు విశేషణముగ కూడ వాడబడినది. పెరుగుతోటకూరకు పేరుతోటకూర, పేరామనికి పెరుగామని యను ప్రయోగములు లేవు గదా యన్నచో, నివి రెండును పర్యాయపదములు కావనుటకు ఆ విధములైన ప్రయోగములు లేక పోవుట నిశ్చాయకములు గావు పర్యాయ శబ్దములే యైనను రూఢిని బట్టి యర్థచ్ఛాయలలో భేదముకల్గుట ప్రసిద్ధమే. 'కెంపు, చెన్ను' శబ్దములు రెండును వృత్తిని శోణార్థకములే ! కాని కెమ్మోవి, చెంగావి అనియే ప్రయోగములు గలవు కాని, చెమ్మోవి, కెంగావి యను ప్రయోగములు లేవు అట్లే 'పెరుగామని, పేరుతోటకూర' యను ప్రయోగములు లేవు. పేరు, పెరుగులు రెండును పాఠాంతరముతోడి నన్నయ ప్రయోగము చాలును.

అధర్వణుడును "వైపుల్యవాచకత్వేన పేరుశబ్దో విధియతే" యని చెప్పినాడు[1]. చిన్నయసూరి దీనిపై టుగామమును విధించినాడు[2]. కాని యిట్టివి నన్నయ భారతమున లేవు[3].

'ఆలు' శబ్దము విశేషోత్తరపదమైనపుడు 'రాలు' అగున నని చెప్పి 'గొల్రాలు, జవరాలు, పాతకురాలు, గెడపురాలు, ముద్దరాలు' అనువాని నుదాహరించినాడు కేతన (ఆం.భా.భూ.–167).

దేశ్యశబ్దములతో 'అలు'శబ్దము సమసించునపుడు సమాసము లీ క్రింది రూపము లందుచున్నవి—

---

1. అధ.కారి–అజంత–70. 2. బాల. సంధి–29
3. బాల ఉద్యో. – పుట 58; వ్యా.సం.స. – పుట 354.

పేద + ఆలు = పేదరాలు - రాగమము

ఈలువు + ఆలు=ఈలువుటాలు - టుగాగమము

మగని + ఆలు=మగనాలు - నాగమము

వెల + ఆలు=వెలయాలు - యడాగమము

ఇల్లు + ఆలు=ఇల్లాలు - ఉత్వసంధి

పెద్ద + ఆలు=పెద్దాలు - అత్వసంధి.

ఇట్లు 'ఆలు'శబ్దము సమాసోత్తరపదమగునపు డనేక రూపములను పొందు చున్నది- అని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ 'ఆలుప్రత్యయచరిత్ర'లో చెప్పినారు[1]. సర్వలక్షణసారసంగ్రహమున 'పురుటాలు, మగనాలు' పదము లకు భాగవత కాశీఖండములనుండి ప్రయోగములు చూపబడినవి. వానిని భారతే తరప్రయోగము లని నిరాకరింపవచ్చును. కాని, కేతనయే తన విజ్ఞానేశ్వర మున 'ఈలువుటా'లని ప్రయోగించినాడు[2].

శ్రీ నిడదవోలువా రింకను అందే ఇట్లు వ్రాసియున్నారు— 'రాలు' శబ్దమున శకటరేఫ మున్నదని తొలుత భాషాశాస్త్రజ్ఞుల దృష్టికి దెచ్చినవారు సుప్రసిద్ధ చారిత్రక భాషావేత్తలు శ్రీ కుందుర్తి ఈశ్వరదత్తుగారు (భారతి-జూన్, 1939). ఇంతవఱ కది ద్రావిడభాషాశాస్త్రజ్ఞులకు, వైయాకరణులకు నెఱుక పడలేదు. కేతన ఆంధ్రభాషాభూషణమున 'ఆలికిఱాలగు' ననియే సూత్రించి యున్నాడు[3]

ఇక కేతన ప్రయోగము నిట్లు సమర్థింపవచ్చును - 'ద్రావిడ భాషలో 'ఱ'కారము 'ట్ర' ఉచ్చారణ గలది. ఇట్టి ఱకారపదములు తెలుగున టకారముతో వెలయును. తేఱు - తేట, ఊఱు - ఊట మొదలగునవి. అప్పుడు 'ఈలువు + ఱు + ఆలు = ఈలువుఱాలు = ఈలువుటాలు'[4].

ఇట్లు కేతన తెలుగుభాషయందలి సంధిని వివరించినాడు :

---

1. 'వ్యాకరణములు - కవిప్రయోగసరళి.'

2. విజ్ఞా. - ఆ. - 115.

3, 4. 'వ్యాకరణములు - కవిప్రయోగసరళి.'

# 3. సమాస ప్రకరణము

'సమాస' పదమునకు కేతన ఇచ్చిన నిర్వచనమును విచారించుటకు, ముందా పదమునకు గల నైఘంటు కార్థములను, పూర్వలాక్షణికు లిచ్చిన యర్థమును, నిచ్చట పేర్కొనుట యప్రస్తుతము కాదు

సమాసపదమునకు మనువు 'సంక్షేప' మనియు, హేమచంద్రుడు 'ఏకపద' మనియు నర్థము చెప్పినారు. మేదినీకోశము 'సమర్థన' మనియు సంక్షేప' మనియు నర్థముల నిచ్చినది హలాయుధకోశము 'సమాహార మని యర్థము చెప్పినది.[1] సంక్షిప్తవ్యాకరణము సమాస మనగా 'నేకపదీకరణ' మనియు,[2] పాణినీయము 'సమర్థమైన పదవిధి' ("సమర్థః పదవిధిః")[3] అనియు లక్షణము చెప్పినవి. ఈ యర్థముల నన్నింటిని లెస్సగా విచారించితి మేని ఈ యన్నింటి యభిప్రాయము నొక్కటిగనే మనకు కనిపించును. సంక్షేప మన్నను, సమర్థన మన్నను, సమాహార మన్నను పృథక్పదముల కేకపదవభాసనమే యుద్దిష్టార్థము ఏకపదము, ఏకపదీకరణ మన్నవానిలో శాస్త్రీయముగ చెప్పుట మాత్రమే భేదము ఏకపదమనుటకంటె నేకపదీకరణ మనుట యుక్తతరముగ నున్నది. అభిప్రాయమునందు మాత్రము భేదము లేదు. పాణినీయలక్షణమునందు సామర్థ్య మనగా నేకార్థీభావము పృథక్పదముల కేకార్థీభావము సామర్థ్యము. ఇది మరికొంత ఎక్కువ కచ్చితముగా చెప్పబడిన లక్షణము. ఎందుచేత ననగా పదములకు ఏకీభావమనునది స్థూలముగా చెప్పిన మాట. సూక్ష్మముగా విచారించినచో సమాసమునందలి పదములకు పృథగవభాసము లేదనుటకు వీలులేదు. పదముల కేకీభావ మనగా నర్థముల కేకీభావ మనియే తాత్పర్యము చెప్పికొని సరిపెట్టుకొనవలయును. పాణినీయలక్షణము ఆ తాత్పర్యమును కచ్చితముగా చెప్పినది.

---

1. ఆం. భా. వి.—పుట 461.  2 ఆం భా వి —పుట 461.
3. అష్టా. 2–1–1

ఈ పై యర్థములు కాని, లక్షణములు కాని, సమాసమన్న పదమునకు జాగ్రత్తగా విచారించుటవలన లభించినవే కాని, నూత్నముగా తెచ్చిపెట్టినవి కావు. 'సమ్' అను నుపసర్గ పూర్వమందుగల 'అస్' ధాతువునకు భావార్థమున 'ఘఙ్'ప్రత్యయము చేర్చగా 'సమాస' పదము సిద్ధించును[1]. 'అస్' అనగా 'ఉండుట' 'సమ్' అనగా 'లెస్స' – లెస్సగా నుండుట యని సమాస పదమున కర్థము. లెస్సగానుండుట యన కలసిమెలసి యుండుట. ఈ కలసిమెలసియుండుటయే పైన అన్ని విధముల చెప్పబడినది.

ఇప్పుడు కేతన చెప్పిన లక్షణమును తీసికొందము. కేతన తన యర్థముల నేమియు తెచ్చిపెట్టలేదు క్రొత్తమాటలను వాడలేదు వట్టి శబ్దార్థమును మాత్రమే వివరించినాడు. సమాసశబ్దమునకు కలసిమెలసియుండుట యని గదా యర్థము. సరిగా దీనినే కేతన చెప్పినాడు-"మొదలిపదంబు విభక్తులం బుచ్చి మీఁదిపదంబుతోడ సమ్యక్సక్తంబు లగుటంజేసి సమాసంబులయ్యె" (ఆం. భా. భూ –109). ఇందు సమ్యక్సక్తంబు లనునది యసలు లక్షణము. మొదటి పదంబు విభక్తులం బుచ్చి మీదపదంబుతోడ – అనునది స్పష్టార్థప్రతిపత్తికొరకు చేసిన వివరణము. కాగా, కేతనలక్షణము 'పృథగ్భూతంబులగు పదంబులకు సమ్యక్సక్తి సమాసము' అని సిద్ధించుచున్నది ఈసమ్యక్సక్తిని ఏకపదీకరణ మనవచ్చును. అంతకంటె నేకార్థీభావప్రయుక్త మనవచ్చును. ఈ విధముగా కేతన పూర్వులు చెప్పిన యర్థముల నన్నియు తన లక్షణమునందు సంగ్రహించినట్లయినది.

కేతన తరువాత వచ్చిన విన్నకోట పెద్దన కూడ కేతన మార్గమునే యనుసరించెను[2]. అనంతుడు సమాసమును నిర్వచింపలేదు. వెంకటకవి యిచ్చిన నిర్వచనము మిక్కిలి యశాస్త్రీయముగ నున్నది – "మొదటిపదము తుదియక్షరమ్ముతో పెరనుడి మొదటియక్షరము గదియ నదికించిన సమాస మంద్రు."[3] ఈ మాట సంధివిషయమునగూడ సరిపోవును. సమాస విషయమున కుదరదు. అందుచేత అవ్యాప్త్యతివ్యాప్తిదోషములు రెండును పట్టినవి.

చింతామణియందు 'సమాసకము'ను గురించి చెప్పబడలేదు[4]. సమాసక మనగా కేవల వికృతిపదములతో గూడినది.

---

1 ఆం. భా. వి –పుట 461
2. కావ్యా చూడా. 9–21.
3 ఆం కా. – పుట 17,
4, ఆం. చిం. హలంత–42.

ఆధునికుడైన చిన్నయసూరి, పాణినీయము ననుసరించి "సమర్థంబు లగు పదంబు లేకపదంబు లగుట సమాసంబు" అని నిర్వచించినాడు[1].

ఈ సంస్కృతప్రక్రియ ఒక్క తెనుగునకే గాక యితర ద్రావిడ భాషలలోనికిని ప్రవేశించినది. అరవమున సమాసప్రక్రియ యున్నట్లు తొల్కాప్పియమున చెప్పబడినది అందు సమాసమునకు 'తొగై' యనునది సమానార్థకముగ వాడబడినది. ఇది 'తొగు' అను ద్రావిడధాతువునుండి యేర్పడినది. దీనికి 'కూడు, చేరు' అనియు, 'తొలగు, లోపించు' అనియు రెండర్థములును గలవు. తరువాతి వ్యాకర్తలు గొందఱు సంస్కృతమునందలి పేళ్ళనే యెత్తి 'తత్పురుషము, ద్వంద్వము' మొదలైన రూపములతోనే విభజించినారు[2]. కన్నడభాషయందలి వ్యాకర్తలు సంస్కృతమునందున్న ప్రణాళిక నట్లే యా పేళ్ళతోడనే గ్రహించిరి. కేశిరాజు తన శబ్దమణిదర్పణమున బహువ్రీహి, ద్వంద్వము, అవ్యయీభావము, క్రియా, గమకసమాసములను చెప్పినాడు. క్రియాసమాసము కన్నడములోనిదేయైనను, గమకసమాసము పేరు మాత్రము మార్చబడిన తత్పురుషసమాసము. సంస్కృతలాక్షణికులవలెనే కేశిరాజు కర్మధారయ ద్విగువులను తత్పురుష ద్విగువులుగ నిరూపించి, దానికి గమకసమాసమని పేరుపెట్టినాడు[3].

కేతన సమాసవిభజనము సంస్కృతవ్యాకరణరీతి ననుసరించియే చేసినను, సమాసనామములను సంస్కృతవ్యాకరణమునుబట్టి యథాతథముగ పేర్కొనలేదు. ఈ పేర్కొనకపోవుటలో మిక్కిలి గడుసుదనమును చూపినాడు. అది ముందుముందు వ్యాకరింతును.

ప్రాచీన సంస్కృతవ్యాకర్త లందఱును సమాసములు నాల్గు రకములుగ చెప్పినారు[4]-

'సమాస శ్చతుర్ధేతి ప్రాయో వాదః। అవ్యయీభావ తత్పురుష బహువ్రీహి ద్వంద్వాధికార బహిర్భూతానా మపి 'సహసుపా' ఇతి విధానాత్। పూర్వ

1. బాల. సమాస_1.
2. ఆం. భా. వి.—పుట 464
3. శబ్దమణి—165, 168.
4. వాచస్పత్యము-పుట 5234.

పదార్థప్రధానో అవ్యయీభావః । ఉత్తరపదార్థప్రధానో బహువ్రీహిః। ఉభయ పదార్థప్రధానో ద్వన్ద్వః॥'—అని పాణినీయము[1].

మఱి కేతన-"అవి పూర్వపదార్థ ప్రధానంబును, నుత్తరపదార్థ ప్రధానంబును, నన్యపదార్థ ప్రధానంబును, నుభయపదార్థ ప్రధానంబును, నసం జతుర్విధంబులై పర్తిల్లు" (ఆం. భా. భూ.—109) అని మాత్రము చెప్పినాడు. పాణినీయమునందలి యవ్యయీభావ తత్పురుష బహువ్రీహి ద్వంద్వము లన్న నామములను పేర్కొనలేదు. కాని యిచ్చిన యుదాహరణములు స్థూలముగ సమాసనామములకు సరిపోవును. ఈ స్థూలదృష్టితో జూచి, కొంతమంది కేతన తెలుగులో అవ్యయీభావసమాసమును చెప్పినా డని విమర్శించిరి. కేతన సమాస నామములను పేర్కొనుట చాల జాగ్రత్తగ పరిహరించినాడు. కేతన ఈ సందర్భమున నిచ్చిన యుదాహరణములను పరిశీలింతము. — ఆ యుదాహరణము లివి : పెడతల, క్రీగన్ను, నడురేయి, ఎడకాలు ఈ సమాసములు అవ్యయీభావము లగునా కావా యని విచారింపవలయును విచారించినచో వీనియం దవ్యయీభావలక్షణ మెంతవఱకు పట్టుచున్నదో యంతవఱకే కేతన వీనికి లక్షణము చెప్పినాడు. ఈ సందర్భమున అవ్యయీభావసమాసమున కున్న లక్షణము ఒక్క పూర్వపదార్థప్రధానమగుటయే కాదు అవ్యయీభావ సమాసము కూడ అవ్యయము కావలయును. అవ్యయీభావసమాసము మూడు విధములు. అవ్యయరహితమ్—పారేగంగం, ఆయతీగవం మొదలైనవి; అవ్యయ పూర్వపదమ్— అధిహరి, ఉపకృష్ణం మొదలైనవి, అవ్యయోత్తరపదమ్— శాకప్రతి, అక్షపరి మొదలైనవి[2]. ఈ మూడింటిలో మూడవదానియందు పూర్వపదప్రాధాన్యము లేదు. తక్కిన రెండును పూర్వపదప్రాధాన్యములే. ముద్విధములును అవ్యయములే. తెలుగునందు ఇట్టి అవ్యయీభావలక్షణము సంపూర్ణముగా పట్టునట్టి సమాసములు ఉన్నట్లు కన్పట్టవు. తెనుగుభాషలో పూర్వపదార్థప్రధానములైన సమాసములు లింగవచనవిభక్తులను స్వీకరించుచున్నవి. కాబట్టి వీని నవ్యయము లనుటకు వీలులేదు. అవ్యయీభావ సమాసమునకు అవ్యయమగుట ప్రధానలక్షణము కదా ! అట్టి లక్షణము తెలుగులో కన్పించుటలేదు. కేతన వీనిని అవ్యయీభావము లని చెప్పలేదు. కావున

1 అష్టా -1-1-2 వార్తికము. 2 శబ్దరత్నావళి-పుట-19.

కేతన చెప్పినది అవ్యయీభావలక్షణము కాదు. ఆ లక్షణము పాక్షికముగా గల సమాసములు కొన్ని తెనుగునందున్నవి. వానిని పూర్వపదార్థప్రధానము లని కేతన చాల గడుసుదనముతో చెప్పినాడు ఇచ్చట మఱియొక చిక్కున్నది. 'పెడతల' మొదలైన సమాసములలో పూర్వపదము అవ్యయమగునా, కాదా, యని కూడ ప్రశ్న. అది అవ్యయమనుటకు వీలున్నది, కాదనుటకు వీలున్నది. అందుచేత కేతన ఆ చర్చకు పోలేదు అతని యుద్దేశ్యము దిగ్దర్శకముగా భాషాస్వరూపమును జెప్పుట ఇట్టి సూక్ష్మచర్చలలోనికి దిగినచో పాఠకునకు లక్ష్యదృష్టి లోపించి లక్షణదృష్టి యేర్పడు నని కేతన భయము కావచ్చును. అందుచేత బాగుగా ఆలోచించియే కేతన సమాసనామములను పేర్కొనలేదని నా భావన. కేతన దృష్టి ఇట్టిది కాగా, కొంతమంది విమర్శకులు దీనిని విచారింపక తెలుగులో అవ్యయములే లేవని, కేతన 'పెడతల' మొదలైనవి అవ్యయీభావము లనుట ప్రామాదిక మని విమర్శించుచున్నారు[1]. తెలుగులో అవ్యయము లనేక ములు గలవు శత్రు తుమానంతర్య చేదావ్యర్థకంబులు, వలె ప్రభృతులు, క్త్వార్థకములు, ఆశ్చర్యార్ధకములు మొదలైనవన్నియు, వైయాకరణపరిభాషను బట్టి యవ్యయములే. తోడన్, తో, అంచు, లోన్ మొదలైన విభక్తిప్రతిరూప కములు కూడ అవ్యయములె. ఎల్లన్ మొదలైన విశేషములు కూడ అవ్య యములే. "ఎల్లన్ శబ్దము ద్రుతాంతమైన యవ్యయ" మని చిన్నయసూరి చెప్పెను[2]. అవ్యయీభావ సమాసము మాత్రము తెలుగులో నున్నట్లు కన్పిం చదు. మఱియు 'పెడతల' మొదలైన సమాసములను ప్రథమాతత్పురుష యగునని చెప్పుచున్నారు. కాని యది శాస్త్రీయము కాదు. ప్రథమాతత్పురుష ప్రమాణికుల యామోదము పొందినది కాదు. ఎందుచేత ననగా ద్వితీయాదులను వలె ప్రథమపదము నుద్దేశించి పాణిని తత్పురుషవిధానమును చేయలేదు. అందు చేత ప్రామాణికులు వీని 'నేకదేశసమాసము' లనినారు[3]. అవి యేకదేశసమాస మైనను, ప్రథమాతత్పురుషమైనను పూర్వపదార్థప్రధానము కాక మానదు. కేతన చెప్పిన దంతవఱకే. దానిని అవ్యయీభావ మన్నచో వచ్చు చిక్కు కేతన యెఱిగియున్నాడు కాబట్టియే యా మాటను పరిహరించినాడు.

---

1. ఆం భా. చ.—పుట 765; ఆం.భా వి.—పుట 473.
2. బాల సంధి—24 వృత్తి
3 శబ్దరత్నావళి—పుట 92.

ఉత్తరపదార్థ ప్రధానమైన సమాసములకు కేతన, 'చలిగాడ్పు, నల్లగలువలు' వంటి వాని నుదాహరించినాడు (ఆం. భా. భూ.—112). వీనియందు సమాసోత్తరపదములైన 'గాడ్పు, కలువలు' అనువానికే ప్రాధాన్యము. ఇవి తత్పురుషములైన కావచ్చు, లేదా కర్మధారములైన కావచ్చు. కావున ఆ భేదములోనికి జొరక 'ఉత్తరపదార్థప్రధానమైనవి' యని మాత్రము చెప్పి వదలి వేసినాడు కేతన.

తరువాత కేతన విశేష్యమునకు వెనుక విశేషణమును దెలుపుచోట ఆ విశేషణమునకు 'అని' యనునది వచ్చుననియు, లేనిచో నా పదము చివర నకారమల్లే యుండుననియు చెప్పి, 'నల్లని కన్నుగవ' యని యుదాహరించినాడు. (అం భా. భూ.—113). చింతామణ్యథర్వణ కారికలు దీనిని పేర్కొనలేదు. కాని చిన్నయసూరి "గుణవాచకంబు లగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు—" అని చెప్పినాడు.[1] సూరి యిట్లు చెప్పుటకు "అని యగు గుణి పిలుద" అను కేతన పద్యమే మూలము.

అన్యపదార్థప్రధానమైన సమాసములకు కేతన 'చలివెలుగు, నలువ మొదలగువాని నుదాహరించినాడు (ఆం. భా. భూ.—115). వీనికి—చల్లనివెలుగు గలవాడు చంద్రు డనియు, నాలుగు వదనములు గలవాడు బ్రహ్మ యనియు నన్వయము.

కేతన యిచ్చిన ఉదాహృతులలో 'ముచ్చెకంటి, ముక్కంటి, గట్టువిలుతుడు' ఇత్యాది సమాసాంతకార్యములు చేయబడినవియు నున్నవి. కేతన దిగ్దర్శకముగా వ్రాసినవాడగుటచే నిట్టి వానిని ప్రత్యేకముగ వివరింపక, యిట్టివి కూడ కలవని యుదాహరణములను మాత్ర మిచ్చి వదలివేసినాడు. చిన్నయసూరి "బహువ్రీహిని సమాసాంతకార్యంబులు గానంబడియెడి" యని చెప్పి, యుదాహరణములలో కేతన యిచ్చిన 'గట్టువిలుతుడు, ముక్కంటి,' యను వానినిగూడ చెప్పినాడు[2].

ఉభయపదార్థప్రధానమైన వానికి 'తల్లిదండ్రులు, అన్నదమ్ములు, కూడుకూరలు, ఆలుబిడ్డలు, ఎద్దుబండ్లు, బంటుజేడులు' ఆటపాటలు అనువాని

---

1 బాల. సమాస—12. 2. బాల సమాస—22.

నుదాహరించినాడు (ఆం. భా. భూ.—117). వీనిలో రెండు పదములకును ప్రాధాన్య ముండును. విన్నకోట పెద్దన దీనిని, సమాసములను గూర్చి చెప్పుచోట చెప్పక, మరొకచోట 'అత్తమామ, ఆలుమగలు, కొడుకుకోడలు' వంటి సమాసములును గలవు గాన నట్టివి కవులు తెలియవలయు నని చెప్పినాడు[1]. ఇట్లు కేతన పెద్దనలు రెండు పదములుగల సమాసములనే చెప్పినారు. కాని రెంటికన్న యెక్కువ పదము లుండు బహుపదద్వంద్వసమాసమును గూర్చి విచారింపలేదు. ఇది గ్రహించి యనంతుడు దానిని గూడ చెప్పినాడు [2] ఈ ద్వంద్వసమాసములందు, ఉత్తరపదాది పరుషమునకు గసడదావాదేశమును వచ్చుచున్నది. కాని దీనిని కేతన ప్రత్యేకముగా విధించలేదు. కేతన ప్రథమమీద క చ ట త ప లకు గసడదవాదేశమును విధించినాడు (ఆం. భా. భూ.—61). దాని నిచ్చట అధ్యాహారము చేసికొనవలయును.

కొన్నిచోట్ల 'అప్పాచెల్లెండ్రు' (నిర్వ రామా. 3—96), 'అన్నాదమ్ములు' (ఉ. హరి.) వంటి సమాసములలో పూర్వపదముపై దీర్ఘముసు కన్పట్టుచున్నది. దీనిని చెప్పిన పూర్వలాక్షణికులలో అనంతు డొక్కడే యున్నాడు[3]. సూరికూడ దీనిని చెప్పనేలేదు. ఇది గ్రహించి ప్రౌఢవ్యాకర్త దానిని వివరించినాడు[4].

తదనంతరము కేతన— 'తన, నా, నీ,' యను పదములకు హలాదు లతుకునప్పుడు అనువై యుండుటవలన 'దు' వర్ణకము వచ్చు నని చెప్పినాడు (ఆం. భా. భూ.—127). నన్నయ-నీదు భరము (ఆది. 1—274), నాదు రోదనము (ఆది. 2—269) అనువానిని భారతమున ప్రయోగించినాడు. కాని యాతడును దీనిని నిత్యముగా చేయలేదు. అందువలననే కేతన తన పద్యమున 'దుజ్ఞు నగున్' 'అనువై యునికిన్' అనువానిని చేర్చి దీనిని వైకల్పికముగనే విధించినాడు. చింతామణియందు "యుష్మదస్మ దాత్మభ్యో ద్వితివర్ణకః"— అని నిత్యముగా విధింపబడినది[5]. కాని చిన్నయసూరి మాత్రము "యుష్మదస్మ దాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాష నగు"— నని వైకల్పికముగా విధించినాడు[6] చింతామణి నిత్యముగ విధించినను సూరిమాత్రము దీనిని

1. కావ్యా. చూ. —5—141
2. ఛందో. 4—88.
3 ఛందో 4—40.
4 ప్రౌఢ.—సమాస—28.
5 ఆం చిం.—హలంత—27.
6. బాలసమాస-11.

విభాష చేయుటకు కేతన పద్యమే మూలము కొంతమంది పండితులు సూరియు చింతామణికర్తయు దీనికి యేకవచనబహువచనముల కని నిర్దేశించకపోవుటచే బహువచనమును గూడ గ్రహింపవచ్చునని తలంచుచున్నారు అప్పకవి 'తమదు కడ, తమదు పంచకములు' వంటి వానిని ప్రయోగించినాడు. కాని యవి అస్వాభావికములు[1]. ఇట్టి స్థలములలో ఈయబడిన ప్రయోగములను బట్టిసూత్రము నర్థము చేసికొనుట వైయాకరణ సంప్రదాయము. చింతామణి–బాలవ్యాకరణ ములు ఏకవచనముపైననే దుగామము చెప్పినవి. ఇట్టి చర్చలకు తావీయక 'తన, నా, నీ' శబ్దముల పైననే విధించుట కేతన ఔచిత్యము. ఈ దుగాగమ ప్రక్రియ సంస్కృతమున లేదు. తెలుగున కిది ప్రత్యేకమైనది దీనిని లక్షణబద్ధముగా రచించిన మొట్టమొదటి లాక్షణికుడు కేతన.

"రాచకొడుకు లెల్లఁ దమదు రాచఱికంబుల్" (హరి. పు. 2—172)
"మీరే మొద లెఱుగ రివియె మీదు విమర్శల్"(భోజ 5—302)-

ఈ ప్రయోగములను చూపించుచు పువ్వాడివారు తమ 'రమణీయము'న(పుట361 "బహుత్వమునుగూడ ఈ దుగాగమము వచ్చుటకు సూత్రమనుమతించినటులే కానవచ్చుచున్నది. బహుత్వమున కవిప్రయోగములు అరుదుగా కలవు"—అని వ్రాసిరి. కాని నన్నయ భారతమున నిట్టి ప్రయోగములు లేకపోవుటవలన కేతన తన పద్యమున నేకవచన విషయమునే చెప్పియుండు నని అనుకొనవచ్చును.

పెక్కు సంస్కృతశబ్దముల నొకచోట కూర్చి, వాని నొక తెలుగు పద మునకు విశేషణములుగా జేర్చి సమాసము గావించినచో, నా తెలుగుపదము మిగిలిన సంస్కృతపదము లన్నింటితోడను నన్వయించును—తన విశిష్టకులా చారధర్మము, తన జగద్గీత సాధువర్తనము (ఆం.భా.భూ.—129, 130). ఇట్లే 'నీ' యనునదియు సంస్కృతముతోడ సమాసించు నని మఱియొక పద్యమున చెప్పినాడు (ఆం.భా.భూ.—134). దీనిని పై పద్యమునందే యంతర్భవింపజేయ వచ్చును· ఇట్లు పునరుక్తముచేయుట అనవసరమనెడి తలంపుతోడనే కూచిమంచి తిమ్మకవి అన్నింటిని కలిపి చెప్పినాడు[2].

తరువాత కేతన సంస్కృతశబ్దములపై తెనుగు ఘటించిన 'దినకర

---

1 ఆం భా చ —పుట 763

2. సర్వలక్షణ.—పుట 101.

కొడుకు' 'అనిమిషమొదవు' ఇత్యాది సమాసములు వ్యాకరణవిరుద్ధము లని చెప్పి వానిని నిషేధించినాడు (ఆం.భా.భూ.—131). కేతన ననుసరించిన పెద్దన కూడ 'క్షీరావర్ణవకూతురు, సంసార్ణవయోడ' ఇత్యాది సమాసములను నిషేధించినాడు[1] కాని పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రమున 'ధర్మకవిలె' (పుట 140) వంటి ప్రయోగములు చేసినాడు[2].

మఱియొక పద్యమున కేతన పూర్వకవి సమ్మతమున నొక్కొకచో దెలుగుపదములపై సంస్కృతపదములు సమాసింపవచ్చు నని వ్రాసి 'వాడి మయూఖములు, వేడిపయోధారలు', అనువానిని ఉదాహరించినాడు. అథర్వణుడు బాలసరస్వతి మొదలగువారు దీనిని "ఆంధ్రం షడ్వర్ణపర్యంతం స్యాత్కర్మధారయే" (అధ కారి. హలంత-24) అను సూత్రముచే సమర్థించినారు కాని కేతన 'కఱకంఠ' శబ్దము నీ యుదాహరణములలో చేర్చు సందర్భమున మిక్కిలి గడుసుతనమును చూపినాడు. ఇచ్చట 'కఱకంఠనామ' మనుటచే ఁఱ కంఠు డను (నామము) పేరనియు, లేక కఱకంఠ మను నామవాచకమనియు నిరువిధములుగా గ్రహింపవచ్చును. కఱకంఠము అనునది కర్మధారయము కావున పై కారికతో సమర్థింపబడును. కాని కఱకంఠుడనునదే నన్నయ ప్రయోగము. కావున రెండును కలిసివచ్చునట్లు గడుసుగా 'కఱకంఠనామ' మని చెప్పినాడు కేతన.

**ఉపసంహారము**

ఈ సమాసప్రక్రియను తెనుగుభాషలోనికి సంస్కృతమునుండియే తెచ్చినను, తల్లక్షణానుగుణముగనే వివరించినాడు కేతన. కర్మధారయమునందలి నిగామము, బహువ్రీహియందలి సమాసాంతకార్యములు,ద్వంద్వసమాసమునందలి గసడదవాదేశము, యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబుపరంబగునపుడు దుగామము, తన—నా—నీ పదములతో సమాసప్రక్రియ, వైరిసమాసములు అనునవి తెలుగునకు ప్రత్యేకములు. తెనుగుభాషాసంప్రదాయమును బాగుగా నెఱిగి యా ప్రక్రియలను వివరించినాడు కేతన.

---

1. కావ్యా.చూడా.9—135.    2. బసవ. పీఠిక—పుటలు 97, 98.

# 4. విభక్తి ప్రకరణము

ఒక వాక్యములోని పదములకు సంబంధమును గూర్చి, ఆ వాక్యము నర్థవంతముగా జేయునవి విభక్తిప్రత్యయములు. ఈ విభక్తిప్రత్యయములు లేనిచో వాక్యము అర్థబోధకము కాదు గావున ప్రతిభాషయందును నివి యతిముఖ్యములైనవి.

ఇతరములైన ప్రక్రియలవలెనే నీ ప్రక్రియకూడ సంస్కృతమునుండియే ద్రావిడాంధ్ర భాషలలోనికి గైకొనబడినది. కేతనకు పూర్వుడైన నాగవర్మ తన కర్ణాటకభాషాభూషణమున పాణినీయము ననుసరించి యీ విభజనము గావించినాడు. కేతనకూడ పాణిని నాగవర్మల ననుసరించి అదేవిధముగ వివరించినాడు :—

1. ప్రాతిపదికార్థలింగపరిమాణవచన మాత్రే ప్రథమా (అష్టా 2—3—46)
   సంబోధనే చ (అష్టా. 2—3—47)
   విజ్ఞార్థవచన మాత్రే ప్రథమా(క.భా భూ.—76)
   సంబోధనే చ (క భా.భూ —77)
   చేయువాడు ప్రథమ (ఆం.భా.భూ.—67)
   సమ్ముఖంబున సేయునది ప్రథమ (ఆం.భా.భూ —67).
2. కర్మణి ద్వితీయా (అష్టా. 2—3—2)
   ద్వితీయా కర్మణి (క.భా.భూ.—78)
   చేయంబడినది ద్వితీయ (ఆం.భా.భూ.—67).
3. కర్తృ కరణయో స్తృతీయా (అష్టా. 1-3-26)
   కర్తృ కరణయో స్తృతీయా (క.భా.భూ.—80)
   ఉపకరణంబు తృతీయ (ఆం.భా.భూ.—67).
4. చతుర్థీ సంప్రదానే (అష్టా. 2-3-13)
   సంప్రదానే చతుర్థీ (క.భా.భూ.—82)

చేయించుకొనువాడు చతుర్థి (ఆం.భా భూ.—67).

5 అపాదానే పంచమీ (అష్టా. 2—3—33)
అపాదానే పంచమీ (క.భా.భూ.—86)
పాయుటకు న్పట్టయినది పంచమి (ఆం.భా భూ.—67).

6 షష్ఠ్యతసర్థ ప్రయత్నేన (అష్టా. 2—3—30)
స్వ స్వామి సంబంధే షష్ఠీ (క.భా.భూ.-87)
ఒడయండు షష్ఠి(ఆం.భా.భూ.—67).

7 సప్త మ్యధికరణే చ (అష్టా. 1—4—45)
అధికరణే సప్తమీ (క.భా.భూ.—88)
ఉనికిపట్టైనది సప్తమి (ఆం భా.భూ.—67).

దీనినిబట్టి సంస్కృతప్రక్రియయే కర్ణాట కాంధ్రభాషలలోనికి ప్రవేశించిన దని స్పష్టమగుచున్నది.

**విభక్తి ప్రత్యయములు**

క్రీ.శ 6వ శతాబ్దమునుండి కన్పట్టుచున్న ఆంధ్రభాషయందును ఈ విభక్తిప్రత్యయము లున్నట్లు శాసనములు ప్రమాణములుగా నున్నవి. నన్నయకు పూర్వపు శాసనములో నీ క్రింది విభక్తిప్రత్యయములు గన్పట్టుచున్నవి[1].

ప్రథమా డు, ము, వు, లు
ద్వితీయా : ని
తృతీయా : తోడ, తో, న
చతుర్థీ · కై, కి, కు
పంచమీ : వలన, ఉణ్డి
షష్ఠీ : అ, లోన్, లోపల
సప్తమీ . ఉన్, న, అన్దు.

ఈ పై విభక్తులలో ప్రథమావిభక్తిప్రత్యయమైన 'డు' 6, 7, 8 శతాబ్దుల శాసనములలో 'న్డు' అను రూపమునను, 8, 9 శతాబ్దులలో 'ణ్డు' అనియును,

1 ప్రా. యు.—పుటలు 201...224.

10, 11 శతాబ్దులలో 'ణ్డు, ండు, డు' అనియును గనవచ్చుచున్నది. కావున 'ణ్టు' అనునదే చాలమార్పులు చెంది 'డు'గా మారినది[1].

ఇట్లే 'ము'యొక్క ప్రాచీనతమ రూపము 'బు' అనునది. అది 6వ శతాబ్దికి 'మ్బు, ంబు' అను రూపములను దాల్చినది. 9వ శతాబ్ది తరువాత 'మ్బు' అను రూపము సమీకరణముచే 'మ్ము' అను రూపముగా మాఱినది మఱికొంత కాలమునకు 'మ్ము' లోని ద్విత్వము పోయి వట్టి 'ము' అను రూప మేర్పడినది[2].

'వు' వర్ణకము శాసనములలో 'సాసనవు, అచ్చెర్వు' అను రూపములందు గన్పట్టుచున్నది. ఇందలి 'వు' వర్ణకమే కాలాంతరమున విభక్తిప్రత్యయముగా మారినది[3]

ప్రథమాబహువచన ప్రత్యయమైన 'లు' ప్రత్యయము తమిళ కన్నడము లందు 'కళ్' అను రూపమున గన్పట్టుచున్నది. ఈ 'కళ్' ప్రత్యయమే 5వ శతాబ్దియందలి చిక్కుళ్ళశాసనములోని 'విజయరాజ్యసంవత్సరంబుళ్' అను పదములో 'ళ్' అను రూపమును పొందినది. తరువాత 'ళు, లు' అని మారినది[4].

ఇట్లు శాసనములందు గన్పట్టుచున్న విభక్తిప్రత్యయములను నన్నయ తన భారతమున నించుక మార్పుతో ప్రవేశపెట్టినాడు[5]—

ప్రథమా డు, ము. వు, లు
ద్వితీయా : న్, గుఱించి
తృతీయా : చేత, చే, తోడ, తో, మెయిన్
చతుర్థీ : కై, పొంటెన్, తదర్థము
పంచమీ : వలన, కంటె, కోలెన్, కృతమున
షష్ఠీ : (సంబంధార్థమున) అ, ఇ, న వర్ణకములు
సప్తమీ : అందు, నన్.

1 ప్రా. యు.—పుట 203.
2. ప్రా. యు.—పుట 205.
3. ప్రా. యు.—పుట 208.
4. ప్రా. యు.—పుట 190.
5. న. భా.— పుటలు 826, 841.

(9)

కేతన కూడ తన వ్యాకరణమున నిట్టి ప్రణాళికనే యొకదానిని పేర్కొని నాడు (ఆం.భా.భూ –57...99). కాని అది సమగ్రమైన దని చెప్పుటకు వీలు లేదు శాసనములందును, నన్నయ భారతభాగమునను గన్పట్టు కొన్ని ప్రత్యయములను కేతన గ్రహింపనే లేదు.

కేతన ఈ క్రింది విభక్తులను జెప్పినాడు-
ప్రథమ డు, ము, వు, లు
ద్వితీయా . ని, న (జడవాచకమునకు విభక్తిలోపము)
తృతీయా చేత, న
చతుర్థీ : కు, కి
పంచమీ : వలన
షష్ఠీ : (సంబంధార్థ) 'ఉ, అ' వర్ణకములు
సప్తమీ · అందు.

కేతన పేర్కొనిన విభక్తిప్రత్యయములలో శాసనములలో గన్పట్టుచున్న 'కై, ఉణ్ణి, అన్, న' వంటి ప్రత్యయములును, నన్నయభాషలో కన్పట్టుచున్న 'గుఱిచి, మెయి, పొంటె, తదర్థము, కొలెన్, కంటె, న' వంటి ప్రత్యయములును, వదలిపెట్టబడినవి. కావున కేతన యిచ్చిన ప్రణాళిక అసంపూర్ణమైనదే యని విశదమగుచున్నది.

**కేతన విభక్తి నిరూపణము**

ఈ విభక్తినిరూపణమునకు మొట్టమొదటి ప్రథమావిభక్తి వివరముగా చెప్పబడినది. ఆంధ్రభాషాభూషణప్రారంభమున తత్సమపదములను తెలుగుగాచించు పద్ధతి నెఱింగించుసందర్భముననే, సంస్కృతనామములపై ప్రథమైకవచన ప్రత్యయములగు 'డు,ము,వు,లు' చేరు పద్ధతిని వివరముగా చెప్పుటచే కేతన తిరిగి దానిని పునరుక్తముచేయక, ఏకవచనములపై బహువచనములు చేరు పద్ధతిని వివరించినాడు (ఆం భా.భూ.-30...40). ఇట్టి వానికి నన్నయ ప్రయోగములే మూలములుగా గన్పట్టుచున్నవి.

1. పలుకు, నెల, తల, చిలుక, ఇత్యాది పదములకు బహువచనమున 'లు' వర్ణకము వచ్చి పలుకులు, నెలలు, తలలు, చిలుకలు వంటి రూపము లేర్పడును (ఆం. భా. భూ._69).

నన్నయ : పలుకులు (ఆది. 8–21).

2. అనఘుడు, బలవంతుడు ఇత్యాది పదములలో ఏకవచన ప్రత్యయమైన 'డు' వర్ణకమును త్రోసి 'లు' వర్ణకము వచ్చుచుండుటచే 'అనఘులు, బలవంతులు' వంటి రూపము లేర్పడును (ఆం. భా. భూ –70).

నన్నయ : పొంచవులు (ఆది. 3–21).

3 'లు' వర్ణము అంతమందుగల పదములకు బహువచనమున 'రు' వర్ణకము వచ్చి వారలురు, మహీపాలురు, దయాళురు[1] వంటి రూపము లేర్పడును (ఆం. భా. భూ._71)

నన్నయ . నృపాలురు (అర. 2_43), అల్లురు (ఆది. 8–53). ఈ 'రు' వర్ణక విషయమున చిన్నయసూరి తత్సమములకు వేఱుగ (బాల. తత్సమ_39), అచ్చికములకు వేఱుగ (బాల. అచ్చిక–5), బహువచనమున విధించినాడు. కేతన ప్రక్రియ ఇంతకంటె సులువైనది, మఱియు విశాలమైనది.

4. వీడు, కాడు, వాడు అను పదములకు బహువచనమున 'ం్రడు' అనునది వచ్చును (ఆం భా. భూ._71).

నన్నయ : పెక్కండ్రు (ఆది 2–25). అంతేకాక ఇట్టి బహువచనములపై మఱియొక బహువచనప్రత్యయమువచ్చిన పెక్కండ్రురు (ఆది.8-25) అనుదానిని గూడ నన్నయ ప్రయోగించినాడు కాని కేతన వీనిని గ్రహింపలేదు.

5. కొఱను, వలను, కొలను, మ్రాను, కెలను వంటి పదములకు బహువచనమున వీని చివరి 'ను' లకు 'కులు' అగును (ఆం.భా.భూ.–72,73).

నన్నయ : కెలను (ఆది. 2–194) — కెలంకులు (అర. 3–297).
కొలను (ఆది. 5–67) — కొలంకులు (అర. 3–270).
వలను (ఆది. 2–13) — వలంకులు (అర. 4–135).
మ్రాను (సభా.2–144) — మ్రాకులు (సభా. 2–41).

1. ఈ శబ్దమును సూరికూడ చెప్పినాడు. కాని దీనికి కవి ప్రయోగము లేదని శ్రీ వజ్ఝలవారు తమ 'బాలవ్యాకరణోద్ద్యోతము'న వ్రాసినారు.

చిన్నయసూరి "కలన్వాదుల నువర్ణకంబునకు కుజ్జగు, బహువచనంబు పరం బగునపుడు నిత్యముగా నగు" (బాల. ఆచ్ఛిక–13) అని యేకవచనములకు కూడ కుజ్ఝు విధించినాడు ఇట్టివి నన్నయ భారతమున కానవచ్చుటలేదు కావున కేతన బహువచనములకే దీనిని విధించినాడు.

6. ఇల్లు, కల్లు, ముల్లు, పల్లు, విల్లు అను పదములకు బహువచనమున ఇండ్లు, కండ్లు, ముండ్లు, పండ్లు, విండ్లు అని యగును (ఆం భా భూ -74)

నన్నయ ఇండ్లు (ఆది. 4-64); కండ్లు (ఆది. 6-160), విండ్లు (ఆర. 1-300)

7. పేను, చేను, మీను వంటి శబ్దములు బహువచనమున పేలు, చేలు, మీలు అనియు; చేయి, వాయి, నేయి వంటి పదములు, చేతులు, వాతులు అనియు, రాయి, రేయి, వేయి యను పదములు రాలు, రేలు, వేలు అనియు నగును (ఆం.భా భూ.—75, 76).

నన్నయ : చేతులు (సభా. 2—57), వాలు (ఆది. 5—115), రేలు (ఆది. 2- 152).

నన్నయ వాళ్ళు (ఆది 6—173) అనునది కూడ సాధువుగ పరిగణించినను చిన్నయసూరి దానిని గ్రహింపలేదు. శ్రీ దూసివారును, శ్రీ కల్లూరివారును అట్టి ప్రయోగములు అలాక్షణికములనియే నిరసించియున్నారు[1].

8. 'రు, లు, డు, డి' లు అంతమందుగల పదములకు 'ళ'వర్ణకము వచ్చి 'గోళ్లు, వేళ్లు, గూళ్లు, లేళ్ళు'వంటి రూపము లేర్పడును (ఆం.భా.భూ._77). నన్నయ–కన్నీళ్ళు (ఆది.6–259), రెన్నాళ్ళు (ఆది. 1_68) వంటి వానిని ప్రయోగించియున్నాడు. కాని శ్రీ గంటిజోగి సోమయాజిగారు 'ళ' వర్ణాంత రూపములు నన్నయ కంగీకారములు కావని తమ 'ఆంధ్రభాషా వికాసము'న చెప్పియున్నారు[2]. ఇట్లే శ్రీవజ్ఝలవారు అలఘులకార రూపములను నిరసించిరి[3]. సంస్కృతభాషలోవలెనే తెలుగున గూడ 'ల, ళ' లకు భేద మపసరము లేదని వారి యుద్దేశ్యము. కాని తెలుగునం దీ రెంటికిని భేదమున్నది. "ఆద్యాయాః

1. బాల ఆచ్ఛిక–21 పేటికా, బా.గు. ప్ర వ్యాఖ్యలు
2. ఆం. భా. వి.-పుట 403. 3 వ్యా. సం స పుట-736

పంచాశ ప్రశ్నాః" అను సూత్రము వద్ద "నళస్యవర్ణాంతరత్వం వక్తుం శక్యతే"[1] అని అహోబలుడు వివరించినాడు. అదియునుగాక అలసులకార యుత రూపములు నన్నయకును అంగీకారములే యని యాతని ప్రయోగముల వలననే స్పష్టము. కేతన వానిని వివరించినాడు

9. ఇకారాంతరపదములు, బహువచనము నొందినపుడు వాని చివరి 'ఇ'కారము 'ఉ'కారమై, మునులు, సుదతులు, సఖులు వంటి రూపము లేర్పడును (ఆం. భా. భూ.-78).

నన్నయ : దాసులు (ఆది. 1-145, 151)

10. చెలియలు, ఆలు, మఱదలు, కోడలు ఇత్యాది పదములకు బహువచనమున 'ండ్రు' అనునది వచ్చును (ఆం భా. భూ.-80). నన్నయ భారతమున 'కోడండ్రు' (సభా. 2-159), 'మఱదండ్రు' (ఆది 1-216) వంటి ప్రయోగములే కాక, వానిపై మఱియొక బహువచన ప్రత్యయమును వచ్చిన 'కోడండ్రును' (సభా 2-257) వంటివియు గలవు. కాని కేతన వీనిని గ్రహింపలేదు.

11. తెమ్మెరలు, నీళ్ళు, గోధుమలు, వడ్లు, జొన్నలు, కొఱ్ఱలు, ఆళ్ళు, చోళ్ళు, అనుములు, పెసలు వంటివి నిత్యబహువచనములని కేతన (ఆం భా. భూ -79) నన్నయ భారతమున 'నీళ్ళు' అను బహువచన వాచకముపై మఱి యొక బహువచనమును వచ్చిన పదములును గలవు-నీళ్ళులలోన్ (ఆది. 4-96).

12 కేతన జడవాచకముల ద్వితీయకు ప్రథమ బహుళముగా నగు నని చెప్పినాడు (ఆం భా. భూ.-81). ఇది నన్నయకు బూర్వమే తెలుగున స్థిరపడిన ప్రక్రియ. కలమళ్ళ శాసనములోని 'రేనాణ్డు ఏళన్' అనుచోటను, దొంగలసాని కడుమశాసనములోని 'పట్టంబుగట్టిన' అనుచోటను, కొఱవి శాసనములోని 'శిలాస్తంభంబు ప్రతిష్ఠించి' యనుచోటను ద్వితీయకు ప్రథమయే కన్పట్టు చున్నది. దీనిని నన్నయ యంగీకరించి భారతమున పలుతావుల ప్రయోగించి యున్నాడు—"చారుతరమహాగ్రహారంబు లిచ్చుచు" (ఆది. 1-7), 'విల్లు గొని' (ఆది. 8-86). అంతేకాక నన్నయ ప్రాణివాచక ద్వితీయకు గూడ ప్రథమ

1 అహోబల-పుట 119.

వాడినాడు — "అమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱించిన పరికాడు వోలె" (ఆది. 4-206). కేతన దీనిని గ్రహింపలేదు. అర్వాచీనలాక్షణికు దగు సూరి కూడ దీనిని గ్రహింపలేదు[1].

13. తదనంతరము కేతన తత్సమపదాంతంబులగు సప్తవిభక్తులందు నేకవచన బహువచనములు వచ్చు తెఱంగెఱింగించుచు, నవి డుజ్జంత, ముజ్జంత, లాంత, ర్యంతముల కెట్లువచ్చునో వివరించినాడు (ఆం భా.భూ.—57...99)

14. 'ట, డ, ర, ల' లు జడ్డలైనయెడల ఒక్కొక్క మాత్రగను, అవి విడిపోవునెడల రెండు మాత్రలుగను లెక్కకువచ్చును · బంట్లు - బంటులు; బండ్లు — బండులు (ఆం.భా.భూ.—98).

నన్నయ . ఇండ్లు (ఆది. 2—132), ఇండులు (ఆది. 6-194). చిన్నయసూరి "బహువచనంబు పరంబడునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" నని సూత్రించినాడు[2]. చింతామణియందు "డలటాముదితాంతస్యచ వా లుక్" అను సూత్రమున రేఫము వదలిపెట్టబడినది. సూరి తన సూత్రమున రేఫను గూడ కలుపుట కేతన ననుసరించియే అని చెప్పక తప్పదు.

15. 'కూతురు'శబ్దము రుకారాంతము. దానిపై విభక్తిచేరినప్పు డందలి 'రు'వర్ణకము లోపించునని కేతన చెప్పినాడు (ఆం.భా.భూ.—99).

నన్నయ : కూఁతు గాంధారి (ఆది. 5-7) | విభక్తి
వృషపర్వుని కూతురు (ఆది. 3—169) | చేరనప్పుడు
దాది కూతు బంచె (ఆది. 4-233)-విభక్తి చేరినప్పుడు.

16. (1) సంబోధనమున ఉకారము ఇకారమును, కొన్నిచోట్ల దీర్ఘము నగును : సుతుడు – సుతుడ ! – సుతుడా !

(2) ఇకారాంతము ఈకారాంత మగును : సుదతి - సుదతీ !

(3) బహువచనమున సంబోధనమున 'ఆర'గాగమము నగును. అది దీర్ఘాంతమగును .
హితకరులు - హితకరులార ! - హితకరులారా !

---

1. బాల. కారక-24    2 బాల. ఆచ్ఛిక-12.

(1) సంబోధన తత్సమపదమం దొక్కొక్క సమయమున 'డు' వర్ణకము కన్పట్టును : ఓ పురుషోత్తమ_ఓ పురుషోత్తముడా! అని సంబోధన ప్రథమావిభక్తి రూపములను చెప్పినాడు కేతన (ఆం.భా.భూ. 100...103).

చిన్నయసూరి "ఓ యామంత్రణంబునం దగు" ఇత్యాది సూత్రములలో కేతన చెప్పిన రూపముల నన్నింటిని సాధించినాడు 'ఓ' యనునది ఆంధ్రశబ్ద చింతామణియందుగాని, అథర్వణ కారికావళియందుగాని చెప్పబడలేదు నన్నయ భారతమునను నిది లేదు[1]. చిన్నయసూరి ఈ విషయమున కేతన ననుసరించె ననక తప్పదు.

17. అనంతరము కేతన సర్వనామములను జెప్పి వానిపై విభక్తులు వచ్చు పద్ధతిని వివరించినాడు (ఆం.భా.భూ -104...105). ఇవి నన్నయ భారతమున యథాతథముగ ననేక పర్యాయములు ప్రయోగింపబడినవి. వాని సంఖ్యకూడ 'ఆంధ్రభాషాచరిత్ర' ఆధారముగ నీయబడుచున్నది[2].

| అస్మదర్థకము | | యుష్మదర్థకము | |
|---|---|---|---|
| ఏను | — 329 | నీవు | — 202 |
| ఏము | — 47 | మీరు | — 57 |
| నన్ను | — 65 | నిన్ను | — 43 |
| మమ్ము | — 12 | మిమ్ము | — 15 |
| నాచేత | — 3 | నీచేత | — 7 |
| నాకున్ | - - | నీకున్ | — 85 |
| నావలన్ | — 1 | నీవలన్ | — 4 |
| నాయొక్క | —230 | నీయొక్క | — 316 |
| మాచేత | — 1 | మీచేత | — 2 |
| మాకున్ | — 80 | మీకున్ | — |
| మావలనన్ | — | మీవలనన్ | — |
| మాయొక్క | — 53 | మీయొక్క | — 84 |

ఇట్లు కేతన ఈ విభక్తిప్రక్రియను తెలుగుభాష కనుగుణముగను నాటి భాషకు చాలవఱకు విస్తరించునట్లుగను రచించినాడు.

1. న భా. పుట 841.   2. ఆం.భా చ —పుటలు 1403, 1404.

# 5. క్రియా ప్రకరణము

సంధి, సమాస, విభక్తి ఇత్యాది పారిభాషికపదములవలె నీ క్రియ యనునది సంస్కృతమునుండి కాని, ద్రావిడభాషలనుండి కాని, తెనుగునకు వచ్చినట్లు కన్పించదు.

పాణిని క్రియాప్రకరణమును 'తిఙంతప్రకరణ' మనినాడు. నిరుక్తము నందు 'నామాఖ్యాతోపసర్గనిపాతము' లని శబ్దములు నాల్గువిధములుగ విభజింప బడినవి. ఇందలి ఆఖ్యాతము క్రియారూప బోధకమే.

కన్నడ వ్యాకర్తలగు నాగవర్మ, కేశిరాజులు సంస్కృతవ్యాకరణాను సారులై తత్ సమ సంజ్ఞలనే వాడినారు. తెనుగులోని క్రియాపరిచ్ఛేద మనునది కన్నడమున 'అఖ్యాతవిధానము లేక అఖ్యాతప్రకరణము' అని చెప్పబడినది. అంతేకాక పాణినీయమునందువలె ధాతులక్షణము, ధాతుపరిగణనము మొదలగు నవి, ఆంధ్రవ్యాకరణములందు చేయబడలేదు. కాని కేశిరాజు తన శబ్దమణి దర్పణమున ఈ విభజనము గావించినాడు.

అరవవైయాకరణు లీవిషయమున కొంత స్వతంత్రమార్గమునవలంబించి నారు. వారు 'వినై' యను పదమును క్రియాబోధకముగ వాడినారు కాని దానిని కూడ వారు నిర్వచించిన ట్లగుపడదు. తొల్కాప్పియనారు 'ఉరుచ్చొల్' అను పదమును 'ధాతువు' అను నర్థమున వాడిన ట్లూహింపబడినది ఇట్లు అరవ లాక్షణికు లెవ్వరును కన్నడలాక్షణికుల వలె సంస్కృతసంజ్ఞలను యథాతథముగ గ్రహింపలేదు. చింతామణ్యథర్వణకారికావళులలో 'క్రియాపరిచ్ఛేద' మనియే యున్నది. చిన్నయసూరియు క్రియాప్రకరణ మనియే వ్యవహరించినాడు.

చింతామణియందు క్రియలు ఉపకృతి పరిణితి సంవృతి భేదములచే త్రివిధము లని చెప్పబడినది[1]. కాని యీ విభజనమును తరువాతి లాక్షణికు లెవ్వరును అనుసరింపలేదు.

---

1 ఆం. చిం క్రియా–1.

కేతన ప్రథమ మధ్య మోత్తమపురుషులు చేసిన క్రియలు, నానావిధము లైన మాటలు, భూత వర్తమాన భవిష్యత్కాలముల జేరి వర్తిల్లుచుండు నని చెప్పినాడు (ఆం భా.భూ.—133). పెద్దన, యనంతుడు మొదలగువారు కేతననే యనుసరించినారు[1] చిన్నయసూరి యీ సందర్భమున చింతామణి ననుసరింపక కేతన లక్షణము ననుసరించియే చెప్పినాడు[2].

### కేతన క్రియా నిరూపణము

కేతన భూత భవిష్య ద్వర్తమానకాలములను, వానికి చేరు ప్రత్యయము లను, ఇంటుగాగము— ఇయుడాగమములను, ప్రేరణార్థక—ప్రశ్నార్థక—క్త్వార్థక— వ్యతిరేకార్థక—చేదర్థక—విధ్యర్థక-అశీరాద్యర్థకములను, మఱికొన్ని విశేష ములను వివరించినాడు నన్నయకు పూర్వపు శాసనములలో నివి గలవు. వీనిని నన్నయ గ్రహించి తన భారతమున వాడియున్నాడు. వీనినే కేతన తన వ్యాకరణమునందు చెప్పియున్నాడు.

### 1. సమాపక క్రియలు

కేతన ఈ క్రింది ప్రత్యయములను ప్రథమ మధ్య మోత్తమపురుషులకు ఏకవచన బహువచనములందు భూత వర్తమాన భవిష్యత్కాలములకు విధించి నాడు (ఆం భా భూ.- 110...145).

**1. భూతకాలము :**

| | ఏక. | | బహు. |
|---|---|---|---|
| ప్రథమ : | ఎను | — | ఇరి |
| మధ్యమ | తివి, తి | — | తిరి |
| ఉత్తమ : | తిని | — | తిమి |

**2. వర్తమానకాలము :**

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | చును | — | దరు |
| మధ్యమ · | దు, దవు | — | దరు |
| ఉత్తమ . | దను | — | దము |

1 కావ్యా. చూడా 9—145; ఛందో. 4—119. 2. బాల. క్రియా.—11.

3. భవిష్యత్కాలము :

| | | | |
|---|---|---|---|
| ప్రథమ : | డును | — | దురు |
| మధ్యమ : | దువు | — | దురు |
| ఉత్తమ : | దను | — | దము |

పీనికి కేతన యిచ్చిన యుదాహరణములను పరిశీలించినచో వర్తమానకాలము నకును భవిష్యత్కాలమునకును భేదము గోచరింపదు. అంతేకాక అవి తద్ధర్మ-ఆశీరర్థకములతోడను దగ్గఱ సామ్యమును గల్గియున్నవి. ఇట్టి యభేదము నన్నయకు పూర్వశాసనములలో నెక్కువగా గన్పట్టును[1]. వర్తమాన కాలప్రత్యయములుగా పేర్కొనినవి నన్నయభారతమున నున్నవి గాని, యవియు భవిష్యదర్థస్ఫోరకములుగనే కన్పట్టుచున్నవి[2]. భూతకాల విషయ మున మాత్రము భేద మేమియు గోచరింపదు. కాని యిట్టి రూపములకంటెను, క్రియాజన్యవిశేషణములపై సర్వనామములను జేర్చుటవలన కల్గిన భూత భవిష్య ద్వర్తమాన క్రియారూపములను నన్నయ బహుళముగ వాడినాడు[3]. ఇట్టివి నన్నయకు పూర్వశాసనములలో గూడ నున్నవి- ఱిచ్చినవాన్డు (ఇందుకూరు శాస), రక్షించిన వానికి (నలజానంపాడు శాస). ఇట్టి ప్రయో గములలో భూతకాల క్రియాజన్యవిశేషకమైన 'ఇన' ప్రత్యయము కన్పట్టు చున్నది. ఇట్లే నన్నయ భారతమున 'వచ్చినవాడవు' ఇత్యాది ప్రయోగము లలోగూడ 'ఇన' యనునదే క్రియాజన్య విశేషకరూపముగా కన్పట్టుచున్నది. అందువలననే కర్త, కర్మ, క్రియలయందు 'ఇన' యనునది భూతార్థమును తెలుపు నని చెప్పి, 'పండినవాడు, పొడిచినవాడు' అనువాని నుదాహరించినాడు కేతన (ఆం.భా భూ.—179).

ఇట్లు 'ఇన' ప్రత్యయము అనుప్రయుక్తమైనపుడు దానికి ఉత్తరపద మైన తచ్ఛబ్దమునందలి 'వ'కారమునకు లోపము కల్గి 'కనినాడు' వంటి రూపము లేర్పడుచునవి[4]. అందువలన 'కనినాడు—కన్నాడు' అను రెండు రూపములను గల్గుచున్నవి.

తరువాత కేతన స్థావర తిర్యక్కుల క్రియాపదములకు బహువచనము నకు బదులు ఏకవచనమును, దేవ మనుష్యాది క్రియలు ఏకవచన బహువచనము

---

1. ప్రా యు —పుట 258. 2. ఆం.భా చ. -పుటలు 1493, 1494.
3. న. భా -857... 859. 4. ప్రా యు.-పుట 260

లను పొందు నని చెప్పినాడు (ఆం భా. భూ.–146, 147). పెద్దన, తిమ్మ కవి, సూరకవి, చిన్నయసూరి మొదలగు వారందరును దీనిని చెప్పినారు[1].

ఇట్లు కొన్ని సమాపకక్రియలను జెప్పిన తరువాత కేతన అసమాపక క్రియలనుగూడ కొన్నింటిని చెప్పినాడు

## 2. అసమాపక క్రియలు

1. 'ఉట' అనునది అంతమందుగల పదములు క్రియ లగును (ఆం. భా. భూ –148). చిన్నయసూరికూడ – "టవర్ణకంబు భావంబునందగు–భావం బనగా ధాత్వర్థంబు"–అని చెప్పి, ట వర్ణాంతధాతువులను చెప్పినాడు నన్నయ– అగుటయున్ (ఆది 2–154), చెప్పుటయున్ (ఆది. 1- 33) వంటి వానిని ప్రయోగించినాడు.

2 ప్రేరణంబున 'చుట' అనునది క్రియలచివర చేరును–పలికించుట, తలపించుట (ఆం. భా. భూ.–149). నన్నయకు పూర్వపు శాసనములలో – ఎత్తిఞ్చి, కట్టిఞ్చి (యుద్ధమల్లుని బెజ శాస.), కాలిఞ్చి (అద్దంకి శాస.) వంటి ప్రయోగములు గలవు. నన్నయ – క్రమ్మరించెన్ (ఆది. 4–206) వంటి ప్రేరణార్థకములను ప్రయోగించియున్నాడు.

ఈ 'ఇంచు'గాగమమునకు బదులు కొన్నిచోట్ల 'ఇయుంచుట' (ఇయుడా గమము) అనునదియు వచ్చును: వరించుట–వరియించుట (ఆం.భా.భూ.–150). కేతన దానిని సంస్కృతధాతువులపైన విధించగా, సూరి దీనిని 'నగించు'వంటి తెలుగు ధాతువులపైనకూడ విధించినాడు[2]. నన్నయలో తెనుగు ధాతువులమీద ఇయుడాగమము కన్పట్టదు. కేతనచూపిన యుదాహరణములుకూడ సంస్కృత ధాతువులపైన కలిగినవే యగుట గమనార్హము. నన్నయ–స్తుతియించి (ఆది. 1–113, సభా. 2-2), వధియించి (సభా. 1–203) వంటివానిని ప్రయోగించి నాడు. ఇట్లే 'ఇయుంచుట' చేరిన రూపములు అసమస్తలఘుద్వ్యక్షరముల పైననేకాక, చతురక్షరములపైనకూడ కన్పట్టుచుండుటచే గాబోలు, అడిదము సూరకవి తన 'కవిసంశయవిచ్ఛేదము'న–"ఆంధ్రభాషాభూషణకారుడు సమస్త

---

1. కావ్య. చూడా. 9–162; సర్వలక్షణ–106,108; కవిసంశయ – 1-90; బాల.క్రియా –25.

2. బాల. క్రియా–50.

లఘుద్వ్యక్షరములమీదగాని వికల్పము పుట్టదన్నాడు. చతురక్షరములమీద నుండవచ్చు" నని చెప్పి 'ప్రతిఘటియించె' (శృ. నై.—4 ఆ) అను ప్రయోగము నుదాహరించినాడు[1]. ఇట్టి ప్రయోగములు తనకాలమునాటికి లేకపోవుటచే కేతన దీనిని ద్వ్యక్షరధాతువులకే నిర్దేశించినాడు.

3. ప్రార్థనమునందుకు, ప్రశ్నార్థమునందును, సంశయము చోటను, నిశ్చయార్థమందును, దూషణార్థమందును, 'ఏ' వర్ణకంబును, సంశయాత్మక మైనచోట్ల 'ఒ, ఓ' లను వచ్చునని కేతన చెప్పినాడు (ఆం.భా.భూ.—153, 154). నన్నయభారతమున — చిత్తశాంతి యొనర్పవే (ఆది. 1—150), నియోగించిరే, అరుగునో, తలంచిరో వంటి ప్రయోగము లున్నవి[2].

4. 'ఏఁగు' వంటి పదములకు 'తెంచు' అనునది అనుప్రయుక్తమై 'అరుగుదెంచు, ఏతెంచు' అని యేర్పడును (ఆం.భా.భూ.—155) నన్నయకు పూర్వశాసనములలో — అరుగుదెంచు, తో తెంచు, ఏగుదెంచు వంటి ప్రయోగము లున్నవి[3]. నన్నయకూడ — పుత్తెంచె (అర. 2—135), చనుదెంచు (ఆది 1—117) వంటి రూపములను ప్రయోగించియున్నాడు.

5. ఒక కర్త పూర్తిచేయు పనులలో మొదట పూర్తియైన పని 'ఇ' కారాంతమును, చేయని పని యైనచో 'అక' అంతమును, చేయదగిన పని యైనచో 'అన్వంతము'ను అగునని చెప్పి, క్త్వార్థక—వ్యతిరేకార్థక—తుమున్నర్థక ధాతువులను కేతన వివరించినాడు (ఆం.భా.భూ.- 156, 157) చాళుక్యుల శాసనములలో—ఇచ్చి (వెలుదుర్తి శాస.), పట్టంబు కట్టబడి (కురుబలకోట శాస.) వంటి క్త్వార్థకములు ; ఎడపక (యుద్ధ. బెజ. శాస.) వంటి వ్యతిరేకార్థకములు, ఏళన్ (ఉరుటూరు శాస.), ప్రవర్తిల్లన్ (విక్రమాదిత్య బలికుల దాణరాజుల శాస.) వంటి తుమున్నర్థకములు కన్పించుచున్నవి[4] ఇట్టివానిని నన్నయకూడ ప్రయోగించినాడు.

తరువాతి పద్యమున కేతన — భావార్థకమైన 'ఉట' అంతమందుగల వ్యతిరేకార్థక ధాతువులకు చివర 'అక' అనునదియు, 'చుట' అంతమందుగల్గిన

1. కవిసంశయ. 1-100
2. న.భా —పుట 865.
3. ఆం. భా. చ.—పుట 1467.
4. ప్రా. యు.—పుటలు 268...278.

ధాతువులకు చివర 'పక' అనునదియు వచ్చును – చేయక, త్రోవక (ఆం.బా.భూ –159).

6. అవసరమైనప్పుడు కావ్యములందు తినుటకు 'తింట', కొనుటకు 'కొంట', వినుటకు 'వింట' వంటి రూపములు వచ్చునని కేతన నిర్దేశించినాడు (ఆం బా.భూ – 158). శ్రీ వజ్ఝలవారు చెప్పినట్లు[1] ఇట్టి ప్రయోగములు నన్నయ భారతమున మృగ్యములైనను, అట్టి ప్రయోగములు కేతన కాలమున నుండె ననుటకు – అంట (అను 1–28), కంట (అను. 1–223), గైకొంట (ఉద్యో. 3–59) వంటి తిక్కన ప్రయోగములే ప్రబల నిదర్శనములు. ఇట్టివి అసాధువులని అహోబల పండితుడు నిరసించుచు కేతన మతమును ఖండించినాడు[2]. ఈ విషయమును శ్రీ గిడుగు వారును సమర్థించినారు[3]

7. తదనంతరము కేతన కొన్ని దీర్ఘాక్షరములు హ్రస్వాక్షరములై ద్విత్వము వహించునని చెప్పి, 'రా–రమ్ము', 'పో–పొమ్ము' వంటి రెండు రూపములను జూపినాడు (ఆం.భా భూ.–170). చిన్నయసూరికూడ దీనిని సాధించినాడు[4]. చింతామణ్యథర్వణకారికావళులలో లేని ఈ రూపములను సూరి సాధించుటకు కేతన పద్యమే మూల మని చెప్పవచ్చును.

8. విధ్యర్థకధాతువుల చివర ఉకార మున్నచో నది మకార మగును– పొడువు మరిసేన (ఆం.భా.భూ.–171).

తదనంతరము కేతన ఆశీరర్థకమును జెప్పినాడు. ఈ ఆశీరర్థక ప్రత్యయముల విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. కేతన చెప్పిన ప్రత్యయములు 'ఎడున్, తన్, గావుతన్' అనునవి యని కొందఱును (వావిళ్ల 1914, శ్రీ వడ్లమూడి మొదలగువారు) ; 'ఎడమ, తము, గావుతము' అని కొందఱును (న.భా.–పుట 868, శ్రీ జి. వి. సీతాపతి 'త్రిలింగరజతోత్సవ సంచిక'–పుటలు 666, 667) భిన్నాభిప్రాయములు కల్గియున్నారు. కొన్ని ఆ కాలపు ప్రయోగములను పరికించినచో, పైరూపము లన్నియు నంగీకృతములే యని స్పష్టమగుచున్నది. నన్నయ–ఎడున్ (ఆది. 1–105), ఎడమ (అది. 2–87); కావుతమ (ఆది 8–63) అనువానిని ప్రయోగించియున్నాడు. కేతనయే తన దశకుమార

1. వ్యా సం. స.–పుట 1431. 2. అహోబల –పుట 470.
3. బాలకవి –పుటలు 36...42, 4 బాల క్రియా–60, 62,

చరిత్రమున - ఎడున్ (దశకు. 9-93), తన్ (దశకు. 1-1), గావుతన్ (దశకు. 1-6), గావుతము (దశకు. 1-4) అనువానిని ప్రయోగించియున్నాడు.

ఇవికాక-నీళ్ల ద్రావుదురుగాక (ఆది. 6-130), కీర్తి దిక్కుల వెలయించుగాక (అర. 3-365) ఇత్యాది ప్రయోగములలో 'గాక' యనునది ఆశీర్థకమే. కాని, సూరికూడ దీనిని గుర్తింపనే లేదు.

10. కొన్ని ధాతువులకు 'ఇంచుక్కు' నకు బదులుగా 'ఇల్లు, ఇలు' అనునవి వచ్చును (ఆం.భా భూ.-175). సంధిల్లుట-సంధిలుట మొదలగునవి. నన్నయ: ఓసరిల్లు-ఓసరిలు అనువానిని ప్రయోగించినాడు[1]. కాని, యిట్టివాని సంఖ్య చాలతక్కువ. ఇట్టి రూపములను చిన్నయ సూరికూడ పేర్కొనినాడు[2].

---

1. న. భా.—855.

2. బాల. క్రియ.—71.

# 6. ప్రకీర్ణ ప్రకరణము

సంజ్ఞ, సంధి, విభక్తి, సమాస, క్రియా ప్రకరణముల యనంతరము కేతన కొన్ని కృత్ తద్ధిత రూపములను, నచ్చటచ్చట కొన్ని విశేషరూపము లను జెప్పినాడు. ఇట్లు వికీర్ణమైనవి యీ 'ప్రకీర్ణప్రకరణము'లో వివరింపబడు చున్నవి. ఇందులో కొన్ని రూపములు చింతామణ్యథర్వణకారికలు గూడ జెప్పియుండలేదు.

1. 'అరి' యను ప్రత్యయము 'కమ్మరి, మేదరి' వంటి పదములలో కులసూచకముగను (ఆం భా భూ.—129), 'పెనపరి, ముండరి, కల్లరి' వంటి పదములలో అధమకార్య సూచకముగను (ఆం.భా.భూ.—164) విడివిడిగా చెప్పినాడు కేతన ప్రాఙ్నన్నయయుగపు శాసనములలో 'పేదరియాకుజిన్త' (రెండవ తాళుని సిరిపురపు శాస). వంటి చోట్లలో ఈ అరిప్రత్యయము ప్రయుక్తమై యున్నది. నన్నయ భారతమున జాలరి (ఆది. 3—40, ఆర. 3—32), సూనరి (సభా. 1—118) వంటి ప్రయోగము లున్నవి. ఇది చింతామణి యథర్వణకారికలయందు లేదు; సూరి దీనిని తద్ధితప్రకరణములో చెప్పినాడు[1] చింతామణ్యథర్వణకారికలలో లేని దీనిని సూరి సూత్రించుటకు మూలము కేతన పద్యమే. సూరి యిట్లు విడివిడిగా చెప్పక ఒకేచోట చెప్పినాడు. కాని కేతన దీనిని పునరుక్తముచేయుట పరిశీలించినచో నాత డీ విషయమున శబ్దార్థము విచారణచేసి వ్రాసినట్లు కన్పించుచున్నది. సూరికేవలము శబ్దవిచారణము చేసి వ్రాసినాడు. పర్యవసానము మాత్రము ఒక్కటే.

సూరి కులార్థమునందు వచ్చు 'అరి' ప్రత్యయమునుగూర్చి చెప్పనేలేదు. కమ్మరి, కుమ్మరి మొదలగు ప్రయోగములు సూరి వ్యాకరణమును బట్టి సాధింప రాదు. సూరి యిచ్చిన యుదాహరణములలో కూడ యివి చేరవు. నన్నయ

1 బాల. తద్ధిత—17.

ప్రయోగములలో 'సూనరి' యనునది మతుబర్థములో వాడబడినది. కాని మతుబర్థమును కేతన చెప్పలేదు.

2. 'ఆడు, ఈడు, కాడు' అనునవి పులింగమందును, 'కత్తె, బోడి' యనునవి స్త్రీలింగమందును వచ్చు (ఆం. భా. భూ.-160) నని చెప్పి, 'కాడు' ప్రత్యయము నేర్పును కూడ తెల్పునని చెప్పినాడు కేతన (ఆం. భా. భూ.-161). నన్నయ- రాపికాడు (ఆది. 4-262), పరికాడు (ఆది. 4-202), నేర్పుకాడు (ఆది. 6-32) వంటి వానిని ప్రయోగించియున్నాడు ఈ రూపముల నన్నింటిని చిన్నయసూరి కూడ సాధించినాడు[1].

ఇచ్చట కూడ కేతన అర్థవిచారణ చేసి, 'బొంకులాడు, తగవులాడు' ఇత్యాది పదములలో 'ఆడు' అనునది యథమకార్యమును దెల్పు ననియు, 'కన్నపేడు, కపటీడు, సాలీడు,' వంటి పదములలో 'ఈడు' అనునది భాషను గుణమును దెలుపు ననియు వివరించినాడు (ఆం. భా. భూ.-162, 164)

3. 'ఇండి' అనునది తదభావద్యోతకమున వచ్చు నని చెప్పి, 'ముక్కిండి, వెరవండి' అనువాని నుదాహరించినాడు కేతన (ఆం. భా. భూ.-163). ఇట్టి బిందుపూర్వక రూపమునకు ప్రయోగములు మృగ్యములు. కాని "అరులకు సిరి యిచ్చెద నను వెరవిడియుం గలడె" యను తిక్కన ప్రయోగములో "వెరవిండియు గలడె" యనినను సరిపోవుచున్నది. చిన్నయసూరి కూడ 'ఇడి' యనియే చెప్పినాడు (బాల. తద్ధిత-24) కేతన చెప్పినది బహుశః ప్రాచీనరూపము కావచ్చును. నేటి 'ఇడి' లోని అరసున్న పూర్వమొకప్పు డిది బిందుపూర్వకమై యుండెనని తెల్పుచున్నది. దశకుమారచరిత్ర, విజ్ఞానేశ్వరములలో కేతనయే 'వెరవిడి' (దశకు. 11-104, విజ్ఞా. ఆ.-101) అను 'ఇడి' ప్రత్యయముతో కూడిన రూపమునే వాడియున్నాడు[2].

4. 'అమి' అనునది లేవను నర్థమునను, 'ఇమి' అనునది యున్నదను నర్థమునను, 'తనము' అనునది తత్-ధర్మము తెలుపునదిగను వాడబడు నని కేతన చెప్పినాడు (ఆం. భా. భూ.-165).

---

1 బాల. తద్ధిత-11,15,23, సమాస-23.

2. కన్నడభాషలోని 'ఇలి' యనునది దీనికి సమానార్థకముగ వాడబడుచున్నది: వావిలి-వాలము లేనివాడు

వీనిలో 'అమి' ప్రత్యయము కేవలము క్రియాపదములపైననే కన్పించు చున్నది. అందువలన సూరి దీనిని 'మిజ్' యని చెప్పి, క్రియాప్రకరణములో చెప్పినాడు.[1] కాని కేతన దీనిని కృదంతముగా పరిగణించినట్లు కన్పట్టు చున్నది. నన్నయ భారతమున తేజరిల్లమి (ఆది. 1–141), రక్షింపమి (ఆర. 1–170) వంటి ప్రయోగము లున్నవి.

'ఇమి' యనునది 'బలిమి, చెలిమి' ఇత్యాదిపదములలో 'కల' యను నర్థమున నామవాచకములపైనను, 'తాల్మి, కలిమి' ఇత్యాది ప్రయోగములలో క్రియలపైనను వచ్చుచున్నది. అందువలన సూరి దీనిని తద్ధితప్రకరణములోను, మరియు కృదంతప్రకరణములోను గూడ చెప్పినాడు.[2] కాని కేతన మాత్రము అర్థవిచారణచేసి యున్నదను నర్థమున వచ్చు నని చెప్పినాడు. 'పలుగుదనము' (ఆది. 5–203) వంటి ప్రయోగములలో 'తనము' తత్–ధర్మబోధకముగ నున్నది.

చిన్నయసూరి కూడ వీనిని సాధించినాడు.

5. అచ్చతెలుగుపదములలో పదమధ్యమునను, పదాంతమునను, ఉండు 'డు, రు, ను' అను అక్షరములపై నున్న ఉత్వము వికల్పముగ లోపించు నని చెప్పినాడు కేతన వేడుక–వేడ్క; కానుపు–కాన్పు (ఆం.భా.భూ.–63,64). ఈ విధి 'ఉ' త్వమునకే కాక 'ఇ' త్వమునకు కూడ చెల్లుచుండుటచే గాబోలు, తరువాతిపద్యమున 'కూర్మి–కూర్మి, తాల్మి–తాలిమి' వంటి రూపములను గూడ వివరించినాడు (ఆం.భా.భూ–65). చిన్నయసూరి కూడ వీనిని సాధించినాడు[3]. నన్నయ 'కలికి–కల్కి; ఉనికి–ఉన్కి' వంటి రూపములను రెంటిని ప్రయోగించియున్నాడు.[4]

6. ఇట్లే మరియొక పద్యమున కేతన 'ట, డ, ర, ల'లు జడ్డలైనయెడల ఒక మాత్రగను, అని విడిపోవునెడల రెండు మాత్రలుగను లెక్కకు వచ్చు నని చెప్పి 'బంట్లు–బంటులు, గుంద్ర–గుండర' వంటి రెండు రూపములను వివరించినాడు (ఆం.భా.భూ–98). సూరికూడ వీనిని చెప్పినాడు[5].

1. బాల క్రియా–37.
2. బాల.కృదంత–4; తద్ధిత–5.
3 బాల.ప్రకీర్ణ–17,18.
4 ఆం.భా చ.–పుట. 1441.
5 బాల–అచ్చిక–12.

7. సముచ్చయార్థకమున, అకారాంత ఇకారాంత పదములపై 'యును' అనునదియు, ఉకారాంతపదములపై 'ను' అనునదియు వచ్చు నని చెప్పినాడు (ఆం.భా.భూ-66) చాళుక్యుల శాసనములలో 'ఉమ్, ఉము, యు' అనునని సముచ్చయములుగ కన్పట్టుచున్నవి. కాని చోళరాజుల శాసనములలో 'చాముణ్డి యును, గొల్లణ్ణును' ఇత్యాది స్థలములలో 'ను, యును' అనునవి కూడ కన్పట్టు చున్నవి.[1] నన్నయ కూడ జమదగ్నిసూనుడును (ఆది. 5-222), అందుట యును (ఆది. 2-107) అని ప్రయోగించియున్నాడు. కన్నడమున 'ఉన్' అనునది సముచ్చయముగా నున్నది.

8. 'ఇల్లు, కల్లు, ముల్లు, పల్లు, విల్లు, కన్ను, మున్ను, వెన్ను, చన్ను' మొదలైన శబ్దములకు హల్లులు పరమైనప్పుడు వాని జడ్డలు లోపించు నని చెప్పి 'విలుకాడు, ఇలుపడి' వంటి రూపములను చూపినాడు కేతన (ఆం భా. భూ.-120,121). "అకారంబు క్రింది ఇకారంబునకుం, దుది నులుల క్రింది నల లకు లోపంబు బహుళంబుగా నగు"నను సూత్రము క్రింద పై రూపములను సాధించినాడు సూరి[2].

9. అచ్చతెనుగుమాటలలో నడుమైనచోట్ల 'గ' కారమునకు 'వ' కారము వచ్చును. రీగె-రీవె, పగలు-పవలు (ఆం.భా భూ-168). నన్నయ పవలు (ఆది. 2-152), తవిలి (అర. 2-230) వంటి వానిని ప్రయోగించియున్నాడు. సూరికూడ "అపదాంత్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారం బగు" నని చెప్పినాడు.[3]

10. 'ఇట్టివాడు, ఎట్టివాడు, అట్టివాడు' అనుటకు 'ఇట్టిడు, ఎట్టిడు, అట్టిడు' అని కూడ చెప్పవచ్చును (ఆం.భా.భూ-169). ఇట్టి రూపములను చింతా మణికర్తగాని, అథర్వణుడుగాని, అప్పకవిగాని సాధింపనే లేదు. నన్నయ-అట్టిడ (ఆది. 4-169), ఇట్టిడే (ఆది. 5-230) వంటి యేకవచనరూపములే కాక, అట్టిరు (ఆది 1-17, సభా. 1-236) వంటి బహువచనరూపములను గూడ ప్రయో గించియున్నాడు.

---

1 ప్రా యు.—పుటలు 282,283   2 బాల ప్రకర్ణ—7.

3. బాల. అచ్ఛిక—27.

11. 'అందు, ఇందు, ఎందు' పదములకు 'అట, ఇట, ఎట' అనునవియు నగును. వానిపైన రాకపోకలను సూచించు క్రియ లున్నపుడు 'అట పోయెడి, ఇట వచ్చెడి, ఎట కరిగెడి' అనవలయునుగాని, 'అట నాడెడి, ఇటఁ బాడెడి, ఎటఁ గూర్చున్నారు' అని యనగూడ దని చెప్పినాడు కేతన (ఆం.భా.భూ.-173,174).

12. మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు నను పగిది పలుకు లొప్పవుఁ గృతులన్
మల్లియ లంజియ గద్దియ
యొల్లియ యని పలికిరేని యెప్పున్ గృతులన్(ఆం.భా.భూ.-176)

అను పద్యమున కేతన 'ఎ'దంతరూపములను, ఇయాంతరూపములను రెంటిని యంగీకరించినట్లున్నది. కొన్ని ప్రతులలో నీ పద్యమున 'ఒప్పవు గృతులన్' అను అర్ధబిందురహిత పాఠాంతరమును ఉండి వ్యతిరేకార్థము నిచ్చుచున్నది. చింతామణియు, అథర్వణకారికావళియు, నీ రెండురూపములను నంగీకరించె[1] నని అహోబలపండితుడు అథర్వణోక్తి యాధారముగా కేతన సూత్రమును పూర్వపక్షముకావించినాడు[2]. కూచిమంచి తిమ్మకవి కూడ ఈ సందర్భమున నహోబలపండితునే యనుకరించినాడు[3]. శ్రీ కల్లూరివారును, శ్రీ వజ్ఝలవారును, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారును నిట్టి ఇయాంతరూపము లా కాలమున నంగీకృతములు కాకపోవుటచే కేతన వానిని నిరాకరించియుండవచ్చు నని వ్రాసినారు[4]. నన్నయభారతమున పదివేల గద్దియల్ (ఆర. 1–344), పదివేల లొట్టియల్ (సభా. 1–267) వంటి ఇయాంతరూపములే బహుళములు. కాని "ఇరువదివేల గద్దెల పసిండియు" (ఆర. 2–345) అనుచోట ఎదంతరూపమును కన్పట్టుచున్నది. కేతనయే స్వయముగా తన దశకుమారచరిత్రమున లంజియ (6–78), లంజె (6–89) అను రెండు రూపములను ప్రయోగించియున్నాడు. దీనివలన అర్ధబిందువిరహితముకంటె, నర్థబిందుసహితమైన 'ఒప్పవుఁగృతులన్' అనుకొన్నచో 'ఒప్పు+అవున్+కృతులన్' అని చెప్పవచ్చును. దీనికి

1 ఆం చిం.-అజంత–82; అథ. కారి.-అజంత–63.
2 అహోబల–పుట 321. 3. సర్వలక్షణ–పుట 17.
4. బా గు. ప్ర–అచ్ఛిక 23 వ్యాఖ్య; వ్యా.సం. స.–పుట 780; స.భా–పుట 821.

'ఒప్పుగగ్గెరులన్' (వావిళ్ళ-1914) అను పాఠాంతరమును గిలదు. ఇది పై విషయమునే నిర్ధారించుచున్నది.

ఇట్లే 'వినె-వినియె' వంటి క్రియాపదములందలి ఎదంత ఇయాంత రూపములను జెప్పినాడు కేతన (ఆం. భా. భూ.-181). ఇచ్చటగూడ ఇయాంత రూపముల నంగీకరింపలేదని కూచిమంచి తిమ్మకవి విమర్శించి నాడు[1]. ఇట్టి రూపములను వాగనుశాసనుడు ప్రయోగించినట్లు అప్పకవియే చెప్పినాడు[2]. సూరి కూడ దీని నంగీకరించినాడు. కేతనకు రెండు రూపములును సమ్మతములే యని యాతని పద్యముపలననే స్పష్టమగుచున్నది.

13. 'అవ, డవ'లపై నున్న 'వ' కార మొకప్పుడు లోపించి యట్టి యెడ తత్పూర్వ 'అ-డ' లకు దీర్ఘము వచ్చును: మఱాడు, కడాబలికె (ఆం. భా. భూ.-177). నన్నయ-చానోప (ఆర. 2-127) వంటి వానిని ప్రయోగించియున్నాడు. కేతనయే తన దశకుమారచరిత్రమున-నోబడియె (దశకు. 10-40; సూ. రా.ని. కూడ దీని నిచ్చినది) అని ప్రయోగించియున్నాడు. బసవపురాణమున 'మచాకు మమ్మ' (బసవ. 3-407) అను ప్రయోగ మున్నది. "క్వచి ద స్తస్య చాన్యస్య లోపో దీర్ఘశ్చ కుత్రచిత్" అను అథర్వణకారికకు టీక వ్రాయుచు శ్రీ ద్వితింత్రిణీ సీతారామశాస్త్రిగారు 'మఱువకు-మచాకు' అను దానిని ఉదాహరించియున్నారు[3]. చిన్నయసూరికూడ వీని నంగీకరించినాడు[4].

14. 'దూయుట, దాగుట' ఇత్యాది పదములను 'డూయుట, డాగుట' యనియు చెప్పవచ్చును (ఆం. భా. భూ.-178). ఇట్టి ప్రయోగములు లేవని ముద్దరాజు రామన్న చెప్పినట్లు తిమ్మకవి—

డక్కె నని కాని చెల్లదు దక్కె ననుప్ర
యోగ మంచు వచించె నింపొనర ముద్ద
రాజు రామన్న యది యథార్థంబు గాదు
రెండు గల వెన్న గృతుల గౌరీకళత్ర-[5]

1 సర్వలక్షణ-పుట 18.
2 అప్ప 1-129.
3 కవిజనమండన-అజంత-90
4. బాల. క్రియా-94.
5 సర్వలక్షణ- 2-78.

అను పద్యమున వ్యక్తపఱచినాడు. అందువలన ఆడిదము సూరకవి—

ఒక్కకవి లేదటంచును
వక్కాణించుటను జెప్పవలసెను నాకున్
డక్కెను దక్కెననంగను
దక్కెను జయలక్ష్మి పురవిదారి కనంగన్—

అను పద్యమున రెండు రూపములును గలవని చెప్పినాడు నన్నయ—డించి (ఆది 5–29), డాగి (అరణ్య.2–82), డిగ్గి (ఆది. 6–52), డగ్గఱ (అరణ్య. 3–295), డప్పి (అర. 2–109) వంటి రూపముల నంగీకరించినాడు. ఇట్టివానిని సూరి కూడ నంగీకరించినాడు[1].

15. అకారాంత ఇకారాంతములైన పదముం నూదిపలుకునపుడు వానికి చివర 'ఎ' వర్ణకమును, ఉకారాంతములైన పదముల నూదిపలుకునపుడు వానికి చివర 'అ'కారమును వచ్చును—దాతయె, నిఖిలకళానిష్ణాతుడ (ఆం.భా.భూ - 182,183). నన్నయ-మంత్రులుగా నొనరించితె (సభా. 1-27), తత్ఫలంబు తథ్యము సమకూరు (ఆది. 1-15), నీయంద పుట్టి నిలుచు (ఆర. 1-126) అని ప్రయోగించినాడు.

16. 'నెత్తమ్మి, నెమ్మొగము, నెత్తావి' వంటి పదములు ఉత్తమగుణ సూచకము లని చెప్పినాడు కేతన (ఆం.భా.భూ.-184). ఇట్టివానిలో 'నె' యనుది విశేష్యమునకు ముందు చేరు ననియు, నట్టియెడ 'నె' తరువాతి యక్షరము జడ్డయగు ననియు 124 వ పద్యములో చెప్పినాడు కేతన. అందువలన దానిని తిరిగి యిచ్చట చెప్పలేదు.

17. "తీవెల ప్రాకుల పేరులు" అను పద్యమున మొగిలిపూవుల నామము తప్ప మిగిలిన పూల నామములే వాని తీవెలకును ప్రాకులకును పెట్ట వచ్చు నని చెప్పినాడు కేతన (ఆం.భా.భూ -187).

18. 'మాన, జేన' మున్నగు పరిమాణార్థములను తెలుపు పదములను తెలుపు పదములపై 'ఎడు' అను ప్రత్యయము వచ్చి, 'మానెడు, జేనెడు' అని యగును. నన్నయకు బూర్వ శాసనములలో 'మానెండు, కుంచ్చెణ్డు' వంటి ప్రయోగములం దీ 'ఎడు' ప్రత్యయము కన్పించుచున్నది (ఆం.భా.భూ.-188).

1. బాల ప్రకీర్ణ–14.

నన్నయలో- 'నూతేసి' (ఆది. 8-2), 'వేయునేసి' (సభా. 1-15) ఇత్యాది ప్రయోగములలో 'ఏసి' యను ప్రత్యయ మొకటి కన్పించుచున్నది. కేతన గాని, సూరి గాని దీనిని గ్రహింపనే లేదు.

19. తదనంతరము కేతన పెక్కు పదముల కొక క్రియాపదమును గూర్చునప్పుడు ఆ క్రియాపదమును వాక్యమునకు జివరగాని, మొదటగాని యుంచవచ్చును లెదా, ఆ కర్తృపదములకు వేఱువేఱుగా నుంచవచ్చు ననినాడు.

రెండు కర్తృపదములకు మధ్య మాత్రము క్రియ నుపయోగింపరా దని కేతన చెప్పినాడు (ఆం.భా.భూ.-185). దీని నాధారముగా జేసికొనియే సూరి "ఎక వాక్యంబునం దొకానొక్కండు తక్క సర్వపదంబులు క్రమనిర పేషంబుగం బ్రయోగింపం జను"-అని సూత్రించినాడు[1].

**ఉపసంహారము**

ఇట్లు కేతన కొన్ని కృత్తద్ధిత ప్రత్యయములను విశేషరూపములను వివరించినాడు. వీనిలో ననేకములు చింతామణి యథర్వణకారికావళులందు కూడ చెప్పబడలేదు. అట్టి వాని నన్నింటిని మొట్టమొదటిసారిగా వ్యాకరణమున కెక్కించినవాడు కేతన.

---

1 బాల కారిక-37

# 7. తరువాతి వ్యాకర్తలపై ఆంధ్రభాషాభూషణ ప్రభావము

ఆంధ్రభాషాభూషణము తెనుగున వ్రాయబడిన ప్రప్రథమ వ్యాకరణ మగుటచే తరువాతి వ్యాకర్తలు పలువురు దాని నొరవడిగా జేసికొనియే రహు గ్రంథములను రచించినారు. వారిలో విన్నకోట పెద్దనయు, గణపవరపు వేంకట కవియు, కేతన మార్గమును తు. చ. తప్పక యనుసరించినవారు. అనంతుడు అప్పకవి వంటి లాక్షణికులు కేతన కేవలము సూచించి వదలివేసిన కొన్ని యంశములను విశదీకరించినారు. వీరుకాక అహోబల పండితుడు, కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి వంటి లాక్షణికులు కేతన చెప్పిన కొన్ని విషయములను తమ గ్రంథములందు ఖండించినారు. ఇట్లు తరువాతి వ్యాకర్త లందఱును కేతనను ప్రస్తావించియేయున్నారు.

## విన్నకోట పెద్దన

పెద్దన, కేతన తరువాత దాదాపు ఒకటిన్నర శతాబ్దులకు తిరిగి వ్యాకరణ రచనమున కుద్యుక్తుడైన లాక్షణికుడు. ఇతని కావ్యాలంకార చూడామణి ఒక లక్షణగ్రంథము. ఇందు భావాదులు, రసములు, నాయికానాయకులు, కావ్య భేదములు, అర్థాలంకార శబ్దాలంకారములు, ఛందస్సు మొదలగు విషయము లనేకములు చర్చింపబడినవి. ప్రస్తావికముగా నవమోల్లాసములో వ్యాకరణమును గూడ చెప్పినాడు. అది కేవలము వ్యాకరణగ్రంథము కాకపోవుటచే దాని కంత ప్రాధాన్య మిచ్చిన ట్లగుపడదు. కేతన చెప్పిన విషయములనే యథాతథముగా నాతడు గ్రహించినాడు. అంతేకాక కేతన సూచనామాత్రములుగ వదలివేసిన కొన్నింటిని విశదీకరించినాడు.

కేతన వలెనే ఇతడును, ఆంధ్రభాషను తత్సమము, తద్భవము, అచ్చ

తెనుగు, దేశ్యము, గ్రామ్యము అని యైదు విధములుగనే విభజించినాడు[1].

సంధి నిర్వచనవిషయమున నితడును వర్ణసంయోగమే సంధి యని నిర్వచించినాడు[2].

కేతన వాడిన సంజ్ఞలనే ఇతడును తన గ్రంథమున వాడుకొనినాడు ద్రుతమునకు 'నకారపు బొల్లు' అనియు[3], పరుషసరళములకు 'కచటతపలు, గజడదబ' లనియు[4], వికల్పముగా వచ్చు ననుటకు 'అడుగ-బొడము[5], తేలుచు-నూదుచు '[6] ననియు వాడినాడు.

కేతన వాడిని 'ఖు' సంజ్ఞను గూడ ఇత డొక పద్యమున వాడినాడు[7]. కాని ఆపద్య మొక్కటి కూడ సంపూర్తిగా లభించుటలేదు. కావున ఈ విషయమున మాత్రము కేతన ననుసరించినా డని నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు.

క్రియా ప్రకరణమున ప్రథమ మధ్య మోత్తమ పురుషలకు, భూత వర్తమాన భవిష్యత్కాలములందు వచ్చు ప్రత్యయములను చెప్పుటలో కేతనను పూర్తిగా అనుకరించినాడు[8].

సమాసప్రకరణమున పూర్వపదార్థప్రధానమైన అవ్యయీభావసమాసమును వదలివేసి, తత్పురుష భేదమేయైన కర్మధారయసమాసమును ఎక్కువగా జెప్పినాడు[9]. అంతేకాక ద్వంద్వసమాసమును పూర్తిగా ముందు చెప్పక పోయినను, అత్తమామ, ఆలుమగడు వంటి సమాసములు కల వని తెలిసి కొనవలయు నని చెప్పినాడు[10].

కేతన యెన్ని పద్యములను వ్రాసినాడో ఇతడును దాదాపు అన్నియే పద్యములను వ్రాసినాడు. అంతేకాక కేతన యే క్రమమున వ్రాసినాడో అదే క్రమమున వ్రాసినాడు. పద్యరచనాక్రమమున కూడ నితనికిని కేతనకును చాల సామ్యము గోచరించును. ఉదాహరణమునకు——

1. కావ్యా. చూడా 9-11.
2. కావ్యా చూడా. 9-45.
3. కావ్యా. చూడా.—9-51,56.
4. కావ్యా. చూడా 9-60, 61
5 కావ్యా. చూడా.—9-52.
6. కావ్యా. చూడా. 9-62
7. కావ్యా. చూడా.—9-55.
8. కావ్యా చూడా. 9-150...155.
9. కావ్యా. చూడా -9-122.
10. కావ్యా చూడా. 9-141.

1. ఆదులు స్వరములు నచ్చులు
కాదు లోగి న్వ్యంజనములు హల్లులు ననగా
మేదిని నెల్లెడ జెల్లును
కాదుల నైదైదు కూర్ప నగు వర్గంబుల్- (ఆం.భా.భూ.—15)
స్వరములు నచ్చులు ననగా
నరయ నకారాది సంజ్ఞ నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు
పరుస గకారాది వర్గపంచాక్షరముల్ (కావ్యా. చూడా. 9–9)

2 యరలపలును శషసహలును
సరయగ నంతస్థ యూష్మ లనగా జెల్లున్
సరివి నివె పేళ్ళు పెట్టుచు
దిరముగ దల్లక్షణములు దెలిపెడి చోటన్- (ఆం.భా.భూ.–16)
యరలవ లంతస్థలు నా
నురవగు శషసహలు పొలుచు నూష్మ లనంగా
బరువడి ప్రయోగములయెడ
విరచింపుదు దెలియవలయు వీని తెలుంగుల్ (కావ్యా చూడా. 9—10)

పై పద్యములను బరిశీలించినచో విన్నకోట పెద్దన కేతన నెంత యెక్కువగా ననుకరించినాడో స్పష్టము కాగలదు.

కొన్ని చోట్ల కేతన సూచనామాత్రముగా వదలివేసిన వాని నీతడు వివరించినాడు—

కేతన భాషావిభజనమును గావించి వానిని నిర్వచింపక, కేవల ముదాహరణములను మాత్ర మిచ్చినాడు. పెద్దన వానిని నిర్వచించి సోదాహరణముగా వివరించినాడు.

కేతన తెలుగుశబ్దము ననేక పర్యాయములు ప్రయోగించినాడు. కాని ఈ శబ్ద మెట్లు వచ్చినదో చెప్పనేలేదు. కాని పెద్దన, శ్రీపర్వత కాళేశ్వర దాక్షారామము లను త్రిలింగక్షేత్రముల నడుమ నున్న దేశము త్రిలింగదేశ మనియు, నచటి వ్యవహరింపబడు భాష కావున తెలుగు భాష యనియు చెప్పినాడు[1]

1. కావ్యా. చూడా.—9–5,6.

కేతన 'పటువు, మనువు, బటువు' శబ్దములకు 'డు' వర్ణకము రాదని చెప్పినాడు (ఆం.భా.భూ.-39). కేతనకు కొంచె మర్వాచీనుడగు పోతన భాగవతమున "ఛండస్ఫూర్తి పటుండు గాంచె" (భాగ. 8-529) అని ప్రయోగించుటచే పెద్దన దానిని జూచియే కాబోలు, తన కావ్యాలంకారచూడామణిలో 'మనువు, బటువు'లకు మాత్రము 'డు' వర్ణకము రాదని చెప్పి పటువు శబ్దమును వదలివేసినాడు[1].

ఇట్లు విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణియందలి వ్యాకరణ విభాగమును కేతన ఆంధ్రభాషాభూషణము నొరపడిగా జేసికొనియే రచించి యున్నాడు.

**గణపవరపు వేంకటకవి**

పెద్దన తరువాత తిరిగి సర్వవిధముల కేతన ననుకరించినవాడు ఆంధ్ర కౌముదీకర్త యగు గణపవరపు వేంకటకవి. ఈ యనుకరణ విషయమున వేంకటకవి, పెద్దనకంటెను మించి పోయినా దని చెప్పవచ్చును. ఇతడు క్రీ.శ. 1650 ప్రాంతమువాడు.

కేతన తన వ్యాకరణము ప్రప్రథమమైన దగుటచే-
సంస్కృత ప్రాకృతాది లక్షణము జెప్పి
తెనుగునకు లక్షణము జెప్పకునికి యెల్ల
గవిజనంబుల నేరమి గాదు నన్ను
ధన్యు గావింప దలచిన తలపుగాని - (ఆం.భా.భూ.-6)

అని ప్రారంభమున చెప్పికొనినాడు. దీని ననుసరించి వేంకటకవియు-

"శ్రీకరమ్ముగను సంస్కృతమునకు గల లక్షణములు చెప్పి
తెనుగున నావిధమ్ము లక్షణము చేయరాకున్కి యదియు నేరంబు గాదు
తొల్లిటి సుకవుల కెల్లను నను ధన్యు గావించు తలపింతె కాని"[2]-

యని వ్రాసినాడు. తనకు పూర్వమే ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణము వంటి లక్షణగ్రంథము లుండగా కేతనవలె తాను గూడ ప్రప్రథమవ్యాకర్త యని వ్రాసికొనుట గమనించినచో కేతన నాత డెంత

1 కావ్యా. చూడా. 9-29.

2. ఆం. కౌ.-పుట 1.

యెక్కువగా ననుసరించినాడో విదితము కాగలదు. ఇదే రచనాపద్ధతియుందును ఆంధ్రభాషాభూషణము ననుసరించినాడు.

కేతనవలె నీతడును భాష నైదువిధములుగనే విభజించి, తరువాత పెద్దన వానిని నిర్వచించినను తాను, మాత్రము కేతన వలె నిర్వచింపక, కేవలము ఉదాహరణములను మాత్ర మిచ్చినాడు[1]

కేతన వాడిన 'ఱు'సంజ్ఞ నితడుకూడ వాడినాడు[2].

పరుషసరళముల కితడును 'గచటతపలు గజడదబలు' అనియే వ్యవహరించినాడు[3]. వికల్పముగా వచ్చు ననుటకు కొన్నిచోట్ల 'ఊరుచు-దేలుచు'[4] ననియు, కొన్నిచోట్ల 'వికల్ప'[5] మనియు, ద్రుతమునకు 'నకారపుబొల్లి'[6] యనియు, స్త్రీపుంవాచకములను కలిపిచెప్పునపుడు 'పురుషాఖ్య'[7] లనియు వాడినాడు.

కర్మధారయమునందు వచ్చు పుగాగమ - టుగాగమముల నీతడును 'పునాదేశ-పుటాదేశము' లనియే చెప్పినాడు[8]

ఇతడును 'కెందామర, చెందమ్మిలు' ఇత్యాది రూపములందలి పూర్వ భాగములు 'కెం, చెమ్మి' లనియే పేర్కొనినాడు[9].

సమాసములను తత్పురుష, కర్మధారయ, బహువ్రీహి, ద్విగు, ద్వంద్వ, అవ్యయీభావ భేదములచే ఆరువిధములుగ విభజించినప్పటికిని, అవ్యయీ భావమును కేతనవలెనే పూర్వపదార్థప్రధానముగనే చెప్పి, 'నడురేయి, రాచిలుక, పెడతల, కడకన్ను' ఇత్యా ద్యుదాహరణములనే యిచ్చినాడు[10].

'అట్టివాడు, ఇట్టివాడు, ఎట్టివాడు' అనుటకు బదులు 'అట్టిడు, ఇట్టిడు ఎట్టిడు' అనవచ్చు నని సూత్రించుటయు కేతన కనుకరణమే[11].

---

1. ఆం. కౌ.—పుట 1
2. ఆం. కౌ.—పుట 4.
3 ఆం. కౌ.—పుట 18,28,41.
4. ఆం. కౌ—పుట 5.
5 ఆం కౌ.—పుట 12,20.
6 ఆం. కౌ—పుట 11.
7. ఆం. కౌ.—పుట 12.
8. ఆం. కౌ.—పుట 17.
9. ఆం. కౌ.—పుట 20.
10. ఆం. కౌ.—పుట 20.
11. ఆం. కౌ.—పుట 27.

సంస్కృతమునందలి క్రియలు, అవ్యయములు, విభక్తులు, క్త్వాంత-ల్యబంతములు మొదలగు వానిని తెనుగున యథాతథముగ ప్రవేశపెట్టరాదని కేతన చెప్పినాడు.[1] ఇది కేతన కాలమునకు ఆవశ్యకమైనది. కాని వేంకటకవి కాలమున కనవసరము. కాని కేతనను సంపూర్తిగా ననుసరించినవా డగుటచే నితడును నట్లే చెప్పినాడు.[2]

ఇట్లు గణపరపు వేంకటకవి తన ఆంధ్రకౌముదిని, కేతన ఆంధ్రభాషా భూషణమును పూర్తిగా ననుకరించుచు వ్రాసినాడు

**అనంతామాత్యుడు**

అనంతుని 'ఛందోదర్పణము' ఒక ఛందశ్శాస్త్రగ్రంథము. కాని ఇందలి చతుర్థశ్వాసమున కొంత వ్యాకరణప్రసక్తి కలదు. ఇతడు ఆంధ్రభాషా భూషణము ననుసరించినా డని చెప్పుటకు వీలులేదు. కాని కేతన కేవలము సూచించి వదలివేసిన కొన్నింటి నితడు విశదీకరించినాడు

కేతన ఆంధ్రమున నిరుపదియా రంతములు గలవని చెప్పినాడే కాని వానిని వివరింపలేదు. వానిని అనంతుడు వివరించినాడు[3]. ఇట్లే కేతన సూచించిన ఆఱు సంధులను వివరించినాడు[4]. ఇవికాక 'పరిక్లప్తి' యను మఱి యొక సంధిని గూడ చెప్పినాడు[5]. కేతన సూచించి వదలిన అవ్యయములను నిర్వచించి చెప్పినాడు[6]. కేతన పెద్దనలు వర్ణసమ్నాయమును చెప్పక 'ఆదులు, కాదులు' అని వదలివేయగా, నతడు పంచాశద్వర్ణములని చెప్పి వివరించుటయేకాక, వాటి జాతులను గూడ పేర్కొనినాడు[7]. కేతన నాల్గు సమాసము లని చెప్పగా నీతడు - ద్వంద్వము, బహువ్రీహి, అలుక్కు, ద్విగువు, కర్మధారయము, అవ్యయీభావము, నఞ్ తత్పురుషము అను భేదములచే నేడు విధములని చెప్పి వానిని సోదాహరణముగా వివరించినాడు[8].

ఇట్లు అనంతుడు కేతన ననుసరింపకపోయినను ఆంధ్రభాషాభూషణము

1. ఆం. భా. భూ –28.
2 ఆం కౌ.–పుట 26.
3. ఛందో 4–110.
4. ఛందో. 4–33...82
5. ఛందో. 4–33.
6. ఛందో. 4–116
7. ఛందో. 4–123...126,130.
8. ఛందో. 4–86...102.

నారవడిగా జేసికొనియే తన చందోదర్పణములోని చతుర్థాశ్వాసమును రచించినా డని చెప్పవచ్చును

**కాకునూరు అప్పకవి**

అనంతునివలెనే అప్పకవియు ఆంధ్రభాషాభూషణము ననుకరించక కేతన సూచించిన కొన్ని విషయములను, పెద్దన అనంతులు విడిచిపెట్టిన వానిని, వివరించి చెప్పినాడు. అప్పకవి ఆంధ్రశబ్దచింతామణి ననుసరించినాడు. అట్లు వ్రాయుటకు కారణముగా నొక స్వప్నవృత్తాంతమును చెప్పినాడు. ఆ స్వప్నమున కామెపలీశుడు—

"తాతనయు నూత్నదండియు
నీ తెనుగుకు లక్షణం బొకించుక తెలియన్
జేత. ప్రౌఢిమ జెప్పిరి
క్ష్మాతలమున దీని తెలుగు గావవి యెల్లన్"[1]–

అని చెప్పినాడు. దీనినిబట్టి ఆంధ్రభాషాభూషణ చింతామణులలో ముందటిదేదో తరువాతిదేదో తేలుటలేదు కాని, ఆంధ్రభాషాభూషణ చింతామణులు రెండును భిన్నమార్గములు కల్గినవని స్పష్టమగుచున్నది.

విన్నకోట పెద్దనవలె అప్పకవి గూడ త్రిలింగశబ్దోత్పత్తిని వివరించినాడు[2]. తరువాత కేతన కాని, పెద్దన కాని, అనంతుడు కాని చెప్పని దేశియచ్చతెనుగులకు గల భేదమును జెప్పుటకు ప్రయత్నించినాడు[3]. చింతామణియందు తత్సమ తద్భవ దేశ్య గ్రామ్యవిభజనములే యున్నవి కాని, అచ్చతెనుగు చెప్పబడలేదు. కేవలము చింతామణి ననుసరించిన వాడైనచో అప్పకవి దీనిని గూర్చి చెప్పనవసరము లేదు. కాని కేతన ఆంధ్రభాషాభూషణమును గూడ చూచినవాడు[4] కావున ఈ వివరణమునకు బూనుకొనినాడు.

అంతేకాక పెద్దనాదులు చెప్పిన 'చ జ' ల తాలవ్య దంత్య భేదములు,

---

1. అప్ప. పీఠిక-59.
. అప్ప. 1-99, 100.
3. అప్ప 1-107, 109.
. చూ. లక్షణగ్రంథముల పట్టిక-అప్ప. 1-4.
5. అప్ప. 1-4.

'యరలవ' ల లఘ్వలఘుభేదంబులు,[1] రేఫ-ఱకార భేద నిర్ణయము[2] మొదలగు విషయములు నెక్కువగా జెప్పినాడు.

పంచమాశ్వాసమున నితడు ప్రకృతిభావము, వికల్పము, నిత్యము, ఆదేశము, ఆగమము, లోపము, మొదలగు పారిభాషిక పదములను నిర్వచించినాడు[3]. కేతనాదులు చెప్పని ఔపవిభక్తికములను గూడ చెప్పినాడు[4].

ఇట్లు అప్పకవి కేతన ననుసరింపకపోయినను, సూచనామాత్రముగా నాతడు వదలివేసిన విషయములను కొన్నింటిని వివరించినాడు. పూర్వలక్షణ గ్రంథములందు చెప్పబడని కొన్ని విషయముల నత్యధికముగా జెప్పినాడు.

**కూచిమంచి తిమ్మకవి**

తిమ్మకవి తన 'సర్వలక్షణసారసంగ్రహము'న కొన్నిచోట్ల కేతన ననుసరించినాడు. కొన్నిచోట్ల మాత్రము వ్యతిరేకించినాడు.

ఇతడును కేతనవలెనే భాషను తత్సమాదిభేదములచే నైదుతెఱగులనియే విభజించినాడు[5]. 'ఆడ, ఈడ' పదములను గ్రామ్యము లనియే చెప్పి, నన్నయ తిక్కనల ప్రయోగముల నిచ్చినాడు[6]. పరుషసరళములకు 'కచటతపలు, గజడదబలు'[7] అనియే వాడినాడు.

సంబోధన ప్రథమా బహువచనమునం దారగాగమము వచ్చు[8] నని కేతన చెప్పగా, నీత డట్లు రాని ప్రయోగములు గలవని చెప్పి, "ఒప్పులు గల్గిన మెచ్చుడు" (ఆం.భా.భూ.-8) అను పద్యములోని 'కవులపాస్తి' యను కేతన ప్రయోగమునే యెత్తిచూపినాడు[9]. కాని దీనికి—

ఒప్పులు దీర్పుడు కవులం
దొప్పులు గైకొనుడు దీని కోపని వారల్

---

1 అప్ప 2-171, 172
2. అప్ప. 2-229
3. అప్ప 5-16...21.
4. అప్ప. 5.
5. సర్వలక్షణ-పుట 3
6 సర్వలక్షణ-పుట 16.
7. సర్వలక్షణ-పుట 44.
8 ఆం.భా భూ.-101,
9 సర్వలక్షణ-పుట 1-79,

తప్పొప్పని వెడబుద్ధులు
విప్పకుడీ యన్నలార వేడెద మిమ్మున్-
(వావిళ్ల · 1949, 1953, దేవినేనివారి ప్రతులు)

అను పాఠాంతరంబును గలదు.

మఱియొక చోట—

"మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు నను పగిది పలుకు లొప్ప వటంచుం
బొల్లెను మారయ కేతన
తెల్లంబుగ నివియు గలవు త్రిపురారాతీ"[1]—

అని కేతనను నిరసించినాడు. ఇచ్చట 'ఒప్పవుఁగృతులన్' అను అర్థబిందుయుతమైనరూపము సరియైనది. 'ఒప్పవు గృతులన్' అను వ్యతిరేకార్థము నిచ్చు రూపము సరియైనది కాదు. ఏలయన కేతనయే తన దశకుమార చరిత్రమున 'లంజె' (6-89), 'లంజియ' (6-44) అను రెండు రూపములను ప్రయోగించినాడు. ఇచ్చట 'ఒప్పగఁ గృతులన్' అను పాఠాంతరమును గలదు (ఆం.భా.భూ.-1949. వావిళ్ల).

ఇట్లే మఱియొక చోట-

"చనియె గనియె గొనియె ననుటకు జనె గనె
గొనె నటంచు జెప్ప గూడ దనుచు
బలికె నూత్నదండి పరికింప నివియును
గలవు కృతుల శిశిరకరవతంస"[2]-

అని కేతనను విమర్శించినాడు. ఈ సందర్భమున శ్రీ గంటిజోగి సోమయాజిగారు తమ 'ఆంధ్రభాషావికాసము'లో, నన్నయభారతమున 'ఎ' వర్ణాంత రూపములు మృగ్యము లనియు, అందువలననే కేతన వానిని నిరసించినా డనియు వ్రాసినారు.[3] కాని వీనినిగూడ కేతన అంగీకరించినాడని అతని పద్యమువలననే స్పష్టమగుచున్నది (ఆం.భా.భూ.-182).

---

1. సర్వలక్షణ—పుట 17. 2 సర్వలక్షణ—పుట 19.
3. ఆం భా వి —పుట 217.

ఇట్లు తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహము'న కొన్నిచోట్ల కేతనతో నేకీభవించినను, కొన్నిచోట్ల నిరసించినాడు.

**అహోబలపండితుడు**

అహోబలపండితుడు అథర్వణకారికావళి ఆధారముగా నాంధ్రశబ్ద చింతామణికి వ్యాఖ్య రచించినవాడు. కావున అతని మార్గము కేతనమార్గము కంటె భిన్నమైన దని స్పష్టము. కాని తన 'కవిశిరోభూషణము'న ఒకటి రెండు చోట్ల అతనిని విమర్శించినాడు.

కేతన 'అనుట'కు 'అంట' యనియు, 'తినుట'కు 'తింట' యనియు ననవచ్చు[1] నని చెప్పగా నట్టి ప్రయోగము లసాధువు లనియు, 'అనుట', 'తినుట' యనియే ప్రయోగించవలయు ననియు, కేతనను నిరసించినాడు[2]. కాని యిట్టి వానిని నన్నయగూడ ప్రయోగించినాడు.

ఇట్లే "మల్లెయు లంజెయు గద్దెయు" (ఆం.భా.భూ.—176) అను పద్యములో "ఒప్పవు గృతులన్" అను పాఠమును గ్రహించి కేతన ఎదంత రూపములు గ్రహింపకపోవుట అసమంజస మని విమర్శించినాడు[3]. కాని కేతన 'ఎదంత, ఇయాంత' రూపములను రెంటిని గ్రహించి తన కావ్యములందు వాటిని ప్రయోగించియున్నాడు. అహోబలపండితుడు గ్రహించినది అపపాఠము. అంతేకాక—

"నియామకత్వ మారూఢా నూత్నదండి ముఖాః క్వచిత్
పూజ్యాభవేయు రాచార్య సరణే రతి దూరగాః"[4]—

'శబ్దశాస్త్రనియామకు లనిపించుకొనిన యాచార్యుల మార్గమునకు మిగుల దవ్వుగా నున్న నూత్నదండి మొదలగు వా రెచ్చట పూజింపబడుదురు'—అని నిరసించినాడు

1 ఆం భా.భూ.—158
2 అహోబల—పుట 470.
3, అహోబల—పుట 321.
4, అహోబల—పుట 5,

**అడిదము సూరకవి**

అహోబలపండితుని వలెనే అడిదము సూరకవియు తన 'కవిసంశయ విచ్ఛేదము' న రెండుచోట్ల కేతనను విమర్శించినాడు.

1. ఆంధ్రభాషా భూషణకారుడు వేడి మయూఖములు, వాడి శరమ్ములు, తనరు మనుష్యుడు, పేర్చు నశ్వము అని ఇకారాంత ఉకారాంతములకే యుదహరించినాడు. కాని అకారాంతములమీద కూడ నుండవచ్చును– చిఱుత శశి ధరించె శివుడు.[1] కాని ఇది కేతనపద్యమును సరిగా నర్థముచేసికొనక వ్రాసిన వ్రాత. పూర్వమహాకవిప్రయోగము లుండుటవలన 'వాడిమయూఖములు, వేడిపయోధారలు' పంటి ప్రయోగములు 'కఱకంఠ' శబ్దమువలె గ్రాహ్యము లని చెప్పి కొన్నియుదాహరణముల నిచ్చినాడు. అట్టివానిలో ఇకారాంత, ఉకారాంత శబ్దములకే ఉదాహరణము లిచ్చి అకారాంత శబ్దములకు ఇయ్యక పోయినను ఊహించి గ్రహింపనగును. అంతమాత్రమున విమర్శింప నవసరము సూరకవికి లేదు.

2. ఆంధ్రభాషాభూషణకారుడు అసమస్తలఘుద్వ్యక్షరములమీద 'ఇంచుటకు' 'ఇయుంచుట' యని కూడ నుండవచ్చునని చెప్పినాడు. కాని చతురక్షముల మీద గూడ నుండవచ్చును.

ఉదా : ప్రతిఘటించె – ప్రతిఘటియించె[2].

కాని యిట్టివి తనకాలమున లేకపోవుటచే కేతన ద్వ్యక్షరములకే నిర్దేశించినాడు. (చూడు : క్రియాప్రకరణము). ఇట్లు అడిదము సూరకవియు కేతనను పేర్కొనినాడు.

ఈవిధముగా కేతన తరువాతి లాక్షణికు లందఱును ఆంధ్రభాషా భూషణము నొరవడిగా జేసికొనియే తమ గ్రంథరచనము సాగించినారు.

అర్వాచీన లాక్షణికులు, విమర్శకులు మొదలగువా రనేకులు తమ తమ గ్రంథములందు ఈ ప్రథమాంధ్రవ్యాకరణమును పేర్కొనియే యున్నారు. బాలవ్యాకరణమున చిన్నయసూరి పేర్కొనకపోయినను, కేతన విజ్ఞానేశ్వరము

---

1. కవిసంశయ-1-31. 2. కవిసంశయ-1-100.

లోని ప్రయోగముల నిచ్చియున్నాడు (పుటలు 29,74,89,195,197,252). ఇట్లే బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానములైన పేటికావ్యాఖ్యయందును (పుట 40)- గుప్తార్థప్రకాశికయందును (బా.గు.ప్ర. – అచ్చిక 23 వ్యాఖ్య), ఆంధ్రభాషా భూషణము పేర్కొనబడినది. అర్వాచీనగ్రంథములైన వ్యాకరణసంహితా సర్వస్వము (పుట 780), బాలవ్యాకరణోద్ద్యోతము (పుట 58), నన్నయ భారతము (పుటలు 807,821,863), వైయాకరణపారిజాతము, సంధి (పుటలు 37,41), ఆంధ్రభాషావికాసము (పుటలు 31,500), ఆంధ్రభాషానుశాసనము మొదలగు గ్రంథము లన్నింటియందును ఆంధ్రభాషాభూషణము పేర్కొనబడియున్నది.

ఇట్లే ఆంధ్రభాషాభూషణము తరువాతి లాక్షణికులకు మార్గదర్శకమైనది.

# 1. ధర్మశాస్త్ర చరిత్రము

**ధర్మ శబ్ద నిర్వచనము**

ఇతరములైన శాస్త్రపదములవలెనే 'ధర్మ' మను పదమును వైదిక వాఙ్మయమునుండియే గ్రహింపబడినది. ఇది తత్తత్సందర్భములలో వివిధార్థము లందు వాడబడినది. కావున దీనికి ఒక ప్రత్యేకమైన అర్థమును వైదికవాఙ్మయము ననుసరించి నిర్ణయించుట కష్టసాధ్యమైన పని. కాని, ఈ పదము 'ధరించు' అను నర్థము నిచ్చు 'ధృ' అను ధాతువునుండి వచ్చిన దనుట స్పష్టము. ఋగ్వేద మునం దీ పదము వివిధార్థములలో నేబదియాఱు పర్యాయములు వాడబడినది ("తాని ధర్మాని ప్రథమా న్యాసన్"[1]). కొన్ని సందర్భములలో నిది పైన చెప్ప బడినట్లు, 'ధరించు, ఆధారము' అను అర్థములలో వాడబడినది. 'సనాతన ధర్మము' ఇత్యాది సందర్భములలో నిది మతసంబంధిగా వాడబడినట్లు స్పష్ట మగుచున్నది. ఆథర్వవేదమునం దిది వైదికకర్మానుచరణముచేత లభించు గొప్ప తనమునకు సూచకముగా నుపయుక్తమైనది.

"ఋతం సత్యం తపో రాష్ట్రం శమో ధర్మశ్చ కర్మ చ ।
భూతం భవిష్య దుచ్ఛిష్టే వీర్యం లక్ష్మీ ర్బలం బలే ॥"[2]

ఐతరేయబ్రాహ్మణమున వైదికకర్మాచరణముల సమూహమే ధర్మ మని చెప్పబడినది–"ధర్మస్య గోప్తా జానీతి తమ భ్యుత్క్రుష్ట మేవం విధభిషేక్ష్య స్నేతయార్చాభిమన్త్రయే"–(ఐ.బ్రా. 7-17)[3].

ఛాందోగ్యోపనిషత్తులో నిది మూడు విధము లని చెప్పబడినది. అవి– 1. బ్రహ్మచారి తన తల్లిదండ్రులతోడను, తన గురువుతోడను ఉండి ఆచరింప వలసిన కర్మములు; 2. గృహస్థుగానుండి ఆచరింపవలసిన దానధర్మములు,

---

1. H.D.-I-P.1.
2. H.D.-I-P.2.
3. H.D -I-P.2.

యజ్ఞయాగాదులు మొదలగు కర్మలు; 3. యత్యాశ్రమము స్వీకరించి చేయవలసిన తపస్సు మొదలగు కర్మలు- అనునవి. వీనిని శాస్త్రోక్తముగా నాచరించినవాడు బ్రహ్మత్వము నొందునని యందే చెప్పబడినది-'త్రయో ధర్మ స్కంధాః యజ్ఞోధ్యయనం దాన మితి; ప్రథమ స్తప యేవేతి; ద్వితీయో బ్రహ్మచర్యాచార్యకుల వాసీ; తృతీయోऽత్యంత మాత్మాన మాచార్యకులే వసాదయన్; సర్వ యేతే పుణ్యలోకా భవంతి బ్రహ్మసంస్థోమృతతత్వ మేతి"[1].

ఇచ్చట ధర్మ శబ్దము వర్ణాశ్రమధర్మబోధకముగా వాడబడినట్లు స్పష్ట మగుచున్నది ఇట్లే తైత్తరీయోపనిషత్తునందును, "స్వధర్మే నిధనం శ్రేయః" ఇత్యాది భగవద్గీతశ్లోకములందును, పై యర్థముననే వాడబడినది.[2] సముచిత జీవత విధానమును దెల్పునది, ధర్మచోదక లక్షణయుక్తమైనది ధర్మ మని జైమిని తన పూర్వమీమాంసా సూత్రములందు నిర్వచించినాడు. ఇచ్చట చోదన మనగా కర్మప్రేరణ మొనర్చు వాక్యము లని శబరుడు వ్యాఖ్యానించినాడు. ఏ కర్మల నాచరించుటవలన అలౌకికమైన సంతోషము, సౌఖ్యము, సిద్ధులు కలుగుచున్నవో అట్టిదే ధర్మ మని వైశేషికసూత్రములందును చెప్పబడినది. ఇంతేకాక బౌద్ధవాఙ్మయమునందును, "అహింసా పరమో ధర్మః" ఇత్యాది భారత ప్రయోగములందును, "ఆచారః పరమో ధర్మః" ఇత్యాది మనుధర్మ శాస్త్రప్రయోగములందును అనేక అర్థములలో నుపయుక్తమైనది.[3] ఈశ్వర సంకల్పమున కనుగుణముగా నిత్యానంద ప్రాప్తికి, మానవకల్యాణ సిద్ధికి చేయు కర్మయే ధర్మ మని పోలే పండితుడు నిర్వచించినాడు[4].

మను, యాజ్ఞవల్క్య స్మృతులం దీ పదము వర్ణాశ్రమవిధులను తెలుపునదిగనే ఉపయుక్తమైనది

### ధర్మమునకు మూలము

ఈ ధర్మమునకు మూలమైన విషయము వేద మని కొందఱు, సదాచార మని కొందఱు, ధర్మతత్త్వజ్ఞు లని కొందఱును వివిధాభిప్రాయములను గల్గియున్నారు.

---

1. H.D.-I-P.2.
2 H.D.-I-P.1...3.
3. భా. త. శా-4-పుట 288.
4. భా. త శా-4-పుట 289.

గౌతమధర్మసూత్రములందు "వేదో ధర్మమూలం,తద్విదాంచ స్మృతిశీలే" అని వేదములు, వేదజ్ఞులును ధర్మమునకు మూల మని చెప్పబడినది[1]. ఇవి కాక సాధువర్తనులైన వారి ఆచారములును ధర్మమునకు మూలము లని మనువు చెప్పినాడు[2]. యాజ్ఞవల్క్యుడును అట్లే చెప్పినాడు[3]. వీరి నిర్వచనములను బట్టి ధర్మమునకు మూలమైనది వేదమే యని స్పష్టమగుచున్నది.

కాని వేదమునందు గాని, ఇతర గ్రంథములందు గాని ఈ ధర్మ విషయములు సూటిగా చెప్పబడవు. అవి కేవలము కొన్ని కొన్ని సందర్భములలో తత్సమయానకూలముగా సూచింపబడును. అట్టి వానిని గ్రహించి ధర్మ శాస్త్రకర్తలు ధర్మశాస్త్రగ్రంథములను రచించినారు. ఉదాహరణమునకు— మైత్రేయసంహితయం దొకచోట చక్కగా నలంకరింపబడిన యొక కన్య తనంతట తనే భర్తను వరించినట్లు చెప్పబడినది. ఇచ్చట అష్టవిధ వివాహములలో నొకటియైన గాంధర్వవివాహము గావింపబడినది ఐతరేయబ్రాహ్మణములోని సునహశేపుని వృత్తాంతము దత్తతను గూర్చి చెప్పుచున్నది. ఇట్లే క్షేత్రజుని విషయికమైన ధర్మసూక్ష్మములు వైదికవాఙ్మయమున అనేకచోట్ల ఉదాహరింపబడినవి. తైత్తరీయసంహితలో మనువు పుత్త్రులకు దాయవిభాగము గావించె నని యున్నది. దీనినిబట్టి తండ్రి జీవించియుండగనే పుత్త్రునకు దాయమును పంచియివ్వవచ్చు నని స్పష్టమగుచున్నది. ఋగ్వేదమునందు బ్రహ్మచారియొక్క విధులు చెప్పబడినవి. తైత్తరీయసంహితయందు మఱొక చోట,[4] శూద్రుడు యజ్ఞబాహ్యు డని చెప్పబడియున్నది. ఇట్టి విషయముల నన్నిటిని ఒకచోట చేర్చగా నేర్పడినవే ఈ ధర్మశాస్త్రగ్రంథములు.

ఇక ఈ వేదములోనికి ధర్మ మెట్లు ప్రవేశించినదో విచారణీయము. వేదకాలపు ప్రజకును తమ సంఘము నొక హద్దులో నుంచుకొనుటకు కొన్ని నియమముల నేర్పరచుకొనవలసి వచ్చినది. తత్ఫలితముగా వారేకమై ఒక సమితిగా నేర్పడి కొన్ని నియమముల నేర్పఱచుకొని వాని ననుసరించి నడవ సాగిరి. ఆ నియమములే ధర్మములైనవి. కావున ఈ ధర్మమునకు మూలము ఆనాటి ఆర్థిక సాంఘిక మతపరిస్థితులే[5].

1. గౌ. ధ. సూ.—1—1—2.
2. మను.—2—6
3. యాజ్ఞ.—1—7.
4. H. D.–I–P. 4...7.
5. S.A.I.L. & J. - P.5.

### ధర్మ స్వరూపము

మనుస్మృతికి సుప్రసిద్ధ వ్యాఖ్యానము రచించిన మేధాతిథి ధర్మము నైదుభాగములుగా విభజించినాడు. అవి : 1. వర్ణధర్మము, 2. ఆశ్రమధర్మము, 3. వర్ణాశ్రమధర్మము, 4. నైమిత్తికధర్మము, 5 గుణధర్మము లేక రాజు ఆచరింపవలసిన వ్యవహారధర్మము. ధర్మశాస్త్రము లన్నింటియందును ఇదే యర్థమునం దిది గ్రహింపబడును (గౌ. ధ. సూ.-హరదత్త-19-1, మను. 2-25)[1].

### ధర్మాచరణ లక్షణము

మనువు-ధృతి, క్షమ, శమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, బుద్ధి, విద్య, సత్యము, క్రోధ వివర్జనము-అను పదియును ధర్మము నకు లక్షణము లని చెప్పినాడు. అంతేకాక యిట్టి ధర్మరక్షణమునను విధ్యుక్త ప్రకార మాచరించినచో జీవితమునకు పరమావధియైన మోక్షము ప్రాప్తించు ననియును మనువే చెప్పియున్నాడు[2].

### ధర్మప్రయోజనము

ఇట్టి ధర్మానుష్ఠానమువలన కలుగు ఫలమును కూడా మన్వాదులే నిర్ణ యించినారు.

"మనుష్యు డెట్టి జంతువులకును బాధలు కలుగజేయక పరలోకసహాయము నిమిత్తము 'చెదపురుగు పుట్టనువలె' మెల్లమెల్లగా ధర్మమును సంగ్రహింపవల యును. తల్లిదండ్రులు, పుత్త్రులు, భార్య, జ్ఞాతులు మొదలగువా రెవ్వరును పరలోకసహాయార్థము వెంట రాజాలరు. ధర్మ మొక్కటియే తన వెంట వచ్చును. మనుష్యుడు పుట్టునప్పుడు తా నొక్కడే పుట్టుచున్నాడు. మరణించు నప్పుడు తా నొక్కడే మృతి బొందుచున్నాడు. మృతశరీరమును కొయ్యను వలెను, మట్టిపెళ్ళనువలెను, నేలపై బారవైచి దేహబంధువులు వెనుకకు దిరిగి పోవుచున్నారు. అట్టి సమయమున ధర్మ మొక్కటే యతని ననుసరించు చున్నది. కావున మనుజుడు ధర్మమాచరింపవలయు" నని మనువు చెప్పినాడు[3].

---

1. H.D. - I - P.3.
2. మను. 6-92,93.
3. మను. 4-238.. 242.

సకలవర్ణములవారికిని స్వధర్మానుష్ఠానము సలిపిన మాత్రముననే పరలోకమునం దపరిమిత సౌఖ్యము కలుగును అట్టి సుఖానుభవము జెందిన పిదప తిరిగి భూలోకమున జనించి, శేషించిన కర్మఫలముచేత ఉత్తమజాతిని, సౌందర్యాదులను, శరీరవర్ణమును, బలమును ధారణాశక్తిని, బుద్ధిని ధనాది వస్తువులను, ధర్మానుష్ఠాన ఫలమును పొందుచున్నారు కావున నుభయలోకముల యందును సుఖమే మనుజుని జెంది చక్రమువలె తిరుగుచుండు నని ఆపస్తంబుడు చెప్పినాడు[1].

హిందూధర్మ నిర్ణయమునకు పూర్వమీమాంసా మాత్రములతోగల సంబంధమును గూర్చి చెప్పుచు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితు డిట్లు నుడివియున్నాడు : "పూర్వమీమాంసా ధర్మశాస్త్రము శ్రుతిపై నాధారపడియున్నది. వేదవిధులు ధర్మమును వివరించును. వేదోక్తమైనది సత్కర్మ యని మీమాంసకు నభిప్రాయము. స్మృతివాక్యములకు సమానమగు వేదవాక్యము లున్నవనియు, నందు గొన్ని నష్టములైన గావచ్చుననియు సంప్రదాయసిద్ధమైన సిద్ధాంతము. శ్రుతి స్మృతి విరోధ మున్నచో స్మృతియే నిరాకరింప దగినది. స్వార్థపరతతో జెప్పబడిన స్మృతులను విడిచిపెట్టదగును. స్మృతుల తరువాత సదాచారము ముఖ్యమైనది. స్మృత్యుక్తములు కాని ధర్మములు, సత్ప్రయోజననియమములుగా భావింపదగును. ప్రాకృత విచారములకు లొంగి మనము వర్తించుచో మన ప్రవర్తనము ధర్మమగును. వేదోక్తధర్మముల ననుసరించియే హిందూజీవితము నియమింపబడిన దగుటచే మీమాంసాసూత్రములు హిందూధర్మమున కత్యవసరము లు. సంధ్యాది పితృకర్మల, యథోచిత నైమిత్తికకర్మల ననుష్ఠించుట మన మోక్షమున కవసరము. ఇవి మానరాని నియమములు. వాని నాచరింపనిచో మనకు ప్రత్యవాయము కలుగును. విశిష్టకాంక్షాసిద్ధికై మనము కామ్యకర్మల నొనర్పవలెను. కాంక్షలు లేనిచో గామ్యకర్మ లవసరము లేదు. నిషిద్ధకర్మలు చేయకున్నచో స్వార్థపరత నశించును. విధ్యుక్తకర్మాచరణము మోక్షసిద్ధి నొసగును"[2].

కావున జీవితపరమావధియైన మోక్షసాధనమే ధర్మప్రయోజనము.

---

1. మా.ధ.చం.-పుటలు 4, 5. 2. భా.త.శా -4-పుటలు 289, 290.

### ధర్మము – సంఘము

భారతములో కర్ణపర్వమునందు–"ధారణా ద్ధర్మ మిత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః" (69–59) అని చెప్పబడినది. దీనివలన ధర్మమును సంఘమును పరస్పరావలంబకము లని స్పష్టమగుచున్నది సంఘములేనిదే ధర్మశాస్త్రము లేదు. ధర్మశాస్త్రము లేనిదే సంఘము ఉండవచ్చును. కాని సంఘముయొక్క విశృంఖలత్వము నరికట్టునది ధర్మశాస్త్రమే కావున, నది సంఘమున కెంతయును ఆధారభూత మని చెప్పవచ్చును. ఇట్టి ధర్మమును గూర్చి ప్రవచించునది ధర్మశాస్త్రము. అనగా విశృంఖలమైన సంఘవ్యవహారములు హద్దులు మీరకుండ కాపాడునది ధర్మశాస్త్రము. కావున ధర్మశాస్త్రము సంఘమున కెంతయును అవసరమైనది.

### ధర్మశాస్త్రము–స్మృతి

స్మృతి, ధర్మశాస్త్రము అను పదములు రెండును పర్యాయపదములుగా వాడబడియున్నవి. మనువు తన ధర్మశాస్త్రమున "ధర్మశాస్త్రంతు వై స్మృతిః" అని ధర్మశాస్త్రమును, స్మృతియు నొక్కటియే యని చెప్పినాడు[1]. హరదత్తుడు గౌతమధర్మశాస్త్రములకు మితాక్షరవ్యాఖ్య వ్రాయుచు ప్రారంభముననే "వేదవిదులైన మన్వాది మహాపురుషులు, స్మృతులు లేక ధర్మశాస్త్రములు, ధర్మమునకు ప్రమాణము" అని చెప్పినాడు[2]. కావున స్మృతి ధర్మశాస్త్రములకు భేదము లేదు.

### ప్రధాన స్మృతులు

లోకమునం దష్టాదశ స్మృతులు ప్రసిద్ధములు. వీనిని యాజ్ఞవల్క్యుడే తన స్మృత్యారంభమునందు జెప్పియున్నాడు—

> "మ న్వత్రి విష్ణు హారితో యాజ్ఞవల్క్యో శ నేంగిరాః
> య మాప స్తంబ సంవర్తాః కాత్యాయన బృహస్పతీ।
> పరాశర వ్యాస శంఖలిఖితా దక్ష గౌతమౌ
> శాతాతపో వసిష్ఠ శ్చ ధర్మశాస్త్ర ప్రయోజకాః॥"[3]

ఈ అష్టాదశస్మృతులును తత్కర్తల పేళ్ళతోనే బరగుచున్నవి. వీనిలో యాజ్ఞవల్క్యస్మృతికి ఒక విశిష్టస్థాన మున్నది.

---

1 మను. 2-10. 2. గౌ.ధ.సూ.-హరదత్త-పుట 1 3. యాజ్ఞ.-1-4,5.

# 2. యాజ్ఞవల్క్య స్మృతి

**యాజ్ఞవల్క్యుడు**

స్మృతికారులలో యాజ్ఞ్యవల్క్య డతిప్రాచీనుడు. అతి మహిమా వంతుడు. శుక్లయజుర్వేద శిరోభూషణమగు బృహదారణ్యకోపనిష దంతయు యాజ్ఞవల్క్యుని కథాకథనమునకు సంబంధించినదే.

అఖిలజగత్సృష్టికిని సంకల్పించిన నారాయణుని నాభికమలమునుండి బ్రహ్మ యుద్భవించెను అతడు కర్తవ్యతావిమూఢుడై దిక్కులు పరికింప 'తప' యని వినబడెను. వేయిసంవత్సరము లత నిట్లు తప మొనరింప శ్రీ మహా విష్ణువు ప్రత్యక్షమయ్యెను. అతని నిశ్వాసరూపమున వేదములు వెలువడినవి. వానిని బ్రహ్మ గ్రహించి తన మానసపుత్త్రిడు కశ్యపప్రజాపతి కొసంగెను. అతడు తన పుత్త్రిడగు సూర్యున కొసంగెను. అందుచేతనే యాతడు త్రయీ మయమూర్తి యైనాడు. అందు యజుర్వేదము శుక్ల కృష్ణ భేదములచే ద్వివిధము. అట్టి శుక్లయజుర్వేదము నభ్యసించినవారు ప్రథమశాఖీయు లని ప్రసిద్ధి.

ఆ శాఖయందు జన్మించిన బ్రహ్మరాతి యను బ్రాహ్మణశ్రేష్ఠుడు సంతాన నిమిత్తము భార్యయగు సునందతో తప మాచరింప, శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షము కాగా, వారాతని బోలిన శిశువును కోరి వరము గాంచిరి. సునంద గర్భవతి యయ్యెను. ఘటికాసప్తకమున నమరులును, నవమాసంబుల నరులును ప్రసవించుచుండ నీమె యాగర్భమును దశవర్షములు మోసెను. గర్భభార పరిక్లిన్న యగు భార్యం గాంచి బ్రహ్మరాతి గర్భస్థుడగు శిశువు నుద్దేశించి "నీ వేల గర్భమునుండి వెలువడ" వని ప్రశింప "సర్వప్రాణిసామాన్యంబగు ద్వారంబున రా నొల్ల" నని పల్కిన, దండ్రి శ్రీ మహావిష్ణువును బ్రార్థించెను. అంత నాతడు గర్భస్థుడగు శిశువునకు మృతసంజీవినీ మంత్రము నుపదేశించి మాతృగర్భము జీల్చుకొని వెలికివచ్చి తల్లిని బ్రతికింపు మనిన నాత డిట్లు

కార్తిక శుద్ధ సప్తమి నాడు మాతృగర్భము జీల్చుకొని వెలికివచ్చి యయోనిజుడై జనించెను. అతడు లోకపవిత్రుడని దేవదుందుభులు మొఱసెను. శిశువునకు యాజ్ఞవల్క్యుడను నామం బిడిరి. అతడు బాష్కలుని కడ ఋగ్వేదమును, వైశంపాయనుని కడ యజుర్వేదమును అభ్యసించెను (యా.మ చ.-1 ఆ)

యాజ్ఞవల్క్యుడు అతిమహిమావంతుడు ఒకనాడు వైశంపాయనుడు శిష్యునధ్యయనము చేయించునెడ ఒక బ్రాహ్మణబాలుడు వారి నడుమ కేతెంచెను వైశంపాయనుడు కోపించి ఒక దర్భతో నతని గొట్టెను. ఆ శిశువు మరణించెను. దానితో వైశంపాయనునకు బ్రహ్మహత్య చుట్టుకొని, పిశాచరూపమున నాతని నాక్రమించెను. వైశంపాయనుడు మూర్ఛిల్లెను అట్టియెడ నశరీరవాణి యతని నెవ్వారైన తప మహిమచే రక్షింపు డని పలుక యాజ్ఞవల్క్యు డా పిశాచము నీశ్వరుని కడ కనిపి, మంత్రోదకముల వైశంపాయనునిపై జల్లి, నాతడు పునరుజ్జీవితు డయ్యెను.

మిథిలానగరమును జనకమహారాజు పాలించుచుండెడివాడు. అతడును జ్ఞాని. అతనికి వైశంపాయనుడు పురోహితుడు. అతడు ప్రతినిత్యము ప్రభువు కడకు మంత్రాక్షతలొక శిష్యునిచే వంతులవారిగా బంపుచుండెడివాడు. వారును దగిన సత్కారముల స్వీకరించి వచ్చుచుండిరి. పిశాచమునుండి విముక్తుడైన యుపాధ్యాయుడు సంతోషముతో నాతడు తన శిష్యుడగు యాజ్ఞవల్క్యుని జనకునికడకు పంపెను. అందుకొన్ని రాజస్త్రీల కొసగ రమ్మనెను. అతడు వానిని గొని రాజస్త్రీల కొసగబోవ వారతని జటావల్కలయుతరూపము నీక్షించి "మా కీ తండులమేటికి గైకొనగా నొల్ల మింక గదలు" మని పరిహ సించిరి అంతట నాత డా యక్షతల నశ్వశాలలోని స్తంభములపై జల్లి "ఏనాడో శుష్కించిన స్తంభములు నా యాశీస్సులచే పుష్పభరితము లగు" నని వచించెను. అవి యట్లే యయ్యెను. జనకుడు వానిని జూచి మహాశ్చర్యమగ్నుడై యివి యెట్లయ్యెనని విచారించి యంతఃపురకాంతలచే యాజ్ఞవల్క్యుని ప్రభావము విని పశ్చాత్తప్తుడై వైశంపాయనుని పిలిచి సత్కరించి, యాజ్ఞ్యవల్క్యుని తిరిగి పంపవలసినదని కోరెను. వైశంపాయను డంగీకరించి, ఆశ్రమమునకు తిరిగి వచ్చి యాజ్ఞవల్క్యుని బొమ్మనెను. అంత యాజ్ఞవల్క్యుడు తనవంతు పూర్తి యైన దనియు, తిరిగి తనను బంపుట భావ్యము కాదనియు నాతని మాట తిరస్కరించెను. వైశంపాయనుడు క్రోధఘూర్ణితలోచనుడై, తన కడ నేర్చిన

విద్యలను తన కొసగి పాఠశాల విడిచి పొమ్మనెను. యాజ్ఞవల్క్యు డెంత బ్రతిమాలినను గురువాలింపకుండుటచే యోగమహిమను దాను బఠించిన యజుర్వేదము నంతయు గ్రక్కెను. అట్లు ముఖోద్గతమైన వేదము ప్రజ్వరిల్లుచుండ వేదవ్యాసు ననుజ్ఞచే వైశంపాయనుడు దానిని బోధయనాదిశిష్యగణముచే భక్షింపజేసెను మును లెల్లరు తిత్తిరిపక్షుల విదమున దానిని భక్షించుటచే దానికి తైత్తిరీయ మని పేరు కల్గినది. ఈ వృత్తాంతమును జనకమహారాజు విని మిగుల దుఃఖించెను. వైశంపాయనుడును యాజ్ఞవల్క్యుడు లేమికి కడు విచారించెను (యా.మ.చ.-2 ఆ)

యాజ్యవల్క్యుడు విద్యావిహీనుడై గ్రుమ్మరుచు విరజాతీరమున నీశ్వరానుగ్రహముకొఱకు తపస్సు గావించెను. ఈశ్వరుడు ప్రత్యక్షమై సూర్యుని కడ నున్న శుక్లయజుర్వేద మభ్యసింపుమని దాన వేదవంతుడ వగుమని వర మొసంగెను. అతడు సూర్యుని సంతోషపఱచి యతని రథముపైనుండి శుక్ల యజుర్వేదము నభ్యసించెను. అనంతరము సూర్యు డతనికి సరస్వ త్యనుగ్రహము సంపాదింపు మని చెప్పెను. అత డట్లే కావించెను. సరస్వతి ప్రత్యక్షమై తన యంశమందు గార్గియను స్త్రీ జనించుననియు నామెను బరిగ్రహింపు మనియు చెప్పి, యాతని జిహ్వాయందు వసించెను (యా. మ. చ. ౩ఆ.).

ఒకసారి నిమిచక్రవర్తి ఒక మహాయజ్ఞమును గావించెను. యజ్ఞానంతర మాతడు అచ్చటికి విచ్చేసిన బ్రాహ్మణులకు బంగారు గోవులను దానము చేయు సందర్భమున చేరువపల్లెయందున్న శ్వపచు లచటికి వచ్చేసి "గోదానము పాలొసంగు మొదవుల నీయవలయునుగాని, యచేతనంబులగు గోవుల నొసంగుట తగదు; అచేతనంబులగు పశువులు మాకు జెందు"ననిరి. చక్రవర్తి యేమియుం దోచక మ్రాన్పడియుండెను. అట్టియెడ యాజ్ఞవల్క్యుడు బ్రాహ్మణుల నెల్లర నుద్దేశించి "ఈ పసిడి గోవులను బ్రతికించి గైకొనుడు. లేకున్న నేను వీనిని బ్రతికించి గైకొందును ఇవి బ్రతికించిన వాని కగునని పల్కెను. ఎవ్వరు నాపని జేయజాలకుండిరి. అట్టిచో నాతడు మంత్రోదకములచే వానిని సజీవములు గావించి శిష్యుల ద్రోలుకొని పొండని యాజ్ఞాపించెను. బ్రాహ్మణులసూయాగ్రస్తులై యడ్డగించిరి. అప్పు డా కదుపులు స్వేచ్ఛగా ప్రవర్తించి యడ్డగించిన వారి నెల్ల చిందరవందఱ గావించెను. గోగణ మతనికి దక్కినది.

బ్రహ్మ, విద్యాధికయగు మైత్రేయి యను నొక యువతిని సృజించి బ్రహ్మవాదినియగు నామెకు నామె ప్రశ్నములకు సమాధాన మిచ్చిన వానిని వివాహమాడు మని యాదేశించెను. ఆమె కనుగొనిన యుత్తమ ఋషుల నెల్ల వేదాంతప్రశ్నల నడుగుచుండెను. వారు తగిన సమాధానము చెప్పలేక తడబడు చుండిరి. ఆమె యాజ్ఞవల్క్యు నాశ్రమము కడకు జనుదెంచి యథాక్రమమున నాతని బ్రశ్నించి సదుత్తరయై యాతని వివాహమయ్యెను వారికి సునందుడు, విజయుడు నను కుమారద్వితయ ముదయించెను

కౌండిన్యమునీంద్రునకు కాత్యాయిని యను నొక కన్య కలిగెను. బ్రహ్మ వరముచే నామెను యాజ్ఞవల్క్యుడు పరిణయమయ్యెను.

ఇట్లుండ కాంచీపురమున బ్రహ్మ యశ్వమేధయాగ మొనర్చి క్రత్వ ధ్యక్షుడుగ యాజ్ఞవల్క్యుని సత్కరించెను. యాజ్ఞవల్క్యుని కీర్తి ప్రతిష్ఠలు దిగంతముల వ్యాపించెను. అతని కీర్తి విని ప్రత్యహ మనేక ఋషిజాల మతని సందర్శింప నరుదెంచుచుండెను.

ఒకసారి విదేహేశ్వరుడగు జనకుడు యాజ్ఞవల్క్యుని సందర్శించి బ్రహ్మిష్ఠుడుగా తా నాతనిని గౌరవింప నెంచినట్లు తెల్పెను. యాజ్ఞవల్క్యు డది "నిరూపణకావలయును, బహుదక్షిణాఖ్యయాగము గావింపుము; అందు జేరిన బ్రాహ్మణులయందు బ్రహ్మిష్ఠుని నిర్ణయింపు" మనెను. రాజట్లు యాగ నిశ్చయము గావించుట కంగీకరించెను. ఆ యాగమునకు కురుపాంచాలదేశముల నుండి సమస్తబ్రాహ్మణులు వచ్చిరి. వైశంపాయనాదు లతని బరిభవింప దలచిరి. ఋక్శాఖియగు శాకల్యుదు యాజ్ఞవల్క్యుని గెల్తునని ముందుకు వచ్చెను. ఆర్తభాగుడు, అహమ్మతి, ఉపస్తుడు మొదలగువారు దీనికి సమ్మతించిరి. జనకు డా యాగమును సక్రమముగా నెఱవేర్చి వేయి యుత్తములగు గోవులను కోష్ఠమందు నిలిపి, వానికొమ్ము కొక్కొక్క దానికి పది పాదముల (పాదము= సుమారు 3 తులములు) మేలిమి బంగారమును గట్టి, బ్రాహ్మణుల జూచి మీలో సమస్తోపనిషద్విద్యల బ్రవీణుడగు బ్రహ్మవేత్త యీ గోగణమును గైకొను డని చెప్పెను. అచ్చటనున్న విప్రులు మహర్షులు తమ బ్రహ్మిష్ఠతను శంకించి మారాడకయుండిరి. అట్టియెడ యాజ్ఞవల్క్యుడు తన శిష్యగణమును జూచి వానిని తమ యాశ్రమమునకు తోలుకొని పొమ్మని చెప్పెను. అట్లు జరుగుట

తోడనే యచ్చట నున్న బ్రాహ్మణ్యమునకు గ్రోధము జనించినది వారందఱును ఒక్కపెట్టున యాజ్ఞవల్క్యునిపై తిరుగబడిరి. వారిలో హోతయగు నశ్వలు డాతని జూచి "నీ వంత బ్రహ్మనిష్ఠుడవే" యని యదిత్వేపింప యాజ్ఞవల్క్యుడు చిరునవ్వు నవ్వి "బ్రహ్మవేత్తలకు నా నమస్కారము- మేము గోకాములము" మని చెప్పెను. అంత నశ్వలు డాతని బ్రహ్మనిష్ఠపరీక్షింపనెంచి యాతనిపై ప్రశ్నల వర్షము కురిపించెను. దానికి సమాదానములు యాజ్ఞవల్క్యు డొసగెను. అనంతరము ఆర్తభానుడు, భుజ్యుడు, ఉపస్తచక్రాయనుడు, కహోళుడు, గార్గి, ఉద్దాలకుడు, శాకల్యుడు మొదలగువా రాతని ననేక విదముల బ్రశ్నింప, యాజ్ఞవల్క్యుడు వారికి సదుత్తరముల నొసంగి, విజయము గాంచెను. జనకు డాతనిని మిక్కిలి గౌరవించెను. సకల ఋషులు నాతని నుతించి, పూజించిరి. గౌతమమహర్షి యాతనిని మిక్కిలి గౌరవించి తన యాశ్రమమున నాతని నుంచుకొని బ్రహ్మతత్త్వమును చర్చించి వినెను. అత డాతని నామస్మరణమే బ్రహ్మవిద్యగఅవు నని ఋషుల కుపదేశ మొసగెను (యా మ.చ.-4 ఆ).

యాజ్ఞవల్క్యుడు మిధిలానగరము విడిచిపోబోవునెడ గార్గి వచ్చి తన్ను వివాహమాడు మనిన బ్రహ్మవేత్తమురా లగు నామెను అతడు వివాహమాడెను.

కొన్ని దినముల తర్వాత యాజ్ఞవల్క్యుడు మఱియొక సారి జనకుని కడ కేగి, యాత డడిగిన ప్రశ్నములకు సమాధానము నొసంగి, యాతని ప్రార్థనచే బ్రహ్మోపదేశము గావించెను. జనకు డాతనికి గురుదక్షిణగా తన రాజ్యము నిచ్చెద ననిన నాత డాశీర్వదించి తన యాశ్రమంబున కరిగెను.

ఇట్లాతడు పెద్దకాలము గడిపి తుదకు సన్యసింపగోరి భార్యలగు కాత్యాయినిని మైత్రేయిని బిలిచి తన యాస్తిపాస్తుల జూపి వానిని గైకొనుడని పలికెను. అందు మైత్రేయి బ్రహ్మవాదిని. ఆమె మోక్షమునకు నిరుపయోగమైన ఆ ఆస్తి తనకు వద్దని నిరాకరించెను. అంతట యాత డామెకు తత్త్వోపదేశము గావించెను (యా.మ.చ.-5 ఆ.).

ద్వాపరే ద్వాపరే విష్ణుః వ్యాసరూపో మహామునిః ।
యాజ్ఞవల్క్య మహాతేజః త్రియస్త్రింశతి రుచ్యతే॥ (ఇతి వైఘానసే)

ప్రతి ద్వాపరమునందును భగవదంశమున వ్యాసావతారము లుద్భవించును. ఈ

యష్టావింశతి ద్వాపరంబున గృష్ణద్వైపాయనుడు వ్యాసుడు. ముప్పదిమూడవ ద్వాపరంబున యాజ్ఞవల్క్యుడు వ్యాసుడగునట (యా.మ.చ.-పుట 93).

ఇట్టి మహిమావంతుడైన యాజ్ఞవల్క్యవిరచితము యాజ్ఞవల్క్యస్మృతి. దానికి విజ్ఞానేశ్వరుడు మితాక్షరవ్యాఖ్యను వ్రాసినాడు. అట్టి యుద్గ్రంథమును సవ్యాఖ్యానముగా ననువదించినాడు కేతన.

**యాజ్ఞవల్క్య స్మృతి**

మిథిలానగరములో ఋషులు తనను ఆశ్రయించి వర్ణాశ్రమ దర్మము లను గూర్చి ప్రశ్నింపగా వానీ గ్రంథమును జెప్పినట్లు యాజ్ఞవల్క్యుడే గ్రంథారంభమున చెప్పికొనినాడు[1].

ఈ యాజ్ఞవల్క్యస్మృతియందు ఆచారకాండము, వ్యవహారకాండము, ప్రాయశ్చిత్తకాండము, అని మూడు కాండము లున్నవి.

**కాలము**

ఈ స్మృతిరచనాకాలము నిశ్చితముగా నిర్ణయించుటకు తగిన యాధార ములు లేవు. కాని గ్రంథస్థవిషయములను బట్టి దాదాపు ఈ ప్రాంతములో రచింపబడియుండవచ్చు నని చెప్పుటకు కొంత అవకాశ మున్నది.

ఆనాటి నాణెములకు 'నాణకము' లని పేరు కన్పట్టుచున్నదనియు ఈపేరునకును, క్రీ.శ. 78 ప్రాంతము వారైన కుషానురాజులు తమ కులదేవత యైన 'నానియా' చిత్రమును నాణెములపై వేసికొనుటకును సంబంధముగల దనియు, కావున ఈ స్మృతి క్రీ.శ. 1వ శతాబ్ది ప్రాంతమున రచింపబడిన దనియు శ్రీ జయస్వాల్‌గా రభిప్రాయపడియున్నారు. కౌటిల్యుని అర్థశాస్త్ర మును మనుధర్మశాస్త్రమును ఇందు పేర్కొనబడియుండుటచే దీనిని క్రీ. పూ. 1వ శతాబ్ది ముందుండినదిగా చెప్పుటకు వీలులేదు. వారములకు పేళ్లుపెట్టుట సాహిత్యమున క్రీ.శ 5వ శతాబ్దమువరకు కన్పట్టదు. ఇది క్రీ.శ. 484వ సంవ త్సరమునకు సంబంధించిన గుప్తరాజుల శాసనములలో కనిపించును. కాని ఈ వారముల పేళ్ళు యాజ్ఞవల్క్యస్మృతిలో కానరాదు. కావున దీనిని

1. యా.- ఆ.- 1.

క్రీ.శ. 5వ శతాబ్దమునకు పూర్వపుదిగనే చెప్పవలసివచ్చును. అంతేకాక, నక్షత్రములు వాని ప్రభావములు ప్రప్రథమముగా 5వశతాబ్దివాడైన వరాహమిహిరునిచే నిశ్చయింపబడినది. కాని యాజ్ఞవల్క్యుడు అంతకు పూర్వము చెప్పబడిన ప్రకారము నక్షత్రాదులను పేర్కొనుటవలన కూడ దీనిని క్రీ.పూ. 5వశతాబ్ది తరువాతదిగా చెప్పుటకు వీలులే దని డాక్టర్ జాలీగారు పేర్కొనినారు. పై ఆధారములను బట్టి ఈ స్మృతి బహుశ క్రీ.శ. 1-5 శతాబ్దుల మధ్యకాలమున రచింపబడిన దని చెప్పవచ్చును[1].

**యాజ్ఞవల్క్య స్మృతి—వ్యాఖ్యలు**

ఈ స్మృతి కనేక వ్యాఖ్యలు వెలువడినవి. వానిలో విశ్వేశ్వరుడు, విజ్ఞానేశ్వరుడు, అపరార్కుడు, శూలపాణులు రచించిన వ్యాఖ్యలు ప్రసిద్ధములు. అందును విజ్ఞానేశ్వరుని మితాక్షరవ్యాఖ్య ఒక విలక్షణమైన స్థానము నాక్రమించుచున్నది.

**విశ్వరూపుడు**[2] : ఇతడు యాజ్ఞవల్క్యస్మృతికి 'బాలక్రీడ' యను వ్యాఖ్య రచించినాడు. యాజ్ఞవల్క్యుని సూత్రములకు అతివిస్తారమైన వ్యాఖ్యానము నీతడు రచించినట్లు మితాక్షర అవతరణికలో చెప్పబడినది. కాని ఈతని వ్యాఖ్యలో ఆచార ప్రాయశ్చిత్తకాండముల కీయబడినంత ప్రాముఖ్యము వ్యవహారకాండమున కీయబడినట్లుగా గోచరింపదు. ఇతడు తన వ్యాఖ్యయందు పారస్కర, భారద్వాజ, ఆశ్వలయనాది గృహ్యసూత్రకారులను, నారద, మను, యాజ్ఞవల్క్య, సంవర్త, హారీతాది స్మృతికర్తలను పేర్కొనినాడు. కుమారిలుని శ్లోకవార్తికమునుకూడ విశ్వరూపు డనేకచోట్ల నుదాహరించినాడు.

సురేశ్వరు డను నాతడు తన నైష్కర్మ్యసిద్ధి, తైత్తరీయోపనిషద్భాష్యములందు తాను శ్రీ శంకరాచార్యుల శిష్యునిగా చెప్పుకొనినాడు. శంకరుని కాలము క్రీ.శ. 788 నుండి 820 వఱకని నిర్ణయింపబడినది. గురువంశకావ్యము ఈ సురేశ్వరుడే విశ్వరూపు డని చెప్పుటచే నితడు క్రీ.శ. 800-825 ప్రాంతమువాడగును. జీమూతవాహనుని దాయభాగ వ్యవహారమాతృకలందును, సరస్వతీ విలాస స్మృతిచంద్రికలందును, విశ్వరూపుని సిద్ధాంతములు బాగుగా చర్చింప

1. K. D. I-P 184 ..187.    2. ధర్మ ఇతి —I—పుటలు 66...68.

బడినవి. తరువాతి వారిలో తిథినిర్ణయసముచ్చయ కర్త, కాలనిర్ణయసిద్ధాంత వ్యాఖ్యాత, నిర్ణయసింధు కర్త మొదలగువా రెందరో విశ్వరూపుని ఉదాహరించినారు.

**అపరార్కుడు** [1] **:—** ఈతని వ్యాఖ్యకు 'యాజ్ఞవల్క్యసూత్రానుబంధ' మని పేరు. ఇది మితాక్షరకంటెను మిక్కిలి పెద్దది. ఇతడు పురాణముల నుండియు, ఉపపురాణములనుండియు కొన్ని కొన్ని భాగములను యథాతథముగా తన గ్రంథమున నెక్కించుకొనినాడు. ఇతడు తన వ్యాఖ్యయందు గర్గసంహిత, క్రియాశ్రయసారావళి మొదలగు గ్రంథములను గూడ ఉదాహరించినాడు.

ఈతడు మితాక్షరను గూర్చి తన గ్రంథమున చర్చించుటచే విజ్ఞానేశ్వరుని తరువాతివా డని స్పష్టమగుచున్నది ఇతనిని గూర్చి ప్రప్రథముగా 'స్మృతి చంద్రిక' యందు చెప్పబడుటచే దేవణ్ణభట్టుకు పూర్వు డగుచున్నాడు.

ఇప్పటికిని కాశ్మీరదేశమున అపరార్కుని వ్యాఖ్యకు ఒక ప్రత్యేక ప్రాముఖ్యము కలదు. ఇత డీ వ్యాఖ్యనే కాక, భాసర్వజ్ఞుని 'న్యాయసారము' పై కూడ టీక రచించినాడు

**శూలపాణి** [2] **.—**వంగాళాదేశపు ధర్మశాస్త్రకర్తలతో జీమూతవాహనుని తరువాత శూలపాణికే యెక్కువ ప్రాధాన్య మున్నది. ఈతని వ్యాఖ్యకు 'దీపకళిక' యని పేరు. ఇందు కేవలము దాయభాగమునకే ప్రాముఖ్య మీయ బడినది. ఇదికాక 'స్మృతి వివేక' మను వేఱొక గ్రంథమును గూడ నితడు రచించెను. ఈ స్మృతివివేకమునందు దత్తవివేకము, శ్రాద్ధవివేకము, సంక్రాంతి వివేకము, దుర్గోత్సవప్రయోగవివేకము మొదలగు శీర్షికల క్రింద ధర్మశాస్త్రమునకు సంబంధింపని నియమము లనేకములు చర్చింపబడినవి.

చండేశ్వరుని రత్నాకరమును, కాలమాధవీయమును, ఉదాహరించుట వలన నితడు క్రీ.శ. 1375 తరువాతివాడును, రుద్రధరుడు, గోవిందానందుడు, వాచస్పతి మొదలగువా రీతనిని పేర్కొనుటవలన క్రీ.శ. 1460 కి పూర్వము

1. ధర్మ. ఇతి.-1-పుటలు 79,80.    2. ధర్మ. ఇతి.-1-87,88.

వాడును అగుచున్నాడు. కావున ఈతడు క్రీ.శ. 1375-1460 నడిమి ప్రాంతమువాడని తెలియుచున్నది.

**విజ్ఞానేశ్వరుడు**[1] : వ్యాకరణశాస్త్రములో 'పతంజలి మహాభాష్యము' నకును, అలంకారశాస్త్రగ్రంథములలో మమ్మటుని 'కావ్యాలంకారము' నకును ఉన్న విశిష్టస్థానము స్మృతివాఙ్మయమున విజ్ఞానేశ్వరుని మితాక్షరవ్యాఖ్య కున్నది. అంతకు పూర్వము దాదాపు రెండువేల సంవత్సరములవఱకున్న ధర్మశాస్త్రవాఙ్మయమునకు ప్రతీకగను అటు తరువాత వచ్చిన ధర్మశాస్త్రము లకు మాతృకగను, నిది వెలయుచున్నది. ఇది యాజ్ఞవల్క్యస్మృతికి కేవల వివరణమేకాక, అంతకుముందుండిన సర్వస్మృతిగ్రంథములకును సార మని చెప్పవచ్చును కొన్ని తాళపత్రప్రతులందు కేవలము 'మితాక్షర' యనియు, కొన్నిటియందు 'ఋజుమితాక్షర' యనియు, మరికొన్నిటియందు 'ప్రమితాక్షర' యనియు నుండుటచే దీనికి మూడు పేళ్లను గలవని నిర్ధారితమగుచున్నది. ఇందు అంగిరసుడు, అత్రి, ఆపస్తంబుడు, ఆశ్వలాయనుడు, ఊశనసుడు, బృహస్పతి, మనువు, యముడు, హారీతుడు మొదలగు స్మృతికర్తలును, అసహాయుడు. విశ్వరూపుడు, మేధాతిథి, శ్రీకరుడు, భారవి, భోజదేవుడు మొదలగు స్మృతివ్యాఖ్యాతలును, పేర్కొనబడినారు. అంతేకాక యిందు బృహదారణ్యకోపనిషత్తు, జాబాలోపనిషత్తు, నిరుక్తము, భరతనాట్యశాస్త్రము, యోగసూత్రములు, పాణినీయము సుశ్రుత సంహిత, స్కాందపురాణము, విష్ణుపురాణము, అమరము మొదలగునవి పేర్కొనబడినవి.

విజ్ఞానేశ్వరయోగి భారద్వాజగోత్రు డనియు, పద్మనాభభట్టు పుత్రు డనియు, ఉత్తముని శిష్యుడనియు, పరమహంసపరివ్రాజకు డనియు, విజ్ఞానేశ్వరీయ గద్యవలన తెలియుచున్నది.

విజ్ఞానేశ్వరుడు డిందు పెక్కు స్మృతివాక్యముల నుద్ధరించి, యందు గనవచ్చు విరోధములను పూర్వమీమాంసా వివరణ సూత్రముల ననుసరించి విశదీకరించుచు, సంబంధములేనట్లు అగుపించు వాక్యములకు సూత్రములకు విషయవ్యవస్థ కావించి సమన్వయము కల్పించినాడు[2].

1. H D.-I P 287...293.
2 'విజ్ఞానేశ్వరము' - స్రవంతి - ఏప్రిల్ 63.

ఇతడు తన మితాక్షరవ్యాఖ్యయందు పెక్కు విషయములను సంగ్రహించి చెప్పినట్లు దాని నామమే చెప్పకచెప్పుచున్నను, అవసరమైనప్పుడు విషయమును సుబోధక మొనర్చుటకై దీర్ఘ వివరణములును చేసినాడు.

ఆంగ్లేయుల పరిపాలనాకాలమున, హిందున్యాయశాస్త్రమున దత్తత, దాయభాగము మొదలగు విషయములందు దీ విజ్ఞానేశ్వరమే పరమప్రమాణ గ్రంథముగా భావింపబడి హిందూన్యాయశాస్త్ర (హిందు లా) మన నొప్పుచుండెడి దని మాక్స్‌ముల్లర్ పండితుడు చెప్పియున్నాడు[1].

ఈ మితాక్షరయందు విశ్వరూపుడు, మేధాతిథి, ధారేశ్వరుడు మొదలగు వారు పేర్కొనబడుటచే నిది క్రీ.శ. 1050 తరువాతనే రచింపబడిన దనుట స్పష్టము. క్రీ.శ. 12వ శతాబ్దమున దేవణ్ణభట్టు తన స్మృతిచంద్రికలోను, 12వ శతాబ్ది ఉత్తరార్థమున నుండిన లక్ష్మీధరుడుతన తన'కల్పతరువు'నందును, విజ్ఞానేశ్వరుని ఉదాహరించినారు. దీనివలన విజ్ఞానేశ్వరుడు 12వశతాబ్ది పూర్వార్థమున నుండినట్లే విశదమగుచున్నది.

విజ్ఞానేశ్వరుడు తాను మితాక్షరను చాళుక్యరాజైన విక్రమార్కుడు లేక విక్రమాదిత్యుడు కళ్యాణపట్టణమును పరిపాలించుచున్నప్పుడు వ్రాసినట్లు పేర్కొనినాడు. ఈ విక్రమాదిత్యుడు క్రీ.శ. 1076 మొదలు 1127 వఱకును కళ్యాణపట్టణమును పరిపాలించిన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు కావచ్చును. ఐనచో మితాక్షర క్రీ.శ. 1070-1100 ల ప్రాంతమునందు రచింపబడినదగును[2]. మితాక్షరపైన విశ్వేశ్వర, నందపండిత, బాలంభట్టులు రచించిన వ్యాఖ్యలు సుప్రసిద్ధమైనవి. నందపండితుని వ్యాఖ్యకు 'ప్రమితాక్షర లేక ప్రతితాక్షర' అని పేరు. ఇత డనేకచోట్ల విజ్ఞానేశ్వరుని విమర్శించినాడు. బాలంభట్టు వ్యాఖ్యకు 'లక్ష్మీవ్యాఖ్యాన' మని పేరు[3].

ఈ విజ్ఞానేశ్వరుడు, హరిహరుడు రచించిన 'అశౌచదశక' మను నొక గ్రంథమునకును వ్యాఖ్య రచించినట్లు 'ఆఫ్రెచ్' పండితుడు పేర్కొనినాడు. కాని తరువాత ఆయనయే దానిని అనుమానస్పద మని వదలివేసినాడు. 'డక్కన్

1. Max Muller's Letter to W H. Morley–Pub. in the Digests of Indian Cases-1850
2. H.D.-I-P. 290.
3. H D.-I-P. 427.

కాలేజ్ కలెక్షన్స్'లోని ఒక తాళపత్రప్రతిని బట్టి అది క్రీ.శ. 1578 సంవత్సరమున వ్రాయబడినట్లు తెలియుచున్నది[1].

ఇట్లే ఆఫ్రెచ్ పండితుడు ముప్పది స్రగ్ధరావృత్తములతో కూడిన 'త్రింశతిశ్లోకి' యను గ్రంథమునకును విజ్ఞానేశ్వరుడు భాష్యము రచించినట్లు పేర్కొనినాడు. కాని యిదియును 'డక్కన్ కాలేజ్ కలెక్షన్స్' లోని ఒక తాళపత్రప్రతిని బట్టి క్రీ. శ. 1711వ సంవత్సరమున రచింపబడినట్లు తెలియుచున్నది[2].

ప్రసిద్ధమైన ఈతని మితాక్షరవ్యాఖ్యను ప్రప్రథమముగా నాంధ్రములోని కనువదించినవాడు కేతన.

ఈ యాజ్ఞవల్క్యస్మృతిని పలువురు తరువాత గ్రంథములందు పేర్కొనినారు. పలువు రందలి గ్రంథస్థ విషయమును గ్రహించినారు.

అగ్నిపురాణ, గరుడపురాణకర్తలు తమ గ్రంథములలో యాజ్ఞవల్క్యస్మృతి ననేకచోట్ల ఉదాహరించినారు[3].

ఈ యాజ్ఞవల్క్యస్మృతికి వాజసనేయసంహిత, విష్ణుధర్మసూత్రములు, వసిష్ఠధర్మసూత్రములు, పారస్కరగృహ్యసూత్రములు కాత్యాయనుని శ్రాద్ధకల్పము,కౌటిల్యుని అర్థశాస్త్రము లతో నెక్కువ సంబంధము గోచరించుచున్నది[4].

ఈ ధర్మశాస్త్ర వాఙ్మయమున బృహద్యాజ్ఞవల్క్యుడు, యోగయాజ్ఞవల్క్యుడు, వృద్ధయాజ్ఞవల్క్యుడు- అను ముగ్వురు, స్మృతికర్త యగు యాజ్ఞవల్క్యాతిరిక్తులు కన్పట్టుచున్నారు. విశ్వరూపుడు, విజ్ఞానేశ్వరుడు, మరియు అపరార్కుడు వృద్ధయాజ్ఞవల్క్యుని పేర్కొనినారు వాచస్పతిమిశ్రుడు తన 'యోగసూత్రభాష్యము' నందు యోగయాజ్ఞవల్క్యుని పేర్కొనినాడు. మనుస్మృతి వ్యాఖ్యాత కల్లూకభట్టు కూడ యోగయాజ్ఞవల్క్యుని తన 'మన్వర్థముక్తావళి'యందు పేర్కొనినాడు. 'డక్కన్ కాలేజ్ కలెక్షన్స్'లో యోగయాజ్ఞవల్క్యునివిగా కొన్ని తాళపత్రప్రతులు కలవు. కాని యోగ యాజ్ఞవల్క్య బృహద్యాజ్ఞవల్క్యుల గ్రంథములు ధర్మశాస్త్ర సంబంధమైనవి కావు.

---

1. H.D.-I-P. 291. 2. H.D.-I-P. 292.
3,4. ధర్మ. ఇతి -పుటలు 50...53.

## విజ్ఞానేశ్వరీయ ప్రాముఖ్యము

ద్రవిడాచార వ్యవహార సంప్రదాయములందు పరమ ప్రమాణములైన గ్రంథము లైదు గలవు. వీని సంఘాతమునకు 'పంచగ్రంథి' యని పేరు. వీనిని గూర్చి చిన్నయసూరి తన 'హిందూధర్మశాస్త్రసంగ్రహము'న నిట్లు చెప్పి యున్నాడు[1].

**1. విజ్ఞానేశ్వరీయము** : ఇందు ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్తములను మూడు కాండములు గలవు. వ్యవహారకాండమందలి దాయభాగ ప్రకారణము ఒక దొరచేత నింగిలీషు చేయబడినది. ఆ కాండమందు మఱికొంత భాగము డుబ్ల్యూ. హెచ్. మెక్‌నాటన్ దొరచే నింగిలీషు చేయబడినది. మితాక్షర కాశీ సంప్రదాయమందు ముఖ్యప్రమాణము. అందుచేతనే ద్రవిడసంప్రదాయమందు సహిత మది ప్రమాణముగా గ్రహింపబడుచున్నది. అంతేకాక ఈ గ్రంథనామము ధర్మశాస్త్రమునకు ముఖ్యప్రవర్తకుడైన మనువుయొక్క గ్రంథనామముతో జేర్చి రెంటికి సాధారణముగా 'మనువిజ్ఞానేశ్వరీయ' మని పేరు పెట్టి, యిందు సమస్త ధర్మములు చెప్పబడియున్న వని చెప్పుదురు.

**2. స్మృతిచంద్రిక:—** దేవణ్ణభట్టు కృతము. మితాక్షర కిది రెండవదిగా పరిగణింపబడుచున్నది

**3. సరస్వతీవిలాసము:—** ప్రతాపరుద్ర కృతము. ఇదియును స్మృతి చంద్రిక వంటిదే.

**4. వ్యవహార మయూఖము:—** నీలకంఠ కృతము. ఇందు అర్థవ్యవహార దండవ్యవహారములు తెలుపబడినవి. ఇది మహారాష్ట్ర సంప్రదాయమందు ముఖ్యమైనది. ఇది బారెడేల్ దొరచేత నింగిలీషు చేయబడినది.

**5. మాధవీయము :—** మాధవాచార్య కృతము. పరాశరస్మృతికి గల వ్యాఖ్యలన్నింటిలోను నిది సర్వోత్తమమైనది.

ఈ పంచగ్రంథిలో సర్వోత్కృష్టమైనది విజ్ఞానేశ్వరీయము. వ్యవహార కాండ ఇంగ్లీషువారిచే ఆంగ్లమున కనువదింపబడుట గమనించినచో వ్యవహార

---

1 హిం.ధ.సం. పుటలు 11...13

విషయములయందు మనుస్మృతి వంటి ప్రామాణిక గ్రంథములు కూడ దీనికి సాటిరా వని చెప్పవచ్చును. ఇది యథార్థమైన విషయము. ఆంగ్లేయుల పరిపాలకాలమున హిందూన్యాయశాస్త్రమున దత్తత, దాయభాగము మొదలగు విషయము లందు విజ్ఞానేశ్వరీయమే పరమప్రమాణ గ్రంథముగా పరిగణింప బడుచున్నట్లు మాక్స్‌ముల్లర్ పండితుడు పేర్కొనియున్నాడు[1].

ఇట్లే ద్రవిడసంప్రదాయములకు పరమ ప్రమాణమైన విజ్ఞానేశ్వరమును కేతన గ్రహించి అనువదించినా డని చెప్పవచ్చును.

అదియునుగాక అనేక విషయములలో యాజ్ఞవల్క్యస్మృతి, మనుస్మృతి నధిగమించుచున్నది.

యాజ్ఞవల్క్యస్మృతిలో వలె మనుస్మృతియందు ధర్మశాస్త్రమునకు ముఖ్యమైన ఆచార వ్యవహార ప్రాయశ్చిత్త ధర్మములు విడివిడిగను విపులము గను చర్చింపబడినట్లు గోచరింపదు.

దాయభాగవిషయమున యాజ్ఞవల్క్యస్మృతిని ఏ ఇతర స్మృతియు అధిగమించలే దనుట అతిశయోక్తి కానేరదు.

భర్త చనిపోయిన తరువాత కొడుకులు లేని స్త్రీ విషయిక ధనమును గూర్చి మనువు ఏమియును చెప్పలేదు. కాని యాజ్ఞవల్క్యుడు అట్టి సందేహాస్పద విషయములను గూడ వివరించినాడు.

మనువు జూదమును పూర్తిగా నిరసించినాడు కాని యాజ్ఞవల్క్యు డది రాజునకు రాబడిని కలుగజేయునది యగుటచేత దానిని రాజు ప్రోత్సహించ వలయు నని చెప్పినాడు.

సాక్షి విషయములందును, తప్తమాషాది ప్రమాణముల విషయము లందును యాజ్ఞవల్క్యస్మృతిలో నున్నంత వివరముగా మనుస్మృతిలో లేదు.

ప్రాయశ్చిత్తాదివిధులకు యాజ్ఞవల్క్యుడు ఇచ్చినంత ప్రాముఖ్యము మనువు ఇవ్వలే దనుట స్పష్టము.

---

1 Max Muller's Letter to W. H. Morley.

ఇట్లనేక విషయములలో యాజ్ఞవల్క్యస్మృతి మనుస్మృతి నధిగమించుచున్నది. కావున కేతన యాజ్ఞవల్క్యస్మృతిని గ్రహించినా డని చెప్పవచ్చును. ఈ సందర్భమున అతనికి విజ్ఞానేశ్వరకృత మితాక్షరవ్యాఖ్య యెంత ఉపయోగ పడినదో తన గ్రంథమునకు 'విజ్ఞానేశ్వరము' అని పేరు పెట్టుకొనుటవలననే తెలియుచున్నది.

### కేతన—విజ్ఞానేశ్వరీయము

ఇక కేతన ధర్మశాస్త్రము ననువదించుటకు గల కారణ మారయవలసియున్నది అది ఒక ప్రయోగాత్మకయుగ మనియు, అప్పుడే ప్రారంభింపబడుచున్న తెలుగు వాఙ్మయమును వృద్ధిపఱచుటకు కవులు పరిపూర్ణమైన సంస్కృతవాఙ్మయమునుండి వివిధ ప్రక్రియలను తెలుగున ప్రవేశపెట్టుటకు ప్రయత్నించి రనియు ప్రారంభముననే చెప్పబడినది. అట్లే కేతన కూడ ప్రయత్నించి తన రచనలలో వైచిత్ర్యమును కూర్చుకొన్నాడు. ఇట్టి ప్రక్రియాభేదములలో ఈ ధర్మశాస్త్ర మొకటి

అంతేకాక, క్రీ శ. 11, 12, 13 శతాబ్దములు మతవిషయికముగను మిక్కిలి ప్రాముఖ్యమును వహించుచున్నవి. బౌద్ధము, వైష్ణవమును నామావశిష్టములైనవి. జైనము పేరునకు మాత్రము నిల్చియుండినది. శ్రీ శంకరచార్యుల వారు ప్రారంభించిన వైదికమతోద్యమము, 11వ శతాబ్దినాటికి ఒక విశిష్టస్థితికి వచ్చినది 11వ శతాబ్దమున నన్నయ భారతమును వైదికమతోద్ధరణమునకై వ్రాసినాడు ఇంతలో క్రీ. శ. 12వ శతాబ్ది ప్రారంభమున వైదికమతముపై గొడ్డలిపెట్టు వంటి శైవము విజృంభించినది. దానితో వైదికమతోద్ధరణ మాగిపోవుటయే కాక, వైదికచారములు పూర్తిగా నశించినవి. వీనికి తోడు క్రీ. శ. 13వ శతాబ్దిలో మహమ్మదీయుల దండయాత్రలు దక్షిణహిందూదేశమువఱకును వ్యాపించి, వైదికాచారములను సర్వనాశన మొనర్చినవి. ఇట్టి సందర్భమున వైదికమతము నుద్ధరించు దృష్టితో పలువురు హిందూఆచారములకు ఆటపట్టులైన ధర్మశాస్త్రములను రచించిరి. హరదత్తుని 'హరదత్తమితాక్షర' వ్యాఖ్య (గౌతమధర్మశాస్త్రముపై), అతనిదే యగు 'ఉజ్జ్వలావ్యాఖ్య' (అపస్తంబసూత్రముల పై), సర్వజ్ఞనారాయణుని 'మన్వర్థవివృతి', గోవిందరాజ కృత 'గోవిందరాజీయము', గౌతమధర్మసూత్రములకు 'మస్కరీయభాష్యము', కల్లూకభట్టు

యొక్క 'మన్వర్థముక్తావళి', విజ్ఞానేశ్వరుని 'ఋజుమితాక్షరవ్యాఖ్య', జీమూత వాహనుని 'ధర్మరత్న, దాయభాగ వ్యవహార మాతృకలు', లక్ష్మీధరుని 'స్మృతి కల్పతరువు', హలాయుధుని 'బ్రాహ్మణసర్వస్వము', దేవణ్ణభట్టుయొక్క 'స్మృతిచంద్రిక', వరదరాజుయొక్క 'స్మృతిసంగ్రహము', హేమాద్రియొక్క 'చతుర్వర్గచింతామణి', అపరార్కుని 'యాజ్ఞవల్క్యసూత్రానుబంధము', బాలంభట్టుయొక్క 'లక్ష్మీవ్యాఖ్యానము' (పరాశరస్మృతికి) ఇత్యాది గ్రంథము లన్నియు ఇంచుమించు 11, 12, 13, శతాబ్దములలో వెలసినవే![1] కాని ఇవి యన్నియును సంస్కృతమున నున్నవి. ఇవి సర్వజనులకు సులభ సాధ్యములు గావు. కావున వీనిలో ద్రవిడసంప్రదాయమున కాటపట్టయినదియు సర్వస్మృతిగ్రంథములకును సారభూతమైనట్టిదయు నైన, విజ్ఞానేశ్వరీయసహిత యాజ్ఞవల్క్యస్మృతిని కేతన ఆంధ్రమున కనువదించినాడు. ఇదే విషయము నాతడు తన విజ్ఞానేశ్వరారంభమున "సకలశాస్త్రధర్మము" అను పద్యమున- "తెనుగున జెప్పెద సమస్త దేశీయులకున్"- అని విశదపఱచినాడు.

ప్రఖ్యాతమైన మనుస్మృతివంటి ధర్మశాస్త్ర గ్రంథముల నధిగమించి యుండుటచేతను, ద్రవిడాచారసాంప్రదాయముల కాటపట్టులైన పంచగ్రంథి యందు ప్రసిద్ధమైన దగుటచేతను, కేతన విజ్ఞానేశ్వరీయమును గ్రహించి యనువదించినా డని ముందే చెప్పబడినది.

ఇట్లు ధర్మశాస్త్రము ననువదించిన కేతనను ధర్మశాస్త్రకర్త యనవచ్చునా యని యాలోచింపవలసియున్నది. విశృంఖలమైన సంఘవ్యవహారములను హద్దులుమీరకుండ కాపాడునది ధర్మశాస్త్రము. కావున కేతనకాలపు మత పరిస్థితులను గమనించినచో నీతనినికూడ ధర్మశాస్త్రకర్త యనవచ్చు నని పించును కేతనయొక్క 'విజ్ఞానేశ్వరము' అనువాదగ్రంథమే యైనను, కొన్ని చోట్ల ఆ కాలపు పరిస్థితుల కనుగుణముగా మార్పుచేయబడినది. మూలమున లేనివి కొన్ని కలుపబడినవి. ఇట్లు కాలానుగుణముగా అనువదించిన కేతనను 'ధర్మశాస్త్ర' కర్త యనుటలో విప్రతిపత్తి లేదు. కాని ఈతడు ప్రసిద్ధస్మృతి కర్త లగు మనువు, యాజ్ఞవల్క్యుడు మొదలగు వారి కోవకు చెందడు. కాని ప్రసిద్ధస్మృతిగ్రంథముల నాధారముగా వేరువేరు స్మృతులను వెలయించిన

1. Dh. Kosa-I-P 2-Introduction.

దేవణ్ణభట్టు (స్మృతి చంద్రిక), వరదరాజు (స్మృతిసంగ్రహము), హలా యుధుడు (బ్రాహ్మణసర్వస్వము) మొదలగువారి కోవకు చెందును.

ఇక ఇట్లు చేయుటలో కేతన సాధించిన ప్రయోజనమును విచారింప వలసియున్నది. ఏమైనను ఇట్టి గ్రంథముయొక్క ప్రయోజనము ఆ కాలపు వారును, తరువాతి వారును అనుకరించుటయే. కేతన గ్రంథస్థము చేసిన అమూలకవిషయములు కొన్ని నేటివరకు గూడ వ్యవహారములో నున్నవి. ఉదాహరణమునకు దక్షిణదేశమున మేనత్త మేనమామ కూతులను వివాహమాడ చెల్లు నని చెప్పినాడు ఇది అమూలకమైన విషయము. దీనిని కేతన గ్రంథస్థము చేయుటచే ఆనాటి సంఘమున నది యసులులోనుంచినట్లు తెలియుచున్నది. అంతేకాక తరువాతి ధర్మశాస్త్రగ్రంథకర్త లగు ధర్మసింధువు కర్త మొదలగువా రీ విషయమును గూడ చెప్పినారు. అది తరువాత తరువాత నొక యాచారమై నేటికిని ప్రబలముగా దక్షిణదేశమున కన్పట్టుచున్నది ఇట్లే ఉత్తరదేశాచారము లను, కలియుగ నిషిద్ధములను, వ్యవహారవిషయములలో వచ్చిన మార్పులను, కేతన వివరించినాడు. ఇవి యన్నియు స్థలాంతరమున చర్చింపబడును.

**ఉపసంహారము**

ఇట్లు సుప్రసిద్ధమైన విజ్ఞానేశ్వరీయ సహిత యాజ్ఞవల్క్యస్మృతిని సంస్కృతమునుండి ప్రప్రథమముగా నాంధ్రమున కనువదించి, ఆంధ్రవాఙ్మయ మున ఒక విశిష్టస్థానము నాక్రమించుకొనినాడు కేతన. అంతేకాక అతనికి పూర్వము ఏ యితర ద్రావిడభాషలలోనికిని ధర్మశాస్త్రము అనువదింపబడినట్లు కన్పట్టదు. కావున ద్రావిడభాషలన్నిటిలోను ప్రప్రథమముగా తెనుగులోనికి ఇది యనువదింపబడినది. ఇట్లనువదించిన ఘనత కేతనకే దక్కినది.

# 3. అనువాదపద్ధతి

శాస్త్రగ్రంథములను, లక్షణగ్రంథములను అనువదించునపుడు పదాను వాదపద్ధతి యవలంబింపబడును. అనగా ఇందు అనువాదకుడు భావములనే కాక, పదములను గూడ ప్రమాణములుగా స్వీకరించి యథాతథముగా ననువదించును కావున అనువాదకుడు స్వాతంత్రించుట కిచట వీలులేదు. యాజ్ఞవల్క్య స్మృతి ధర్మశాస్త్రగ్రంథ మగుటవలన కేతన పదానువాదపద్ధతినే యవలంబించినాడు. కాని అచ్చటచ్చట కొన్ని చేర్పులు, కొన్ని మార్పులు, కొన్ని వదలివేయుటలు కన్పట్టుచున్నవి.

కేతన విజ్ఞానేశ్వరమున ఆచారకాండ కెక్కువ ప్రాధాన్య మిచ్చినట్లు కన్పట్టును. ఏలయన, స్వల్పశ్లోక పరిమితిగల శౌచప్రకరణము, దంతధావన విధి, ఘోనవిధి, బ్రహ్మచర్య గృహస్థ విధులు మున్నగు వానిని విస్తరించి వ్రాసినాడు. ఆ కాలమున భ్రష్టమగుచుండిన ఆచారముల నుద్ధరించుట కట్లు వ్రాసియుండవచ్చును. కాని జాతివివేక ప్రకరణము, భక్ష్యాభక్ష్య ప్రకరణము, ద్రవ్యశుద్ధి ప్రకరణము, గణపతికల్పము, గ్రహశాంతి ప్రకరణము మొదలగు వాని నేలనో వదలివేసినాడు

మూలములో రాజధర్మ ప్రకరణ మని ఆచారకాండచివర నొక ప్రకరణ మున్నది. ఇందు రాజధర్మములు కొన్ని వివరింపబడినవి. అట్లే వ్యవహారకాండ ప్రారంభమున మఱికొన్ని రాజధర్మములు వివరింపబడినవి. ఇట్లు రెండుచోట్ల వివరింపబడిన రాజధర్మముల నొక్కచోట చేర్చి, వానిని ఆచారకాండమునుండి తొలగించి రాజధర్మములతో సంబంధించు వ్యవహారకాండ ప్రారంభమున వ్రాసినాడు.

వ్యవహారకాండయందలి వేతనాదాన ప్రకారణము, సంవిద్వ్యతిక్రమ ప్రకరణము, ద్యూతసమాహ్వాయ ప్రకరణము, దండపారుష్య ప్రకరణము మొదలగు వానిని తగ్గించినాడు

వీనిని గూర్చి స్థలాంతరమున చర్చింపబడును.

యాజ్ఞవల్క్యస్మృతియందలి ప్రాయశ్చిత్తకాండకును, విజ్ఞానేశ్వర ప్రాయశ్చిత్తకాండకును సంబంధమే గోచరింపదు. ఏలయన విజ్ఞానేశ్వరములోని ప్రాయశ్చిత్తకాండ పద్యములకు మూలములు యాజ్ఞవల్క్యస్మృతిలోని వ్యవహారకాండ యందే కన్పట్టుచున్నవి. యాజ్ఞవల్క్యస్మృతిలోని వ్యవహారకాండలోని 157వ శ్లోకమునుండి విజ్ఞానేశ్వర ప్రాయశ్చిత్తకాండ ప్రారంభమై మూలములోని వ్యవహారకాండ పూర్తియగు సరికే విజ్ఞానేశ్వరములోని ప్రాయశ్చిత్తకాండము పూర్తియైనది

బాగుగా పరిశీలించగా నొకటి రెండు చోట్ల మాత్రము మూలమునందలి ప్రాయశ్చిత్తకాండకు సంబంధించినవిగా గోచరించు చోట్లున్నవి. విజ్ఞానేశ్వర ఆచారకాండలోని 69వ పద్యములో కేతన మౌనముతో భుజింపవలయు నని చెప్పినాడు. దీనికి మూలము యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండలో గన్పట్టదు. ప్రాయశ్చిత్తకాండలోని "గ్రామా దాహృత్య వా గ్రాసా నష్టౌ భుంజీత వాగ్యతః" (యా.—ప్రా.—54.) అను శ్లోకపాదమే మూలముగా గన్పట్టుచున్నది.

ఇట్లే విజ్ఞానేశ్వర ప్రాయశ్చిత్తకాండలో కేతన గురుతల్పగమన దోషమునకు శిక్షను చెప్పినాడు (వి.-ప్రా.-106). ఇది మూలమున రెండు చోట్ల కన్పట్టును. అందొకటి ప్రాయశ్చిత్తకాండమున నున్నది (యా.-ప్రా.-231... 233). రెండవది వ్యవహారకాండములోని మితాక్షరవ్యాఖ్యయందు (మితా.—పుట 271) గలదు ఇట్లు మూలమున రెండుచోట్ల నున్న దానిని కేతన ఒకేచోట చెప్పినాడు. సూక్ష్మముగా పరిశీలించినచో, కేతన పద్యమునకు మూలము విజ్ఞానేశ్వరు డుద్ధరించిన నారదస్మృతి వచనములే యని తత్సందర్భౌచిత్యమును బట్టి తేలికగా గ్రహింపవచ్చును.

ప్రాయశ్చిత్తకాండమును యాజ్ఞవల్క్యమహర్షి మరణసంబంధమైన అశౌచముతో ప్రారంభించి, చాండాలాది స్పర్శనమున చేయవలసిన విధులు, అమ్మరాని వస్తువులు, నాలుగు ఆశ్రమములందును ఆచరింపవలసిన విధులు, జీవాత్మల సంబంధము, శరీరోత్పత్తిక్రమము, ఆత్మస్వరూపము, తనచేతనే రచింపబడిన బృహదారణ్యకోపనిషత్ప్రసంగము- దానివలన జీవుడు పొందు జన్మాదులు, ధ్యానపద్ధతి, మహాపాతక-ఉపపాతకములు, పాతకులు జన్మాంతర

మున పొందు వివిధ జన్మములు, నరకములు, ప్రాయశ్చిత్తమువలన మహాపాత కోపపాతక నివృత్తివిధానములు, రహస్య ప్రాయశ్చిత్త విధానములు, కృచ్ఛభేద ములు, చాంద్రాయణాది వ్రతములు, చివరకు యాజ్ఞవల్క్యస్మృతికి ఫలశ్రుతి— అనువానిని వివరించినాడు. కేతన ఆశ్రమధర్మములను ఆచారకాండయందే చెప్పుటవలన ఇచ్చట వానిని గ్రహింపలే దనవచ్చును. కాని, అచ్చటి వాటికిని వీటికిని సంబంధమే లేదు. మహాపాతకోపపాతకములు, నరకములు, ప్రాయ శ్చిత్తవిధానములు, కృచ్ఛచాంద్రాయణాది భేదములు మొదలగు వానిపై నాటికి నమ్మకము పోయినట్లు కన్పట్టుచున్నది ఇట్టివాని కన్నిటికిని రాజదండనమే ప్రాయశ్చిత్తముగా విధింపబడెడిదేమో. అందువలననే కేతన వానికి రాజదండన మునే చెప్పినాడు కాని చాంద్రాయణాదికృచ్ఛ్రములను విధించలేదు.

కాని మూలములోని ప్రాయశ్చిత్తకాండను వదలివేసినను వ్యవహార కాండను రెండు విభాగములుగా జేయుట సమంజసము గాదు. ఏలయన, నిక్షేపాది పదునెనిమిది వ్యవహారములును కలిసియే వ్యవహారధర్మ మనబడును. అందువలననే యాజ్ఞవల్క్యాదీ పదునెనిమిదింటిని కలిపి వ్యవహారకాండముననే వ్రాసినాడు. కాని కేతన విజ్ఞానేశ్వరమున క్రయవిక్రయానుశయ ప్రకరణముతో వ్యవహారకాండ పూర్తియై స్వామిపాలనవివాద ప్రకరణముతో ప్రాయశ్చిత్తకాండ ప్రారంభింపబడుచున్నది.పదునెనిమిది వ్యవహారపదములును గలిసియే వ్యవహార కాండము గాన, ఈ విభజనము సమంజసముగా తోచదు. కాని ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ, ఉస్మానియావిశ్వవిద్యాలయ తాళపత్రప్రతులం దిట్లే యున్నది.

మూలమున ద్వాదశవిధ పుత్త్రుల నిర్ణయము దాయవిభాగ ప్రకరణమున చేయబడినది. దానిని కేతన ఆచారకాండయందు అష్టవిధవివాహముల యనంతరము వివరించుట చాల సమంజసముగా నున్నది.

విజ్ఞానేశ్వర ముద్రితప్రతియందు ఆచారకాండ తరువాత ప్రాయశ్చిత్త కాండ, అటుతరువాత, వ్యవహారకాండయు నున్నవి. కాని మూలమున 'ఆచార కాండ, వ్యవహారకాండ, ప్రాయశ్చిత్తకాండ' యను వరుసయం దున్నవి. ఈ అస్తవ్యస్తము కేతన చేసినాడనుటకు వీలులేదు. అతడు మూలము ననుసరించిన వరుసను పరిశీలించినచో విజ్ఞానేశ్వరములోని ప్రాయశ్చిత్తకాండ, వ్యవహార

కాండ తరువాతనే యుండవలె నని తోచును కాని ముద్రిత ప్రతియం దిట్లుండుట కొకకారణము మాత్రము కన్పట్టుచున్నది. అది విజ్ఞానేశ్వరమునకు భరతవాక్యము వంటిదైన "తజ్ఞులకు దెలియునట్లుగ" (వి.-వ్య.-152) అను పద్యము వ్యవహారకాండాంతమం దున్నది. ముద్రాపకులకు లభించిన తాళపత్రప్రతిలో అట్లుండియుండవచ్చును. కాని నాకు లభించిన అకాడమీ, విశ్వవిద్యాలయ తాళపత్రప్రతులు రెంటియందును ఈ పద్యము ప్రాయశ్చిత్త కాండాంతముననే గలదు. కావున ఈ అస్తవ్యస్తము కేతనదికా దని స్పష్టము.

ఇట్లే ఒక ప్రకరణములోని పద్యము లింకొక ప్రకరణములోనికి వచ్చి పడినవి. ఇట్టివి వ్యవహార ప్రాయశ్చిత్తకాండలందే గోచరించును. ఆచార కాండలో లేవు. వీనిని గూర్చి 'విజ్ఞానేశ్వర గ్రంథసంస్కరణ' మను వ్యాసమున చెప్పబడినది.

ఏదియెట్లున్నను మూలమునందలి 1011 శ్లోకసంఖ్య అనువాదమున 433 పద్యములలోనికి దిగినది. ఇందు చాలవఱకు విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యనుండి గ్రహింపబడినవే. కావుననే తన పుస్తకమునకు కేతన 'విజ్ఞానేశ్వర' మని పేరిడినా డనవచ్చును.

ఇంక కేతన మూలము నెంతవఱ కనుసరించినాడో, ఎచ్చటెచ్చట మార్చినాడో, ఎచ్చటెచ్చట అమూలకములను కలిపినాడో ఇతర స్మృతుల నెంతవఱ కనుసరించినాడో చూపబడును.

**మూలమున కనుసరణములు**

**1. భావానువాదము**

కేతన విజ్ఞానేశ్వరము యాజ్ఞవల్క్యస్మృతి కనువాదమగుటవలన మూలము ననుసరించిన తావు లనేకములు కన్పట్టును. అట్టివి కొన్ని ఉదాహరింప బడుచున్నవి :—

1. గర్భాష్టమేఽష్టమేవాబ్దే బ్రాహ్మణస్యోపనాయనమ్ ।
   రాజ్ఞా మేకాదశేసైకే విశామేకేయథాకులమ్ ॥ (యా.-ఆ.-14)
   ఆషోడశా దాద్వావింశా చ్చతుర్వింశాచ్చ వత్సరాత్ ।
   బ్రహ్మ క్షత్ర విశాం కాల ఔపనాయనికః పరః ॥ (యా.-ఆ.-37)

అత ఊర్ధ్వం పతం త్యేతే సర్వధర్మ బహిష్కృతాః ।
సావిత్రీ పతితా వ్రాత్యా వ్రాత్యస్తోమాదృతే క్రతోః ॥ (యా.-ఆ.-38)

అను దానిని—

గర్భాష్టమాదిగాఁగను షోడశాబ్దాంత ముపనయనము బ్రాహ్మణోత్తములకు,
బదునొకండాది యిర్వదిరెండు తుదగాగ నుపనయనము క్షత్రియులకు నెల్ల
బండ్రెండు మొదలు నిర్వదినాల్గు తుదగాగ వడుగు చేయగదగు వైశ్యులకును
నంతలో వడుగుచేయక తక్కెరేనియు బతితుడౌ నట మీద బ్రాహ్మణుండు.
(వి.-ఆ.-18)

అని కేతన అనువదించినాడు.

2. మాతు ర్యదగ్రే జాయంతే ద్వితీయం మౌంజి బంధనాత్ ।
బ్రాహ్మణ క్షత్రియ విశ స్తస్మా దేతే ద్విజాః స్మృతాః॥ (యా.-ఆ.-35)

అను దానిని—

వర్ణములు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర
లిందు మొదలి ముప్వురు ద్విజు లెట్లు లనిన
దల్లివలన నాచార్యు మతమ్మువలన
జన్మములు రెండు గలిమి నిశ్చయము గాన— (వి.-ఆ.-85)

అని కేతన అనువదించినాడు.

3. యదుచ్యతే ద్విజాతీనాం శూద్రా ద్దారోపసంగ్రహః ।
నైత న్మమమతం యస్మా త్తత్రాత్మా జాయతే స్వయమ్॥ (యా.-ఆ.-56)

అను దానిని—

మేలగు విప్రుడు శూద్రిని
నాలింగా జేసికొనుట యన్యాయం బా
యాలి యుదరమున విప్రుడు
పోలంగా దానె పుట్టి పుత్రుం డగుటన్— (వి.-ఆ.-94)

అని కేతన అనువదించినాడు.

4. మృతే జీవతి వాపత్యౌ యా నాన్య ముపగచ్ఛతి ।
సేహ కీర్తి మవాప్నోతి మోదతే చోమయా సహా॥ (యా.-ఆ.-75)

అను దానిని—

పతి యున్నను బతి చచ్చిన
నితరుఁ దాఁ బొందకున్న యీఁవుటా ఁ రి
క్షితి గీర్తియు పిమ్మట బా
ర్వతితోడ సఖిత్వమును ధ్రువంబుగ బడయున్— (వి -ఆ.-116)

అని కేతన అనువదించినాడు.

5. స్మృత్యాచార వ్యపేతేన మార్గేణాధర్షితః పరైః ।
ఆవేదయతిచే ద్రాజ్ఞే వ్యవహార పదం హి తత్ ॥ (యా -వ్య.-50)

అనుదానిని—

విచ్చలవిడి బలవంతుం
డచ్చుగ గారించుటయును నబలుడు చాలన్
నొచ్చి మహీపతి సభకున్
వచ్చి యెఱింగింప నదియె వ్యవహార మగున్-- (వి.-వ్య.-9)

అని కేతన అనువదించినాడు

6. దేశా ద్దేశాంతరం యాతి సృక్విణీ పరిలేఢి చ ।
లలాటం స్విద్యతే చాస్య ముఖం వైవర్ణ్య మేతి చ ॥
పరిశుష్య త్స్ఖలద్వాక్యో విరుద్ధం బహుభాషతే ।
వాక్చక్షుః పూజయతి నో తథోష్ఠౌ నిర్భుజత్యపి ॥
స్వభావా ద్వికృతిం యాతి మనోవాక్కాయ కర్మభిః ।
అభియోగేఽథ సాక్ష్యే వా స దుష్టః పరికీర్తితః॥ (యా.-వ్య.-13...15)

అను దానిని—

నెలకొని యొకచోట నిలువక పెదవులు నాలుక యందంద నాకుచుండు
నుదురు చెమర్చంగ వదనంబు వెల్లనై పలుకులు తడబడ బలుకుచుండు
వాతెఱ తడిలేక వఱువట్లు వట్టంగ బెదవులు దడుపుచు బెదిరి చూచు
బలుకులు జెయ్వులు దలపులు దగ నిజప్రకృతిబొందక కడువికృతిబొందు
సాక్షి చెప్పుచోట సభఁ బాడి యాడుచో
నెవ్వ డతడు దుష్టు డిరవు గాగ
నిట్టి లక్షణముల నెఱిగి సభ్యులు పాడి
నిర్ణయించి చెప్ప నేరవలయు— (వి.-వ్య.-45)

అని కేతన అనువదించినాడు.

7. చతుస్త్రి ద్వ్యేకభాగాస్స్యు ర్వర్ణశో బ్రాహ్మణాత్మజాః ।
క్షత్రజా స్త్రిద్వ్యేకభాగా విడ్జాస్తు ద్వ్యేకభాగినః॥ (యా.-వ్య.-123)

అను దానిని-

నాలుగు వర్ణములందును
నోలిని విప్రునకు బుట్టియున్న తనూజుల్
నాలుగు మూడును రెండును
బోలగ నొక్కటియు నంశములు గొనవలయున్— (వి.-వ్య.-131)

అని కేతన అనువదించినాడు.

8. ధనుశ్శత పరీణాహో గ్రామ క్షేత్రాంతరం భవేత్ ।
ద్వే శతే కర్వటస్యా న్నగరస్య చతుశ్శతం॥ (యా.-వ్య.-165)

అను దానిని—

ఊరికి జేనికి నడు మెడ
యారయగా నూఱువిండ్ల యంత వలయు సం
చారార్థము ఖర్వటమున
కా రెట్టియు బట్టణమున కా యినుమడియున్- (వి.-ప్రా.-18)

అని కేతన అనువదించినాడు.

9. అభిగంతాస్మి భగినీం మాతరం వా తవేతి చ ।
శపంతం దాపయే ద్రాజా పంచవింశతికం దమమ్॥ (యా.-వ్య.-203)

అను దానిని—

వాని తల్లి తోబుట్టుగు వాని యాలు
వాని లంజెలు వారికి దాను మగడ
ననుచు నీ క్రియ బూతాట మాడి తిట్టు
నతనిఁ గొనదగు బంచవింశతి పణములు- (వి.-ప్రా.-44)

అని కేతన అనువదించినాడు.

10. బందీగ్రాహాం స్తథా వాజి కుంజరాణాం చ హారిణాః ।
ప్రసహ్య ఘాతిన శ్చైవ శూలా నారోపయే న్నరాన్॥ (యా.-వ్య.-278)

అను దానిని-

నెఱిమాలి బందెవెట్టిన
నఱిముచె జంపినను గజము నశ్వము మ్రి చ్చె
పఱిగొనిన యట్టి వారల
గొఱుల దిగిచి చంపు టొప్పుఁ గువలయపతికిన్- (వి.-ప్రా.-93)

అని కేతన అనువదించినాడు.

ఇట్లు కేతన మూలమునందలి శ్లోకములను యథాతథముగా ననువదించి నాడు. ఇట్టి వనేకములు కలవు.

## 2. ప్రతిపదానువాదము

అవసరమగుచోట్ల కేతన పదపదమును అనువదించినాడు :-

1. సురాపీవ్యాధితా ధూర్తా వంధ్యా ర్థఘ్న్యప్రియవందా ।
స్త్రీప్రసూ శ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీ తథా॥ (యా.-ఆ.-3)

అను దానిని-

సురసేవించిన వాతివాడి యయినన్ సొమ్మెల్ల బోనాడినం
బురుషద్వేషిణియైన గొడ్డయిన నెప్డుం గూతులం గన్న మై
బరపౌ రోగము లున్న, ధూర్త యయినన్ భార్యం బెడంబాసి య
ప్పురుషుం డొండొక పెండ్లి యాడినను నొప్పుం దప్పు లేదేమియున్-
(వి.-ఆ.-114)

అని కేతన అనువదించినాడు.

2. తేషా మాద్య మృణాదానం నిక్షేపో(అ)స్వామి విక్రయః ।
సంభూయ చ సముత్థానం దత్తస్యా నపకర్మ చ॥
వేతనస్యైవ చా(ఆ)దానం సంవిదశ్చ వ్యతిక్రమః ।
క్రియవిక్రియానుశయో వివాద స్స్వామిపాలయోః॥
సీమావివాద ధర్మశ్చ పారుష్యే దండవాచికే ।
స్తేయం చ సాహసంచైవ స్త్రీసంగ్రహ మేవ చ ॥
స్త్రీ పుం ధర్మో విభాగశ్చ ద్యూత మాహ్వయ మేవ చ ।
పదా న్యష్టాదశైతాని వ్యవహార స్థితావిహేతి॥ (యా.-వ్య.-5)

అను దానిని—

అప్పుడు నిక్షేప మస్వామి యమ్మ్కట కూడి బేహారమ్ము లాడికొనుట
యిచ్చి క్రమముఁగొంట యిల గూలిపనిచేత తివిరి యొడంబాటు తిరుగబడుట
కొని యమ్మి మెనుచుట యనుచరస్వాముల వాదంబు పొలిమేరవలని పోరు
బెట్టు దిట్టుట మేనుముట్టి నోనడచుట చౌర్యంబు అంకాట సాహసంబు
నాలి మగని పోరు నర్థవిభాగంబు
జూద మనెడు నట్టి వాదు పుట్టు
జనులు కోరి వచ్చి సభ చెప్పుదురు దీని
దెలియ నడిగి విభుడు తీర్పవలయు- (వి.-వ్య.-17)

అని కేతన అనువదించినాడు.

3. తపస్వినో దానశీలాః కులీనాం సత్యవాదినః ।
ధర్మప్రధానా ఋజవః పుత్రవంతో ధనాన్వితాః ॥
త్ర్యవరా స్సాక్షిణో జ్ఞేయా శ్శ్రౌత స్మార్త క్రియాపరాః ।
యథా జాతి యథా వర్ణం సర్వే సర్వేషు వా స్మృతాః ॥
(యా.-వ్య.-67,68)

అను దానిని—

తపమును దానముం గులము ధర్మము సత్యము నార్జవంబు ని
క్కపుధనమున్ సుసంతతియు గల్గి శ్రుతి స్మృతి మార్గవర్తులై
చపలులు గాని వారిఁ దగు సాక్షులుగాఁ గొన వారు లేనిచో
నపగతదోషులైన జను లయ్యయి జాతులవార లందఱున్—
(వి.-వ్య.-101)

అని కేతన అనువదించినాడు.

ఇట్లు, అవసరమున్నచోట్ల పదమునకు పదము ననువదించినాడు కేతన.

## విజ్ఞానేశ్వరీయము ననువదించిన తావులు

యాజ్ఞవల్క్యస్మృతికి అనువాదప్రాయమైన తన గ్రంథమునకు విజ్ఞానేశ్వర మని పేరుపెట్టుటవలననే, కేతనకు విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యపై గల గౌరవము వ్యక్తమగుచున్నది. తన గ్రంథమున అనేక తావులందు మితాక్షర వ్యాఖ్య ననువదించినాడు :—

1 పాలొండె ముండులొండెన్
జాల గలిగి తోలుగలుగు సరసపుబుడకన్
శీలోత్కృష్టుడు ప్రాతః
కాలమున న్వలయు దంతకాష్ఠము చేయన్— (వి.-ఆ.-44)

అను కేతన పద్యమునకు యాజ్ఞవల్క్యస్మృతిలో మూలము లేదు.
దీనికి మితాక్షరలోని—

కంటక క్షీర వృక్షోత్థం ద్వాదశాంగుళ సమ్మితమ్ ।
కనిష్ఠ కాగ్రవత్ స్థూలం పర్వార్థ కృత సూచకమ్ ॥ (మితా.-ఆ.-98)

అను విజ్ఞానేశ్వరుని వచనమే మూలము కావలెను.

2. ఉత్తమసతి శూద్రులతోఁ
జిత్తజు సుఖకేలి వాంఛఁ జేసిన ప్రాయ
శ్చిత్తమున శుద్ధిబొందును
గత్తరి పురుషునకు బాయు గర్భం బైనన్— (వి.-ఆ-113)

అను పద్యమునకును మితాక్షరలోని— "అప్రకాశి తాత్మనో వ్యభిచారా త్పురుషాంతరసంభోగ సంకల్పాద్య పుణ్యాంతస్య ఋతౌ రజోదర్శనే శుద్ధిః-శూద్రకృతేతు గర్భే త్యాగః" (ఆ.-71)-అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

3. చూలై యుండగ నొకరుం
డాలింగా నేలుకొనిన యా గర్భమునం
దా లలన గన్న పుత్త్రుడు
పోలంగ సహోఢనామ పుత్త్రుండయ్యేన్— (వి.-ఆ.-130)

అను పద్యమునకును మితాక్షరలోని— "సహోఢజస్తు గర్భేస్థితో గర్భిణ్యాం పరిణీతాయాం యః పరిణీత స్సహోఢజః పుత్త్రః" (మితా.-ఆ.-129)—అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

4. తల్లియు దండ్రియు బుత్రుని
నొల్లక పుత్తెంచుటయును నుచితస్థితిమై
నుల్లం బలరగ జొచ్చిన
దెల్లం బపవిద్ధనామధేయ సుతుడగున్. (వి.-ఆ.-131)

అను పద్యమునకును మితాక్షరలోని—"అపవిద్ధో మాత్రా పిత్రా వా ఉభాభ్యాం వోత్సృష్టో యో గృహ్యతే స గృహీతః పుత్రః"(మితా.-ఆ.-129) అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

5 ఆ విప్రు లేడ్వురైనను
నేవురు ముువ్వురును నైన నిమ్మహిలో సం
భావిత సభయగు గావున
మూవు రవశ్యంబు వలయు ముఖ్యులు సభకున్- (వి.-వ్య.-3)

అను పద్యమునకు మితాక్షరలోని—

లోక వేదజ్ఞ ధర్మజ్ఞా స్సప్త పంచ త్రయో(అ)పి వా ।
యతోపవిష్టా విప్రాస్స్యుః సా యజ్ఞః సదృశీ సభా ॥ (మితా.-వ్య.-2)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

6. అర్థిఁ బిలిచి నీ కెవ్వఁడ
నర్థం బొనరించెఁ జెప్పు మని యాతనిచే
సార్థముగ నెఱిగి మఱి ప్ర
త్యర్థిం బిలిపింపవలయు నధిపతి సభకున్- (వి.-వ్య.-9)

అను పద్యమునకు మితాక్షరలోని—

కాలే కార్యర్థినం పృచ్ఛే త్ప్రణతం పురతస్థితమ్ ।
కిం కార్యం కా చతే పీడా మాభైషీ ర్బ్రూహి మానవ ॥
కేన కస్మిన్ కదా కస్మా త్పృచ్ఛా దేవం సమాగతం ।
ఏవం పృష్ట స్సయదబ్రూయా త్సభ్యై ర్బ్రాహ్మణై స్సహ ॥
విమృశ్య కార్యం న్యాయం చే దాహ్వానార్థ మతఃపరమ్ ।
(మితా -వ్య.-5)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

7. జాతక పెండ్లి యుత్సవము జన్నము జేయ దొడంగి యున్నచో
ప్రాఁగ రాజమంత్రులు తపస్వులు వశ్య లవశ్యకార్యముల్

ప్రీతి నొనర్చుచో దఱిమి పిల్వగ నప్పను లెల్ల దీఱగా
భూతలనాథు ముద్రఁగొని పోయిన భృత్యులు వారిఁ దేఁ దగున్—

అను (వి.-వ్య.-10) పద్యమునకు మితాక్షరలోని—

విమృశ్య కార్యం న్యాయం చే దాహ్వానార్థ మతఃపరమ్ ।
ముద్రాం వా నిక్షిపేత్ తస్మిన్ పురుషం వా సమాదిశేత్॥(మితా -వ్య -౧)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము

8. వ్యవహారాసక్తునికై
వ్యవహారంబునకు జొచ్చి నతడు గెల్చినన్
వ్యవహారంబున నోడిన
వ్యవహారాసక్తునికె జయాపజయంబుల్— (వి.-వ్య.-20)

అను పద్యమునకును మితాక్షరలోని— "యో యస్యార్థే వివదతే తయో ర్జయ పరాజయా వితి స్మరణాత్ । నియుక్త జయపరాజయౌ మూలస్వామినో రేవ" (మితా.-వ్య.-6)— అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

9. ఇది నా ప్రతిజ్ఞ యని ము
విదితంబుగ జెప్పి దాని విపరీతముగా
బదపడి చెప్పుట దప్పగు
నది తగవున నోడె ననుచె యన్యాయ మగున్— (వి.-వ్య.-24)

అను పద్యమునకు మితాక్షరలోని— "పూర్వ మావేదన కాలే అవేదితం తథా (ఏవ లేఖనీయం) న పున రన్యథా—అన్యథా వాదిత్వేన భంగప్రసంగాత్"— (మితా.-వ్య.-6) అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

10. ఒక పని బ్రతికెడి వారికి
నొక కులమున వారి కొక్క యూధమునకు బ
త్రిక చాలు సాక్షి సత్యము
లొకనాడును వలదు వారి యొడబాటునకున్— (వి.-వ్య.-33)

అను పద్యమునకును మితాక్షరలోని—

పూగశ్రేణీ గణాదీనాం యా స్థితిః పరికీర్తితా ।
తస్యాస్తు సాధనం లేఖ్యం న దివ్యం న చ సాక్షిణః ॥ (మితా.-వ్య.-22)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

11 పెలుచ నొకం డడుచుటకును
జలము మెయిం దిట్టుటకును సాహసమునకుం
బలవత్ప్రతికిం బత్రము
వలపదు దైవంబు సాక్షివర్గము జాలున్—  (వి.-వ్య.-34)

అను పద్యమునకు మితాక్షరలోని—

ప్రక్రాంతే సాహసే వాదే పారుష్యే దండవాచికే ।
బలోద్భవేషు కార్యేషు సాక్షిణో దివ్య మేవ చ ॥  (మితా.-వ్య.-22)

అను విజ్ఞానేశ్వరవచనములే మూలము.

12. వాకొను తెరువు జలంబున
బోక తెరువు వినక వాదు పుట్టినచో దా
నాకును సాక్షియు నేలా
యేకం బనుభవమె చాలు నేర్పడ దెలుపన్-  (వి.-వ్య.-36)

అను పద్యమునకు మితాక్షరలోని—

ద్వార మార్గ క్రియా భోగ జల వాహాదిషు క్రియా ।
భుక్తి రేపతు గుర్వీ స్యా న్న దివ్యం న చ సాక్షిణః॥  (మితా.-వ్య.-22)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

13. తలగొఱిగించి కుక్కడుగు తప్పక ఫాలమునందు వ్రాసి మున్
గల ధన మెల్ల బుచ్చుకొని గాడిద నెక్కగఁ జేసి గ్రామమున్
వెలువడ దోలిచిపుచ్చుటయు విప్రుని జంపుట క్షుద్రజంతులం
జొంపక చంపు తప్పు గలచోఁ దగి చంపుట ధర్మ మెమ్మెయిన్-
(వి.-వ్య.-42)

అను పద్యమునకు మితాక్షరలోని—

శిరసో ముండనం దండ స్తస్య నిర్వాసనం పురాత్ ।
లలాటే నాభిశస్తాంకః ప్రయాణం గర్దభేన చ॥  (మితా.-వ్య.-26)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

14. గురు దల్లిని దండ్రిని సో
దరుని నకారణమ ప్రల్లదముఁ బల్కిన ము
ష్కరుచేత నూఱుపణములు
ధరణీశుడు గొనుట నీతి దండువు పేరన్- (వి.-ప్రా.-43)

అను పద్యమునకు మితాక్షరలోని—

మాతరం పితరం జాయాం భ్రాతరం శ్వశురం గురుం
అక్షారయ చ్ఛతం దాప్యః పంథానం చా దద్గురో రితి॥ (మితా.-వ్య.-202)

అను విజ్ఞానేశ్వరుని వచనములే మూలము.

15. ముచెకినాటివారు మొఱకులు పెనపరు
లఱవవారు ద్విజుల కాన పెద్ద
యనుచు దేశభాషలను గులంబును దిట్టు
నతడు దండువచ్చు శతపణములు— (వి -ప్రా.-56)

అను పద్యమునకును మితాక్షరలోని—

తత్ర కలహప్రియాః ఖలు గౌడా ఇతి దేశాక్రోశః। నితాంతం లోలుపాః ఖలు ఇతి జాత్యాక్రోశః। క్రూరచరితా నను వైశ్వామిత్రా ఇతి కులాక్షేపః॥ (మితా.-వ్య.-202) అను విజ్ఞానేశ్వరవచనములే మూలము.

ఇట్లు కొన్ని చోట్ల విజ్ఞానేశ్వరుని మితాక్షరవ్యాఖ్య ననుసరించియును తన విజ్ఞానేశ్వరమును రచించినాడు కేతన. ఇవి యాజ్ఞవల్క్యస్మృతిలో కూడ చెప్పబడినను వీనికి సరియైన మూలములు విజ్ఞానేశ్వరవ్యాఖ్యయందే గలవు.

**మితాక్షరలో నుదాహరింపబడిన ఇతర స్మృతుల యనుకరణము**

కేతన తన విజ్ఞానేశ్వరమున విజ్ఞానేశ్వరీయ వ్యాఖ్య ననుసరించుటయే కాక, విజ్ఞానేశ్వరీయమున ఉద్ధరించబడిన వసిష్ఠ, కాత్యాయన, నారద, వ్యాస, మను స్మృతులయందలి భాగములను గూడ కొన్నిచోట్ల అనువదించుకొనినాడు.

1. **పుత్త్రులు** లేరు నాకు నిది **పు**త్రిక దీని నలంకరించి నీ
క్షేత్రము గాగ నిచ్చెద నకిల్బిషమానస నీకు దీనికిం

బుత్త్రుడు పుట్టగా నతడు పుత్త్రుడు నా కని పల్కి కొన్న యా
పుత్త్రుడు నౌరసుండు సరిపుత్త్రుల కెల్లను బెద్ద లిద్దఱున్-(వి.ఆ.-120)

అను పద్యమునకు మూలము యాజ్ఞవల్క్యస్మృతిలో లేదు. కాని విజ్ఞానేశ్వరుడు తన ఋజుమితాక్షరవ్యాఖ్యలో నుదాహరించిన—

అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్య మలంకృతాం ।
అస్యాం యో జయే త్పుత్ర స్సమే పుత్రో భవే దితి॥ (మితా.-వ్య.-126)

అను వసిష్ఠస్మృతి శ్లోకము మూల మని చెప్పవచ్చును.

ఇట్లే—

2. పెనకువ నోడిన యతనికి
ధనమరువం బూటయొకడు దావలయు నతం
డును దొరక కుండెనేనియు
జనపతి తన భృత్యు నైన జాలింపనగున్— (వి.-వ్య.-21)

అను అమూలక పద్యమునకు మూలము మితాక్షరవ్యాఖ్యలోని—

అథచే త్ప్రతిభూ ర్నాస్తి కార్య యోగ్యస్తు వాదినః ।
స రక్షితోసౌ దినస్యాంతే దద్యా ద్భృత్యాయ వేతనమ్॥ (మితా.వ్య.-100)

అను కాత్యాయనోక్తియే మూలము.

3. ఒక్కడు మానుష మూదగ
నొక్కడు దైవంబు నూది యొడబడకున్నన్
నిక్కపు మానుషముం గొని
తక్కువ పెనకువలు దీర్ప దగు సభ్యులకున్— (వి.వ్య.-31)

అను పద్యమునకు కాత్యాయనస్మృతిలోనిదిగా మితాక్షరవ్యాఖ్యయందు ఉదాహరింపబడిన—

యద్యేకో మానుషీం బ్రూయా దన్యో బ్రూయాత్తు దైవికీం ।
మానుషీం తత్ర గృహ్ణీయా న్నతుదైవీం క్రియాం నృప॥ (మితా.వ్య.-22)

అను శ్లోకమే మూలము.

4. తండ్రితోడ గొడుకు ధరణీశుతో బంటు
పురుషుతోడ భార్య గురునితోడ

శిష్యుడోటలేక చెనసి పైబడి సభ
బాడియాడ జనుట పాడి గాదు— (వి.వ్య.-53)

అను పద్యమునకు మితాక్షరవ్యాఖ్యలో నుదాహరింపబడిన—

గురో శ్శిష్యే పితుః పుత్రే దంపత్యో స్స్వామిభృత్యయోః ।
విరోధేతు మిథ స్తేషాం వ్యవహారో న సిద్ధ్యతి ॥ మితా -వ్య -31)

అను మనుస్మృతిలోని శ్లోకమే మూలము.

5. ధనము గని యిచ్చి నతనికి
జనపతి షష్ఠాంశ మిచ్చి చన నాలవపా
ల్ధనము గొని యొడయునికి ద
క్కిన ధన మిచ్చుటను ధర్మకీర్తులు గలుగున్— (వి.-వ్య.-63)

అను అమూలకపద్యమునకు మితాక్షరవ్యాఖ్యలోని— ప్రణష్ట స్వామిక మధిగమ్య రాజ్ఞే ప్రబ్రూయు ర్విఖ్యాప్య సంవత్సరం రాజ్ఞా రక్షమూర్ధ్వ మధిగంతు శ్చతుర్థాంశో రాజ్ఞ శ్శేష ఇతి (మితా.-వ్య.-32)—

అను గౌతమస్మృతి వచనమే మూలము. కాని యిచ్చట మూలమున జెప్పబడిన సంవత్సర కాలపరిమితిని కేతన గ్రహింపనేలేదు. అంతేకాక— "ప్రభు వా ద్రవ్యము నష్టు వ్యయముచేసిన వెనుక ద్రవ్యస్వామి వచ్చె నేని ప్రభు వా ద్రవ్యమును బొక్కసమునుండి యెత్తి ఇప్పించవలయు నని మూల మున నుండగా దానిని కూడ కేతన వదిలివేసినాడు.

6. సిచ్చ సిచ్చ వడ్డి నెల నెల ప డ్డొడ
బొటు వడ్డి వడ్డి పైని వడ్డి
యనగ నాల్గు దెఱగు లయ్యె నా వడ్డి దా
దగవుతోడ నెక్కు దరతరంబు— (వి.-వ్య.-66)

అను పద్యమునకు మితాక్షరలోని—

కాయికా కాలికా చైవ కారితా చ తథాపరా ।
చక్రవృద్ధిశ్చ శాస్త్రేషు తస్య వృద్ధి శ్చతుర్విధా ॥ (మితా.-వ్య.-36)

అను నారదోక్తియే మూలము.

7. రోయిగాని పెట్టజాలక
ప్రాయిడియై యరుగు నతడు బరదేశము దా
బోయి నతడు మూడు నెలల్
పోయిన రుది వడ్డి సహితముగ బెట్టదగున్— (వి.–వ్య.–69)

అను పద్యమునకు మితాక్షరలోని—

కృతోద్ధార మదత్వా యో యాచితస్తుదిశం వ్రజేత్ ।
ఊర్ధ్వం మాసత్రియా త్తస్య త ద్ధనం వృద్ధి మాప్నుయాత్॥
(మితా.–వ్య.–37)

అను కాత్యాయనోక్తియే మూలము.

8. ఎనిమిది యేడులు పసపడి
యెనిమిది యేండ్లకును బాలు డెడ యెఱుగడు గా
వున బాలు డెన్ని భంగుల
జనకుని ఋణ మరుప జనదు చను నటమీదన్— (వి.–వ్య.–83)

అను పద్యమునకును మితాక్షరలోని—

గర్భస్థై స్సదృశో జ్ఞేయ అష్టమా ద్వత్సరా చ్ఛిశుః ।
బాల ఆషోడశాద్వర్షా త్పోగండ శ్చేతి శబ్ద్యతే॥
పరతో వ్యవహారజ్ఞ స్స్వతంత్రః పితరా మృత । ఇతి ।

యద్యపి పితృమరణా దూర్ధ్వం బాలో(అ)పి స్వతంత్రో జాత స్తథా నర్తథా గృవతి॥ (మితా.–వ్య.–46)—

అను నారదవచనమే మూలము.

9. అరువంగ బూటపడినత
డరువక తాఁ జచ్చె నేని నాతని పుత్రుం
డరువదగు మొదలు తత్సుతు
డరువం బని లేదు ధర్మ మారసి చూడన్— (వి.–వ్య.–87)

అను పద్యమునకును మితాక్షరలోని—

ఋణం పైతామహం పౌత్రః ప్రాతిభావ్యా గతం సుతః ।
సమం దద్యా త్తత్సుతౌ తు న దాప్యా వితి నిశ్చయః॥ (మితా --వ్య.-53)

అను వ్యాసవచనమే మూలము.

10. ఒక్క చాయ పూట యొకడు పరదేశ
మరుగ గొడుకు తండ్రి యట్ల యచ్చు
దండ్రి చచ్చెనేని దనయు డా యెకచాయ
పూట తండ్రిపాలు పూని యిచ్చు— (వి.-వ్య.-90)

అను పద్యమునకును మితాక్షరలోని—

ఏక చ్ఛాయా ప్రవిష్టానాం దాప్యో య స్తత్ర దృశ్యతే ।
ప్రోషితే తత్సుత స్సర్వం పిత్రంశంతు మృతే సమమ్॥ (మితా -వ్య.-54)

అను కాత్యాయనోక్తియే మూలము.

11. అర్థి దోడై చ్చిన నాకుల నేర్పడ లిఖియింపదగువాడు లిఖిత సాక్షి
మఱవక యీయర్థ మెఱుగు మీ వని యప్డు తలపింపబడువాడుతలపుసాక్షి
యెందేని బో వచ్చు యెల్లకార్యములు నేర్పడ విన్నవా డబ్బాటుసాక్షి
యర్థి తనంత రహస్యంబు సాక్షిగా గొన్నాతడు మఱి గూఢసాక్షి

యితడు నీతడు సాక్షి యీ యిద్దఱకును
సాక్షి యన నాత డుత్తరసాక్షి యయ్యె
వీర లేవురు కృతసాక్షు లైరి మీద
నకృతసాక్షు లార్వురు గల రవనిమీద- (వి.-వ్య.-100)

అను పద్యమునకు మితాక్షరలోని—

అర్థినా స్వయమానీతో యో లేఖ్యే సన్నివేశ్యతే ।
స సాక్షీ లిఖితో నామ స్మారితః పత్రకాదృతః ॥
యస్తు కార్యప్రసిద్ధ్యర్థం దృష్ట్వా కార్యం పునః పునః ।
స్మార్యతే చార్థినా సాక్షీ సస్మారిత ఇహోచ్యతే ॥
యస్తు యదృచ్ఛయా(ఆ)గతస్సాక్షీ విధీయతే స యదృచ్ఛాభిజ్ఞకః ।
య శ్శ్రావ్యతే స్థితో గూఢో గూఢసాక్షీ స ఉచ్యతే ॥

సాక్షిణా మపి యస్సాక్ష్య ముపర్యుపరి భాష్యతే ।
శ్రవణా చ్ఛ్రావణాద్వాపి ససాక్ష్యుత్తర సంజ్ఞికః ॥ (మితా.-వ్య.-113)

అను వారైదుగురును సాక్షు లను కాత్యాయనుల శ్లోకములే మూలము. వీరుకాక అకృతసాక్షులు ఇంక ఆరురకములవారిని నారదుడు చెప్పినాడు. వారు—

గ్రామశ్చ ప్రాడ్వివాకశ్చ రాజాచ వ్యవహారిణా ।
కార్యే ష్వధికృతో యస్స్యా దర్థినా ప్రహితశ్చయః॥

కుల్యాః కులవివాదేషు విజ్ఞేయా స్తేపి సాక్షిణాః॥ (మితా.-వ్య.-113)
అనువారు. కాని కేతన ఈ మిగిలిన ఆరుగురను గూర్చి చెప్పక, "అకృత సాక్షు లార్వురు గల రవనిమీద" యని చెప్పి వదిలివేసినాడు.

12. సత్యమంతయు జెడు సాక్షి బొంకిన నని విప్రవంశజులకు వెలయ జెప్పి
వాహనాయుధములు వ్యర్థంబులగు బొంకుపలికిన నని క్షత్రియులకు జెప్పి
గోధన ధాన్యముల్ గూడక చెడు నని సభను వైశ్యులకును జాటి చెప్పి
పాపంబు లన్నియు బ్రాపించు బొంకిన నని శూద్రజాతి కందంద జెప్పి
యివ్విధంబున సాక్ష్యుల కెల్ల దెలిపి
ప్రాఙ్ముఖంబుగ నిల్పి యేర్పడగ నడిగి
మంచివారలు చెప్పిన మాట యూని
పాడి చెప్పుట నీతి సభాసదులకు— (వి.-వ్య.-106)

అను పద్యమునకు మితాక్షరలోని—

సభాం తస్సాక్షి ణస్సర్వా నర్థి ప్రత్యర్థి సన్నిధౌ ।
ప్రాడ్వివాకో నియుంజీత విధినా(అ)నేన సాంత్వయన్॥
దేవ బ్రాహ్మణ సాన్నిధ్యే సాక్ష్యం పృచ్ఛేదృతం ద్విజాన్ ।
ఉదఙ్ముఖా న్ప్రాఙ్ముఖా న్వా పూర్వాహ్ణే వై శుచిశ్శుచీన్॥
ఆహూయ సాక్షిణః పృచ్ఛే న్నియమ్య శపథై ర్భృశమ్ ।
సత్యేన శాపయే ద్విప్రం క్షత్రియం వాహనాయుధైః ।
గోబీజ కాంచనై ర్వైశ్యం శూద్రం సర్వైస్తు పాతకైః॥(మితా.వ్య.-71-1/2)

అను కాత్యాయనోక్తియే మూలము.

13. విను నూరుమాడలకు విష
మెనుబదిటికి నగ్ని యఱువదింటికిని జలం
బును నలువదింటికిని దుల
యును నిడి తెలిగొనుట ధర్మ ముర్వీశులకున్— (వి.-వ్య.-116)

అను పద్యమునకు మితాక్షరలోని—

జ్ఞాత్వా సంఖ్యాం సువర్ణానాం శతనాశే విషం స్మృతమ్ ।
అశీతేస్తు వినాశే వై దద్యాచ్చైవ హుతాశనం ॥
షష్ట్యా నాశే జలం దేయం చతుర్వింశతివై ధటం॥(మితా.-వ్య.-96-1/2)

అను కాత్యాయనుని వచనములే మూలము. కాని, దీని తరువాత కాత్యాయనుడు "ముప్పదిసువర్ణములయందు గాని, ముప్పదియైదుసువర్ణములయందు గాని కోశ దివ్యమును, దానిలో సగమందును నాలవపాలునందును తండులదివ్యమును, అంతకు తక్కువ విషయములలో లౌకికక్రియలు- అనగా శపథములను చేయించుట- చేయవలయును. ఇట్లు విచారించి జరిగింపుచుండు భూపాలునకు ధర్మార్థములు చెడకుండును" (మితా.-వ్య.-96-1/2) అని విశేషముగా చెప్పినాడు. కాని, కేతన ఈ భాగమును వదలివేసినాడు.

14. జనకుడు తను జదివించక
జనకుని ధనమైన గుడిచి చదువక తన యం
తన కుడిచి చదివి పడసిన
ధనముం బాలడుగ లేదు దాయాదులకున్— (వి.-వ్య.-129)

అను పద్యమునకును మితాక్షరలోని—

అనుపఘ్నన్ పితృద్రవ్యం శ్రమేణ యదుపార్జయేత్ ।
దాయాదేభ్యో న తద్దద్యా ద్విద్యయా లబ్ధమేవ చ ॥ (మితా.-వ్య.-117)

అను మనుస్మృతిలోని శ్లోకమే మూలము.

15. జనకుని వస్త్రంబులు వా
హనములు శయ్యలును దొడవు లశ డీల్గిన నా
తని శ్రాద్ధంబున గుడిచి న
తనికిం దగు బుచ్చుకొనగ దగదు సుతులకున్— (వి.-వ్య.-133)

అను పద్యమునకు మితాక్షరలోని—

వస్త్రాలంకార శయ్యాది పితుర్య ద్వాహనాదికం ।
గంధమాల్యై స్సమభ్యర్చ్య శ్రాద్ధభోక్త్రే తదర్పయేత్ ॥
(మిత్యా.-వ్య.-117)

అను బృహస్పత్యుక్తియే మూలము.

16. వెలగూడి మెచ్చి నెయ్యము
దలచి వివాహంబుకొఱకు ధర్మార్థము పెం
పలపడగా నుపకారికి
దలకొని యిచ్చిన ధనంబు దగదు మరల్పన్— (వి.-ప్రా.-28)

వెఱచినవానిచే వెరవఱువానిచే మత్తుచేతను మదోన్మత్తుచేత
బాలునిచే శోకపరవశుచే రోగవిహ్వలుచే గ్రోధవివశుచేత
గొన్న ధనంబులును గుటిలధర్మంబుల గుటిలవిద్యలవెంట గొన్న ధనము
మఱపున గొన్న సొమ్మఱగొన్న లంచంబు తగని వాడిచ్చిన నగవుటీగి
మచ్చరమ్మునసై యొరు డిచ్చు ధనము
చేయబూనిన కార్యంబు చేయ కొరుని
చేత గొన్న ధనంబు ప్రీతితోడ
మగుడ నీకుంట యెంతయు దగవు కాదు- (వి.-ప్రా.-29)

అను పద్యములందు దత్తము, అదత్తము అను రెండు రకముల ధనమును కేతన జెప్పినాడు. దత్తమనగా న్యాయముగా నీయబడినది. దీనిని తిరిగి ఇయ్య వలసిన అవసరములేదు. అదత్తమనగా అవిజ్ఞానముతో నివ్వబడిన ధనము తిరిగి ఇయ్యకపోవుట. ఈ దత్తాదత్తధనములు వరుసగా ఏడు, పదునారు రకము లని నారదుడు చెప్పినాడు :-

పణ్య మూల్యం భృతిస్తుష్ట్యా స్నేహా త్ప్రత్యుపకారతః ।
స్త్రీశుల్కానుగ్రహార్థం చ దత్తం దానవిదో విదుః ।
అదత్తంతు భయ క్రోధ శోకావేశ రుజాన్వితైః ।
తథోత్కోచ పరీహా సవ్యత్యాసచ్ఛల యోగతః॥
బాలమూఢా స్వతంత్రార్థమత్తోన్మత్తోపవర్జితమ్ ।
కర్తా మమేదం కర్మేతి ప్రతిలాభేచ్ఛయా చ యత్॥

అపాత్రేపాత్ర మిత్యుక్తే కార్యే చాధర్మ సంహితే ।
యద్దత్తం స్యా దవిజ్ఞానా దదత మితి తత్ స్మృతమ్॥ (మితా.వ్య.-174)

అని మితాక్షరలో చెప్పబడిన నారదవచనములే కేతన పద్యమునకు మూలము.

17. క్రమమతి శూద్రుడు విప్రో
త్తము పైనిం దప్పులేక తా గర్వితుడై
యుమిసిన బెదవులు గోయుట
యుమికొలఁ దునిపించు టుచిత మర్వీశులకున్— (వి.-ప్రా.-46)

అను పద్యమునకు మితాక్షరలోని—

అవనిష్ఠీవతోదర్పా ద్ద్వావోష్ఠౌ ఛేదయే న్నృపః । (మితా.-వ్య.-213)

అను మనువచనములే మూలము. యాజ్ఞవల్క్యస్మృతిలో నిష్ఠ్యూతస్పర్శనమున 20 పణముల దండన మని యుండగా కేతన దానిని వదలివేసి వ్యాఖ్యలోని మనువచనములనే అనువదించినాడు.

18. వెల యెనిమిది యగు పాలును
వెల నాల్గవపాలు నోలి విడువగ వలయున్
తొలు రేవున మలు రేవున
జెలువేదగ జాకి చీర చేటిన చోటన్- (వి.-ప్రా.-62)

అను పద్యమునకు మితాక్షరలో—

మూల్యాష్టభాగో హీయేత సవృద్ధౌ తస్య వాస సః ।
ద్విఃపాద స్త్రి స్తృతీయాంశ శ్చతుర్థౌ తే(అ)ర్థ మేవ చ॥
(మితా.-వ్య.-236)

అను నారదుని వచనమే మూలము.

19. వెలగొని యమ్మిన బండము
తలకొని వేఱొకని కమ్మ దగ దమ్మిన దా
వెల యినుమడి యొడయనకిని
వెల యినుమడి రాజునకును విధి నరువదగున్— (వి.-ప్రా.-76)

అను పద్యమునకు మితాక్షరలోని—

అన్యహస్తేతు విక్రీతం యో అన్యస్మై ప్రయచ్ఛతి।
ద్రవ్యం తద్ద్విగుణం దాప్యో వినయం తావ దేనతు॥ (మితా.-వ్య.-255)

అను నారదోక్తియే మూలము.

20. తురగమునకు బణము పురుషున కరపణ
మాడదానికైన నందు సగము
వ్రేగు ముట్టునందు వ్రేగు విడుపునను
నోడ కూలి గొనుట యుచిత మండ్రు— (వి.ప్రా.-86)

అను పద్యమునకు మితాక్షరలోని—

పణం యానాంతరే దాప్యః పౌరుషో(అ)ర్థపణాంతరే।
పాదం పశుశ్చ యోషిచ్చ పాదార్ధం రిక్తకః పుమాన్॥ (మితా.-వ్య.-261)

అను మనుస్మృతి వచనమే మూలము.

21. గీతవిదునిచేత విన్నాణిచేతను
దపసిచేతఁ బిన్నదానిచేత
రాయబారిచేత రాజపురుషుచేత
గూలి పుచ్చుకొనుట చాల దప్పు— (వి.ప్రా.-87)

అను పద్యమునకు మితాక్షరలోని—

నభిన్న కార్షాపణ మస్తి శుల్కం న శిల్ప వృత్తౌ న శిశౌ న దూతే।
న భైక్ష లబ్ధే న హుతావశేషే న శ్రోత్రియే ప్రవ్రజితేన యజ్ఞః॥
(మితా.-వ్య.-261)

అను మనువచనమే మూలము. కాని, మూలమున 'శిశౌ' అనియున్నచోట ముద్రితప్రతియందు 'పిన్నదాని' యని యున్నది. దానిని 'పిన్నవాని' అని మార్చినచో మూలమునకు సరిపోవును. 'దా, వా'లకు ఎక్కువ భేదము ఉండదు గావున, తాళపత్రప్రతులలోని 'వా' కు 'దా' అని వ్రాసి పొరపాటుపడుటకు అవకాశ మున్నది. 'పిన్నవాని' అని సరిచేసిన నది 'మూలమునకు సరిపోవును.

22. క్రుచ్చును బట్టిన మాత్రన
చెచ్చర దండింప కతనిచే దెలిగొని వా

డచ్చెైన విడువు నిక్కపు
బ్రముచ్చెైనం దగిన దండముం గొనవలయున్— (వి.-ప్రా.-91)

అను పద్యమునకు మితాక్షరలోని—

అన్యహస్తా త్పరిభ్రష్ట మాకామా దుత్థితం భువి।
చోరేణ వా ప్రతిక్షిప్తం లోప్త్రం యత్నా త్పరీక్షయేత్॥
అసత్యా స్సత్య సంకశా స్సత్యా శ్చాసత్య సన్నిభాః ।
దృశ్యంతే వివిధాభావా స్తస్మా ద్యుక్తం పరీక్షణమ్॥ (మితా.-వ్య.-226)

అను నారదవచనములే మూలము.

23. వెలయగ సొమ్ముతోడ ముడివిడ్పుల బట్టిన జుట్టవ్రేలితో
గలయగ బెద్దవ్రేల్నఱకి క్రమ్మఱ పీడ్చిన గాలుఁజేయునుం
జలమఱ దున్మి మూడవఁగుసారి సహింపక యూరెఱుంగగా
దల దెగవ్రేసి చంపు టుచితంబగు నాయకులైనవారికిన్- (వి.-ప్రా.-95)

అను పద్యమునకు మితాక్షరలోని—

అంగుళీగ్రంథభేదస్యఛే దయే త్ప్రథమే గ్రహే।
ద్వితీయే హ స్తచరణౌ తృతీయే వధ మర్హతి॥ (మితా.-వ్య.-272)

అను మనువచనములే మూలము.

24. తల్లితోబుట్టువు తండ్రితోబుట్టువు తల్లిదండ్రుల సహోదరుల సుతలు
తన తోడబుట్టువు తన తోడబుట్టినవారల సుతలు భూవరుల సుతలు
తనయుని కాంతయు దన కన్నకూతురు గోడలు నత్తయు గోత్రజలును
బతిహితవ్రతయైన బ్రాహ్మణ భార్యయు జెలికాని సతియు శిష్య సతియు
గురుని సతియు దాదియు ననంగ బరగువారి
గవయు కష్టుండు గురుతల్పగామి వాడు
ఉత్తమబ్రాహ్మణుఁడు గాక యుండెనేని,
చంప కాతని కోరును ద్రెంప వలయు— (వి.-ప్రా.-106)

అను పద్యమునకు మితాక్షరలోని—

మతా మాతృష్వసా శ్వశ్రూ ర్మాతులనీ పితృష్వసా।
పితృవ్యసఖి శిష్యస్త్రీ భగినీ తత్సఖీ స్నుషా।

దుహితా(అ)చార్యభార్యా చ సగోత్రా శరణాగతా।
రాజ్ఞీ ప్రవ్రజితా ధాత్రీ సాధ్వీ వర్ణోత్తమా చ యా॥
అసామాన్యతమాం గచ్ఛన్ గురుతల్పగ ఉచ్యతే।
శిశ్నస్యోత్కర్తనా త్తత్ర నాన్యోదండం విధీయతే॥ (మితా.-వ్య.-234)

అను నారదోక్తియే మూలము. ఇదియే మూలమున ప్రాయశ్చిత్త కాండములో—

సఖిభార్యా కుమారీషు స్వయోని ష్వంత్యజాసు చ।
సగోత్రాసు సుత స్త్రీషు గురుతల్ప సమం స్మృతమ్॥
పితు స్స్వసారం మాతుశ్చ మాతులానీం స్నుషా మపి।
మాతు స్సపత్నీ భగినీ మాచార్య తనయాం తథా॥
ఆచార్య పత్నీం స్వసుతః గచ్ఛంస్తు గురుతల్పగః ।
లింగం చిత్వా వధ స్తస్య సకామా యా స్త్రియా మపి ॥
(మితా.-ప్రా -231...233)

అని తిరిగి చెప్పబడినది. కాని, అనువదింపబడిన వరుసను బట్టి పరిశీలించినచో నది మూలమునందలి ప్రాయశ్చిత్తకాండములోని భాగమును కాక, మితాక్షర లోని నారదస్మృత్యనుసరణమే యని బోధపడును

25. ఒడబడిని పణ్యకాంతల
యొడలను నఖ దంత ఘాత మొనరించిన వా
డొడబడనిచ్చిన రోవెల
కడరగ నెనిమిది పణంబు లరువగ వలయున్- (వి.-ప్రా.-113)

అను పద్యమునకు మితాక్షరాలోని—

అప్రయచ్ఛం స్తథా శుల్క మనుభూయ పుమాన్ స్త్రియం।
అక్రమేణ చ సంగచ్ఛన్ ఖాదన్ దంత నఖాదిభిః॥
అయోనౌ వాభిగచ్ఛే ద్యో బహుభి ర్వాభివాసయేత్।
శుల్క మష్టగుణం దాప్యో వినయం తావ దేనతు॥ (మితా.-వ్య.-290)

అను నారదోక్తియే మూలము. కాని ఇచ్చట మూలములో 'అష్టగుణం' అని యుండగా ముద్రితప్రతియందు 'ఎనిమిది పణంబు'లని యున్నది. ఇది ముద్రణ దోషము కావచ్చును. ఇచ్చట 'ప'కు బదులు 'గు' అని యున్నచో మూలము నకు సరిపోవును. కావున 'ఎనిమిది గుణంబు' లని యుండుట లెస్స. ఇచట విశ్వవిద్యాలయ తాళపత్రప్రతియందు 'ఎనిమిది గుణంబు' లనియే యున్నది.

26. ఆయుధంబులుగల బంట్ల యాయుధములు
వాద్యములవారి వాద్య యాతోద్యములును
గర్మకారుల కర్మోపకరణములును
గొనరు రాజులు ధనములు గొనర యేని— (వి.-ప్రా.-135)

అను పద్యమునకు మితాక్షరలోని—

ఆయుధా న్యాయుధీయానాం వాహ్యాదీ న్వాహ్యాజీవినాం॥
వేశ్యాస్త్రీనా మలంకారా న్వాద్యాతోద్యాది తద్విదాం॥
యచ్చ యస్యోపకరణం యేన జీవంతి కారుకాః।
సర్వస్వహరణేప్యేత న్న రాజా హర్తు మర్హతి॥ (మితా.-వ్య.-300)

అను నారదవచనములే మూలము.

27. నలి శూద్రుడు విప్రాకృతి
దలకొని పితృభోజనముల తఱి జొచ్చిన గెం
పలవడ గాగిన యినుమున
సొలవక జన్నిదము నొప్ప జూడగవలయున్— (వి.-ప్రా.-138)

అను పద్యమునకు మితాక్షర లోని—"శ్రాద్ధభోజనార్థం పున శ్శూద్రస్య విప్ర వేషధారిణా స్తప్తశలాకయా యజ్ఞోపవీతాది వద్వపుష్యా లిఖే దితి స్మృత్యంత రోక్తం ద్రష్టవ్యం"- (మితా.-వ్య.-302)

అను స్మృత్యంతరవాక్యమే మూలము.

28. జీవనము కొఱకు శూద్రుడు
తా విప్రుడ ననుచు వేషధారితనమున
జీవించె నేని వానిం
గావలమున గన్నయపుడు ఖండింపదగున్- (వి.-ప్రా.- 139)

అను పద్యమునకు మితాక్షరలోని "వృత్త్యర్థం బ్రాహ్మణలింగధారిణో వధయేవ। ద్విజాతి లింగినః శూద్రాన్నిష్ఠతయే ద్వివిధైః విధైః" (మితా.-వ్య.-302) -అను మనువచనమే మూలము.

ఇట్లు కేతన తన విజ్ఞానేశ్వరమున కేవలము విజ్ఞానేశ్వరుని మితాక్షర వ్యాఖ్యనే కాక అందుదాహరింపబడిన ఇతరస్మృతి వచనములను కూడ యథాతథముగా ననువదించినాడు.

**ఇతర స్మృతులనుండి గ్రహించినవి**

కేతన తన విజ్ఞానేశ్వరమున ఆచారకాండకు అధికప్రాధాన్య మిచ్చి వ్రాసె నని పూర్వము చెప్పబడినది. అందువలన నందు అశౌచప్రకరణము, భోజనప్రకరణము మొదలగు వానిలో అనేక అమూలక విషయములు వచ్చి చేరినవి. అవి కొన్ని ఇతర స్మృతులలో కన్పట్టుచున్నవి :-

నెనడు మెదడు మలము నెత్తురు శుక్లంబు
మూత్ర మనెడు నివియు మొదలుగాగ,
గుబిలి చెమట పుసులు గోరు శ్లేష్మం బశ్రు
జలము లివి శరీర మలము లయ్యె- (వి.-ఆ.-42)

దీనికి యాజ్ఞవల్క్యస్మృతిలో మూలము కానరాదు. కాని మనుస్మృతిలో ఇట్టిదే ఒక శ్లోకమున్నది. అది—

వాస శుక్ర మసృ ఙ్మజ్జా మూత్ర విడ్ ఘ్రాణ కర్ణవిట్ ।
శ్లేష్మాశ్రు దూషికా స్వేదో ద్వాదశై తే నృణాం మలాః॥(మను.-5-135)

అనునది. కేతన, విజ్ఞానేశ్వరీయములో నుదాహరింపబడని మనుస్మృతిశ్లోకముల ననువదించినాడు. అందుదాహరింపబడకపోయినను దీనిని ప్రత్యేకముగా మను స్మృతినుండి గ్రహించినా డనినను దోషమేమియునుండదు. కావున కేతన పద్య మునకు మూల మిదియే అని చెప్పవచ్చును. ఇట్లే మఱి కొన్నియు గన్పట్టు చున్నవి.

2. మొదలిటి యాఱును సోకిన
మృదుదకముల గడుగ శుద్ధి మీదటి యాఱుం
గదిసిన నీరున గడిగిన
విదితంబుగ శుద్ధి యండ్రు విద్వజ్జనముల్— (వి.-ఆ.-43)

అను పద్యమునకును అత్రిసంహితలోని—

షణ్ణాం షణ్ణాం క్రమే ణేకం శుద్ధి రుక్తం మనీషిభిః ।
మృద్వారిభిశ్చ పూర్వేషా ముత్తరేషాం చ వారిణా ॥

అనునదే మూల మనవచ్చును.

3. వజ్ర చక్ర త్రిశూలముల్ వాస వాచ్యు
తేశ్వరుల కెట్టు లట్ల మహీసురులకు

దర్భ సర్వార్థసిద్ధి ప్రదంబు గాన
బ్రాహ్మణుడు దర్భ విడుచుట పాడి గాదు— (వి.–ఆ -47)

అను పద్యమునకు సరియైన సంస్కృతశ్లోకము హేమాద్రికృత 'చతుర్వర్గ చింతామణి'లో నున్న దని ధర్మప్రవృత్తి కర్త చెప్పినాడు. అది—

యధా వజ్రం సురేంద్రస్య శూలం హస్తే హరస్యచ ।
చక్రాయుధం యధా విష్ణో రేవం విప్రకరే కుశాః॥ (ధ.ప్ర.–పుట 27)

అనునది. కాని, ఈ హేమాద్రి క్రీ.శ. 1270 ప్రాంతమువా డగుటచే కేతనకు సమకాలికు డగుచున్నాడు. అందువలన నీ పద్యమును కేతన చతుర్వర్గ చింతామణినుండి గ్రహించినాడో లేక విజ్ఞానేశ్వరమునుండి హేమాద్రి గ్రహించి నాడో చెప్పుటకు వీలులేదు.

4. తొమ్మిది చిల్లుల బొందిన్
గ్రమ్మెడు మలములను గీడుకంపులు( జెడు( బు
ణ్యమ్ము గలుగు( బ్రాతస్నా
న మ్మెప్పుడు జేయు బుధజనంబుల కెల్లన్- (వి.–ఆ.–49)

అను పద్యమునకు మనుస్మృతిలోని—

అత్యంతమలినో కాయో నవఛిద్ర నమన్వితః ।
స్రవత్యేవ దివా రాత్రౌ ప్రాతస్స్నానేన శుద్ధ్యతి॥ (ధ.ప్ర.–8)

అను శ్లోకమే మూలము కావచ్చును.

5. తల నుదురు ముక్కు తుద యగు
కొలదిం గాళ్లకును నిల్పి కొల్చిన దండం
బులు విప్ర రాజ వైశ్యులు
తలకొని వర్ణాశ్రమమున ధరియింప దగున్- (వి.–ఆ -23)

అను పద్యమునకు గోభిలస్మృతిలోని—

కేశాంతికో బ్రాహ్మణస్య దండః కార్యః ప్రమాణతః
లలాట సమ్మితో రాజ్ఞః స్యాత్తనుసాంతికో విశః॥ (గోభిల.–123)

అనునదే మూలము కావచ్చును

6. పెక్కండ్రు చూచుచుండగ
నొక్కడు దాగుడువగ జన దొకరుడు చూడన్

పెక్కండ్రు గుడువ జన దని
తక్కక చెప్పుదురు ధర్మతత్త్వవిధిజ్ఞుల్. (వి.-ఆ.-73)

అను పద్యమునకు పరాశరస్మృతిలోని—

నాదత్వా మిష్ట మశ్నీయా ద్బహూనాం చైవ పశ్యతాం।
అశ్నీయు ర్బహవచ్చైవ తథా నైకస్య పశ్యతః॥ (సదా.-146)

అను శ్లోకమే మూలము కావచ్చును.

7. గోమేధము సేయుటయును
రామాజనములకు దేవరన్యాయంబున్
భామకు రెండవ పెండ్లియు
నీ మహిలో గలియుగమున నెగ్గని రార్యుల్- (వి.-ఆ -133)

అను పద్యమునకు వృద్ధపరాశరస్మృతిలోని—

ద్విజానా మసవర్ణాసు కన్యా సూపయమ స్తథా।
దేవరాశ్చ సుతోత్పత్తి ర్మధుపర్కే పశోర్వధః॥ (1-6)

అనునది మూలము కావచ్చును.

ఇట్లు కేతన తన విజ్ఞానేశ్వరమున కొన్ని ఇతరస్మృతిగ్రంధముల నుండి కూడ గ్రహించి వ్రాసినాడు.

**మార్పులు-చేర్పులు**

కేతన విజ్ఞానేశ్వరమును కేవలము యధాతధముగా ననువదింపబూనిన వాడు కాడు. దానిని తన కాలానుగుణ్యముగా తీర్చిదిద్దదలంచినవాడు. అందు వలన తన అనువాదమున కొన్ని మార్పులను చేర్పులను గావించినాడు. ఇట్లు కావించిన మార్పులలో 3, 4 చోట్ల మూలముకంటెను అనువాదమును చక్కగా తీర్చిదిద్దిన తావులు గలవు.

1. మూలమున ద్వాదశవిధపుత్రుల నిర్ణయము వ్యవహారకాండలోని దాయవిభాగప్రకరణమున నున్నది. దానిని కేతన ఆచారకాండములో అష్టవిధ వివాహము లైన తరువాత వివరించుట చాల సమంజసముగా నున్నది.

2. ఇట్లే రాజు భూమిని దానముచేసిన యనంతరము ఆ విషయము తరువాత వచ్చు రాజులకు తెలియుటకొరకు తన ముద్రికగల తామ్రపట్టమునందు

లిఖించి ఇయ్యవలయు నని ఆచారకాండమున నుండగా కేతన దానిని వ్యవహార కాండములోనికి మార్చినాడు. రాజధర్మములకు సంబంధించిన విషయము లన్నియు వ్యవహారకాండమున చెప్పబడినవి. అట్లే ఇది కూడ రాజధర్మమే కావున దీనిని గూడ వ్యవహారకాండములోనికి మార్చుట మిక్కిలి సమంజసముగా నున్నది. పూర్వులు ఇచ్చిన దానములను తరువాతివారు కాపాడుట ఆ కాలమున సామాన్యముగా నుండినట్లు శాసనాధారములు గూడ గలవు[1].

3. భోజనము చేయుటకు ముందు భూతబలి వేయుదురు. అది 'ధర్మ రాజాయ నమః, చిత్రగుప్తాయ నమః' ఇత్యాది మంత్రపూర్వకముగా వేయుదురు. విజ్ఞానయోగి బలిహరణ మనగా వైశ్వదేవ మని వ్రాసినాడు (మితా.-ఆ.-102). వైశ్వదేవము భోజనమునకు ముందు చేయవలసినది ఇది భోజనవిధిలోనిది. భోజనవిధిని చెప్పుచు బలిహరణ మనినచో నది వైశ్వదేవము కానేరదు. కేతన చెప్పిన భూతబలియే యగును.

4. బాల- సువాసినీ- వృద్ధ- గర్భిణులకు ముందటను, తరువాత అతిధులకు- అభ్యాగతులకు- భృత్యులకును పెట్టి మిగిలిన అన్నమును దంపతులు భుజింపవలయు నని మూలము (యా.-ఆ.-104). దీనిని కొంచెము మార్చి అతిథులకును, అభ్యాగతులకును, దేవతలకును, పితరులకును, పెట్టిన అనంతరము మిగిలిన దానిని భుజించుట గృహస్థధర్మ మని కేతన వ్రాసినాడు (వి.-ఆ.-69). దేవతార్చన అయిన తరువాత అతిథి-అభ్యాగతుల విషయ మాలోచించుటయే సద్ధర్మము. కావున ఇచ్చట మూలముకంటె అనువాదమే బాగున్నది.

5. పొలమును మేసిన యే యే జంతువుల కెంతెంత శిక్షయో చెప్పి, మేసిన జంతువులు పొలములోననే విశ్రమించినచో రెట్టింపు దండనము విధింప వలయు నని మూలము (యా.-వ్య.-157-1/2). కేతన దీనిని కొంచెము మార్చి యజమాని కావలయు నని యితరుల చేను మేయుటకు విడిచినచో రెట్టింపు దండన మని వ్రాయుట సమంజసముగా నున్నది.

ఇవికాక మఱికొన్ని మార్పులను విజ్ఞానేశ్వరమున కావించినాడు కేతన :-

1. మూలమునందు రాజు తీర్చవలసిన 18 రకముల వ్యవహారములలో సమాహ్వాయ మను భేదమును కేతన వేఱుగా చెప్పక, ద్యూతమునందే అంత

**1. S. I. I.-4-228.**

ర్భవింపజేసినాడు. కారణమేమన, విజ్ఞానేశ్వరయోగియే మితాక్షర వ్యాఖ్య యందు 'ద్యూత మాహ్వాయ మేవ చ' అని చెప్పినాడు. కావున సమాహ్వాయ మును ద్యూతమునందే యంతర్భవింపజేసినా డని జెప్పవచ్చును.

2. తల్లి దండ్రు లిద్దఱుగాని, తండ్రియనుమతిమీద తల్లిగాని లేక తండ్రిగాని విక్రయింపగా నెవ్వడు కొనుచున్నాడో వాని కా కొన బడినవాడు 'క్రీత పుత్త్రు' డని మూలము. కేతన దానిని 'కృతకృత్యు' డని మార్చినాడు (వి.-ఆ.-126). ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీయందు గల విజ్ఞానేశ్వర తాళపత్ర ప్రతిలో - "ధన మొడబడి యడిగికొనిన తనయుడు కొన్నాతనికిని పుత్త్రుం డయ్యెడు" అని యున్నది. ఈ పాఠము మూలమునకు కొంచెము దగ్గరగా నున్నది కావున ముద్రితప్రతిలోని పాఠము 'కృతపుత్త్రు' డని యుండుట మేలు.

3. దాయవిభాగ ప్రకరణమున మనస్మృతి నాధారముగా జేసికొని విజ్ఞానేశ్వరుడు విభక్తకుటుంబములో ఇరువదియగు పాలు జ్యేష్ఠునకును నలుబదియగుపాలు మధ్యమునకును, ఎనుబదియగు పాలు కనిష్ఠునకును, ఉద్ధ రాంశమీయవలయు నని చెప్పినాడు (మితా.-వ్య.-118-1/2). కేతన దీనిని మార్చి, ఇరువదియగు పాలు జ్యేష్ఠుడు గ్రహింప మిగిలిన ధనమును తక్కిన వారు సమానముగా పంచుకొనవలయు నని వ్రాసినాడు (వి.-వ్య.-126). విజ్ఞానేశ్వరుడు చెప్పిన విషయము ముగ్గురు కుమారులు మాత్రము గల్గిన సంసారవిషయికము. అంతకన్న నెక్కువ వా రున్నచో నీ విధి వర్తింపదు. కావున కేతన పైవిధముగా మార్చియుండవచ్చును.

4. మేపుటకు గొనిపోయిన పశువులలో నేదైన ప్రమాదవశమున మర ణించినచో నా మేపువాడు గోవువెలకట్టి యజమానుకును, పదమూడున్నర పణములు రాజునకును ఈయవలయు నని మూలము (యా.-వ్య.-162, 163). కేతన- "కొంత దండువును పెట్టదగు- " అని దానిని మార్చినాడు. ఇది ప్రమాదవశమున జరిగిన దగుటచే ధరయే కాక దండువును గొనుట అసమం జసము. కావున ఆ పశువు స్థితిగతుల ననుసరించి కొంత దండువుమాత్రము గొనుట న్యాయము.

ఇవి కాక ఆ కాలపు స్థితిగతుల ననుసరించి కావించిన మార్పులును గొన్ని కన్పట్టుచున్నవి. ఇవి రాజవ్యవహారమునకు సంబంధించినవి.

ఇట్లు కావించిన మార్పులకు శాసనాధారములు గాని, గ్రంధాధారములు గాని లేవు. కాని, ఆ కాలమున వివిధరకములగు పన్నులు విధింపడుచుండె ననుటకు తగిన శాసనాధారములు గలవు. కుళోత్తుంగుని 15వ విజయరాజ్య సంవత్సరశాసనమును, కాకతి గణపతిదేవుని స్వయంభూదేవాలయ స్తంభశాసనమును, ఆ కాలపు రకరకములగు పన్నులను తెల్పుచున్నవి. వేల్పూరి నాదెండ్ల శాసనములు పేరు (పెరిక) సుంకమును, కొట్యదొణశాసనము రేవుసుంకమును గూర్చి చెప్పుచున్నవి[1]. కాని ఈవిధమైన దోషములకు ఇట్టి దండనమును విధింపవలయు నని స్పష్టముగా చెప్పుటకు విజ్ఞానేశ్వరమును మించిన గ్రంధము కానరాదు. ఇవి ఆ కాలపు సాంఘికపరిస్థితుల ననుసరించి చేయబడినవి.

1. రాజు తన వద్దకు వచ్చిన ధనమును దాచియుంచి, ఆ ధనస్వామి వచ్చిన తరువాత నాతని కియ్యవలయును. ఒక సంవత్సరము వఱకును రానిచో తన ధనాగారము న కలుపుకొనవచ్చును (యా.-వ్య.-55) అని మూలము. కేతన మూలమునందలి సంవత్సరకాలపరిమితిని తీసివేసినాడు అంతేకాక, ద్రవ్యస్వామి రెండవసంవత్సరమునందు వచ్చెనేని ప్రభువు ద్రవ్యరక్షణార్థమై పంద్రెండవపాలును, మూడవసంవత్సరమందు వచ్చెనేని పదవవంతును, మూడు సంవత్సరముల తరువాత వచ్చెనేని ఆరవవంతును, ప్రభువు తీసికొనవచ్చు నని మూలము. కేతన దీనిని వదలివేసినాడు.

2. స్వామిపాలవివాదప్రకరణమున పరుల పొలము మేసిన ఎనుమునకు 8 మాషములును, మొదవునకు 4 మాషములును, గొఱియకు 2 మాషములును పందె యని మూలము (యా.-వ్య.-15). కేతన దానిని—

ఎనుమునకు బందె పాతిక
గొన నగు మొదవునకు బరక గొఱియకు వీసం
బొనరు నొరు చేను మేసిన... (వి.-ప్రా.-4)

అని మార్చి వ్రాసినాడు.

3. అంగవిహీనుని, వికలాంగుని, రోగదుష్టాంగుని జూచి తిట్టుట, అంగవిహీనుడైన వానిని జూచి-'ఇతడు సౌమ్యాంగుడు, ఇతని కెనయగువారు లేరు' అని గేలిచేయుట మొదలగు పనులు జేసినవారికి పదమూడున్నర

1. S.E.E.D-P. 178...182.

పణములు దండన మని మూలము (యా.-వ్య.-202). కేతన దీనిని మూడురూక లని మార్చినాడు (వి.-ప్రా.-42).

4. మెడ చెయ్యి కన్ను పాదము తొడ నాలుక ముక్కు చెవులు మొదలగు శరీరభాగములను తునియలుగా చేసెద నని వాక్పారుష్యము లాడిన వానికి 50 పణములు దండనము విధింపవలయు నని మూలము (యా.-వ్య.-206). కేతన దానిని 100 పణము లని మార్చినాడు (వి.-ప్రా.-53).

5. ప్రసిద్ధమైన పరిమాణము గలిగియుండవలసిన త్రాసు, తూకములు మొదలగువానిని హెచ్చుగాగాని, తగ్గుగా గాని వేసి మోసముచేయువారికి ఉత్తమసాహసదండనము విధింపవలయు నని మూలము (యా.-వ్య.-238). అట్టి మోసగాండ్రు పండ్రెండు మాడలు దండన మరువవలయు నని కేతన (వి.-ప్రా.-65).

6. కొలతలు తూకములు మొదలగువానిలో మోసముచేసినవారికి ఇన్నూరు పణములు దండన మని మూలము (యా.-వ్య.-242). కేతన తగిన రీతిని దండింపవలయు నని మార్చి వ్రాసినాడు (వి.-ప్రా.-68).

7. సరకు లమ్మక దాచిపెట్టి సరకు వెల పెరిగిన తరువాత అమ్మిన వారికి రాజు ఉత్తమ సాహసదండనము విధింపవలయు నని మూలము (యా.- వ్య.-248). రాజట్టి వారిని తగు రీతిని దండింపవలయు నని కేతన వ్రాసినాడు (వి.ప్రా.-72).

8. విదేశిసరకులపైన పదిశాతమును, దేశిసరకులపైన ఐదుశాతమును రాజు పన్ను విధింపవలయు నని మూలము (యా.-వ్య.-250). విదేశీసరుకులపై ఐదిశాతమును, దేశిసరకులపై నాల్గుశాతమును రాజు పన్ను విధింపవలయు నని కేతన మార్పు (వి.-ప్రా.-78).

9. స్వైరిణ్యాదులను శుల్కమీక బలత్కారముగా బొందినవానికి పది పణములు దండన మనియు, పెక్కండ్రుగూడి ఇచ్ఛలేనిదానిని బలాత్కారముగా పొందిన పక్షమున వారికొక్కరికి 24 పణములు దండన మనియు మూలము (యా.వ్య.-289). కేతన దానిని కొంచెము మార్చి పెక్కండ్రుగూడి ఇచ్ఛలేని దానిని పొందినచో నొక్కొక్కరికి ఇరువదిపణములు దండన మని వ్రాసినాడు (వి.-ప్రా.-112).

10. రాజునకు కీడుపుట్టును, రాజ్యము నశించిపోవును- అని ఎఱుక చెప్పెడు జ్యోతిషాధములకు 800 పణములు దండన మని మూలము (యా.-వ్య.-302). అట్టివానికి వేయిపణములు దండనము విధింపవలయు నని కేతన (వి.-ప్రా.-137).

11. భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయాదులందు తినరాని వస్తువులు బ్రాహ్మణునిచే దినిపించినవానికి ఉత్తమసాహసదండనము, వైశ్యునిచే దినిపించిన వానికి మధ్యమసాహసదండనము, శూద్రునిచే దినిపించినవానికి ప్రథమసాహస దండనములో సగము అని మూలము (యా -వ్య.-294). కేతన దానిని మార్చి బ్రాహ్మణునిచే తినిపించినవానికి 500 పణములు, క్షత్రియునిచే తినిపించినవానికి 300 పణములు, వైశ్యునిచే తినిపించినవానికి 80 పణములు, శూద్రునిచే తిని పించినవానికి 120 పణములు, దండనము విధింపవలె నని వ్రాసినాడు (వి.-వ్య.-128).

12. తాను సమర్థుడైయుండియు, గజ వృషభాది జంతువుల బారినుండి ఆపదలో నున్నవారిని రక్షింపనివాడు ప్రథమసాహసదండనమునకు పాత్రు డనియు, ఆ హింసింపబడుచుండినవాడు అరచుచుండినను సమర్థుడైయుండి రక్షింపనివాడు ద్విగుణదండనమునకు పాత్రుడనియు మూలము (యా.-వ్య.-298). అట్టివారికి 3 మాడలు దండనము విధింపవలయు నని కేతన వ్రాసినాడు (వి.-ప్రా.-132).

ఇట్లే సాంఘికపరిస్థితుల ననుసరించి కేతన ఒకటి రెండు చోట్ల అమూలకమైన విషయములు వ్రాసినాడు.

1. పశువులకాపరి పగ లెన్ని పశువులను గొంపోయిన అన్ని పశువులను ఎంచి సాయంత్ర మప్పగింపవలయును. ఒకవేళ దైవవశమున నది చచ్చినచో దాని చెవి కొమ్ములు కొని తెచ్చి యజమానునకు చూపి పరిశుద్ధుడు కావలయును. లేనిచో నాతడు ముచ్చువలె దండ్యు డగును (వి.-ప్రా.-10).

2. పశులకాపరికి ఎనిమిదవపాలు పాలును, నూఱావుల కొక్క మొదవును జీతముగా యజమాని ఇచ్చుట ధర్మము (వి.-ప్రా.-14).

3. ఉత్తర దక్షిణ దేశాచారములను తెల్పు పద్యములును ఇట్టివే (వి.-ఆ.-31, 32).

ఒకటి రెండు విషయములలో కేతన అనువాదముకంటె మూలముననే బాగున్నది —

1. మడివాలు యజమాని వస్త్రమును ధరించిన పక్షమున మూడుపణములు, కుదువయుంచినను బాడుగకిచ్చినను పదిపణములు అని మూలము (యా -వ్య.-236). కాని కేతన దీనిని మార్చి, వస్త్రమును తడబఱచినను, అమ్మికొనినను, కుదవయుంచినను మూడుపణములే దండు వని వ్రాసినాడు (వి.-ప్రా.-61). ఇచ్చట మూలమే అనువాదము కన్న బాగున్నది.

2. కాయగూరలు, కట్టెలు, కసవు, మంచము, పీట, ఇనుము మొదలగు క్షుద్రద్రవ్యముల నపహరించినవారికి దేశకాలపరిస్థితుల ననుసరించి దండనము విధింపవలయు నని మూలము (యా.-వ్య.-273). కాని ఇట్టి క్షుద్రద్రవ్యాపహరణమునకు ఆరుపణములు దండనము విధింపవలయు నని కేతన (వి.-ప్రా.-96). ఇచ్చట కూడ అనువాదముకన్న మూలము బాగున్నది.

ఇవికాక కొన్ని అమూలకవిషయములను గూడ రచించినాడు కేతన. ఇట్లు అమూలకమైనవి సంప్రదాయమునుబట్టియు, లౌకికధర్మము ననుసరించియు వ్రాయబడినట్లు కన్పట్టుచున్నవి.

1. గంగోదకము చాల పవిత్రమైనది (వి.-ఆ.-50).

2. మంచముపైనుండియు, పీటమీద కూర్చొనియు, చెప్పులు పావలు తొడిగియు, తలకు చీరచుట్టియు, నవ్వుచును, మాట్లాడుచును, నడచుచును, శయనించియు సంధ్యావందన మాచరింపరాదు (వి.-ఆ.-53).

3. ఇనుము పొదగబడిన పీటపైనను, కాలిన పీటపైనను, పగిలిన పీటపైనను కూర్చొని బ్రాహ్మణు డగువాడు భుజింపగూడదు (వి.-ఆ.-71).

4. ఇనుపపళ్లెరమునందును, మట్టిమూకుడునందును, చేతులలోను, ఆకులపైనను, పీటపైనను, భోజనము చేయరాదు (వి.-ఆ.-72).

5. ఎంగిలి అభోజ్యము (వి.-ఆ.-75, 78).

6. భోజనానంతరము బడబాగ్న్యైనలాగస్త్యులకు జీర్ణమగునట్లు తనకును ఆహారము జీర్ణము కావలయునని వారిని తలచుచు కడుపు నిమిరికొనవలయును (వి.-ఆ.-82).

7. ప్రాణాపాన వ్యానోదాన సమానములను పంచవాయువులును తృప్తి వహించి మద్దేహమునకు తృప్తికల్గున ట్లొనరించుగాక యని కడుపు నిమిరి కొనవలయును (వి.-ఆ.-83).

8. అన్నదమ్ములైనను, ఆత్మసంభవులైనను, జనకుడైనను, న్యాయ విషయములందు సమానులే (వి.-వ్య.-11)

9. నడవజాలనివారిని రాజు మోపించి సభకు తెప్పించి న్యాయా న్యాయములను విచారింపవలయును (వి.-వ్య.-18).

10. చెప్పవలసిన దంతయు సభలో చెప్పక మఱచిపోయి, న్యాయ నిర్ణయ మంతయును జరిగిన పిదప నేమైన చెప్పదలచినచో నది ఓటమియే యగునుకాని, గెలుపు కానేరదు (వి.-వ్య.-28).

11. బండివాడు, విప్రుడు, రాజు, వివాది, చిన్నబిడ్డ, ఆడుది మొద లగువారు ఎదుగువచ్చినచో తొలగి, త్రోవ ఈయవలయును (వి.-ప్రా.-16)

12. దేవసమూహ మంతయును గోవుశరీరమున నెలకొనియుండుట వలన బ్రహ్మకైనను గోమహత్త్వము నెన్నగా రాదు(వి.-ప్రా.—57).

ఇట్లు కేతన విజ్ఞానేశ్వరీయమును కడు జాగ్రత్తతో ననువదించినాడు.

# 4. విజ్ఞానేశ్వర విషయ వివేచనము

మనుస్మృతికి సుప్రసిద్ధవ్యాఖ్యానము రచించిన మేధాతిథి ధర్మము నైదులక్షణములు గలదిగా విభజించినాడు. అవి— 1. వర్ణధర్మము; 2. ఆశ్రమ ధర్మము; 3. వర్ణాశ్రమధర్మము; 4. నైమిత్తికధర్మము లేక ప్రాయశ్చిత్త ధర్మము; 5. గుణధర్మము లేక రాజాచరింపదగిన వ్యవహారధర్మము[1]. ఇందు మొదటి మూడును ఆచారవిషయములకును, నాల్గవది ప్రాయశ్చిత్త విషయమునకును, ఐదవది వ్యవహారవిషయమునకును సంబంధించినవి. కావున నే ధర్మశాస్త్రమునందైనను నివియే చర్చింపబడును.

**ఆచార కాండము**

ఆచార మైహికాముష్మిక ప్రదాయక మని పలువురు ధర్మశాస్త్ర ప్రయోజకులు ప్రశంసించియున్నారు. ఇది శ్రుతి స్మృతి నిర్ణీతము. నాల్గు వర్ణములవారికిని ధర్మమును గాపాడు నట్టిది యాచార మనియు, గాన యాచారము లేనివారు ధర్మమునకు పరాఙ్ముఖు లగుదురనియు పరాశరుడు (1-37) ఆచారప్రశంస కావించినాడు. బ్రాహ్మణాది నాల్గువర్ణములవారికిని ఆచారమే శాశ్వతమైనదనియు (1-107) ఆచారమునుండి జారిపోయిన బ్రాహ్మణులు వేదఫలమును సంపూర్ణముగా పోగొట్టుకొనుచున్నారనియు మనువు (1-109) చెప్పినాడు. వసిష్ఠుడును (పు.క.ప్ర.-పుట 134) షడంగములతోడ వేదము నధ్యయనముచేసినను ఆచారము లేనియెడల పరిశుద్ధులు కానేరరనియు, ఱెక్కలు వచ్చిన వెనుక పక్షులు గూళ్ళను విడచునట్లు ఆచారహీను డగు పురుషుడు మరణించునపుడు వేదములు వానిని విడిచిపోవుననియు చెప్పినాడు. మంచి యాచారమువలన జన్మాంతరమున దేవత్వమును ఋషిత్వమును, దురాచారమువలన హీనజన్మలును కల్గుచున్న వని పారిజాతమునందు (మా.ధ.చం.-

---

1. H.D.-I-P.3.

పుట 2) చెప్పబడినది. మహాభారతమున, ఆచారము ధర్మమునకు మూలమగుట వలన దాని నవశ్య మాచరింపవలయుననియు, ఆచారమువలననే కీర్తి, సంపద, ఆయుస్సు, ఉభయలోకములందును కల్గుననియు (శ్రీ.భా.ర.-పుట 28) చెప్పబడినది. కావున ఆచారము ధర్మశాస్త్రమునకు పరమావశ్యకమైన దని చెప్పవచ్చును. ఇట్టి వర్ణాశ్రమాచారధర్మములను మునుల కోరికపై యాజ్ఞవల్క్యుడు విశదపఱచినాడు. అదియే యాజ్ఞవల్క్యస్మృతి.

మున్ముందు ఈ చాతుర్వర్ణ్యవ్యవస్థ పుట్టుపూర్వోత్తరములను గూర్చి విచారింపవలసియున్నది. ఈ వ్యవస్థ వేదకాలమునాటికి బాగుగా నమలులో నుండినట్లు నిదర్శనము లున్నవి. ఋగ్వేదములోని పురుషసూక్తమున-

"బ్రాహ్మణో(అ)స్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగుం శూద్రో అజాయాత ॥"

అని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు క్రమముగా విరాట్పురుషుని ముఖ బాహూరు పాదములనుండి యుద్భవించినట్లు చెప్పబడియున్నది.

అంతేకాక బ్రాహ్మణశబ్దము జాతిపరముగా 8 సార్లు, పురోహితు డను నర్థమున 4 సార్లు ప్రయోగింపబడె నని మాక్డొనెల్ పండితుడు అంగీకరించినాడు[1]. ఇట్లే క్షత్రియశబ్దము కూడ జాతిపరముగా వాడబడినట్లు అవినాశచంద్రదాసు గారు వ్రాసిరి[2]. గ్రామణి తఱచు వైశ్యుడుండెడివా[3] డని చెప్పుటబట్టి వైశ్యులును ఉండి నట్లు స్పష్టము. శూద్రశబ్దము దశమండలములో (90-12) పేర్కొనబడినది. ఋగ్వేదములోని ప్రాచీనభాగమున 'దాస' శబ్దము ప్రయుక్తము[4]. శతపథాది బ్రాహ్మణముల కాలమునాటికి కూడ నివి యమలులో నున్నట్లు నిదర్శనము లున్నవి. కాని వేదకాలమునకు పూర్వ మీ వ్యవస్థ యుండినట్లు కన్పట్టదు. ఆకాలమున 'ఆర్యులు, దస్యులు' అను రెండు తెగలవా రుండిరి. వారిలో ఆర్యులు దస్యులను జయించి తమ నాగరకతను వ్యాపింపజేసిరి. కొంత కాలమునకు వారే తెగలుతెగలుగా విభజింపబడిరి. ఆ తెగలలో ముఖ్యమైనవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర తెగలు. వీరుకాక చండాలురు, పుల్కసులు

1. H.S.L.-P. 161, 162.
2. R.C.-P. 132, 133.
3. R.C.-P. 133.
4. 'మనుస్మృతి-వేదాధారము'- ఆంధ్రపత్రిక-1934-పుట 250.

మొదలగు తెగలవారును వారిలో నుండినట్లు వేదములో నిదర్శనములు కన్పట్టు చున్నవి. బ్రాహ్మణముల, ఉపనిషత్తుల కాలమునాటి కీ తెగలు ఇంకను విభజింపబడి వారు తమ తమ వృత్తులను చక్కగా నిర్వర్తించుకొనుచుండినట్లు తెలియుచున్నది[1].

ఈ వర్ణములవారు పరస్పరము మారుట కూడ కన్పట్టుచున్నది. భారత మున వీతహవ్యుడు, అరిష్టసేనుడు, సింధువాపి మొదలగువారు తపస్సాచరించి బ్రాహ్మణత్వమును పొందినట్లు చెప్పబడినది. ఇట్లే పురుకుత్సుడు, అజామిఢుడు మొదలగువారు కూడ బ్రాహ్మణత్వమును పొందినవారే. ఇట్లే కొందఱు బ్రాహ్మ ణులు చేయకూడని కర్మలాచరించి బ్రాహ్మణభ్రష్టు లైనట్లు శ్రీ ఇబ్బెట్సన్‌గారు పేర్కొనినారు. ఈ విషయములను బట్టి పరిశీలించినచో నెవ్వరును పుట్టుకచేతనే ఉత్తమాధమజన్మలను పొందరనియు, వారాచరించు కర్మలవలననే ఉత్తమాధమ వర్గములను బొందుచున్నారనియు తెలియనగును. దీనినే శ్రీ రాధాకృష్ణపండితులు తమ 'భారతీయతత్త్వశాస్త్రము'న 'ధమ్మపదము, వసులసుత్తము, వాసిట్టసుత్తము' మొదలగు గ్రంథము లాధారముగా నిట్లు వివరించినాడు— "పుట్టుకచే నెవ్వడును బ్రాహ్మణుడు గాడు, ఎవ్వడును చండాలుడును గాడు, తాను చేయు కర్మల వలననే బ్రాహ్మణుడు గాని, చండాలుడు గాని యగును" (భా.త.శా.-పుట 265).

శంకరదిగ్విజయమునను "జన్మనా జాయతే శూద్రః, సంస్కారా ద్విజ ఉచ్యతే"—అని చెప్పబడినది (హిం ఆ -పుట 45)

మహాభారత శాంతిపర్వమున-

న విశేషో స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్ ।
బ్రహ్మణా పూర్వ సృష్టం హి కర్మాభి ర్వర్ణనాం గతమ్ ॥

పూర్వము బ్రహ్మచే సృజింపబడిన జగత్తంతయు బ్రాహ్మణమయమైయుండి, **తరువాత** వారి కర్మనుబట్టి కులము లేర్పడినట్లు చెప్పబడినది. ఉదాహరణమునకు ఐతరేయబ్రాహ్మణమున కవషవెలుష డను శూద్రుడు హీనకులమున జన్మించియు పాండిత్యప్రకర్షచే ఋషిస్థాన మధిష్ఠించి, ఋగ్వేదములో కొన్ని ఋక్కులకు (ఋగ్వేదము 10-30-34) ఋషియైనాడు. గోత్రాదు లేమియు లేని జాబాలి

1. H.D.–II–1–P. 49.

యజుర్వేదమున కొంత భాగమునకు కర్తయైనట్లు ఛాందోగ్యోపనిషత్తునందు గలదు (హిం.ఆ.-పుటలు 45, 46).

మనువు (10-65) కూడ శూద్రుడు సత్కర్మల నాచరించి బ్రాహ్మణుడు కాగలడనియు, బ్రాహ్మణుడు దుష్కర్మ లాచరించి శూద్రుడగు ననియు ఒప్పుకొనినాడు.

కావున నీ వర్ణవ్యవస్థ పుట్టుకచేతకాక వారివారి కర్మలచేత యేర్పడు చున్న వని విశదమగుచున్నది. కాని ఇట్టి మారకము తరువాతకాలమున గన్పట్టదు. ఒక జాతిలోనివా రింకొక జాతివారితో నెట్టి సంబంధబాంధవ్యము లను కల్పించుకొనుటకు మౌర్యులకాలమునాటికే వీలులేకుండినట్లు మెగస్తనీస్ వ్రాతలవలన తెలియుచున్నది[1]. ఈ విషయమునే స్మృతులు కూడ విశద పరచినవి. "స్వశాఖను వదలి, యితరశాఖావిధి నవలంబించుటవలన స్వకీయ ఋషిని తిరస్కరించినవాడై అంధతమ స్సను నరకమునందు మగ్నుడగు" నని వసిష్ఠుడు చెప్పినాడు (ధ.ప్ర.-115). కేతన కూడ అట్లే, దేశాంతరమునను స్వదేశాచారములనేగాని, దేశాంతరవర్తనముల కాశపడినచో నింద్యుడై శాఖార ణ్యుడు లేక శాఖకుబాహ్యుడు అనబడు నని చెప్పినాడు (వి.-ఆ.-9).

ఈ ఆచారములు కులదేశాచారముల ననుసరించి చేయవలయును (వి.-ఆ.-9).

ఆశ్రమములు, సంస్కారములు, ఆహ్నికములు మొదలగు అంశములే ఆచారకాండమున చర్చింపబడును.

బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు అను నాలుగు ఆశ్రమముల వారికని తత్తదుచిత సంస్కారాహ్నికములు విధింపబడినవి. అవి అవశ్య మాచరణీయములు. అట్టి సంస్కారాహ్నికములను గూర్చి విచారింప వలసియున్నది.

'సంస్కార' మనునట్టి అర్థముననే వేదకాలపు భాషలో 'సంస్కృత' అను శబ్దము ప్రయుక్తమైనది. 'కృ' అను ధాతువునకు 'సమ్' అను ఉపసర్గ

1. H.D -II-1-150.

చేర్చుటవలన 'సంస్కృత' మను రూప మేర్పడును. కాని ఆనాటి సంస్కృత శబ్దము నేటి ప్రత్యేకార్థమున కాక, వివిధ అర్థములలో వాడబడినది. ఋగ్వేద మున నిది 'పాత్ర' యను నర్థమున వాడబడినది శతపథబ్రాహ్మణమునను, వాజసనీయ సంహిత యందును నిది 'సంస్కరింపబడిన' యను నర్థమున ప్రయోగింపబడినది. జైమిని సూత్రములం దిది 'క్షురకర్మ, ఉపనయనము, సంస్కరింపబడుట' ఇత్యాది వివిధార్థములలో నుపయోగింపబడినది. తంత్ర వార్తికమునందు మానవు డుత్తమస్థానమును పొందుట కాచరింపవలసిన కర్మ సంస్కారమని చెప్పబడినది. ధర్మశాస్త్రము లీ యర్థముననే సంస్కారపదమును గ్రహించినవి[1].

ఈ సంస్కారములు బ్రాహ్మ్యములు దైవతములు నని హారీతుడు రెండు విధములుగా విభజించినాడు. గర్భాధానము మొదలగు సంస్కారములు బ్రాహ్మ్యములు. పాకయజ్ఞాదులైన సంస్కారములు దైవతములు. ఇది స్థూల మైన విభజనము. కొందఱు ధర్మశాస్త్రకర్తలు సూక్ష్మముగా పరిశీలించి అనేక విధములుగా విభజించినారు. అందువలన నీ సంస్కారములసంఖ్య విషయమున అనేక వాదములు ప్రబలినవి. గౌతముడు తన ధర్మశాస్త్రమునందు నలువది (40) సంస్కారములను చెప్పినాడు. మను యాజ్ఞవల్క్యులును నిషేకాది సంస్కారములు పదునాఱని చెప్పినారు. వ్యాసుడు పదునాఱుసంస్కారములనే చెప్పినాడు. కేతనకూడ "గర్భాధానం బాదిగా పదాఱుకర్మంబులు బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులకు గ్రమంబున జేయవలయు" నని చెప్పినాడు (వి.-ఆ.-11.)

ఈ సంస్కారములలో జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, కేశ ఖండనము, కర్ణవేధ, చౌలము లేక చూడాకర్మ అనుసంస్కారములను కుమారునకైన సమంత్రకముగను కుమార్తెకైన అమంత్రికముగను చేయవలె నని యాజ్ఞవల్క్యుడు చెప్పినాడు. వివాహము మాత్రము మొదటి మూడు వర్ణములవారికిని సమంత్రకము గనే చేయవలె నని చెప్పబడినది. ఇట్టి సంస్కారములు క్లీబులైన వారికి చేయ నవసరము లేదని సంస్కారప్రకాశమునందు చెప్పబడినది. అపరార్కుడు గర్భాధానము మొదలు చౌలము వఱకును గల సంస్కారములను శూద్రులకు కూడ చేయవచ్చు నని చెప్పినాడు. రఘునందను డీ సంస్కారములను

1. H.D.-II-I-P. 190.

సమంత్రకముగ కూడ శూద్రులకు చేయవచ్చు నని చెప్పినాడు. ఈ సంస్కార ములు శూద్రులు చేయునపుడు మంత్రములను బ్రాహ్మణుడు చదువవలయునని నిర్ణయసింధువునందు చెప్పబడినది. స్మృతిచంద్రికయందు వివాహము తప్ప ఇంక యే యితర సంస్కారమును శూద్రులు చేసికొనరా దని చెప్పబడినది.

నిషేకము (గర్భాధానము), పుంసవనము, సీమంతము, విష్ణుబలి, జాతకర్మ, నామకరణము, నిష్క్రమణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయ నము, వేదవ్రతచతుష్టయము, సమావర్తనము, వివాహము- అనునవి పదునాఱును సంస్కారములు

ఇక, ఈ సంస్కారములు గర్భాధానముతో ప్రారంభించి వివాహముతో నేల యంతమొందుచున్న వని యాలోచింపవలసియున్నది. శిశువు రేతోరూప మున గర్భమున ప్రవేశించుటతో నివి ప్రారంభింపబడి వివాహముతో నంత మొందును. తదనంతరము ఇవియే తిరిగి తిరిగి ఆవర్తమగును.

ఈ సంస్కారములను సకాలమున కావించుటకు వీలుకాకున్నచో ప్రాయ శ్చిత్తముగా వ్యాహృతిహోమము చేసిన తరువాత చేసికొనవలయు నని 'స్మృత్యర్థ సారము' నందు చెప్పబడినది[1].

ఈ సంస్కారముల ఆవశ్యకతను గూర్చి కొంత విచారింపవలసియున్నది. యాజ్ఞవల్క్య డీ సందర్భమున బీజగర్భసముద్భవము, శుక్రశోణితసంబంధ దోషములు జాతకర్మాదులవలన నశించు నని చెప్పినాడు (యా.-1-$12\frac{1}{2}$). మనువును నిట్లే చెప్పినాడు. ఇట్టి దోషము లెట్లేర్పడుచున్న వను ప్రశ్నకు విజ్ఞానేశ్వర కల్లూకభట్టులు తమ వ్యాఖ్యలందు, "ధర్మవ్యతిరిక్తమైన పద్ధతిన స్త్రీని కలియుటవలనను, మలినవంతమైన గర్భమునందు చాలకాల ముండుట వలనను, దోషము లేర్పడుచున్నవి. అట్టివి నశించుట కీ సంస్కారములను చేయవలయును. అంతేకాక తల్లిదండ్రులవద్దనుండి వంశపారంపర్యముగా వచ్చు అవకతవకలను సరిదిద్దుటకు కూడ ఈ సంస్కారము లుపయుక్తము లగు" నని వ్యాఖ్యానించినారు. ఇట్లు ఉపకరించునవి జాతకర్మాది కొన్ని సంస్కార ములు మాత్రమే. మిగిలినవి కొన్ని వాని వాని ప్రయోజనముల ననుసరించి

1. H. D.-II-1-P. 199.

చేయబడుచున్నవి. వైదికకర్మల నాచరించుటకు తగిన అర్హతలను ఉపనయనము చేకూర్చుచున్నది. నామకరణము, అన్నప్రాశనము, నిష్క్రమణము మొదలగు వానికి అంత ప్రాముఖ్యము లేకున్నను అవి అపత్యములపై ప్రేమను పెంపొందించుటకు సహకరించుచున్న వని చెప్పవచ్చును. వివాహము, ఆత్మబలము, ఆత్మార్పణము మొదలగువానిచే సుఖమైన ఆదర్శవంతమైన జీవితమును గడుపుటకుపకరించుచున్నవి. ఇట్లే మిగిలిన సంస్కారములును ఆయా అవసరములను బట్టి కల్పింపబడినవి.

ఇక యీ సంస్కారములకు మూలాధారములను, వాటి యొక్క ప్రయోజనములను విచారింపవలసియున్నది.

గర్భాధాన సంస్కారము మను విష్ణు ధర్మశాస్త్రములందు 'నిషేక'మను పేరను, పారాస్కర ఆపస్తంబ గృహ్యసూత్రములందు 'చతుర్థీకర్మ లేక చతుర్థీ హోమ' మను పేరను, గౌతమ యాజ్ఞవల్క్యస్మృతులందు 'గర్భాధాన' మనియు చెప్పబడినది. అధర్వవేదమునందు గర్భాధాన సంస్కారము పేర్కొనబడినట్లు బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పబడినది [1]. ఋతుస్నాతయైన 4 వ దినము నుండి సమతిథులలో పొలతిని చేరిన పురుషశిశువును, విషమతిథులలో చేరిన స్త్రీశిశువును కలుగును (వి.-ఆ.-13).

పుంసవనము దాదాపు అన్ని గృహ్యసూత్రములలోను కన్పట్టుచున్నది. దీనికి 'అనవలోపనము లేక అనవలోభనము' అను ఇంకొక పేరును కలదు. ఇది 'లప్' ధాతువునకు 'అవ' అను ఉపసర్గచేర్చుటవలన నేర్పడును.

గర్భస్థమైన బీజమునకు పాతము కలుగకుండ పై సంస్కారము చేయబడును కావున దీని కా పేరు నచ్చినది[2]. ఈ సంస్కారము గర్భచిహ్నములు స్త్రీ యందు కన్పట్టగనే చేయవలెను (వి.-ఆ.-14).

సీమంత సంస్కారము కూడ దాదాపు అన్ని గృహ్యసూత్రములందును చర్చింపబడినది. ఇది గర్భ మేర్పడిన 6 వ నెలలో చేయవలెను (వి.-ఆ.-14). 'సీమంత' మనగా పాపట. గర్భిణీస్త్రీయొక్క పాపటను ఏదుపందిముల్లుతో

1. H.D.-II-1-201. 2. H.D.-II-I-P.221.

చక్కగా విడదీయుచు చేసెడి సంస్కారమగుటవలన దీనికి 'సీమంతోన్నయన' మని పేరు వచ్చినది.

జాతకర్మసంస్కారముకూడ అన్ని గృహ్యసూత్రములందును చెప్ప బడినది. ఇది ప్రప్రథమముగా తైత్తిరీయసంహితయందు చెప్పబడినది. బృహదారణ్యకోపనిషత్తునం దిది విస్తృతముగా వివరింపబడినది. దీనివలన శిశువునకు గర్భజలపానదోషము శమించును (స.ధ.ప్ర.—15). జాతకర్మ ఐహికాముష్మికప్రద మని లఘ్వాశ్వలాయనస్మృతియందు (5—1) చెప్పబడినగి.

నామకరణసంస్కారమును గూర్చి యనేక వాదము లున్నవి. బృహ దారణ్యకోపనిషత్తునం దిది జాతకర్మనాడును, శతపథబ్రాహ్మణమున జన్మదిన మునకైనను లేక రెండవ లేక మూడవ దినముననైనను చేయవచ్చుననియు నున్నది. పారాశరుడు పదవదినమునను, బోధాయనుడు 10లేక 12వ దినమునను, హారీతుడు 12 వ దినమునను, యాజ్ఞవల్క్యుడు 11వ దినమునను చేయవలె నని చెప్పినారు.

నిష్క్రమణ మనగా శిశువును ఇంటినుండి బయటికి గొంపోవుట. బోధాయనుడు దీనిని 'ఉపనిష్క్రమణ' మనియు విష్ణు శంఖులు 'ఆదిత్యదర్శన' మనియు పేర్కొనినారు.

అన్నప్రాశన శిశువునకు 6 వ నెలలో చేయవలెను (వి..ఆ..17). ఇదికూడ గర్భజలపానదోషము పోవుటకే చేయుదురు (స.ధ.ప్ర.—పుట 15). శిశువు చే నేదైన తినిపించుట ప్రారంభింపబడును కానదీనికి 'అన్నప్రాశన' మని పేరు వచ్చినది. కాని బృహదారణ్యకోపనిషత్తు ప్రకారము శిశువుచే జాతకర్మనాడు దధి ఘృతాదులు తినిపించుట జరుగుచున్నది గావున ఆనాడే అన్నప్రాశనకూడ చేయించిన ట్లగుచున్నవి. కావుననే బెంగాల్‌వంటి కొన్ని ప్రదేశములలో నిది జాతకర్మనాడే చేయబడుచున్నది.

చౌలము స్మృతికర్తలందరిచేతను చెప్పబడినది. చౌల మనగా మొదటి సారిగా శిశువునకు జుట్టుకత్తిరించుట. భారద్వాజుడు తన గృహ్యసూత్రములలో ఋగ్వేదములోని ఋక్కు నొకదానిని ఉదాహరించినాడు. అందు— "పిల్లవాని

వెం(డ్రుకలవలె బాణములు కుప్పలుకుప్పలుగా పడినట్లు వర్ణితము[1] నామకరణ చౌల సంస్కారములవలన ఆయుస్తేజోవృద్ధులును, వ్యవహారసిద్ధియు కల్గును (స.ధ.ప్ర-పుట15).

ఉపనయనమువలన వైదిక కర్మాచరణమున కర్హత కలుగుచున్నది. ఈ 'ఉపనయన' మను శబ్దమునకు 'వైదిక విద్యాభ్యాసమునకు దగ్గఱగా తీసికొని పోవుట' యనిగాని లేదా, 'విద్యాభ్యాసమునకై గురువు దగ్గఱకు తీసికొనిపోవుట' యని గాని, రెండువిధములుగా నర్థము చెప్పవచ్చును. ఉపనయనమైన పిల్లవాడు 'బ్రహ్మచారి' యని పిలువబడును. ఈ బ్రహ్మచారి యను పదము ప్రప్రథమముగా ఋగ్వేదమున కనిపించుచున్నది. ఋగ్వేదమున, బ్రహ్మచారిగానుండి యనేక తపము లాచరించిన తరువాత బృహస్పతి జుహువును పెండ్లి చేసికొనెనని చెప్పఁబడినది. అథర్వవేదమునం దనేక చోట్ల బ్రహ్మచర్యాశ్రమప్రశంస గలదు. వటువునకు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికొఱకును, తేజోవంతుడగుటకును ఉపనయమును సకాలములో చేయవలె నని బోధాయనుడు (2-5) చెప్పినాడు. గర్భాష్టమసంవత్సరము మొదలు షోడశవత్సరములవఱకు బ్రాహ్మణులకును, 11 వ సంవత్సరముమొదలు 22వ సంవత్సరమువఱకు క్షత్రియులకును, 12 వ సంవత్సరము మొదలు 24 వ సంవత్సరమువఱకు వైశ్యులకును ఉపనయనము చేయవచ్చు నని యాజ్ఞవల్క్యాదులు చెప్పినారు. 'గర్భాష్టమునందు వటు వాయుష్మంతుడగు ననియు, అంతేకాక బ్రాహ్మణత్వము ఆ వయస్సుననే కల్గుననియు, కావున ఆ యేటనే చేయవలె నని హేమాద్రి (హే.ప్రా. కాం.-367) చెప్పినాడు. గృహస్థాశ్రమము స్వీకరించు వఱకును బ్రహ్మచారి దండము, అజినము, కౌపీనము, కమండలువు, యజ్ఞోపవీతము, మౌంజి ధరించియుండవలెను (వి.-ఆ.-20). ఇట్లు చేసినయెడల సర్వకర్మలును ఫలవంతములై వటువు తేజోవంతుడగు ననియు, లేనిచో నిష్ఫలములై భ్రష్టుడగు ననియు, అంతేకాక బ్రహ్మచారియగువాడు మేఖలాజినదండములను వదలి మూడు దినములైనను, పదునైదు దినములైనను ఉన్నయెడల ప్రాజాపత్యము నాచరింపవలయుననియు, అవి నష్టమైనను భ్రష్టమైనను, వానిని జలములందు వైచి నూతనమైన వానిని ధరింపవలయు నని హేమాద్రి (హే.ప్రా.కాం.-369) చెప్పినాడు.

1. H.D.-II-1-261.

యజ్ఞోపవీతమున మూడు ఆవృతములుండును. అందు ప్రథమావృతము అహితాగ్ని యనియు, రెండవది గార్హపత్యాగ్ని యనియు, మూడవది యాహవనీయ మనియు బ్రహ్మాండపురాణమునందు చెప్పబడినది. కేశవాది చతుర్వింశతి నామములును నాలుగుపర్యాయములు తిరిగి వచ్చుటచేత తొంబది యారంగుళములు గల యజ్ఞోపవీతము ప్రశస్తమైనది (హే.ప్రా.కాం.-594). ఈ యజ్ఞోపవీతమునకు తొమ్మిదితంతు లుండును. అవి క్రమముగా ఓంకార, అగ్ని, నాగ, సోమ, పితృ, ప్రజాపతి, వాయు, సూర్య, సర్వదేవాత్మకములను అధిష్ఠానదైవతములుగా గలిగియుండును (వి.-ఆ.-29). స్మృతిచంద్రికయందును (స్మృ.చం.-1—31) నిట్లే చెప్పబడినది. ఇట్టి జన్నిదములను బ్రహ్మచారియగువా డొకటియు, ఇతరులు రెండును, యతు లొకటియు ధరింప వలయు నని చెప్పబడినది (వి.—ఆ.—25). అట్లే భృగువును చెప్పినట్లు ధర్మప్రవృత్తియం దున్నది (ధ.ప్ర.—పుట 29)

బ్రహ్మచారి శ్రాద్ధభోజనమును, మధుమాంసాదులను వర్జింపవలె నని చెప్పబడినది (వి.-ఆ.-27). గౌతమధర్మసూత్రములపై గల 'మస్కరీయ భాష్యము'నందు, ఇవి అబుద్ధిపూర్వకమైనచో దోషములేదనియు, అట్లే మాంసము రోగపీడితునకు ఔషధముగా నీయబడినచో తప్పులేదనియు చెప్పబడినది (పుట 43).

వేదచతుష్టయము నాల్గువ్రతముల సమాహారము. ప్రజాపతి, సోమ, అగ్ని, విశ్వేదేవులు నలుగురును కృష్ణయజుర్వేదమునకు కాండర్షులు. వేద ప్రవర్తకులైన పై నలుగురియొక్కయు అనుగ్రహము సంపాదించుటకొఱకు వేదాధ్యయనము పూర్తిఅయిన పిదప ఆచార్యుడు శిష్యులను సమీపమున నుంచు కొని ఈ వ్రతములను చేయింపవలయును. వేదప్రవర్తకులగు ప్రజాపత్యాది కాండర్షుల యనుగ్రహమువలన జదువబడిన వేదవిద్య మహామహిమాన్వితమై వెలయుచుండును కావున వీని నవశ్య మాచరింపవలయును (స. ధ. ప్ర.- పుట 16).

అన్ని సంస్కారములలోను ముఖ్యమైనది వివాహము. 'ఉద్వాహము, పరిణయము, ఉపయమము, పాణిగ్రహణము' అనునవి దీనికి పర్యాయపదములు. వివాహమనగా నొక కన్యను వేరొక కారణముకొఱకు (అనగా భార్య కావించు

కొనుటకు) కొనిపోవుట. ఉద్వాహ మనగా తల్లిదండ్రులయింటినుండి పిల్లను తీసికొనిపోవుట. పరిణయమనగా అగ్నికి ప్రదక్షిణము కావించుట ఉపయమ మనగా దగ్గరకు తీసికొని సొంతముగా చేసికొనుట. పాణిగ్రహణ మనగా స్త్రీ చేతిని గ్రహించుట. ఇట్టివి యన్నియు నొకే యర్థమున నుపయుక్తములైనవి. ఈ వివాహప్రశంస దాదాపు అన్ని శ్రుతి స్మృతి గ్రంథములందును కానవచ్చు చున్నది గార్హపత్య జీవితమును గడుపుచు యాగాదులను చేయుటకును పుత్రోత్పత్తికిని ఈ సంస్కారము కావించుకొనవలె నని ఋగ్వేదము భర్త పుత్రరూపమున భార్యనుండి ఉద్భవించుటవలన భార్యకు 'జాయ' యని పేరని ఐతరేయబ్రాహ్మణమున చెప్పబడినది. శతపథబ్రాహ్మణమున భార్య అర్ధశరీర ముగా వర్ణింపబడినది. భార్యలేని జీవితము అసంపూర్ణ మని ఐతరేయారణ్యకము నుడువుచున్నది. తాండ్యబ్రాహ్మణమున ఒకప్పుడు కలిసియుండి తరువాత వియోగము ననుభవించుచుండిన భూమ్యాకాశములు ఒకవివాహము చేసికొనుటకు నిశ్చయించుకొనిన వని చెప్పబడినది. ధర్మకర్మములు చేయుటకును, ఉప చారము కావించుటకును, అపార సంతోషము కల్గజేయుటకును మూలహేతువు భార్యయే అని యాజ్ఞ్యవల్క్య (1-78), మనువులు (9-28) చెప్పినారు[1].

కేతన దక్షిణదేశమున మేనమామ మేనత్త కూతులను బెండ్లియాడిన చెల్లు నని చెప్పినాడు (వి.-ఆ.-31). 'సంస్కార కౌస్తుభము' నందును, 'ధర్మ సింధువు' నందును మాతులసుతాపరిణయ మంగీకరింపబడినది.

ఈ వివాహము బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసు రము, గాంధర్వము, రాక్షసము, పైశాచము అని ఎనిమిది విధములు (వి.-ఆ.-95...101). ఇట్టి వివాహము లా రోజులలో నుండె ననుటకు చారిత్రాత్మక నిదర్శనము లనేకములు కన్పట్టుచున్నవి. మార్కండేయపురాణములో నాభాగు డను రాజు ఒక వైశ్యకన్యను రాక్షసపద్ధతిలో వివాహమాడినట్లు గలదు. కాళి దాసుని 'అభిజ్ఞానశాకుంతలము' లోని శాకుంతలవివాహము గాంధర్వమే. అమోఘ వర్షుని నంజన్‌శాసనములో ఇంద్రరాజు ఒక చాళుక్యరాజకుమార్తెను రాక్షస పద్ధతిన వివాహమాడినట్లు గలదు. ఇట్లే పృథ్వీరాజ్ చౌహాన్ కనోజ్‌రాజైన జయచంద్రుని కూతురును వివాహమాడినాడు. ఈ అష్టవిధ వివాహములలో బ్రాహ్మణులకు మొదటి ఆరును, క్షత్రియులకు చివరినాల్గును, వైశ్యులకు

1. **H. D.-II-1-427, 428.**

గాంధర్వ ఆసుర పైశాచములును, శూద్రులకు ఆసురమును తగిన వని మనువు చెప్పినాడు (మను.-3-24.).

రజస్వల కాకపూర్వము కన్యను తగినవరున కీయకపోయినచో, ఆమె ఎన్నిమార్లు ముట్టయిన అన్ని భ్రూణహత్యలు చేసిన పాపము పితరులకు ప్రాప్తించునట (వి -ఆ.-104, యా. 1-64) రజస్వలయైన స్త్రీని ప్రప్రథమముగా సోమ, గంధర్వ, అగ్నిదేవులు వరుసగా అనుభవింతు రని దీని కొక కారణము ఋగ్వేదమున చెప్పబడినది. శ్రీ పి. వి. కాణేగారు "యాజ్ఞవల్క్య స్మృతిలో రజస్వలకాకముందు కన్యకు వివాహముచేయవలె నని చెప్పబడుటకు కారణము ఆనాడు బహుముఖముగా విస్తరించుచుండిన బౌద్ధమతములో ప్రతివారును చేరిపోవుచుండుటయే కావచ్చు" నని చెప్పినారు.[1] ఇదే విషయమును శ్రీ వైద్యాగారును పేర్కొనినారు[2].

ఆ రోజులలో వర్ణాంతరవివాహములు కూడ నున్నట్లు నిదర్శనములు కన్పట్టుచున్నవి. కాని ఇట్టి వివాహములు 9, 10 శతాబ్దములవఱకును విరివిగా ప్రచారములోనుండి తదనంతరము తగ్గినట్లు కన్పట్టును విష్ణువర్ధనగోత్రికుడు వాకాటకవంశీయుడు నైన ద్వితీయ రుద్రసేనుడు ద్వితీయ చంద్రగుప్తుని కుమార్తెను వర్ణాంతరవివాహము చేసికొనినట్లు పూనాశాసనమువలన తెలియుచున్నది. కదంబవంశపురాజైన మయూరశర్మ వంశము వారందఱును తమ పేర్లచివర శర్మ అని కాక వర్మ అని తగిలించుకొనుట చూచినచో నిది ఒక వర్ణాంతరవివాహ ఫలితమే యని స్పష్టము కాగలదు. విజయనగరరాజైన మొదటి బుక్కరాయల కూతురు విరూపదేవిని అగ్రా ప్రతినిధి బ్రాహ్మణ వంశజుడు నైన బొమ్మణ్ణవొడెయ పెండ్లియాడినాడు రాజశేఖరుడు(బ్రాహ్మణుడు) తన 'కర్పూరమంజరి'లో తన భార్యయైన అవంతి సుందరి చౌహాన్‌వంశీయురాలని (క్షత్రియకన్య) చెప్పుకొనినాడు అంతేకాక, నేటి రాజ్యాంగచట్టమున వధూవరుల కిష్టమైనచో అనులోమ ప్రతిలోమ వివాహములలో నెట్టిదైనను ఆచరించుటకు అవకాశములు కల్పింపబడినవి [3]

ధర్మశాస్త్రము లన్నింటియందును ఈ విలోమ ప్రతిలోమ వివాహములతే కాక వారికి పుట్టిన సంకరవర్ణములవారును పేర్కొనబడియున్నారు

---

1 H.-D.II-1-P. 443. 2. D.F.H.I -P 396

3. H.D.-II-1-P. 449 451.

(వి.-ఆ.-120...141.) ఇట్టి అనులోమ ప్రతిలోమజులను గ్రహించినచో ఆ కాలమున వర్ణాంతర వివాహములు విరివిగా నుండె నని స్పష్టము కాగలదు.

భార్య కల్లుద్రావినను, నోటి దురుసుదనము గలదైనను, సొమ్ము నాశనముచేయునదైనను, తనను ద్వేషించునదైనను, గొడ్రాలైనను, యెప్పుడును కూతులనే కనినను, రోగగ్రస్తురాలైనను, ధూర్తురాలైనను, ఆమెను వదలి భర్త పునర్వివాహము చేసికొనవచ్చును (వి.-ఆ.-113). అంతేకాక గృహస్థునకు భార్య మరణించినచో నాతడు నిత్యనైమిత్తికములకును, దాన వ్రతములకును అయోగ్యుడై మిగుల పాపవంతుడగును. కాన తిరిగి తప్పక వివాహము చేసికొనవలయు నని 'కుమారవిజయము' నందు చెప్పబడినది.

ఇవి సంస్కారములు.

తదనంతరము కొన్ని అహ్నికములను గూర్చి చర్చింపవలసియున్నది. ఆహ్నికము లనగా ప్రతిదినము నిర్వహింపవలసిన శౌచము, దంతధావనము, స్నానము, భోజనము, సంధ్యావందనము వంటి నిత్యవిధులు.

శౌచ మనగా మలమూత్రముల విసర్జనానంతరము మృదంబువులచేతను, గంధలేపములచేతను, అవయవములను శుద్ధిచేసికొనుట. శౌచాచారములు లేనివాని కర్మయంతయు నిష్ఫలము గావున ద్విజులైనవారికి శౌచము చాల ప్రధానమైన దని గౌతమధర్మశాస్త్రమునందు జెప్పబడినది (2—1).

పాలు, ముండ్లు గలిగి తోలూడ్వబడని పుడకచే దంతధావనము చేయ వలెను. పంచపర్వములందును, పాడ్యమి, షష్ఠి, నవమి దినములందును, శ్రాద్ధకాలముననుు, వ్రతచర్యలయందును దంతకాష్ఠ ముపయోగింపరాదు (వి.-ఆ.-44,45). ఈ నిషిద్ధదినములలో మామిడాకులతో కడుగవలె నని గౌతముడు (గౌ.ధ.సూ.— 495) చెప్పినాడు.

నవరంధ్ర సమన్వితమైన దేహము ఎప్పుడును మలపదార్థములను వదలుచుండును గాన అట్టివానిచే శరీరము కంపుకొట్టకుండుటకు ప్రాతస్స్నానము చేయవలె నని కేతన చెప్పినాడు (వి.-ఆ.-49). తైలముచే శిరోభ్యంజనము చేయుటచే తడికల్గియుండును గాన నొకప్పుడును తలనొప్పిగలగదనియు, వెండ్రుకలు తెల్లబడవనియు, శిరమునందలి కపాలాస్థులకు విశేషముగ బలమును

నానాట వృద్ధినొందుననియు, తలవెంట్రుకలు నిగనిగ లాడుచు మిక్కిలి నిడుదలై పెరుగుచుండుననియు, చక్షూరాదింద్రియములు నిర్మలములై యుండు ననియు, ముఖము చర్మము మంచి కాంతి కల్గి రాత్రులందు సుఖముగ నిదుర పట్టుననియు, చరకుడు చెప్పినాడు (చరకసంహిత—సూత్రస్థానము—131). ఈ స్నానములు క్రియాంగస్నానము, అభ్యంగస్నానము, కపిలస్నానము, ఆతుర స్నానము, ఆగ్నేయస్నానము, వాయువ్యస్నానము, బ్రహ్మస్నానము, దివ్య స్నానము ఆని వివిధ రకములుగ చెప్పబడినవి [1].

సంధ్యావందనమునందు ముఖ్యమైనది అర్ఘ్యప్రదానము. ఉభయ సంధ్య లయందును మందేహులను రాక్షసులయొక్క నాశముకొఱకు అర్ఘ్యము నీయ వలయుననియు, ప్రాయశ్చిత్తముకొఱ కాచమనము చేసినయెడల రాక్షసత్వము కలి గిన పాపము శమించుననియు, ధర్మప్రవృత్తియందు చెప్పబడినది (ధ.ప్ర -41) తదనంతరము ప్రాణాయామముచేసి ప్రణవసంయుతముగాను, వ్యాహృతి పూర్వ కముగను, గాయత్రీజపము చేయవలయును (వి.-ఆ -62). భూసురుడు సోమరియై సంధ్యోపాసన జపహోమాదులను దర్భవెలిగా కావించినచో నదియంతయు నిష్ఫల మగును. దర్భయొక్క ఆదియందు బ్రహ్మదేవుడును, మధ్యభాగమున మహావిష్ణువు ను,అగ్రభాగమున మహేశ్వరుడును నివసించుచుండును గాన,బ్రాహ్మణుడగువాడు, సర్వదా దర్భలను చేతియందు గలవాడై యుండవలయును. అంగుష్ఠానామిక లతో బ్రహ్మదేవుని తల శివునిచేత కత్తిరించబడినది. అట్లు అపరిశుద్ధమైన హస్త శుద్ధికొఱకు బ్రహ్మముడి కలిగిన కుశ కాంచన ధారణము చేయవలసివచ్చిన దని గౌతముడు (గౌ.ధ.సూ.-14-67.. $68\frac{1}{2}$) చెప్పినాడు. వజ్రము వాసవునకు, చక్ర మచ్యుతునకు, త్రిశూలము ఈశ్వరునకు నెట్లో మహీసురల కట్లు దర్భ సర్వార్థసిద్ధిప్రదము కాన బ్రాహ్మణుడగువాడు దర్భ నవశ్యముగా ధరింపవలె నని కేతన చెప్పినాడు (వి.—ఆ.-43).

భోజనమునుగూర్చి ప్రప్రథమముగా ఋగ్వేదమున, "మనుష్యులు భోజన మునకు గూర్చున్నట్లు పర్వతములు దిగబడిన" వని యున్నది. తైత్తరీయ బ్రాహ్మణమున మనుష్యులు రోజుకు రెండుమార్లు మాత్రము భుజింపవలయు నని యున్నది. భోజనము అగ్నిహోత్రమునకు సమానమైన విధి కాన బ్రాహ్మణు

1. H.D -II-1-666, 667.

డగువాడు ప్రాత స్సాయంకాలములందు మాత్రమే భుజింపవలె నని మనువు చెప్పినాడు (ధ.ప్ర.—79) మనువు వేద విద్యకును- వైదికకర్మలకును- అహార మునకును విముఖులగుటవలన, బ్రాహ్మణులకు మర్మరణము ప్రాప్తించు నని చెప్పినాడు (5—4). ఆహారశుద్ధివలన మనశ్శుద్ధియు, మనశ్శుద్ధివలన తత్త్వ జ్ఞానమునందు దృఢబుద్ధియు, దానివలన మోక్షప్రాప్తియు కలుగును గాన ఆహారము అవశ్యక మని ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడినది.[1]

భోజనమునకు పూర్వము చేతులను కాళ్ళను కడిగికొని పీటపై కూర్చుండి కాళ్ళు నేలపై నాన్చి, ఆపోశనము పట్టి, ప్రాణాహుతులను గొని మౌనియై భుజింపవలయును (వి.-ఆ.-67). భుజించుటకు పూర్వము భోజనపాత్రక్రింద నేలపై బ్రాహ్మణులకు చతురస్రముగను, రాజులకు త్రికోణముగను, వైశ్యులకు వర్తులముగను, శూద్రునికి అర్ధచంద్రాకృతిగను, మండలముల నేర్పఱుప వలయును. అట్లుచేయనిచో నాతడు భుజించు నన్నముయొక్క సారము నంతయు రాక్షసులు అపహరించెద రని గౌతముడు (గౌ.ధ.సూ. 4-1-16) చెప్పినాడు. ద్వాదశాదిత్యులు, అష్టవసులవులు, ఏకాదశరుద్రులు, నవబ్రహ్మలు మొదలగు వా రందఱును మండలమువలన జీవించుచున్నా రని శంఖుడు చెప్పినాడు. యాతుధానులు, పిశాచములు, అసురులు, రాక్షసులు, అన్నమువలన కలిగెడి బలమును హరింతురు కాన మండలరహితముగా భోజనము చేయకూడ దని పితామహుడు వచించెను (ధ.-ప్ర.-80.) పాదప్రక్షాళనము, మలరోగము శ్రమాపహ మనియు, దృష్టిప్రసాదనకర మనియు, ద్రవ్యగుణసంగ్రహమున చెప్పబడినది (సదా.-ఉపో.-పుట 12). ఆహారమును అమృతమువలె చేయుటకు ఆపోశనముపట్టవలె నని యాజ్ఞవల్క్యుడు (1-106) చెప్పినాడు. ప్రాణ వాయువున నాత్మయును, అపానవాయువున నమస్తభూతయోనులును, వ్యాన వాయువున సమస్తపాతాళలోక వాసులును, ఉదానవాయువున సర్వదేవతలును, సమానవాయువున పితృగణములన్నియును, వసించి యుండుటవలన నీ యాహుతుల నొసంగవలయు నని గౌతమధర్మసూత్రములందు (పుట 541) చెప్పబడినది. మౌనముగా భుజించుటవలన నాయుర్వృద్ధి యగును. భోజనము

1. H. D.-II-2-P. 757.

నకు ముందు మీది యన్నములో కొన్ని మెతుకు లెత్తి, 'చిత్రగుప్తాయనమః, ధర్మరాజాయనమః, యమాయనమః' అని యనుచు భూతబలులను వేయవలయును (వి.-ఆ.-68) భోజనానంతరము పుడిసెటిలో సగము నీళ్ళతో ఉత్తరాపోశనము పట్టినచో పాతాళలోకములోని ఆరకులు తృప్తి చెందెదరు. (వి.-ఆ.-80).

కొన్ని దేశములలో శాస్త్రవిరుద్ధమైన అచారములుకూడ అమలులోనుండ వచ్చును. అవి ఆ దేశమునకు సరిపోయినవగుటచే వానిని శాస్త్రనిషిద్ధము లని త్రోసిపుచ్చరాదు. అట్టివి దేశకాలపరిస్థితుల ననుసరించి గ్రాహ్యములగును. పైఠీనసమందు (పు.క.ప్ర.-59) తండ్రి అక్కచెల్లెండ్రయొక్కయు, తల్లి యక్కచెల్లెండ్రయొక్కయు, మేనమామయొక్కయు పుత్రికలు న్యాయముగా చెల్లెండ్రగుచున్నారు గావున వివాహమునందు విడువదగినవా రని చెప్పబడినది. మేనమామకూతురు ననుభవించినవాడు పరాకకృచ్ఛ్రము నాచరింపవలయు నని విశ్వరూపుడు(యా.-వ్యాఖ్య-3-254) చెప్పినాడు. కాని దీనికి యనేక నిదర్శనములు గన్పట్టుచున్నవి మహాభారతములోని శ్రీకృష్ణార్జును లిద్దఱును మేనమామ కూతులను పెండ్లియాడినవారే. సంస్కారకౌస్తుభమునందును, ధర్మసింధువునందును, మాతులసుతాపరిణయ మంగీకరింపబడినది. ఇట్టి వివాహములు దక్షిణదేశమున నేటికిని మిక్కిలి ప్రచురముగ నున్నవి. కొందఱు మేనమామ కుమార్తెను వివాహముచేసికొనుట విధిగా నెంచెదరు (పు.క.ప్ర.-59, 60). ఇట్లే అశ్వములు-గోర్పడములు మొదలగువానిని అమ్ముకొనుట, ఓడనెక్కి బేహార మాడుకొనుట, మధుమాంససేవయు నుత్తరదేశమున పెక్కండ్రు చేసినను, అవియును దేశాచారములు గాన తప్పులేదని కేతన వ్యక్తము చేసినాడు (వి.-ఆ.-32). గోమేధము సేయుట, దేవరన్యాయము, స్త్రీపునర్వివాహము అనునవి కృత త్రేతా ద్వాపర యుగములలో కన్పట్టుచున్నను, కలియుగమున నవి నిషిద్ధములు (వి.-ఆ -132).

ఇట్టి ఆచారములను దేశకాలపరిస్థితులననుసరించి చేసినయెడల పరమమైన పదము ప్రాప్తించును.

వ్యవహార, ప్రాయశ్చిత్త కాండములు

'వి, అవ, హర' అను పదముల సంయోగముచే వ్యవహార యను పద మేర్పడుచున్నది. అనగా, 'వి'-అనేకమైన, 'అవ'—అనుమానములను, 'హర'—పోగొట్టునది, అని యర్థము కావున అనేకవిధములైన అనుమానములను పోగొట్టున దను యర్థమున నీ 'వ్యవహార' మను పదము ప్రయుక్తమైనట్లు కాత్యాయనస్మృతియందు చెప్పబడిన దని కల్లూకభట్టు తన 'మన్వర్థముక్తావళి వ్యాఖ్య' యందు (మను.—౧—1.). పేర్కొనినాడు. ఇది శబ్దగతమైన యర్థము. బలవంతునిచేత మిక్కిలి బాధింపబడిన బలహీనుడు రాజసభకు వచ్చి తనకు జరిగిన యన్యాయమును రాజున కెఱిగించుట, అప్పు డా రాజు కామ క్రోధ లోభ వివర్జితుడై ధర్మశాస్త్రజ్ఞులతో గూడిన సభయందు ధర్మశాస్త్రానుగుణముగా దేశాచార సమయాచారముల ననుసరించి, ధర్మనిర్ణయము గావించి, దండార్హులైనవారిని దండించుట, 'వ్యవహారధర్మ' మనబడును. ఇది భావగతమైన యర్థము. ఇదియే రాజధర్మము. ఆచారధర్మము, వ్యవహారధర్మము, ప్రాయశ్చిత్త ధర్మము అను ముఖ్యమైన మూడుధర్మలును, ఈ రాజధర్మమునందే ఇమిడి యుండుటచే నీది సర్వోత్కృష్టమైనదిగా పరిగణింపబడును. ఇట్టి రాజధర్మము లను గూర్చి తెల్పున దీ వ్యవహారకాండము.

వ్యవహారవిషయములలో రాజు క్రోధలోభములకు లోనుగాక, సద్ధర్మ తత్పరుడై, విద్వద్వర్యులును, విశ్రుత విప్రవంశ్యులు నగు సభికులతో గూడిన సభయందు ధర్మవ్యవహారనిర్ణయము గావించినచో నాతని కీర్తి—ఐశ్వర్యములు నలుదిక్కులకు వ్యాపించును. వ్యాకరణ మీమాంసాది శాస్త్రజ్ఞులును, వేదాధ్యయన సంపన్నులును, సత్యయుతులును, ధర్మశాస్త్రవిదులును, రాగద్వేషవిరహితులును, హితులును నైన విప్రులను రాజు తనకు సభికులుగా నియోగించుకొన వలయును. అట్టి విప్రు లేడ్వురైనను, నేవురైనను, ముగ్వురైనను, సభ్యులుగా నుండదగును. కాని ముగ్వురికన్న తక్కువయుండుటకు వీలులేదు. అట్లున్నచో నది సభయనిపించుకొనబడదు.

లోకాచారజ్ఞులును, ధర్మశాస్త్రజ్ఞులును, అగు విప్రు లేడ్గురేని ఐదుగురేని, మూవురేని యెచ్చట వసింతు రా సభ 'పరమపావని' యగుననియు, అట్టి

బ్రాహ్మణులు దొఱకని పక్షమున అట్టి లక్షణములుగల ఏ జాతివారినైనను సభ్యులుగా గ్రహింపవచ్చు ననియు శుక్రనీతిసారమున చెప్పబడినది (పుట 170, 171). అంతేకాక నృపుడు, నధికృతుడు, సభ్యులు, ధర్మశాస్త్రము, గణకుడు, లేఖకుడు, హేమము, అగ్ని, జలము, భటులు— అను పదియును ధర్మాధికరణంబున కంగంబులు ఈ దశాంశములుగల యే సభ నధివసించిరాజు కృతమతియై న్యాయము విచారించు నా సభ యుజ్ఞసదృశంబై వెలయు. ఈ యంగములయందు నధికృతుడు వివాదవక్తయు, రాజు శాసకుండును, హిర ణ్యాగ్నులు శపథార్థమును, జలము తృషానివారణార్థము నుపయోగపడును. గణక భటులు రక్షకులుగా నుందురు. ఎల్లజనుల వ్యవహారములు ధర్మశాస్త్రాను సారమున నిందు మిగులపరిశీలింపబడటం జేసి ధర్మాధికరణము (Court of Justice) నాబడు (శు. సా.—పుట 173) అనియు చెప్పబడినది.

రాజు తనంతటి తానే వ్యవహారనిర్ణయము కావించుట అతిముఖ్యము. ఒకవేళ తన కితర కార్యానురోధమువలన వ్యవహారముల విచారింపలేని పక్షమున, తనకు మాఱుగ ధర్మశాస్త్రార్థ తత్త్వార్థవిధిజ్ఞుడైన ప్రాడ్వివాకు నొకని నియమింపవలయును(వి.-వ్య.-4).వైద్యుడు యంత్రములచేత శల్యమును బయటికు లాగివేయునట్లు ప్రాడ్వివాకుడు వ్యవహారములోని అన్యాయమును గ్రహించి దానిని తొలగింపవలయు నని నారదుడు చెప్పినాడు [1]. ఆతడు మున్ముందు అర్థిప్రత్యర్థులను వ్యవహారవిషయికముగా ప్రశ్నించి, పిమ్మట ప్రియపూర్వకముగా సభ్యులయెదుట వారి వ్యవహారసందర్భమును వివేచన, చేసి చెప్పును కాబట్టి ప్రాడ్వివాకుం డనబడుచున్నా డని బృహస్పతి చెప్పినాడు. అట్టి ప్రాడ్వివాకుడు పదునెనిమిది విధములగు వ్యవహారస్థానముల తత్త్వమును, వాని యంతర్భేదములైన ఎనిమిదివేల విధములను చక్కగా నెఱిగిన వాడును, అన్వీక్షకి— దండనీతి మొదలైన విద్యాస్థానములలో నారితేరినవాడును, శ్రుతులు చక్కగా చదవి విశ్వసంచియున్నవాడునునై, న్యాయాధీశుడుగా నుండవలయు నని నారదుడు చెప్పినాడు. మరియు రాజు ప్రాడ్వివాక మతానుసారముగా వ్యవహారముల విచారింపవలయును గాన సభయందు రాజుకన్నను ప్రాడ్వి వాకునకే ఎక్కువ ప్రాముఖ్యమని యతడు చెప్పినాడు. కావున ఉత్తమకులజు

1. H.D.-III-271.

డైన బ్రాహ్మణునైనను, అట్టి బ్రహ్మణుడు లభింపని పక్షమున ఉక్తగుణ నియుక్తుండైన క్షత్రియునైనను, తదభావపక్షమున అట్టి వైశ్యునైనను, ప్రాడ్వివాకునిగా నిర్ణయింపవలయునేకాని యెట్టి పరిస్థితులందును శూద్రుని నిర్ణయింపరాదని కాత్యాయనుడు చెప్పినాడు (మితా.-వ్య.-3). ఈ సందర్భమున మనువు "ఏ రాజుయొక్క అస్థానమున శూద్రుడు ప్రాడ్వివాకుడుగా చేయబడునో అట్టి వాని ధర్మనిర్ణయము బురదలో మునిగిన ఆవుయొక్క పవిత్రత వంటి" దని చెప్పినాడు (మను.8-20). అంతేకాక రాజు లోభాది కారణములచేత అన్యాయముగా దండనము విధించిన పక్షమునం దట్టి ధనమును దండువు గోల్పోయినవాని కిచ్చి, ఇంకను పాపపరిహారార్థము తన బొక్కసమునుండి ముప్పది యంతల ధనమును వరుణునిగూర్చి విప్రుల కీయవలెనట(వి -వ్య -41). రాజు అన్యాయమార్గము నవలంబించినచో, భయముచేత గాని, మరియేమైన రాజున కెదురుచెప్పకుండినచో, వారు పాపకూపమున బడుదురు గాన వారట్లుచేయక కార్య తత్త్వమును రాజునకు చక్కగా చెప్పవలయును(వి.-వ్య.-5). ఒకవేళ సభికులలో నెవ్వరైనను రజోగుణప్రవిష్టులై స్నేహలోభ భయాదులవలన స్మృత్యాచార సమయాచార విరుద్ధముగా వ్యవహారమును విమర్శించిరేని అట్టి వ్యవహారమందు వాదప్రతివాదులలో నెవడు పరాజితుడై శిక్షకర్హుండగునో వానికి జేయదగిన శిక్షకు రెట్టింపు శిక్ష సభికులకు ప్రత్యేకముగా విధింపవలయును. ఇది రాగ ద్వేషాదులవలన గాక అజ్ఞానభ్రాంత్యాదులవలన విరుద్ధముగా జరిగించిరేని ఈ శిక్ష విధింపగూడదు. గౌతమాదులచేత బ్రాహ్మణునకు శిక్షవిధింప గూడదని చెప్పబడినది. అయినను శాస్త్రము లోకమున వేదవేదాంగవిత్త్వాది లక్షణయుక్త బహుశ్రుత బ్రాహ్మణవిషయికము గనుక, సాధారణ బ్రాహ్మణునికి వధవ్యతిరిక్తమైన శిక్ష విధింపవచ్చు నని విజ్ఞానేశ్వరుడు (మితా.-వ్య.-4) వ్యాఖ్యానించినాడు. దండింపదగనివారలను దండింపచును, దండింపదగినవారలను దండింపకను ప్రవర్తించినచో రాజు దుర్గతిని పొందును (వి.-వ్య -7).

రాజుసభయందు తూర్పు ముఖుడుగను, సభాసదులు ఉత్తరదక్షిణ పడమరలందును ఉండవలయు నని 'వ్యవహారసారము' నందు చెప్పబడినది[1]. రాజు వ్యవహారములను తీర్చు సందర్భమున, అర్థిని బిలిచి నీ కెవ్వ డన్యాయము చేసె నని యడిగి అతనిచే నన్ని విషయములను చక్కగా నెరిగిన తరువాత

1. H.D.-III-P. 278.

ప్రత్యర్థిని పిలిపించి న్యాయనిర్ణయము చేయవలయును (వి -వ్య.-9). రోగి బాల వృద్ధులను కారాగృహాది విషమస్థానములందున్న వారిని, శుభాశుభ కార్యము లందు ముఖ్యులై యున్నవారిని, రాజకార్యమునందున్న వారిని, కల్లుద్రావిమత్తులై యున్నవారిని, భూతావేశాదులవలన ఒడలెఱుంగక యున్నవారిని, పరాధీను లైన భృత్యులను, దిక్కులేని యువతులను, సత్కులమందు బుట్టిన మానవతు లను, బాలింతరాండ్రను, బ్రహ్మణస్త్రీలను, పెండ్లిగాని పడుచులను- ఇలాంటి వారిని తొందరపడి సభకు పిలిపింపరాదు. అయినను దేశకాల పరిస్థితుల ననుసరించియు, కార్యముల బలాబలముల నెఱింగియు, పిలిపింపవలయునని విజ్ఞానేశ్వరుడు చెప్పినాడు (మితా.-వ్య.-5). ఇట్లు సభకు పిలిపింపవలసిన యవసరమున నడవజాలనివా రున్నచో రాజు కోపగింపక వారి కొఱకు వాహనములను పంపి, వారిని మోయించి తెప్పించి, అత్యవసర కార్యములలో ఆలస్యముచేయక ధర్మనిర్ణయము గావింపవలయును (వి.-వ్య -18).

ప్రతివ్యవహారమును శంకాభియోగ తత్త్వాభియోగ భేదములచే ద్వివిధము శంకాభియోగము ఆ వ్యవహారముయొక్క పరిస్థితుల ననుసరించియు, తత్త్వాభి యోగము ప్రత్యక్షసాక్ష్యాదులచేతను నిర్ణయింపబడును మరల ఈ తత్త్వాభి యోగము ప్రతిషేధాత్మక విధ్యాత్మక భేదంబులచే ద్వివిధము ప్రతిషేధాత్మక మనగా ఆస్తి విషయమున మఱొకని హక్కు నిరాకరింపబడుట విధ్యాత్మక మనగా ఆస్తివిషయమున ఒక వ్యక్తిపట్ల తీసికొనబడు ప్రత్యక్షచర్య. దీనిని వివరించినచో మొదటిది హక్కును నిరాకరించుటవలనను, రెండవది దోషక్రియ నుండియు కల్గుచున్నవి[1]. ఈ విభజనము బహుస్థూలమైనది. ధర్మశాస్త్రకర్తలు అతిసూక్ష్మముగా పరిశీలించి ఋణాదాన నిక్షేపాది భేదములచే దానిని పదు నెనిమిది రకములనియు, వానికి తిరిగి ఎనిమిదివేల అంతర్భేదములు కలవనియు వివరించినారు.

వ్యవహారనిర్ణయమున నొక 'ప్రమాణ' మవసరము. వస్తుతత్వం బిట్టి దని తెలియజేయునది ప్రమాణ మనబడును. అది మానుషము, దైవికము అని రెండు విధములు. లిఖిత మనగా ప్రమాణపత్రము భుక్తి యనగా అనుభవము. సాక్షు లనగా సాక్ష్యము చెప్పువారు. ఈ మూడింటిలో అన్నియును ఉన్న చాల

1. A. H.J.–P. 21.

మంచిది లేక రెండున్నను, లేక ఒకటియున్నను జాగ్రత్తగా పరిశీలించి ధర్మ నిర్ణయము గావింపవలయును (వి.-వ్య.-32). ఈ మూడును లేని సందర్భ మున దైవమగు క్రియను చేయింపవలయును(వి.-వ్య.-30). మానుషప్రమాణంబు లైన విఖితాదు లుండునపుడు దివ్యప్రమాణంబును గ్రహింపగూడదు (వి - వ్య.-31). ఒకపనిమీద బ్రతికెడివారికి ఒక్క పత్రిక చాలును; సాక్ష్యాదులతో పని లేదు (వి.-వ్య.-33). వాక్పారుష్య దండపారుష్యములయందు దైవ మును సాక్ష్యమును చాలును పత్ర మవసరము లేదు (వి -వ్య.-34). భూజల గృహాది విషయములందు భుక్తియే ప్రధానము. సాక్షి పత్రాదు లనవసరము.

**లిఖితము :-** రాజాజ్ఞచే పిలిపింపబడిన ప్రత్యర్థి వచ్చిన తర్వాత, రాజు అర్థిచే తన విజ్ఞాపనమును ప్రత్యర్థి యెదుటనే ఒక పత్రముపై వ్రాయింపవల యును. అట్లే ప్రత్యర్థియు తాను అర్థిని గూర్చి చెప్పవలసిన విషయములను కూడ అర్థి యెదుట సభకు లౌనను నట్లు సమాధానపూర్వకముగా పత్రముపై వ్రాయవలెను. ఇట్లు వ్రాయవలసిన సందర్భమున, రాజువద్ద నేరములను చెప్పుటకు వచ్చినపుడు చెప్పినట్లు కాక మరియొక విధముగా వ్రాసినచో నతడు హీనవాదియై శిక్షింపబడును (వి -వ్య -24). ఇట్లు వ్రాయబడిన పత్రిక ప్రతిజ్ఞా పత్రిక లేక భాషాపత్రిక యని యనబడును (మితా.-వ్య.-6).అందు, సంవత్సర మాస తిథులను వాదప్రతివాదుల నామములను, వారి జాతులను, వారి వయస్సు లను, వివాదాస్పదభూతంబైన ద్రవ్యంబును, ఆ ద్రవ్యపరిమాణంబును, దేశ స్థానాదులను, ప్రాతర్మధ్యాహ్నాదికాలంబును లిఖింపవలయును. గృహధనాదుల విషయమున సంవత్సరములాను, తీసికొనిన ధనమునకు వడ్డి నిర్ణయించు సందర్భమున సంవత్సర మాసాదులును ఉపయోగించును గాన అవి పత్రిక యందు తప్పక వ్రాయవలయును. ఇవియే కాక, మధ్యదేశాది భేదంబును, కాశీ కాంచ్యాది స్థలభేదంబును, పూర్వపశ్చిమాది దిగ్భాగములయందు నున్న గృహ క్షేత్రాది సరిహద్దులను, వాదప్రతివాదుల తాతతండ్రులపేళ్లను, తత్కాల ప్రభు నామంబును వ్రాయింపవలయును అట్లుకాక దీనికి వ్యతిరిక్తముగా వ్రాయించినచో నది ప్రతిజ్ఞాపత్రిక యని కాక పక్షాభాసం బనబడును (మితా.-వ్య -6). పత్రము చిరిగినను, పత్రాక్షరములు సందిగ్ధములుగా నున్నను, పత్రిక వ్రాసిన వాడు పరముదేశనం దున్నను, అట్టిదే వేఱొకపత్రమును వ్రాయవచ్చును (వి.-వ్య.-111).

**భుక్తి**:- ఇది అనుభవమని కూడ చెప్పబడును. ఈ అనుభవము పత్రిగ్రహక్రియాది స్వత్వకారణయుక్తము, దీర్ఘకాలవ్యాపి, నిరంతరము, నిరాక్షేపము, ప్రత్యర్థిసన్నిధానము అను ఐదువిశేషణములతో గూడియుండవలయునని స్మృత్యంతరమున చెప్పబడినది (మితా.-వ్య.-261/2). తన పొలము నొకడనుభవించుచుండగా 20 ఏండ్లవఱకును ఊరకయున్నచో ఆ పరిభోగము అనుభవించినవాని పాలగును (వి.-వ్య.-46). ఇట్లే 10 సంవత్సరములు తన ధనము నొక డనుభవించుచుండగా తాను చూచుచు నూరకున్నచో అది యనుభవించినవాని పాలగును (వి.-వ్య.-47).

**సాక్షి** :- సాక్షి ఒక కార్యము జరుగగా చూచినవాడనియు, విన్నవాడనియు, రెండు విధములుగా నుండు నని మనువు చెప్పినాడు. ఇందొకరొకరికి మరల రెండు భేదములు కలవు: కృతసాక్షులు; అకృతసాక్షులు. కృతసాక్షు లనగా సాక్షిగా నియోగించుకొనబడినవారు. అకృతసాక్షు లనగా నియోగించుకోబడనివారు. తిరిగి వారిలో కృతసాక్షులు ఐదు విధములుగను, అకృతసాక్షులు ఆరు విధములుగను ఉందురు. కృతసాక్షులగు ఐదు విధముల వారిని గూర్చి కాత్యాయను డిట్లుచెప్పినాడు (వి -వ్య.-100 మితా.-వ్య.-113).

1. **లిఖితసాక్షి** : అర్థిచేత పిలువబడి వచ్చి పత్రమందు చేవ్రాలు వ్రాసినవాడు.

2. స్మారితుడు లేక తలపుసాక్షి : జరిగినకార్యము బయలుపడియుండునను తలంపుచేత కార్యార్థియైనవాడు ఒకని బిలిచి, యీ జరిగిన కార్యమును నీవు మఱువవలదని పలుమారులు చెప్పెనేని, అట్లు చెప్పబడి యెఱిగిన సాక్షి స్మారితు డనంబడును.

3. యదృచ్ఛాభిజ్ఞుడు లేక డబ్బాటుసాక్షి : ఎచ్చటికోపోవుచు తనంతట తాను వచ్చి జరిగిన కార్యమును కార్యార్థితెలుపగా నెఱిగిన సాక్షి యదృచ్ఛాభిజ్ఞు డనబడును.

4. **గూఢసాక్షి** : అర్థి తన వ్యవహారము సిద్ధించుటకై యొకని బిలిచికొని వచ్చి దాచియుంచి, తాను ప్రతివాదితో నాడు మాటలు వినుచుండుమన్న పక్షమం దట్లు దాగియుండి వ్యవహారము నెఱిగినవాడు గూఢసాక్షి యనబడును.

5. ఉత్తరసాక్షి. సాక్షులు గుర్తెఱిగిన సంగతి వినియుండి గాని,సాక్షులు చేత నియోగింపబడియుండిగాని, సాక్షులమీద సాక్ష్యము బలుకువాడు ఉత్తర సాక్షి యనబడును.

ఇక అకృతసాక్షులను 6 గురను గూర్చి నారదుడు డిట్లు వివరించినాడు:

1. గ్రామస్థులు.
2 ప్రాడ్వివాకుడు
3. రాజు.
4 వ్యాపారముచేయువారి కార్యములను విచారించుటకు వారేర్పరచుకొని యుండు కార్యస్థుడు.
5. వాదిచే బంపబడినావా డొకసాక్షి.
6. కులవిషయికములైన వ్యవహారములందు వేరొక కులజులగు సాక్షులు.

ఇట్టి సాక్షులు పదునొకండు విధములవారు.

తపము, దానము, కులము, ధర్మము, సత్యము,ఆర్జవము,సుసంతతియు గల్గి, శ్రుతి స్మృతి మార్గవర్తులైన వారిని సాక్షులుగా నేర్చుకొనవలయును. అట్టి వారు దొఱకని పక్షమున అపగతదోషులైన జనులను తీసికొనవచ్చును (వి.-వ్య.-101). శుభగుణములు, ఆచారము, గొప్పతనమును లేనివా రెందఱు సాక్షులైనను నిరర్థకమే ఈ గుణము లన్నియును గల్గినవా డొకడైనను సాక్షి కాజాలును (వి.-వ్య.-102) కాని తిట్టాట,ఱంకు,ముచ్చిమి ఇత్యాది వివాదములం దెట్టివారైనను సాక్ష్యము గానోపుదురు (వి.-వ్య.-103). బాలకుడు, వృద్ధుడు, పగవాడు, చుట్టము, సూనగాడు, పాతకుడు, బొంకులాడు, ముచ్చు, ముండరి, కొండీడు, కల్లుద్రాగువాడు, తానె సాక్షిజెప్పబూని వచ్చినవాడు, పాడిధనము లోని పాలివాడు, కోపి, పుణ్యాపాపము లెఱుగనివాడు, జూదగాడు మొదలగు వారు సాక్షులు కానేరరు (వి-వ్య.-104, 105). సాక్షులు దుష్టస్వభావులై తప్పుడు సాక్ష్యమిచ్చినచో నది గ్రహించి, రాజు వారికి వేరువేరు దండనములు విధింపవలయును (వి.-వ్య.-107). తప్పుసాక్ష్యమిచ్చువాడు భయముచే ఒకచోట స్థిరముగా నిలువక నాలుకచే పెదవులను నాకుచు నిటునటు తిరుగు చుండును. నుదురు చెమర్చి, విన్ననైన వదనముతో, తడబడబలుకుచు బెదరి

చూచుచుండును. పలుకులు, తలపులు, చేష్టలు ఒకేరకముగా నుండక బహు వికృతులను బొందుచుండును. ఈ చిహ్నములను బాగుగా గుర్తించి తప్పు సాక్ష్యమని రాజు గ్రహించి రాజు ధర్మనిర్ణయము కావింపవలెను(వి.-వ్య.-45). సభలో సాక్ష్యమిచ్చుటకు వచ్చిన అర్థిప్రత్యర్థుల సాక్షులలో ఏకీభావములేకుండ వాదులాట ప్రారంభించినచో వారిరువురిలో గుణసమగ్రులైనవారి సాక్ష్యమును గ్రహించి, రాజు ధర్మనిర్ణయము చేయవలయును (వి.-వ్య.-108) సాక్షులను రాజు తూర్పుముఖముగా నిలుచుండబెట్టి అపుడు బొంకినవాడు బ్రాహ్మణుడైనచో సత్యమంతయు చెడుననియు, క్షత్రియుడైనచో వాహనాయుధములు వ్యర్థము లగు ననియు,వైశ్యుడైనచో గోధనధాన్యములు నశించుననియు, శూద్రుడైనచో పాపము లన్నియు జుట్టుకొను ననియు, వారికి దెలిపి, వారు చెప్పిన సాక్ష్యము నందలి ధర్మాధర్మములను గ్రహించి ధర్మనిర్ణయము జేయవలెను (వి.-వ్య.-106).

ఇట్టి మూడువిధములగు మానుషప్రమాణములచే, న్యాయాన్యాయములను రాజు నిర్ణయింపవలయును. ఈ మానుషప్రమాణములును లేని పక్షమున దివ్య ప్రమాణములు చేయింపవలయును. ఈ దివ్యప్రమాణములు తుల, అనిలము, జలము, విషము, కోశము అని పంచవిధములు (వి.-వ్య.-113). ఇందు సామాన్యముగా తుల విప్రులకును, అగ్ని క్షత్రియులకును, జలము కోమట్లకును, విషము శూద్రులకును, కొందరికి మాత్రము కొన్ని సందర్భములలో కోశమును, ప్రమాణముగా నుపయోగింపబడును (వి.-వ్య.-114). ఇట్లభియోగింపబడిన ప్రమాణమును, అభియుక్తుడు చేయవలెను. లేనిచో నేరము నొప్పుకొన్నవా డగును (వి.-వ్య.-115).

**1. తులాదివ్యము :** శోధింపవలసిన వానిని ప్రప్రథమ దివసమున తూచి, యాతనియెత్తయిన ఇటిక లన్నింటిని దాచియుంచవలెను. తరువాత సత్యమును నిర్ణయింపవలసిన దినమున ఆ త్రాసును పూజించి, అందు దిక్పాలుర నావహించి, ఆ శోధ్యుని తూర్పు విధముగా నందెక్కించవలయును. అప్పుడు ప్రాడ్వివాకుడు ఆ శోధ్యునిచే-

త్వం తులే సత్యధామాసి పురా దేవైర్వినిర్మితా ।
తత్సత్యం వద కల్యాణి సంశయా న్మాం విమోచయ॥
యదస్మి పాపకృన్మాత స్తతో మాం త్వ మధో నయ ।

శుద్ధశ్చేద్గమ యోర్ధ్వం మాం తులా మితి - (యా.-వ్య.- 99,100) అను మంత్రమును చదివింపవలయును. ఆ సమయమున శోధ్యు డున్నతి బొందిన శుద్ధు డగును; క్రిందికిబోయిన నేరస్థుడగును (వి.-వ్య.-117). ఇది తులాదివ్యము.

**2. అగ్నిదివ్యము:** 16 వ్రేళుల (అంగుళముల)పొడవు గల్గిన మండలములను ఏడిటిని ఏర్పఱుపవలయును. పితామహుడు-శోధ్యుడు నిల్చుండ వలసినదియును, తప్తాయఃపిండమును వదలవలసిన మండలమును గూడ కలిసి 9 మండలములని చెప్పినాడు. అవి-1. అగ్నిదైవత్యము; 2. వారుణము 3. వాయవ్యము; 4 యమదైవత్వము; 5. ఐంద్రము; 6. కుబేరదైవత్వము; 7 సోమదైవత్వము, 8 సవితృదేవతాకము, 9. సర్వదేవతాకము-అనునవి. వీనిలో శోధ్యుడు అగ్నిదైవత్వమున ప్రాఙ్ముఖుడై కాని, పశ్చిమాభిముఖుడై కాని నిలిచి చేతియం దేడు అశ్వత్థపత్రముల నుంచికొని, అందక్షతల నుంచికొని, దానిపై ప్రాడ్వివాకుడు మంత్రపూర్వకముగ 50 పలముల ఎత్తుగల తప్తాయః పిండము నుంచగా, అప్పుడా శోధ్యుడు వరుణ, వాయవ్య, యమ,ఇంద్ర,కుబేర, సోమ, సవితృమండలముల నేడింటిని గడచి, సర్వదేవతాకమైన మండలమున దానిని విడువవలయును అట్లు చేసిన పిదప చేతులు పొక్కనిచో నతడు శుద్ధుడు; పొక్కినచో నతడు దోషి. ఇది అగ్నిదివ్యము(వి.-వ్య.-118, 119). నడుమనే తప్తాయఃపిండము పడినను, సందేహము కలిగినను, మఱల జేయింపవలె నని యాజ్ఞవల్క్యుడు చెప్పినాడు (యాజ్ఞ.-వ్య.-105).

**3. జలదివ్యము :** ఈ జలదివ్యము చేయించుటకు యోగ్యమైన తావులు మనుజులు త్రవ్వని నదులు, మడుగులు, చెఱువులు, సముద్రములు, ప్రవాహములు మొదలగునవి అని నారదుడు చెప్పినాడు. మొసళ్ళు గలది, నాచుగలది, జలగలు చేపలు గలదియు, ఈ దివ్యమునకు పనికిరావని పితామహుడు నిషేధించినాడు. ఇట్లే బురదగల యుదకమును, తటాకాదులనుండి తోడితెచ్చి తొట్టియందు బోసిన జలమును, ఈ దివ్యమునకు పనికిరావు. బొడ్డుబంటి నీటి యందు నిలుచున్న శోధ్యుడు చంద్రకొయ్యతో జేయబడిన మ్రానువంటి దండమును చేతబట్టుకొని నిలువవలెను. జలస్థానముగట్టున సమమై, పరిశుద్ధమైన ప్రదేశమందు నారదోక్తరీతిగా నీటియందున్న శోధ్యుని కున్నంత దూరమునకు సరియైన పొడవుతోనుండు నట్లొక తోరణము గట్టించి, ఒక మంచివిలుకాడు

ధనుస్సు నెక్కు పెట్టి 3 శరములను వదలగా అందు నడిమి అమ్ము పడినంత దూరమున ఒకనిని నిలుపవలెను. అనంతరము ప్రాడ్వివాకుడు శోధ్యుని మునుగ వలసిన దని చెప్పి, తోరణము దగ్గరివానిని శరపతనస్థానమునకు పంప వలయును. అత డక్కడ చేరగా, అక్కడి శరీరమును పట్టుకొని, అచ్చట నిల్చినవాడు తోరణమువఱకు రావలయును. అప్పటివఱకును శోధ్యుడు జీవించి యుండినచో నతడు శుద్ధుడు; లేనిచో దోషి. ఇది జలదివ్యము (వి.-వ్య.-120).

**4. విషదివ్యము :** నారదులు చెప్పిన రీతిని ప్రాడ్వివాకుడు తొలిదిన ముపవసించి మరునటిదినము దేవ బ్రాహ్మణ సన్నిధియందు మహాదేవుని బూజించి ధూపదీపనైవేద్యాదు లన్నియు జేసిన పిమ్మట మహాదేవుని యెదుట విషమునుంచి ధర్మావాపనాది పూజలు—హోమములు నితరదివ్యములందు వలె చేయించి, సమంత్రకమగు ప్రతిజ్ఞాపత్రమును దివ్యకర్త శిరస్సున నుంచి-

త్వం విష బ్రహ్మణాః పుత్ర సత్యే ధర్మే వ్యవస్థితః ।
త్రాయస్వాస్మా దధీశాపా త్సత్యేన భవ మే(అ)మృతమ్॥
(యా.-వ్య.-108)

అను మంత్రముచేత విషమును అభిమంత్రించి శోధ్యునిచే త్రాగింపవలయును. పిమ్మట ఏనూరుమారులు చేతులు తట్టునంత కాలమైన తరువాత నారదులు చెప్పినట్లు, అతనికి జికిత్స చేయవలయును. అంతవఱకు అతడు జీవించి యున్నచో నతడు శుద్ధుడు, లేనిచో దోషి. ఇది విషదివ్యము.

**5. కోశదివ్యము:** ప్రమాణము చేయువాడు ఏ దేవతా భక్తుడో తెలిసికొని ఆ దేవతను, దుర్గాది ఉగ్రదేవలను పూజించి, శోధ్యుని గోమయముతో చేయ బడిన మండలమున సూర్యాభిముఖునిగా గూర్చుండబెట్టి, అతని ఆరాధ్యదైవము నభిషేకించిన జలము నాతనిచే మూడుదోసెళ్ళు పానము చేయింపవలయును. ఇది కోశదివ్యము (యాజ్ఞ -వ్య.- 100).

పితామహస్మృతియందు తప్తమాషము, తండులదివ్యము, ధర్మవ్రతము అను మఱి మూడు దివ్యములు చెప్పబడినవి. తప్తమాష మనగా నొక గిన్నె యందు నూనెను, నేతిని గలియబోసి, కాచి, యందు వేసిన తప్తమాషమును దివ్యకర్తచేతితో నెత్తించుట. అప్పుడతని వ్రేళ్ళు బొబ్బలెక్కనియెడల అతడు నిర్దోషి యగును.

తండులదివ్యమున - నానబోసి యెండబెట్టిన బియ్యమును, అంతకు పూర్వదినమునుండియు నుపవసించిన శోధ్యుడు. తూర్పుకు తిరిగి తనపై నారోపింపబడిన నేరము నుచ్చరించుచు తినవలయును. అప్పు డాతని గదవ ఎఱ్ఱబడకున్నను, ఆతని నాలుక పొక్కకున్నను, అతని శరీరము కంపింప కున్నను, ఆతడు నిర్దోషిగా గ్రహింపబడును.

వెండితో జేయబడిన ధర్మప్రతిమను, సీసముతో గాని లేక ఇనుముతో గాని చేయబడిన అధర్మప్రతిను, దాచియుంచి, దివ్యకర్తచే వానిలో నొకదాని నెత్తించవలయును అట్లెత్తుటలో ధర్మప్రతిమ నెత్తినచో నిర్దోషి యనియు, అధర్మప్రతిమ నెత్తినచో దోషి యనియు గ్రహింపవలయును (మితా.-వ్య.-పుటలు 155, 156).

ఇవికాక చిన్న చిన్న తప్పులయందు, దేవ బ్రాహ్మణుల పాదవిషయమైయును, భార్యాబిడ్డల శిరస్సుల విషయమైయును, శపథములు చేయనగు నని మన్వాదులు చెప్పినారు (మిత్యా.-వ్య.-పుట 156).

ఈ శపథము అబ్రాహ్మణునిచే నైనచో దేవసన్నిధియందును, అట్లు కానిచో బ్రాహ్మణసమీపముననను, లేనిచో చివరకు రాజుసమీపముననైనను చేయింపవలె నని స్మృత్యంతరమున చెప్పబడినది [1].

ఇట్లు మానుషప్రమాణములు లేనిచో దివ్యప్రమాణములు చేయించి నేరములను నిర్ణయించెడివారు.

ఇక ఈ వ్యవహారములు 18 రకములు. అవి :

| | |
|---|---|
| 1. ఋణాదానము | 2. నిక్షేపము |
| 3. దాయవిభాగము | 4. సీమావివాదము |
| 5. స్వామిపాలవివాదము | 6. అస్వామివిక్రయము |
| 7. దత్తాప్రదానికము | 8. క్రీతానుశయము |
| 9. అభ్యుపేతశుశ్రూషము | 10. ద్యూతసమాహ్వయము |
| 11. వాక్పారుష్యము | 12. దండపారుష్యము |

1. Dh. Kosa–1–1–Vyavahara.

13. సాహసము
14. విక్రీయాసంప్రదానము
15. సంభూయసముత్థానము
16. స్తేయము
17 స్త్రీసంగ్రహణము
18. ప్రకీర్ణకము—అనునవి.

ఈ 18 వ్యవహారములను నారదుడు ఈ విధముగా వివరించినాడు :—

1. ఋణాదానము : అధమర్ణునివిషయమై. ఈలాటి అప్పు తీర్పవలయు ననియు, ఈలాటి అప్పు తీర్పనక్కరలేదనియు, ఇట్టివా డప్పు తీర్పవలయు ననియు, ఇవ్విధమున ఋణము దీర్పవలయుననియు, ఉత్తమర్ణుని విషయమై ఇవ్విధంబున అప్పియ్యవలయు ననియు, ఇవ్విధంబున మఱల దీర్పవలయు ననియు, మొత్తము ఏడువిధములు గలదై యుండును (వి.-వ్య -64...92, మితా -వ్య.-36).

2 ఏ ద్రవ్యమైనను ఒక డొకనివద్ద నుంచినచో నతడు దానిని దాచియుంచి కాపాడి తిరిగి యా ధనస్వామి యడిగినప్పుడు జాగ్రత్తగా నీయ వలయును. ఇది నిక్షేప మనబడును (వి -వ్య -93...99, మితా.-వ్య.-64)

3. దాయ మనగా ధనాధికారితో దేహసంబధము గలుగుటచేత నన్యు నకు స్వత్వము గలుగు ద్రవ్యము ఈ దాయ మప్రతిబంధకము మనియు, సప్రతిబంధక మనియు, రెండు తెఱంగులు. అందు కొడుకులకు తండ్రి ధనము అను సంబంధముచేత స్వత్వవిషయము గనుక నిది యప్రతిబంధక మైన దాయము. ధనాధికారి కొడుకులు లేకుండినను, ధనాధికారి లేకుండినను, అతని ద్రవ్య మతని తండ్రికిగాని భ్రాతలకుగాని చేరునపుడు ధనాధికారి యుండుటయు, అతనికి గొడుకులుండుటయు మొదలగునవి భ్రాతాదు లగుట వలన స్వత్వవిషయమగును గనుక నది సప్రతిబంధకమైన దాయము. పలువురకు ద్రవ్య సముదాయమందు స్వత్వము గలిగియుండగా, అందు కొందరి స్వత్వము కొన్ని ద్రవ్యములయందు నుండు నట్లేర్పఱుచుకొనుట విభాగ మనబడును (వి -వ్య.-123...146; మితా.-వ్య.-111).

4. పొలిమేర యనగా భూమి మొదలైన వాని యెల్ల. అది దేశపుటెల్ల యనియు, గ్రామపు టెల్ల యనియు, ఇంటి యెల్ల యనియు, 3 విధములుగా నుండును. దానికి ధ్వజిని, మత్స్యిని, నైధాని, భయవర్జిత, రాజశాసన

నీత యని అయిదు విధముల లక్షణములు నారదులచే చెప్పబడియున్నవి. అందు చెట్లు మొదలైన ఉన్నత చిహ్నములు గలది ధ్వజిని కొలకులు, మడుగులు మొదలైన జలచిహ్నములు గలడి మత్స్యని. పొట్టు, బొగ్గు మొదలైన వాని పాతరలు గలది నైధాని. అర్థిప్రత్యర్థులు సమ్మతించి యేర్పఱచు కొన్నది భయవర్జిత. ఎఱిగినవారును, గుఱుతులును, లేని యపుడు రాజు తన చిత్తము చొప్పున నిర్ణయించినది రాజశాసననీత. ఈ చెప్పబడిన గుఱుతులను, చుట్టుప్రక్కలవారు మొదలగువారివలన దెలిసికొని ప్రభువు పొలిమేరను నిర్ణయింపవలయును (వి.-వ్య -147...151; మితా.-వ్య.-149).

5 ఎనుము గొఱ్ఱె మేక మొదలగు జంతువు లితరుల పొలము మేసినపుడు విధింపవలసిన దండనము, గోవుల విషయమున గోపాలురు తీసికొనవలసిన జాగ్రత్త మొదలగునవి స్వామిపాలవివాద ప్రకరణమున వచ్చును (వి.-ప్రా.-4...18, మితా.-వ్య.-పుట 208).

6. దాచ నుంచిన పరద్రవ్యమునుగాని, ఒకడు పోగొట్టుకోగా దొరికిన పరద్రవ్యమునుగాని, అపహరింపబడిన పరద్రవ్యమునుగాని, మరియొకడు విక్రయించిన నది యస్వామివిక్రయ మనబడును (వి.-వ్య -19...23;మితా.-వ్య -166).

7. శాస్త్ర చోదితముగాని మార్గము నవలంబించిన ద్రవ్యము నిచ్చి దానిని మరల రాబట్టుకొన నిచ్ఛగలిగిన పక్షమం దట్లు రాబట్టుకొనదగిన దానము దత్తాప్రదానిక మను వ్యవహార పదమగును (వి.-వ్య.-173; వి.-ప్రా.- 27...29).

8. వెలయిచ్చి యొక వస్తువును గొన్నవాడు పిమ్మట నా వస్తువు మంచిదికాదని యెంచిన నది క్రీతానుశయ మనెడు వ్యవహారపద మని చెప్పబడును (మితా.-వ్య.-175; వి -ప్రా.- 30,31).

9. ఎవడైనను పరిచర్యచేయ నొప్పుకొని దానిని జేయనివా డయ్యనేని అభ్యుపేత శుశ్రూషాఖ్య వ్యవహారపద మనంబడును (మితా.-వ్య.-222;వి - ప్రా - 32...34).

10. పాచికలు, తోలుపట్టు, దంతము మొదలగువానిచేత నిడుపుగా నాలుగుమూలలు తీర్చిచేయబడిన పాచికలు, చతురంగ మాడుటకుగా జేయు

బడిన యేనుగులు గుఱ్ఱములు మొదలగు ప్రాణములేనివానిచేత బందెములు పెట్టి యాడునది ద్యూతము. కోడి, జెట్లు, పొట్టేళ్ళు, ఎనుబోతులు మొదలగువాని చేత బందెముపెట్టి యాడునది సమాహ్వాయము (మితా.-వ్య.-197; వి.ప్రా.-39...41).

11. దేశము, జాతి, కులము, విద్య, శిల్పము మొదలగు వానిని నిందించునట్టి యాక్రోశధ్వనిగల మాటలతో గూడి రోషమును బుట్టించు వాక్యము వాక్పారుష్య మనంబడును (మితా.-వ్య.-234; వి -ప్రా.-42...49).

12. పరుల దేహములయందును, పరుల స్థావరద్రవ్యములయందును, జంగమద్రవ్యములయందును, చేతులచేత, కాళ్ళచేత, నాయుధములచేత, డాలు మొదలగువానిచేత నుపద్రవముచేయుట, అలాగే బూడిద దుమ్ము బురద పేడ మొదలగువానిని పైనవేసి మనస్సునకు దుఃఖమును గలుగజేయుట, యివి రెండును దండపారుష్య మనంబడును (మితా.-వ్య.-పుట 239; వి -ప్రా.-50...55).

13 రాజదండనమును, జనుల యాక్రోశము నుల్లంఘించి రాజపురుషులు గాని యితరులుగాని చూచుచుండగా దేనినైన నెత్తుకొనిపోవుట-చంపుట-పర భార్యను బట్టుట-మొదలగునవి సాహసములని చెప్పబడును (మితా.-227; వి -ప్రా.-60...75).

14. వెల నిర్ణయించుకొని యమ్మినట్టి సరకును గొన్నవాని కీయక పోవుట విక్రియాసంప్రదాన మనబడును (మితా -వ్య.-252; వి.-ప్రా.-76...80).

15. కొంద ఱొక యేర్పాటు చేసికొని దానిని వ్యతిక్రమించినచో నది సంభూయసముత్థాన మనంబడును (మితా -వ్య -257;వి -ప్రా.-81...87).

16. ద్రవ్యాధికారి మొదలగువారు చూడకుండ నేమరించిన పరధనమును హరించిన నది స్తేయము (మితా.-వ్య -254; వి.-ప్రా.-90...104).

17. స్త్రీసాహసము ప్రథమ మనియు, మధ్యమ మనియు, ఉత్తమ మనియు మూడువిధములు. అందు తగనిచోటునను-తగని సమయమునను-

జనులులేని తావునను - బరస్త్రీలతో మాటలాడుట, క్రీగంటి చూపుల జూచుట నగవు అనునవి ప్రథమసాహసవిషయములు. చందనము-పూలదండలు-ధూప ద్రవ్యములు- సొమ్ములు- వస్త్రములు-వీనిని పంపుట, భోగ్యంబులగు నన్న పానాదులచేత నాసపుట్టించుట, ఇవి మధ్యమసాహస విషయములు. విజన ప్రదేశమందు గూడియుండుట, యొకరితో నొకరు చేరియుండుట మొదలగునవి ఉత్తమసాహసదండన విషయములు. కావున స్త్రీసంగ్రహణము చేసినవానికి దండనము విధించునపు డా సంగ్రహణము నెఱిగి విధింపవలయును (మితా -వ్య.- 281, వి -ప్రా.-105...116).

18. ప్రకీర్ణకమునందు వ్యవహారములు రాజు నాశ్రయించియుండును. కావున రాజుల ఆజ్ఞ కడ్డముసేయుట, వారి కార్యములను చేయమి, పురప్రధానుల భేదించుట, ఆశ్రమవంతుల యాశ్రమధర్మలోపము, వర్ణసంకర దోషము, మఱియు బూర్వము చెప్పిన వివాదపదములలో జేరని విషయములును, ఈ ప్రకీర్ణకమున చెప్పబడును (మితా.-వ్య.- 292; వి.-ప్రా.- 117...140).

ఇట్టి 18 రకములకు వ్యవహారపదములను రాజు బాగుగా నెఱింగి ధర్మనిర్ణయము గావింపవలయును.

ధర్మనిర్ణయపద్ధతి నాల్గు అవస్థలలో నడచును. అవి - 1. ప్రతిజ్ఞాపత్రిక 2 ఉత్తరము 3. సంశయహేతు పరామర్శ 4. నిర్ణయము-అనునవి. ప్రతిజ్ఞాపత్రిక యనగా ఆర్థి తన నేరమును రాజుయొక్కయు సభికులయొక్కయు సమక్షమున నొక పత్రికపై వ్రాయునది ఉత్తర మనగా రాజుచే పిలిపంపబడిన ప్రత్యర్థి సభికు లౌననునట్లు అర్థి వ్రాసిన నేరమునకు ప్రత్యుత్తరము దానిపైననే వ్రాయుట. ఈ ఉత్తరము సందిగ్ధముగ నున్నను, అత్యల్పమైనను, అతిభూరియైనను, పక్షైకదేశమైనను, వ్యస్తపదమైనను, అవ్యాప్తియైనను, నిగూఢార్థసమ్మితమైనను, విరుద్ధమైనను, వ్యాఖ్యా-అగమ్యమైనను, అసారమైనను, నిరాకరింపబడును[1]. సంశయహేతుపరామర్శ మనగా సాక్ష్యాదులచే నేరమును దృఢపఱచుట. దీనినే కాత్యాయనుడు 'ప్రత్యాకలిత' మని చెప్పినాడు[2]. నిర్ణయ మనగా రాజు ధర్మనిర్ణయము చేయుట. ఇట్టి ధర్మనిర్ణయము నాల్గవస్థలలో నిర్ణయింపబడును.

ఇది వ్యవహారనిర్ణయ పద్ధతి

1. A. H. J.—Ch. 3.  2. A. H. J.—P. 27.

# 5. విజ్ఞానేశ్వరము - సాంకేతిక పదములు

1. సభ :- ఇది రాజు ధర్మ నిర్ణయము కావించుటకు కూర్చుండెడి స్థలము. ఈ సభ-నృపుడు, అధికృతుడు, సభ్యులు, ధర్మశాస్త్రము, గణకుడు, లేఖకుడు, హేమము, అగ్ని, జలము, భటులు—అను పది యంగములతో కూడి యుండును. రాజు సభయందుండి, అర్థి ప్రత్యర్థుల వాద ప్రతివాదములను విని, ఈ పది విధముల యనుకరణముల సహాయమున ధర్మ నిర్ణయము కావించును (వి.—వ్య.—౩).

2. సభ్యులు :— రాజు తనకు ధర్మవ్యవహారమున తోడ్పడుటకు. వ్యాకరణ మీమాంసాది శాస్త్రాభిజ్ఞులును, వేదాధ్యయన సంపన్నులును, సత్య యుతులును, ధర్మశాస్త్రవిదులును, రాగద్వేషవిరహితులును నైన వారిని, ఏడ్వురను కాని ఐదుగురను గాని ముగ్గురను కాని సభ్యులుగా నిర్ణయించు కొనును (వి.—వ్య.—2).

౩. ప్రాడ్వివాకుడు :- రాజు తనంతట తానే వ్యవహార నిర్ణయము కావించుట యతిముఖ్యము. ఒకవేళ తన కితర కార్యానురోధమువలన వ్యవహారముల విచారింపలేని పక్షమున తనకు మాఱుగ ధర్మశాస్త్రార్థ తత్త్వార్థ విధిజ్ఞుడైన ప్రాడ్వివాకు నొకని నియమింపవలయును అతడు మున్ముందు అర్థిప్రత్యర్థులను వ్యవహార విషయికముగా ప్రశ్నించి, పిమ్మట ప్రియపూర్వకముగా సభ్యులయెదుట వారి వ్యవహారసందర్భమును వివేచనచేసి చెప్పును కాబట్టి ప్రాడ్వివాకు డనబడునని బృహస్పతి చెప్పినాడు. ఆ ప్రాడ్వివాకుడు పదునెనిమిది విధముల వ్యవహారస్థానముల తత్త్వమును, వాని యంతర్భేదములగు ఎనిమిదివేల విధములను చక్కగా నెఱిగినవాడును, అన్వీక్షకి, దండనీతి మొదలైన విద్యాస్థానములం దారితేరినవాడును, న్యాయాధీశుడును గావలయునని నారదుడు చెప్పినాడు. రాజు ప్రాడ్వివాకుని మతానుసారముగా వ్యవహారము విచారింపవలసియుండును గాన, సభయందు రాజు కన్నను ప్రాడ్వివాకునకే ఎక్కువ ప్రాధాన్య మీయబడును (వి.—వ్య.—4).

4. వ్యవహారము :— 'వి'—అనేకమైన, 'అవ' — అనుమానములను, 'హర' పోగొట్టునది—కాన ఇది వ్యవహార మని కాత్యాయనుడు చెప్పినాడు (మన్వర్థముక్తావళి) ఇది శబ్దగతమైన యర్థము. బలవంతునిచేత మిక్కిలి బాధింపబడిన బలహీనుడు రాజసభకు వచ్చి తనకు జరిగిన యన్యాయమును రాజున కెఱిగించుట వ్యవహార మనబడు నని తాత్త్వికార్థము (వి.–వ్య.–8). ఈ వ్యవహారము ఋణాదాన నిక్షేపాది భేదములచే పదునెనిమిది విధములు. తిరిగి వానియందు ఎనిమిదివేల యంతర్భేదములు కలవు.

5. అర్థి :- అన్యాయము జరుగగా, రాజువద్దకు వచ్చి, తనకు జరిగిన యన్యాయమును రాజునకు చెప్పి, ధర్మాధర్మముల నిర్ణయింపవలసిన దని యర్థించువాడు (వి.–వ్య.–15).

6. ప్రత్యర్థి :- అర్థికి ప్రతియైనవాడు. అనగా అన్యాయము చేసినవాడు (వి.–వ్య –15).

7 పూట :- వ్యవహారనిర్ణయమైన పిదప ఓడిపోయినవారు గెలిచిన వానికిని, వ్యవహారనిర్ణయము కావించినందులకు రాజునకును, కొంతధన మీయ వలసియుండును. ఆ ధనమును తాను తప్పక యిత్తు నని చెప్పి ఓడి పోయిన యతడు ఒక జామీనును చూపవలయును. అతడు 'చూపుడు పూట' యనబడును (వి.–వ్య.–21).

8. పాడి :- పాడి యనగా ధర్మనిర్ణయము (వి.–వ్య.—27).

9. పత్రము :- రాజాజ్ఞచే పిలిపింపబడిన ప్రత్యర్థి వచ్చిన తరువాత, రాజు అర్థిచేత తన విజ్ఞాపనమును ప్రత్యర్థియెదుటనే ఒక పత్రికపై వ్రాయింప వలయును. అట్లే ప్రత్యర్థియు, తాను అర్థిని గూర్చి చెప్పవలసిన విషయమును సమాధానపూర్వకముగా అర్థియెదుట సభకు లౌననునటుల ఆ పత్రముపైననే వ్రాయవలయును. ఇట్లు వ్రాయబడిన పత్రము 'ప్రతిజ్ఞాపత్రము లేక భాషా పత్రిక' యని చెప్పబడును (వి.—వ్య.—30).

10. సాక్షి :— ఒక కార్యము జరుగగా చూచిన వాడనియు విన్నవాడ నియు రెండు రకములు. తిరిగి వారు కృతసాక్షులనియు, అకృతసాక్షులనియు, రెండు విధములు. కృతసాక్షు లనగా సాక్షులుగా నిర్ణయించుకోబడినవారు.

అకృతసాక్షు లనగా సాక్షులుగా నిర్ణయించుకోబడనివారు. ఈ కృతసాక్షులు లిఖిత, స్మారిత, యదృచ్ఛాభిజ్ఞ, గూఢ, ఉత్తరాది భేదములచే పంచవిధములు. గ్రామస్థులు, ప్రాడ్వివాకుడు, రాజు, వ్యాపారుల కార్యముల విచారించు కార్యస్థుడు, వాదిచే బంపబడిన సాక్షి, కులవిషయిక వ్యవహారములు నిర్ణయించు వేరొక కులజులగు సాక్షులు—అనువా రాఱుగురును అకృతసాక్షులు (వి.—వ్య.—30).

11. భోగము :— దీనిని అనుభవ మందురు ఇది- ప్రతిగ్రహక్రియాది స్వత్వకారణ యుక్తము, దీర్ఘకాలవ్యాపి, నిరంతరము, నిరాక్షేపము, ప్రత్యర్థి సన్నిధానము-అను అయిదు విశేషణములతో గూడియుండును (వి —వ్య —30).

12. మానుషము :- మానుష మనగా మనుష్య సంబంధములైన లిఖిత, భుక్తి, సాక్ష్య ప్రమాణములు (వి.—వ్య.—31).

13. దైవక్రియ:— మానుషములైన ప్రమాణములు దొఱకని పక్షమున, తులానల జల విషకోశాది ప్రమాణములచే వ్యవహార నిర్ణయము కావింపబడును. అట్టి క్రియ దివ్యప్రమాణ మనబడును (వి.-వ్య.-30).

14 ఆకు :—ధనము నప్పిచ్చినవాడు, ఋణముకొన్నవానిచే వ్రాయించుకొను ప్రమాణపత్రము (వి.-వ్య.-38).

15. దండువు:— వ్యవహారమున నోడిపోయినవాడు, వ్యవహారమున గెల్చినవానికిని, రాజునకును చెల్లించుకోవలసిన నష్టము (వి.—వ్య.—40).

16. ధనికుడు లేక ధనకుడు:-అప్పిచ్చినవాడు (వి.-వ్య -43).

17. ఋణి లేక ఋణికుడు:—అప్పు తీసుకొన్నవాడు (వి.-వ్య.-43)

18.వడ్డి:-ధన మప్పుతీసికొనెడివాడు, బ్రాహ్మణుడైనచో రెండుచొప్పునను, వైశ్యులైనచో నాల్గుచొప్పునను, శూద్రులైనచో ఐదుచొప్పునను ఇచ్చుకొనెడివారు. అది కాలిక, కాయిక, కారిత, చక్రవృద్ధి యని నాల్గు విధములు.

19. రోయి:— ధన మప్పకొనినప్పుడు ఉంచు కుదువ రోయి యనంబడును (వి.—వ్య.—64). వేశ్య కిచ్చెడు శుల్కముకూడ 'రో' యనబడును (వి.—ప్రా.-94).

20. మండలము:- పదునారంగుళముల పొడవును, పదునారంగుళముల వెడల్పును గలిగిన చతురస్రాకార ప్రదేశము. అగ్ని దివ్యమునందు ఇట్టివి తొమ్మిది మండలముల నేర్పాటుచేసి, చేతియం దగ్నిని ధరించిన శోధ్యునిచే వానిపై నడిపింతురు (వి.-వ్య.-119).

21. మడ్డు.- ఏబదిపలముల బరువు గలిగి ఎనిమిది వ్రేళ్లాయితమైన ఇనుపగుండును (మడ్డుచు) అగ్నిదివ్యమునం దుపయోగింతురు(వి.-వ్య.-118).

22. దాయము:- దాయ మనగా ధనాధికారితో దేహసంబంధము కలుగుటచేత నన్యునకు స్వత్వముగలుగు ద్రవ్యము. ఈ దాయ మప్రతిబంధకము, సప్రతిబంధకము అని రెండు విధములు. అందు కొడుకులకు తండ్రిధనము అను సంబంధముచేత స్వత్వవిషయము గనుక నిది అప్రతిబంధకమైన దాయము. ధనాధికారికి కొడుకులు లేకుండినను, ధనాధికారి లేకుండినను, అతని ద్రవ్యమతని తండ్రికిగాని, భ్రాతలకుగాని చేరునపుడు ధనాధికారి యుండుటయు, అతనికి గొడుకు లుండుటయు మొదల గునవి భ్రాతాదు లగుటవలన స్వత్వవిషయ మగును గనుక నది సప్రతిబంధకమైన దాయము. పలువురకు ద్రవ్యసముదాయమందు స్వత్వము గలిగియుండగా అందు కొందరి స్వత్వము కొన్ని కొన్నిద్రవ్యముల యందు ఉండున ట్లేర్పరచుకొనుట విభాగ మనబడును (వి -వ్య.-125).

23 బందె:- పశువు లితరుల చేను మేసినపుడు రాజు వాటి యజమానులవద్దనుండి వసూలుచేయు సుంకము (వి.-ప్రా.-4).

24. కొలుచులు:- కొలత కొలుచు పాత్రలు (వి.-ప్రా.-69).

25. నెలప్రతి:- రాజు ప్రతినెల, వర్తకులు సరకు లమ్మవలసిన ధరలపట్టి యొకటి నిర్మించును. వారా ధరల ప్రకారమే వస్తువుల నమ్మవలయును. అట్లు అమ్మకపోయినచో వారు దండింపబడుదురు (వి.-ప్రా.-74).

26. సుంకము:- రాజు బేహారులవద్దనుండి వసూలుచేయు పన్ను (వి.-ప్రా.-83).

27. వ్రేగు:- ఓడపై ప్రయాణము చేసినందుకు ఓడ యజమానులకు చెల్లింపవలసిన డబ్బు (వి.-ప్రా.-86).

## భాషావిశేషములు

కేతన కాలమునాటికి తెలుగుభాషలో చాలావఱకు సంస్కృత పదముల వాడుక తగ్గిపోయినట్లు కన్పట్టుచున్నది. ఈ మార్పు కేతన కించుక పూర్వులైన శివకవులు కావించిన దనుటలో సంశయము లేదు. శివకవుల ప్రభావము ఈ విషయమున కేతనపైకూడ ప్రసరించినదనుట వాస్తవము. విజ్ఞానేశ్వరమున అపూర్వములైన తెలుగుపదములు అనేకములు ప్రయోగింపబడినవి. చివరకు కొన్ని సాంకేతిక పదములు (Technical terms) కూడ తెనుగున కనువదింప బడియున్నవి:-

అస్వామి విక్రయము-అస్వామి యమ్ముట (వి.-వ్య.-17)
సంవిద్వ్యతిక్రమము - కూడి బేహారము లాడికొనుటలోని పోరు (వి.-వ్య -17).
సీమా వివాదము - పొలిమేరవలనిపోరు (వి.-వ్య.-17).
స్త్రీ సంగ్రహణము - అంకాట (వి.-వ్య.-17).
పత్రము - ఆకు (వి.-వ్య.-17).
భోగము - కుడుపు (వి.-వ్య.-49).
స్మారిత సాక్షి - తలపు సాక్షి (వి.-వ్య.-100).
యదృచ్ఛాభిజ్ఞుడు - దబ్బాటు సాక్షి (వి.-వ్య.-100).
ధర్మము - పాడి (వి.-వ్య.-18).
పత్రము - ఆకు (వి.-వ్య. -38).

ఇవికాక సామాన్యముగా వాడుకలో నుండని కొన్ని అపూర్వపదములను కేతన ప్రయోగించినాడు:-

అచ్చు - దండిగిచ్చు (వి.-ప్రా.-48); శుద్ధము (వి.-ప్రా.-91)
ఆకు - ఇచ్చి పుచ్చుకోలు పత్రము (వి.-వ్య.-38).
ఇడుగడ - హీనత్వము (వి.-ఆ.-111).
ఎడ - వ్యవహారము (వి.-వ్య.-83).
ఏటము - ప్రధానము (వి.-వ్య.-27).
డబ్బాటు - అకస్మాత్తు (వి.-వ్య.-100).
తెవులుగొంటు - వ్యాధిగ్రస్తుడు (వి.-ప్రా.-16).
దళము - అధిక్యము (వి.-ప్రా.-55).

పాడి - ధర్మము (వి.–వ్య.-18).
పూట - జామీను (వి.–వ్య.-10).
పందె - పశువుల దండుగ (వి.–ప్రా.-4).
మడ్డు - ఇనుపగుండు (వి.–వ్య.-118).
మాపు - సాయంకాలము (వి.–ఆ.-63).
ముచ్చట్లు చఱచి - మూడు ప్రదేశములు తుడిచి (వి.–ఆ.–67,79).
రెంట - ద్వైవిధము (వి.–వ్య.-108).
రో - వేశ్య కిచ్చెడు శుల్కము (వి.–ప్రా.-109).
రోయి - కుదవ (వి.–వ్య.-64).
వ్రేకన - భారము (వి.–ప్రా.-16).
వ్రేలు - అంగుళము (వి.–వ్య.-119).
రెట్టి - రెట్టింపు (వి.–వ్య.-88).
వెసల - పాత్ర (వి.–ఆ.-78).
కూటిముడి - అన్నపు పళ్లెరము (వి.–ఆ.-79).
గొట్టెము - నీరుత్రావు పాత్ర (వి.–ఆ.-80).
మెయి - సమానమైన (వి.–ప్రా.-124).
గ్రొచ్చు - త్రవ్వు (వి.–ప్రా.-147).

ఇట్లనేక అపూర్వపదములను కేతన తన విజ్ఞానేశ్వరమున ప్రయోగించి యున్నాడు.

# 6. కేతన భాషాప్రయోగ విశేషములు

ఆంధ్రభాషాభూషణము చాలా చిన్ని వ్యాకరణ మగుటచే నది యానాటి భాషను సంపూర్తిగా పరివేష్టింప దనునది నిర్వివాదమైన విషయము. అయినచో కేతన అంత చిన్ని వ్యాకరణమును వ్రాయ నేల యను ప్రశ్న వచ్చును కేతన మొట్టమొదటిసారిగా తెనుగున వ్యాకరణమును వ్రాయ ప్రయత్నించినాడే కాని, యానాటి భాష కంతకును వ్రాయవలె నని యతని యుద్దేశ్యము కాదు. అది యునుగాక, తెనుగున నే వ్యాకరణమును సంపూర్ణ మని చెప్పుటకు వీలులేదు. నేటివఱకును మిక్కిలి ప్రసిద్ధికెక్కిన చిన్నయసూరి బాలవ్యాకరణమే సంపూర్ణ మని చెప్పుటకు వీలులేదు. అది సంపూర్ణమని చెప్పినచో ప్రౌఢవ్యాకరణ మేల యను ప్రశ్న వచ్చును. కావున కేతనకూడ తన కాలమునకున్న భాషకంతకును సరిపోవు వ్యాకరణము వ్రాయలే దని విమర్శింప నవసరములేదు. అంతేకాక, అతని వ్యాకరణమునకు వ్యతిరిక్తమైన ప్రయోగములు కొన్నియు, అతని వ్యాకరణమున చెప్పబడని ప్రయోగములు కొన్నియు అతని గ్రంథములందే కలవు. వాని నిచ్చట వివరించెదను

**ఆంధ్రభాషా భూషణమునకు వ్యతిరిక్త ప్రయోగములు**

1. చిన్నయసూరి తెనుగులమీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావనెను (బాల.-సంధి.-14). కాని విజ్ఞానేశ్వరమున కేతన 'వేవణముల నెనిమిదింటిని' (వి.-ప్రా.-49) అని ప్రయోగించినాడు ఇచ్చట 'వేయిపణముల నెనిమిదియు' అని అకాడమీ తాళప్రతియందు గలదు కాని, ప్రాసభంగ ముండుటచే నది యగ్రాహ్యము.

2. 'ఇండి' వర్ణకము తదభావద్యోతకమున నగు నని ఆంధ్రభాషాభూషణము (163). కాని విజ్ఞానేశ్వర, దశకుమార చరిత్రలందు 'ఇండి' అని కాక, 'ఇఁడి' యనియే ప్రయుక్తము-వెరవిడి(వి.-ఆ.-101; దశకు.-11-104)

**ఆంధ్రభాషాభూషణమున సాధింపబడని కేతన ప్రయోగములు**

1. పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు (బాల.-సంధి.-46) అని చెప్పి సూరి 'భయంపడి' వంటి రూపములను సాధించినాడు. కేతన వీనిని చెప్పకయే 'భయంపడి' (దశకు. 8-79) అని ప్రయోగించినాడు.

2. కర్మధారయంబునం దుత్తునకచ్చు పరంబగునప్పుడు టుగాగమంబగు (బాల.-సంధి.-28). కేతన దీనిని చెప్పకయే - ఈలువుటాలు (వి.-ఆ.-115), అంకుటాంద్రకున్ (వి.-ఆ.-111), నగవుటీగి (వి.-ప్రా.-29) నిక్కుపుటాలు (వి.-ప్రా.-107) అని ప్రయోగించినాడు.

3. ఆంధ్రభాషాభూషాణమున ఆమ్రేడితము పేర్కొనబడలేదు. అందువలన ఆమ్రేడితమున వచ్చు విభక్తిలోపాదులుగాని, రూపభేదములుగాని, అందు కన్పట్టవు. కాని, నిచ్చనిచ్చవడ్డి, నెలనెలవడ్డి (వి.-వ్య.-66), ఒక్కొక్క (దశకు. 4-150) వంటి వానిని ప్రయోగించినాడు కేతన.

4. ఆంధ్రభాషాభూషణమున ఔపవిభక్తికములైన 'ఇ, టి, తి' వర్ణకములు కన్పట్టవు. కాని అవి వచ్చిన రూపములు విజ్ఞానేశ్వరమున ప్రయోగింపబడినవి—పెనుఁ్రవేలి మొదలి తీర్థంబు (వి.-ఆ.-51); ఏటి నీళులు (వి.-ఆ.-50); లేటిపిండు (ద. 8.-25); పద యింటికి (వి -ప్రా.-78); పొదరింటిలోన (ద. 2-91).

అంతేకాక, ఒక ఔపవిభక్తికముపై మఱొక ఔపవిభక్తిక ప్రత్యయము కూడ వచ్చిన రూపాములును కలవు- మొదలిటిపత్రము లెల్లను (వి.-వ్య.-37).

5. అకారంబు క్రింది అకారంబునకు లోపంబు బహుళంబుగా నగు (బాల.-ప్రకీర్ణ-7).

గొజ్జియ—గొజియ (వి.-ప్రా-4).

6. తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచకంబు పరంబగునపుడు మతుబర్థంబున నగు- బోయత (ద.-2-80). అట్టి తవర్ణంబు పరమగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడి(బాల.-తద్ధిత-19,20)- మాలెత(వి.-ప్రా. 125). ఈ ఎత్వవిషయమును కేతన చెప్పనే లేదు.

7. దఘ్నార్థంబున బంటి కొలదు లగును (బాల.-తద్ధిత-27)—బొడ్డుబంటి నీళులలోన(వి.-ప్రా.-120).

8. ప్రేరణంబున పకారము వచ్చును (బాల.-క్రియా.-87)—మోపించి (వి.—వ్య.-18); దిగిపించి (ద.10-59).

9. కర్మధారయంబునందలి మువర్ణమునకు పుంపులును,టుగాగమమును వచ్చును (బాల.-సంధి-32,28).

నిక్కపు బత్రము (వి.-వ్య.-110); నిక్కపు జంగము (ద.-7-68); సుంకపుటెండులు (వి.-ప్రా.-85); నిక్కపుటాలు (వి.-ప్రా.-107).

10. క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు (బాల.-తత్సమ-18)-కరుణారసపాత్రంబు (ద.1-20); కీర్తి పాత్రంబు (ద. 1-41)

11. అగు ధాతువునకు ముత్తు పరంబగునపుడు 'కమ్ము' అని యగును (బాల.—క్రియా-91).

కమ్ము (ద. 8-28).

12. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు (బాల.-ప్రకీర్ణ-22)—గర్వంబు గిర్వంబు నుడువ నైతి(ద.6-54,68).

13. పద్యాదుల నలవర్ణకంబున కత్వంబును, గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు (బాల.-క్రియా-51).

అగుపడ్డ (ద. 5-130).

14. మహత్తుల మగాదులకుం గయిరాదులకును డుజ్జగు; నుత్వంబు గాదు (బాల.-ఆచ్ఛిక-4).

కేతడు (ద. 1-45); తిక్కడు (ద. 1-91).

15. తాను శబ్దము 'తా, తాన్' అనియే పెక్కుచోట్ల వాడబడినది. ఒకటి రెండుచోట్ల మాత్రము 'తాను' అని గలదు.

తాఁ బరశాఖ న్వర్తించెనేని (వి.—అ.-7).

తా దండ్యు డగున్ (వి.—ప్రా.-22)

మున్నొక్కడఁ బాడిఁ దాను గెలుచుట (వి.—వ్య.-16).

ఈ తాను అనునది అది యను నర్థమునగూడ ప్రయోగింపబడినది.

తా మిక్కిలి దోషము (వి.-ప్రా-.111).

16. వారు అను నర్థమున 'తారు' శబ్దము ప్రయుక్త మైనది.

తా రొక్క వేహారంబె (వి.-ప్రా.-30)

తా రక్కన్యారక్షణార్థంబు (ద. 4-19).

17. రెండు శబ్దము సమాసపూర్వపదంబుగా నున్నప్పుడు 'ఇరు' అనియే కాక, అనేకరూపములు పొందుచున్నది.

ఇరువురము (ద.3-88); ఇనుమడి (వి.-ప్రా.112); ఇద్దరికి (ద.5-50); రెండు (ద. 6-112); రెట్టి (వి -వ్య.-88); రెంటలై (వి.-వ్య.-108).

18. అస్మచ్ఛబ్దమునకు 'ఏను' అను రూపమేకాని,'నేను' అని కానరాదు.

ఏను దొల్లి యిట్ల (వి.-ప్రా.-105).

ఏను కాదె విభునకు (ద. 3-135).

కాని విభక్తియుత మైనపుడు 'నన్ను, నా' అను రూపముల నందినది.

నన్ను (ద. 3-41); నాకు (ద.-136); నాదు (ద. 5-31); నానేర్చిన భంగి (ద. 4-5).

ఇట్లే బహువచనమున 'ఏము' అనియే ప్రయుక్తము (ద. 2-65,66).

కాని, యుష్మచ్ఛబ్దమునకు 'ఈవు, నీవు' అని రెండు విధములుగను ప్రయుక్తమైనది.

ఈవు (ద 2-62); నీవు (ద. 2-107).

విభక్తి చేరినపుడు- నిన్ను (ద. 3-52), నిదు (ద. 5-62) అని ప్రయుక్తమైనది.

19. ఇల్లు శబ్దమునకు బహువచనము 'ఇండ్లు'. దీనికి 'ఇండులు' అను రూపము కన్పట్టుచున్నది.

ఇండులు (ద. 5-71); సుంకపుటిండులు (వి.-ప్రా-85).

20. నీరుశబ్దము 'నీళులు' అని కూడ ప్రయుక్తము.

గంగనీ రదెంత (వి.-ఆ.-50).

నీళు లొకమాటు సోక (వి.-ఆ. 54).

కన్నీళులు (ద. 10-167).

21 ఇట్లే, కోళ్లు అను నర్థమున కోళులు అని ప్రయోగింపబడినది (ద. 9—29)

22. ఏడు (సంవత్సరము) శబ్దమునకు 'ఏళ్లు, ఏండ్లు' అనునవి బహు వచనరూపములు. దీనికి 'ఏడులు' అను రూపమును ప్రయోగించినాడు కేతన.

ఎనిమిదియేడుల శిశువట (వి.-వ్య.-83).

ఇరువదియేడులు (వి.-వ్య.-46).

23. అందురు అను నర్థమున 'అంద్రు' అని పలుచోట్ల ప్రయుక్తమైనది. (వి - ఆ. -105, 107, 123, 126).

24. దిక్కయినవాడు అను నర్థమున 'దిక్కండు' అనియు ప్రయుక్తము (ద.1-64).

25. 'సత్యము' శబ్దము అమహద్వాచకము. దీని సబంధవాచకము లును అమహద్వాచకములే కావలెను. కాని కేతన మహద్వాచకముగా ప్రయో గించినాడు.

26. పదుగురు అను నర్థమున 'పదుంద్రు' అని వాడబడినది.

ప్రాదుర్భావము నొందిన పదుంద్రు కుమారులు (ద. 2-115).

27. 'ధర్మము' అను దానిని నన్నయ 'ధర్మువు' అని ప్రయోగించి నాడు. ఇట్లే కేతన కూడ 'ధర్మువు చెఱచి' (ద. 3-9) అని ప్రయోగించినాడు.

28. 'ప్రాణగొడ్డము' అను వైరిసమాసమును కేతన రెండుమార్లు ప్రయో గించినాడు (ద. 3-70, ద. 6-94).

29. మధ్యమపురుషైకవచన ధాతువులలో 'వి' ప్రత్యయ విరహిత రూపమును ప్రయోగింపబడినది.

శాపం బిచ్చితి (ద. 4-100).

దీనికిని, ఉత్తమపురుషైకవచనధాతువునకును—(నేను) కడునొచ్చితి (ద. 4-100)-భేదము కన్పట్టదు. అర్థబోధను బట్టి మాత్రమే గుర్తింపవలయును.

30. 'లడయో రభేదః' అనుదాని ననుసరించి ఒకచోట కేతన ప్రాస స్థానమున 'డ' కు బదులు 'ల' యే ప్రయోగించినాడు.

"..........తద్వార్తకు బె
గ్గిలి కెలనెఱుంగకుండన్
వెల(డ)లితి........." (ద. 5-85)

31. 'వలదు' అను శబ్దమును నన్నయ యనేకచోట్ల 'వలవదు' అనియే ప్రయోగించియున్నాడు. ఇట్లే కేతనకూడ "వెఱవ వలవదు" (ద.5-88) అని ప్రయోగించినాడు.

32. 'ఉంటిమి' ఇత్యాది ఉత్తమపురుష ధాతువులకు 'ఉండితిమి' అని యనేకచోట్ల ప్రయుక్తమైనది—ఉండితిమి (ద. 6-103); వచ్చుచుండితిమి (ద. 7-11); తలపోయుచుండితిన్ (ద. 8-25).

33. 'ఎదురు' అను పదమునకు 'ఎదుళ్లు' అని ప్రయుక్తము.

ఎదుళ్లు చూచెద (ద. 10-17 ; ద. 12-71).

34. పెద్దశబ్దమునకు 'ఆలు' శబ్దము పరమగునపుడు టుగాగమ రుగాగమముల వంటి వేమియు రాకుండ, సంధియే జరుగుచున్నది.

పెద్ద + ఆలు = పెద్దాలు (వి.-ఆ.-115).

# 1. దశకుమార చరిత్రము–
# కేతన చిత్రించిన తిక్కన

కేతన తన దశకుమారచరిత్ర ప్రథమాశ్వాసములోను, షష్ఠ్యంతముల లోను, ఆశ్వాసాది ఆశ్వాసాంత పద్యములలోను, తిక్కనను ఒక విశిష్టమైన-విలక్షణమైన వ్యక్తిగా తీర్చిదిద్దినాడు ఈ దశకుమార చరిత్రనుబట్టి తిక్కన పితరులు, వారి వంశగౌరవము, ఆచారతత్పరత, గుణగణములు, కీర్తిప్రతిష్ఠలు విపులముగా బోధపడగలవు అంతేకాక, కేతన తనకు తిక్కనపైగల ఆదరాభిమానగౌరవములను ఇందు వ్యక్తపరచినాడు.

తిక్కన ఇంటిపేరు కొట్టరువువారు – కొట్టరువు తిక్కని (ద. 1–4); కొట్టరు మంత్రితిక్కనిన్ (ద.1–8); కొట్టరువు తిక్కనామాత్యుండు (ద 1–20): కొట్టరువు కొమ్మనామాత్య కూర్మిసుతుడు (ద. 1–89).

తల్లి అన్నమ లేక అన్నమ– అన్నమ తిక్కని (ద. 1–1); అన్నమ సుతుడు (ద. 1–91); అన్నమ వరసుతునకు (ద 1–101); అన్నమాంబా తనూజుండు (ద. 2–120).

తండ్రి కొమ్మనామాత్యుండు-కొమ్మయ తిక్కని (ద. 1–2); కొమ్మనామాత్య కూర్మిసుతుడు (ద. 1–89); కొమ్మనామాత్యపుత్రా (ద. 3–165); కొమ్మనామాత్యు సూనున్ (ద. 6–196); కొమ్మనామాత్య తనూభవత్వ మహిమ స్తవనీయ (ద. 10–142).

వీరిది గౌతమ గోత్రము——గౌతమ గోత్రమునన్ (ద. 1–28); పూత చరిత్ర సముజ్జ్వల గౌతమ గోత్రునకు (ద. 4–129).

వీరు బ్రాహ్మణులు అంతేకాక, ఆయన తమ వంశములోని వారిలో నుత్తమోత్తముడు–పద్మోద్భవ వంశాగ్రణికి (ద. 1–97); భూదేవకులాగ్రణికి (ద. 1–103); విరించివంశవనధిప్రాలేయ భానుండు (1–118); కులజలరుహ

మిత్రుడు (ద. 3-165); కులాబ్ధి సుధాకర శుభమూర్తి (ద. 7-1); అన్వయోద్ధారుడు (ద. 10-198).

వారిది శివపూజాది శ్రౌత స్మార్త కర్మలు, విశ్రుతమైన ఆచారములు గల కుటుంబము— ఆగమ ప్రథితకర్మ స్ఫూర్తికిన్ (ద. 1-102); పూజాతర్పిత రాజశేఖరునకున్ (ద. 1-102); సేవాతర్పిత శశాంక శేఖరునకు (ద. 1-103) చిత్తనిత్యస్థిత శివు డెవ్వ డనిన వీడను శబ్దమున కర్థమైనవాడు (ద. 1-89); ఉదాత్త శ్రౌత స్మార్తకర్మ తత్పర మతికిన్ (ద. 2-1); వేదోదిత కర్మవ్రత (ద. 3-164); లసిత హరపదపద్మైకావాస చిత్తమధుకర (ద. 8-1); విశ్రుతాచారముద్రా (ద. 8-96).

తిక్కన స్వయముగా వేదవేదాంగవిదుడు—వేదత్రితయాత్మకు (ద.1-4); వేదాది సమస్త విద్యాభ్యాసి (ద. 1-88); వేదాది ప్రకట వివిధ విద్యాభ్యాసాపాదిత మహత్త్వుడు (ద. 1-94); అనూన తపస్స్వాధ్యాయాది సుకృతపరిపాకుడు (ద. 1-98); సకలాగమతత్త్వార్థ విచారోదారుడు (ద. 2-119); నానావేదవేదాంగ తత్త్వజ్ఞుడు (ద. 5-186); సారవిద్యా పవిత్రుడు (6-196 )

దశకుమారచరిత్ర రచనాకాలము నాటికి తిక్కన యజ్ఞముచేసి సోమయాజి యైనట్లు కన్పట్టదు. కాని సోమయాజి యని ఎచ్చటను పేర్కొనకపోవుటవలన నీత డింకేమైన యాగములను చేసియుండవచ్చు నని తలంపవచ్చును. దశకుమారచరిత్రలో పలుచోట్ల యాగప్రశంస కలదు— నారాయణుండునుం బోలె క్రతు పురుషత్వ ప్రసిద్ధుండును (ద. 1-88); సతత స్వాహా స్వధాది శబ్దద్వయ సంస్కృత హవ్య కవ్య సంతర్పిత మఖ శిఖిముఖ నిలింప పితృవర్గునకున్ (ద. 1-96); యాగవిద్యాభిరామా (ద. 3-165); సతతాధ్వర క్రియాకర్మఠ పాణిపద్మునకు (ద. 5-184); మఖ సంతోషిత మరుత్సమాజునకు (ద. 5-185); యాజక మండలోత్తమా (ద. 8-94).

తిక్కన తండ్రి కూడ మంత్రిగా నుండి రాజసత్కారాదులను పొంది ఐశ్వర్యమును సంపాదించినవాడే: కావున తిక్కన పుట్టుభోగిగనే కన్పట్టును. కేతన చాలచోట్ల తిక్కనను మిక్కిలి ఐశ్వర్యవంతుడుగా వర్ణించినాడు— నారాయణుండునుం బోలె లక్ష్మీ సమాలింగిత వక్షుండును (ద. 1-88); దేవేంద్రవిభవునకు (ద. 1-103); ఇద్ధలక్ష్మీ కళత్రుండు (ద. 2-120);

శ్రీ సంయుక్త కటాక్షా (ద. 4-128); అపారవిభవ దేవేంద్రునకున్ (ద.5—1); దేవేంద్రసమాన విభవ (ద 8—1); నిర్జిత దేవేంద్రవిభవ (ద. 8—95);

ధన మున్నచోట చదువుకూడ ఉండుట చాలా అరుదు. తిక్కన ఎంత ఐశ్వర్యవంతుడో అంత పాండితీ సంపన్నుడు గూడ — వాక్పతి నిభుడు (ద. 1—91); విద్వదోగ్యభాగ్యుడు (ద. 1—97); విద్యావైశారద్యత సము ద్యోతితమతి (ద 1-100); భారతీ సుస్థిర సంభావిత వదనసదనుడు (ద. 1—103); పండిత పుండరీక నవపంకజబాంధవుడు (ద. 3—163); నిఖిలలోకామోదసంపాదిత విద్యాధనుడు (ద. 4—130); కావ్యకళాజనిభూమి (ద. 5—134); నిఖిలకళాసంవేది(ద. 5—135); వచస్సమగ్రతా చతురాస్యుడు (ద. 6—195); విద్యానికషోపలము (ద. 7—165); ప్రౌఢ విజ్ఞానదీపము (ద. 8—96); విద్యానిధానము (ద. 10—132).

తిక్కన మహాకవి కూడ. బాణ మయూరాది సంస్కృత మహాకవులకు దీటైనవాడు—— మయూర సన్నిభ మహాకవి తిక్కన (ద. 1—6), "అగునన కొమ్మయ తిక్కడు,జగతి నపూర్వార్థశబ్ద చారుకవితమై, నెగడిన 'బాణోచ్ఛిష్టం, జగత్త్రియం' బనిన పలుకు సఫలంబయ్యెన్" (ద. 1—90); పద్యాది త్రివిధ కావ్య పారీణునకున్ (ద. 1—100); కవిసరోజ మార్తాండునకున్ (ద.1—101); నిత్యస్తుత్య విలాస సారకవితా నిర్మాణచాతుర్య(ద. 7—164); కవితాధన్యుండు (ద. 9—84).

ఈ మహాకవికి సంస్కృతాంధ్రభాషలలో నపారపాండిత్యము ముండుట వలననే 'ఉభయకవిమిత్రు' డను బిరుదము వచ్చినదట. ఈ బిరుదము మనుమ భూపతి యాస్థానముననే ఈయబడినది (ద. 1—92)—— గౌతమ గోత్రునకు నుభయకవిమిత్రునకున్ (ద. 4—129).

తిక్కన కవియే కాక గొప్ప రాజకీయ చతురుడును-మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్యభార ధౌరేయుడు (ద. 1—89);సామాద్యుపాయవిదుడు(ద.1—95); నయోన్నతుడు (ద. 1—97); నీతిచాణక్యుడు (ద.1—97);నీతి సంపదాఖండల పూజ్యుడు (ద. 3—163); దుర్గమ శాత్రవ పార్శ్వభేది (ద. 4—128); నీతి నిపుణమతిజిత పురుహూతామాత్యుడు (ద. 4—129); రాజనయవిధాప్రయోజన విశారదుడు (ద. 8—94); అరిసచివమహోపాయాపహారుండు (ద. 9—86); నరపతి నయవిద్యానైపుణప్రౌఢభావుకుడు (ద. 11—144).

అంత గొప్ప రాజకీయచతురు డగుటవలననే మనుమసిద్ధి మహీపాలునకు మంత్రిత్వ, దండనాథత్వముల నెఱపగలిగినాడు — కొట్టరువు తిక్కనా మాత్యుండు (ద. 1—20); మన్మక్ష్మాపాల మంత్రి మాణిక్యునకున్ (ద.1—99); మంత్రి తిక్కండు (ద. 3—1); తిక్కన మంత్రీ (ద. 8—1); తిక్క దండా ధీశున్ (ద. 7-1); తిక్క చమూపా (ద. 9—1); తిక్క దండాధీశా (ద. 12—1).

కేతన తిక్కనను మిక్కిలి ధర్మతత్పరుడనియు, ఆశ్రితకవి బంధుజన పోషకు డనియు, వితరణఖని యనియు వర్ణించినాడు.

ధర్మతత్పరుడు—పరహితార్థికి (ద. 1-99); ధర్మోద్యోగనిరూఢమాన సోల్లాస (ద. 7-165); ధర్మవిహారసముజ్జ్వలుడు (ద. 11-1); ధర్మనిర్మలా (ద. 11-142).

కవిపోషకుడు—కవిజన రాజకీర సహకారము (ద. 1-8); సుకవీంద్ర బృంద రక్షకు డెవ్వ డనిన, వీ డను నాలుకకు దొడవైనవాడు (ద. 1-89); కవీంద్రలోకాధారుడు (ద. 2-119); పోషిత సత్కవీంద్రునకు (ద. 4—123).

ఆశ్రిత జనపోషకుడు—ఆశ్రిత భరణునకున్ (ద. 2—1); దీనజనతా నిధానంబు (ద. 1—89).

బంధుజనపోషకుడు—బుధ బంధుజనాహ్లాదన తత్పర (ద. 3—164); బంధుపాలనదక్షా (ద. 4-1); తోషిత బంధువర్గునకు (ద. 4—128).

వితరణఖని—వితరణ శ్రీయుతుడు (ద. 1—91); దానపయోధారా ఫలవితత విప్రధాత్రీజుడు (ద. 3-1); అసమ దానత్యాగలీలా సముద్యద్విన యనిధి (ద. 4—130); అర్థిజనరాధేయుడు (ద. 5-1), సతత దానవినోదీ (ద. 8-95); అర్థి మిత్రుండు (ద. 10—194).

ఇట్టి బహువిధ సుగుణ సంపదచేత నాతడు కృతార్థీభూతసంపన్నిధి (ద. 3—164).

ఇంతేకాక, తిక్కన మిక్కిలి తేజోవంతుడనియు, మన్మథునివంటి సౌందర్యము కలవాడనియు, కేతన అభివర్ణించినాడు.

తేజోవంతుడు - మేరుర తేజోరాజిత కోదోపిమురుండు (ద. 1-4); తేజోరాజిత సర్వలోకునకు (ద 2-12.), అతి ప్రకర తేజుండు (ద 2-120); మార్తాండసమానతేజ (ద 3-1..), దినినాథ జైత్ర తేజోధనసార (ద 11-143).

మదన సుందరాకారుడు— రాజత్సుందరాకారు (ద 1-7), పుష్పాస్త్ర రూపోపమా రాజన్మూర్తికి ద. 1-102), పుష్పకోదండ తను ప్రభాచరవిధాన విశారద భవ్యరూప (ద. 3-168), పుష్పశరప్రతిమాన మూర్తికిన్ (ద. 4-123), మదనసమానాకృతి హృద్యమ్మునకు (ద .-1), పంచశాబ్యంద నవీన మానసభవున్ (ద 6-194), కామిని చిత్తహారుస్ (ద. .-190), రతిపతి సమరూప (ద .-90).

అంతేకాక తిక్కన ఉద్దండపండితుడు గుణగణములచే విరాజిల్లువాడు—— సతత శుద్ధాత్ముడు (ద. 1—14), భాస్వద్గుణ విరాజిత భాస్వత్తనయుడు (ద. 1—95), కరుణార్ద్రస్వాంతుడు, పుణ్యమూర్తి (ద. 1—1 .); సౌజన్యా భరణుడు (ద. 1—101); అతుల సత్య త్యాగశీలంబులం పొరసిండు (ద. 2—113); ధీరుడు (ద. 2—11.), సతత ప్రియభాషణుడు (ద. . -163); చలనరహితచిత్తుడు (ద. 3—135), సలిలనిధి గభీరుడు (ద. 3-165), పుణ్య చరిత్రుడు (ద 4-128), ధూతకళంకుడు (ద. .—123), నిర్మలమార్గవృత్తి రమణీయుడు (ద. 5—131), ఉదారుడు (ద. 5—13.), అమృతమతి (ద. 5—135); వినయనిధి ద. 5—136); గుణజాలిక రత్నాకరుడు (ద. 6—1); వర్జిత దుర్జనసంగుడు (ద. 8—95), నిరతిశయవివేకోన్నిద్రుడు (ద. 9—36); కారుణ్యసముద్భవస్థలము (ద. 10—192), శ్రీరమణీ రమణీయ మహోరస్స్థల విజిత కాంచనోర్వీధరవిస్తారిత బలుండు (ద. 11—1); వివేక సంపదున్నత్యాభి రాముడు (ద. 11—142); అతుల శుభచరిత్రుడు (ద. 2—120); మనుమసిద్ధి మహీవల్లభునకు గరుణారస పాత్రంబైన (ద. 1—20) అమాత్యశేఖరుడు; తుహినభానుండునుంబోలె బహుకళాసంపన్నుడు, కార్తికేయునింబోలె నసాధారణ శక్తియుక్తుడు, అధరీకృత మయూరుండు, నారాయణుండునుంబోలె ననంతభోగ సంశ్లేషశోభితగాత్రుండు (ద. 1-85), కనకగిరితటీ సంకాశవక్షస్థలీ భాసుడు (ద. 1—104), నిజప్రభాదూషిత వాసవేశుడు (ద. 1—12.), అంతరద్విష న్నిర్మథన ప్రభావ మహనీయ విశాలబుద్ధి (ద. 5—135), సజ్జన ధరణీరుహో త్కరవసంతము (ద. 8—94); అనవద్య చిత్తవిద్వజ్జన మోహన నిపుణుడు

(ద. 11–143); విమంధీ సుశ్లోకుడు (ద. 12–1). ఇట్టి సుగుణసంపదచేత నాతడు నిరుపమమూర్తి (ద. 8–95). ఇట్టివాని కీర్తి పదిదిశల వ్యాపించుటలో విశేషమేమియుండును. అందువలననే కేతన–దశదిశావిక్రాంతయశు డెవ్వ డనిన వీ డని చెప్పుటకు బాత్రమైనవాడు (ద. 1–89) అని తిక్కనను అభివర్ణించినాడు.

ఆయన అనేక సన్మానములను బడసిన సన్మానసమగ్రుడు (ద. 1-99); నృపమాన్యుడు (ద 1-101); పారావార పరీత విశ్వవసుధాభాగంబునం గీర్తికాధారంబై వెలుగొందువాడు (ద. 2-118); విశ్వభూజనితాహ్లాదన సాంద్ర నిర్మల యశశ్చంద్రాతపుడు (ద. 6-194); శారద మేఘకాంతి భంజన పటు జాలము (ద. 8-94), గుణావళీభూషిత కీర్తికాంతుడు (ద. 4-123).

ఈవిధముగా తిక్కనను చిత్రించటమే కాక, కొన్ని చారిత్రక విషయములను గూడ వ్యక్తపఱచినాడు కేతన.

1. తిక్కన గృహనామము కొట్టరువువా రని ప్రప్రథమముగా చెప్పినది కేతనయే!

2. తిక్కన నిజస్థానము నెల్లూ రని కొందఱు, గుంటూ రని కొందఱు, భేదాభిప్రాయములు వ్యక్తపఱచి యున్నారు. కేతన తన దశకుమారచరిత్ర పీఠికలో "కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానం బగు విక్రమసింహపురంబు నభివర్ణించెద"(ద. 1-10)అని చెప్పి,తిక్కన నిజస్థానము నెల్లూరని తేల్చినాడు.

3. తిక్కనకు 'ఉభయకవి మిత్రు' డను బిరుదము భారతరచనమునకు పూర్వమే వచ్చినట్లు దశకుమార చరిత్రలో—

అభినుతుడు మనుమభూవిభు
సభ దెనుగున సంస్కృతమున జతురుండై తా
నుభయకవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కడు దాల్చెన్- (ద. 1–32)

అని స్పష్టముగా చెప్పినాడు.

### కేతన చిత్రించిన తిక్కన

1. అప్పటికే ఆంధ్రవాఙ్మయమున తిక్కనకు సంస్కృతమున బాణున కీయబడిన స్థాన మీయబడినట్లు దశకుమారచరిత్రలోని—

అనుపమ గౌరవ్యుఁడు తిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచారుకవితమై
నెగడిన 'బాణోచ్ఛిష్టం
జగత్త్రయం' బనిన పలుకు సఫలం బయ్యెన్ (ద. 1— )

అను పద్యమునుబట్టి స్పష్టమగుచున్నది

ఇట్లు కేతన, తనకు తిక్కనపై గల గౌరవాభిమానములను వ్యక్తపఱచుచు, ఆయన వ్యక్తిత్వమును కళ్లకు గట్టినట్లు చిత్రించినాడు.

# 2. ఆంధ్రభాషాభూషణము-
# కొన్ని పాఠభేదములు

ఈ నా పరిశోధనలో నాకు లభించిన తాళపత్రప్రతుల పాఠభేదములను, నాకు లభించిన ముద్రితప్రతులయందలి పాఠభేదములను, ఈ అనుబంధమున పొందుపరచుచున్నాను.

ఆంధ్రసాహిత్య పరిషత్తులోని ప్రతులు

| | | |
|---|---|---|
| 1. క-ప్రతి | 2. గ-ప్రతి | 3. చ-ప్రతి |
| 4. ట-ప్రతి | 5. త-ప్రతి | 6. ప-ప్రతి |

తంజావూర్ సరస్వతీమహల్‌లోని ప్రతులు

| | |
|---|---|
| 7. య—డి. నెం. 769 | 8. ర-డి. నెం. 770 |
| 9. ల—డి. నెం. 771 | 10. వ-డి. నెం. 772 |

ముద్రితప్రతులు

11. శ—వావిళ్ల ప్రతి—1932
12. ష—వావిళ్ల ప్రతి—1949
13. స-దేవినేనివారి ప్రతి—1953
14. హ-వావిళ్ల ప్రతి—1914

పై ప్రతులలో కొన్నింటిలో అధికపాఠము లున్నవి. కొన్నింటిలో ప్రస్తుతము ముద్రిత ప్రతులలో నున్న కొన్ని పద్యములు లేవు అట్టివాని నీ యనుబంధమున జూపుచున్నాను.

**అధికపాఠములు**

1. 'ఖ్యాత శుభచరితుడ' (3) అను పద్యము తరువాత ఈ క్రింది పద్యము గలదు—

ప్రమానయకును నంకమకును
సూనుడ నమిత సత్య నయవచో విభుడ వి
జ్ఞానానూన మనస్కుడ
నానాశాస్త్రజ్ఞుడను గుణాభిజ్ఞుడన్ —ష. స. ప్రతులు

2. "తత్సమంబునాగ దద్భవంబన" (15) అను పద్యము తరువాత ఈ భాగ మధికముగా నున్నది—

డు లు ము వు రు ప్రథమ నిను గూ
ర్చిల లు ద్వితీయ మఱి తోడ పదం
బులు దా దృతీయ కై కొఱ
కులు దలప జతుర్థి యన దెనుగునకున్.
పట్టి వలన కంటె యన పంచమీ విభ
క్తి యగు కి కు యొక్క లోపల షష్ఠి
జగతిలో నిందు నందు నా సప్తమి యగు
నోయి యనగ సంబుద్ధి యాంధ్రోక్తులందు.

వ. డు లు ము వు రు—యీ అయిదున్ను మాటకొనను వచ్చినపుడు ప్రథమా విభక్తు లౌను. నిను, గూర్చి—యీ రెండున్ను ద్వితీయా విభక్తులు. చేత, తో, తోడ—యీ మూడున్ను తృతీయా విభక్తులు. కై, కొరకు—యీ రెండున్ను చతుర్థీ విభక్తులు. పట్టి, వలన, కంటె—యీ మూడున్నూ పంచమీ విభక్తులు. కి, కు, యొక్క, లో, లోపల-యీ నాలుగున్నూ షష్ఠీవిభక్తులు ఇందు,అందు-యీ రెండున్నూ సప్తమీ విభక్తులు. ఓయి, నీవు—యీ రెండున్నూ సంబుద్ధి విభక్తులు. యివన్ని విభక్తు లనబడును. తత్సంధిక్రమం బెట్టిదనిన—'త' ప్రతి.

3. "అచ్చుగ నట్టి ఱు ఱను" (44) అను పద్యము తరువాత నీ పద్య మధికముగా నున్నది—

ఓతడ యన సంబోధన
నాతడ యని యాదుచోటన పద మకారం
బ్రీతి మరుతోడ మీ యన
నీతి మిల్తొడవి నాగ నిచ్చం జెల్లున్.
(పా. -నీ తెమ్మెర లొడమె యనగ నిచ్చట జెల్లున్"— చ ప్రతి)
—క. గ. చ. ప్రతులు

4 "అచ్చుగ బెఱయచ్చులపై" (48) అను పద్యము తరువాత నీ క్రింది పద్యమున్నది—

ఓతడ యగు సంబోధన
యాతండన నూదుచోటన పరమకారం
బితమ్మొదల యాడమి న
ని తమ్మొరు తోడ మనగ నెచ్చట జెల్లున్. —ర ప్రతి

ఈతడయన సంబోధన
యాతుర యని నూదుచోటన పరమకారం
బీ తెమ్మెరుల యొడవి యన
నీ తెమ్మెర లొడమి నాంగ నిచ్చం జెల్లున్. —ల ప్రతి.

కాని ఈ రెండు పద్యములకును అన్వయము కుదురుటలేదు.

5. "ఇల్లు కల్లు ముల్లు పల్లు విల్లన నివి" (74) అను పద్యము తరువాత నీ రెండు పద్యములును కలవు—

పేను మీను కూను పెక్కులై యొప్పిన
మ్రాను గేను తాను పూను పైన
యీను దేను కొను యీ రీతి పల్కుల
కాన వచ్చు బహు ప్రకారవృత్తి.

ఆలు గేలు మాట లైనట్టి పల్కుల
బెలుచ మీ లగుట బెక్కులైన
యీలక్రింద నమరు యివి గొన్ని కుఱుచలు
లు ల బహుత్వమునకు వెలుగుచుండు. —క ప్రతి.

6. "నీ సంస్కృతముతోడ సమాసించును" (134) అను పద్యము తరువాత నీ క్రింది పద్య మున్నది...

పదసంధులు నున్నతమై
యదనుగ య ర లూష్మ లొతికి పై వర్ణముతో
నదుకు నెడల గవి యనుమతి
మడి గుదియగ బడ్క వ్రాలు మానుగ ఆల్లున్. —క ప్రతి.

7. "దును మరు లొరులకు" (142) అను పద్యము తరువాత నీ క్రింది పద్య మధికముగా నున్నది—

పొల్లును నెకసంబనగా
మ్లులును నల్లంబనా ప్రమోదంబున గా
కుల్లు కహ ఈ ఆ అగు
నిల్లున కని నూత్నదంతి యా గతి చెప్పెన్. —గ ప్రతి.

8. "ఆత దిట్టివా డెట్టివా డట్టివాడు" (169) అను పద్యము తరువాత నీ క్రింది పద్యమున్నది—

ఒరుల బనుపుచోట నుటలపై టలవోవు
చుటల నెల్లం జొచ్చు బోవు
వాని మీద లు లకు మానిచి తోడ న
శత్వ మెక్కు నమనయించి పనుప —య ప్రతి

9 "తెనుగునకు లక్షణము భువి" (189) అను పద్యము తరువాత కొన్ని ముద్రితప్రతులలో మాత్ర మీ క్రింది పద్యములు అధికముగా నున్నవి—

తప్పులు దీర్పుడు కవులం
దొప్పులు గైకొనుడు దీని కోపనివారల్
తప్పొప్పని పెడబుద్ధులు
విప్పకుడీ యున్నలార వేడెద మిమ్మున్.

పాలు నీరు వేఱుపఱచు నా కలహంస
రీతి ప్రమానయార్య కేతనకవి
ఆంధ్రలక్షణంబు నలరంగ నా చంద్ర
తారకంబుగాగ దా రచించె. —ష. స. ప్రతులు

'స' ప్రతిలోని నీ రెంటికిని ముందు 'ప్రబంధ రత్నాకరము' (పుట 95) లోనిదిగా నీ క్రింది పద్యముగూడ నున్నది.

మెచ్చుడు మెచ్చువచ్చు నెడ మెచ్చకు డిచ్చకు మెచ్చుగానిచో
మెచ్చియు మెచ్చు ప్రింగకుడు మెచ్చక మెచ్చితి మంచు గ్రొచ్చలై
మెచ్చకు డిచ్చ మెచ్చుగని మెచ్చుడు మెచ్చొక మానమైనచో
మెచ్చియు మెచ్చకుండకయు మెచ్చుడు సత్కవులార ! మ్రొక్కెదన్
—స. ప్రతి.

లుప్త పాఠములు

ముద్రిత ప్రతులలో నున్న ఈ క్రింది పద్యములు వాని కెదురుగా చూప బడిన తాళపత్ర ప్రతులలో లేవు—

1. గుణదోషంబు లెఱిఁగి (')—త.
2. క్రొత్తగ నాంధ్రభాషకును గొండొక (10)-త.
3 తెలుఁగున గల భేదంబులు (14)-ర
4. ఆఱు సమాసము లిఱువది (17)-క. గ. చ. ట. ప య ర ల వ.
5. లచ్చి యన లక్ష్మి పే రగు (20) -క. గ. చ. ట ప. య. ర ల వ.
6. తెమ్మెర లేమావి తలిగన్ను క్రొన్నన (24)-క. చ
7. (వ) అనంతరంబ సంస్కృత పదంబులు (27)-వ.
8. వృక్షేణ దత్తాయి (28)-క. గ. వ.
9 లక్షణములు దెలిపెదిచో (32)-ల. వ.
10. వుణ్ణగు నుణ్ణంతముపై (33)-ర.
11. ఇల ముకారమునకు ద్విత్వమేని (36) — క. గ. చ. ట. త. ప. ర
12. తుద నాకారము లుడిపిన (37)-ప.
13. హోత ధాత యనగ నేత దాత యనగ (38)-ప.
14. అచ్చుగ నట్టి ట్టు ట్టను (44)—ర.
15. (వ) తత్సంధి క్రమం బెట్టి దనిన (46)-ట. త. ప. ర.
16. అవనినాథుడు దయజూడ కనిపినాడు (47) —క. గ. చ య ర.
17. నన్నును నిన్నును దన్నును (58)-ర.
18. నన్నెరుగు నన్ను నెఱుఁగున్ (59)-వ
19. ఏకపదమున డిమియిత్వ మొక్కొకతఱి (65)-ర.
20. కొలఁకులు నెలకు లనంగా (73)-ల. వ.
21. డు లకు నిను నేకవచనము (83)—వ.
22. ఇను డు రు లుణ్ణంతములకు (86)-ర.
23. పెడతలయును క్రేఁగన్నులు (110)-గ. చ.
24. అనియగు గుణిపిఱుద (113) -ర. వ.
25. ధీనిధి గుణపదములపై (118)-ర.
26. పే రనియెడు శబ్దం బేపారం (126)-ర.

## కొన్ని పాఠభేదములు

27 తెనుగు పదంబులపై బెంపొనరగ (132)– క. గ.

28 వాడి మయూఖము లనగా (133)–క. గ.

29 ఆ కామిని యక్కామిని (136) –గ. చ.

30 అడిగెదు నడిగెద రనగా (143)–వ.

31 ఉను డురు లొరులకు జెప్పను (144)-వ.

32. పలుకును పలుకుదు రనగా (145)–వ

33. దూయుట దాయుట దొంగయు (173)–య. ర.

34 ఉత్తమగుణ సూచక మగు (184)–ర.

# 3. విజ్ఞానేశ్వరము - గ్రంథసంస్కరణము

మూలము ననుసరించి చూచినచో విజ్ఞానేశ్వరములోని కొన్ని పద్యములు ఒక ప్రకరణమునుండి మరియొక ప్రకరణములోనికి వచ్చిపడినట్లు స్పష్టముగా గన్పట్టును. ఒక పద్యమునకును దాని తరువాతి మరియొక పద్యమునకును సంబంధము లేకపోవుటవలన నిట్టి పరిస్థితి యేర్పడినది ప్రకరణ మన నేల౦ ముద్రాపకులు అధ్యాయముల నధ్యాయములనే మార్చివేసినారు. ప్రాయశ్చిత్తా ధ్యాయము మూలమున వ్యవహారాధ్యాయమునకు తరువాత నుండగా, ముద్రిత ప్రతిలో ముందు వచ్చి చేరినది.

ఈ విజ్ఞానేశ్వర తాళపత్ర మాతృకలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో నొకటియు, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీలో నొకటియు నున్నవి వాని ననుసరించి చేయదగిన మార్పులు కొన్నియున్నవి. ఇట్లు అస్తవ్యస్తములుగానున్న పద్యములను మూలము ననుసరించి కాని, లేక తాళపత్ర మాతృకల ననుసరించిగాని, సవరించినచో సమంజసముగా నుండునని యిచ్చట సూచింపబడినది:—

1. పై రెండు తాళపత్రప్రతులందును, ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్త ధ్యాయము లని యున్నది. కాని మూలము ననుసరించి ముద్రాపకులు అధ్యాయ ములను కాండము లని మార్చివేసినారు

2 విజ్ఞానేశ్వర ముద్రితప్రతియందు గ్రంథాంత పద్యము "తజ్ఞులకు దెలియునట్లుగ" అనునది వ్యవహారాధ్యాయము చివరనుండుటచే కాబోలు ప్రాయ శ్చిత్తాధ్యాయము ముందు వచ్చి వ్యవహారాధ్యాయము తదనంతరము వచ్చినది. కాని ముద్రాపకులకు దొరికిన తాళపత్రప్రతియందు ఈ పద్యము 'వ్యవహార ధ్యాయము' చివరనే యుండినది కానోపు. అందువలననే ప్రాయశ్చిత్తాధ్యాయము ముందు వచ్చి, వ్యవహారాధ్యాయము చివరకైనది. కాని నాకు లభించిన రెండు తాళపత్ర ప్రతులందును ఈ పద్యము ప్రాయశ్చిత్తాధ్యాయము తరువాతనే

యున్నది. దానివలన వానియందీ అధ్యాయముల తారుమారును జరుగలేదు. కాని కేతన మూలమునందలి ప్రాయశ్చిత్తకాండమును సంపూర్తిగా వదలివేసి, వ్యవహారకాండమునే రెండుగా విభజించి, వ్యవహార ప్రాయశ్చిత్తాధ్యాయములుగా విభజించినా డనుట స్పష్టము.

3 "శ్రీ వాణీ గిరిజేశ" అను విజ్ఞానేశ్వర ప్రథమపద్యమునందు 'నానా విద్వత్ప్రిభులం దలంచి' (వి.— ఆ —1) అని ముద్రితప్రతియం దున్నది. కాని, సాహిత్య అకాడమీ వారి తాళపత్ర ప్రతియందు 'నానా విద్వత్సభలం దలంచి' అని యున్నది ఆరోజులలో విద్వత్సభ లుండెడి వని నన్నయగారు తమ భారతావతరణములోని "పరమ వివేక సౌరభ విభాసిత" (ఆది 1—23) అను పద్యమున స్పష్టపరచినారు. కావున అట్టి విద్వత్సభలను కేతన కూడ తలంచి నా డని చెప్పుట సమంజసముగా నుండును కావున ముద్రిత ప్రతి పాఠము కంటె తాళపత్రప్రతి పాఠమే సమంజసముగా నున్నదని చెప్పవచ్చును.

4 కేతన తండ్రిపేరు విషయమున భేదమేమియు లేదు. కాని, తల్లి పేరు విషయమున ననేక పాఠాంతరములు కన్పట్టుచున్నవి విజ్ఞానేశ్వరమున గంగమ (వి.-ఆ - 3) అని యున్నది సాహిత్య అకాడమీ తాళప్రతియందు 'నాకమ' యని యున్నది విశ్వవిద్యాలయ ప్రతియందు 'సంకమ' అనియున్నది. ఆంధ్రభాషాభూషణమున 'సంకమ' (ఆం భా. భూ.-4) అనియే యున్నది. దశకుమారచరిత్రకు పీఠిక వ్రాయుచు శేషాద్రిరమణకవులును తల్లి 'సంకమ' అనియే చెప్పినారు కావున 'సంకమ' యనునది సమంజసముగా గన్పట్టు చున్నది

5 'మానయకును' అను (వి -ఆ - 3) పద్యమున 'నానాశాస్త్రజ్ఞుడను' అనుచోట సాహిత్య అకాడమీవారి ప్రతిలో 'నానా నయశాస్త్రజ్ఞుడ' నని యున్నది. నయశాస్త్ర మనగా రాజనీతిశాస్త్ర మని యర్థము అది తెలియనిచో కేతన విజ్ఞానేశ్వరము వ్రాయుట సంభవించెడిది కాదు కావున ఈ తాళపత్ర ప్రతి పాఠమే సమంజసముగా గన్పట్టుచున్నది.

6 ఆచారకాండ 5 వ పద్యమున "మును సకలశాస్త్రధర్మము విని విజ్ఞానేశ్వరుండు" అని యున్నది కాని నాకు లభించిన రెండు తాళప్రతు లందును "మును యాజ్ఞవల్క్య ధర్మము విని విజ్ఞానేశ్వరుండు" అని గలదు పై ముద్రితప్రతి పాఠము కూడ సరిగనే యున్నను ఈ తాళపత్రప్రతుల పాఠము ఇంకను సమంజసముగ నున్నది

# 3. విజ్ఞానేశ్వరము - గ్రంథసంస్కరణము

మూలము ననుసరించి చూచినచో విజ్ఞానేశ్వరములోని కొన్నిపద్యములు ఒక ప్రకరణమునుండి మరియొక ప్రకరణములోనికి వచ్చిపడినట్లు స్పష్టముగా గన్పట్టును. ఒక పద్యమునకును దాని తరువాతి మరియొక పద్యమునకును సంబంధము లేకపోవుటవలన నిట్టి పరిస్థితి యేర్పడినది ప్రకరణ మన నేలం ముద్రాపకులు అధ్యాయముల నధ్యాయములనే మార్చివేసినారు. ప్రాయశ్చిత్తాధ్యాయము మూలమున వ్యవహారాధ్యాయమునకు తరువాత నుండగా, ముద్రిత ప్రతిలో ముందు వచ్చి చేరినది.

ఈ విజ్ఞానేశ్వర తాళపత్ర మాతృకలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో నొకటియు, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీలో నొకటియు నున్నవి వాని ననుసరించి చేయదగిన మార్పులు కొన్నియున్నవి. ఇట్లు అస్తవ్యస్తములుగానున్న పద్యములను మూలము ననుసరించి కాని, లేక తాళపత్ర మాతృకల ననుసరించిగాని, సవరించినచో సమంజసముగా నుండునని యిచ్చట సూచింపబడినది:—

1. పై రెండు తాళపత్రప్రతులందును, ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్తధ్యాయము లని యున్నది. కాని మూలము ననుసరించి ముద్రాపకులు అధ్యాయములను కాండము లని మార్చివేసినారు

2 విజ్ఞానేశ్వర ముద్రితప్రతియందు గ్రంథాంత పద్యము "తజ్ఞులకు దెలియునట్లుగ" అనునది వ్యవహారాధ్యాయము చివరనుండుటచే కాబోలు ప్రాయశ్చిత్తాధ్యాయము ముందు వచ్చి వ్యవహారాధ్యాయము తదనంతరము వచ్చినది. కాని ముద్రాపకులకు దొరికిన తాళపత్రప్రతియందు ఈ పద్యము 'వ్యవహారధ్యాయము' చివరనే యుండినది కానోపు. అందువలననే ప్రాయశ్చిత్తాధ్యాయము ముందు వచ్చి, వ్యవహారాధ్యాయము చివరకైనది. కాని నాకు లభించిన రెండు తాళపత్ర ప్రతులందును ఈ పద్యము ప్రాయశ్చిత్తాధ్యాయము తరువాతనే

12 "మెండియపు వ్రేల వెండియు" (వి -ఆ -17) అను పద్యమున 'కొండక వ్రేల జలంబును' అని యున్నది ఈ పాఠము సుబోధకముగ లేదు సాహిత్య అకాడమీ ప్రతియందు 'కొండొక వ్రేల కుశంబును' అని యున్నది బ్రాహ్మణునికి దర్భ అవశ్యము ధార్యము (వి.-ఆ.-17, 45) కావున ఇచట తాళపత్ర ప్రతి పాఠమే మిక్కిలి సమంజసముగ నున్నది.

13 ఆచారకాండ 92 వ పద్యమున "కులమొక్కటియై గోత్రము కల యక శుభ లక్షణములు గలిగి" యని ముద్రితప్రతియం దున్నది సాహిత్య అకాడమీ తాళపత్రప్రతియందు 'శుభలక్షణము'లను చోట 'సల్లక్షణము' అని యున్నది. కేవలము శుభలక్షణములే కాక, మంచి గుణములు గలది కూడ కావలెనని దీని భావము. కావున తాళపత్రప్రతి పాఠమే బాగున్నది

14 ఆచారకాండ 107 వ పద్యమున "చెప్పక మాపక కలిగిన" యను పాఠము కంటె సాహిత్య అకాడమీ ప్రతిలోని "చెప్పగ మాపగ కలిగిన" అను పాఠము సుబోధకముగ నున్నది

15. ఆచారకాండ 126 వ పద్యమున —తల్లిదండ్రుల చేత బడి ధనము నకు తనయుని సమ్మినచో నట్టివాడు కొన్నవానికి "క్రీతపుత్రు"డని మూల మున నున్నది విజ్ఞానేశ్వర ముద్రితప్రతియందు దీని "కృతకపుత్రు"డని మార్చబడినది. సాహిత్య అకాడమీలోని తాళపత్రప్రతిలో "ధనమొసగబడ యడిగికొనిన తనయుడు కొన్నతనికిని పుత్రుండయ్యెడు" అని యున్నది ఈ పాఠము మూలమునందలి యర్థమునకు దగ్గఱగ నున్నది.

16. ఆచారకాండ చివర "భూసురసంగయైన నృపపుత్రికి" అను పద్య మొకటి ప్రక్షిప్తమని అధోజ్ఞాపికలో నీయబడినది. విశ్వవిద్యాలయ అకాడమీ ప్రతులలో నిది ఆచారకాండ వరుసయందే గలదు కాన నిది యమూలకమైనను ఆచారకాండ వరుసయందే యుండుట సమంజసము

17 ముద్రిత ప్రతిలోని 8, 9, 10, 11, 12, 13 (ఆచారకాండ) పద్య ములు అకాడమీవారి తాళపత్రప్రతిలో వదిలివేయబడినవి. ఇట్లే పై పద్య ములు అమూలకములగుటచే బహుశః వదలివేయబడినవేమో కాని, యందలి 10 వ పద్యము ఇంచుక మార్పుతో విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యయం దున్నది కాని దీనిని కూడ వదలుట శోచనీయము ఇట్లే 13 వ పద్యము కూడ అమూలక

మగుటచే వదిలివేయబడియుండవచ్చును కాని, విశ్వవిద్యాలయప్రతిలో పై పద్యము లన్నియు గలవు

18 వ్యవహార కాండములోని నిక్షేప ప్రకరణమున "భ్రేషశ్చే న్మార్గితే దత్తే దాప్యో దండంచ తత్సమం" అని రెండింతలు ధనము చెల్లించవలె నని మూలమున నుండగా "ధనముగాఁ గొన్నతడు రెండు దండు వచ్చు"(వి.-వ్య - 39) అని విజ్ఞానేశ్వర ముద్రితప్రతియందు దున్నది. దీనిని అకాడమీవారి తాళప్రతి ననుసరించి "ధన మొసంగిననతడు రెట్టి గొనగవచ్చు"అని మార్చినచో మూలమున కనుగుణముగ నుండును

19. "ఓలిని వడ్డిని గొలములు" (వి.-వ్య.-65) అనుదానిని విశ్వవిద్యాలయ తాళపత్ర ప్రతి ననుసరించి 'ఓలిన వడ్డికి గొలములు" అని మార్చినచో నర్థము సుబోధకముగ నుండును.

20. "అరువంగ బూట పడి నత" (వి.-వ్య -87) డను పద్యమును విశ్వవిద్యాలయ తాళప్రతి ననుసరించి, "అరువదగు పూట పడి నత" దని మార్చినచో నర్థము స్పష్టముగ నుండును.

21. ముద్రితప్రతిలోని 151 వ పద్యము తరువాత సాహిత్య అకాడమీ వారి ప్రతియందు దీ క్రింది రెండు అసంపూర్ణ పద్యములును గలవు-

జ్ఞాతియు సామంతుండును
ఖ్యాతయు భృత్యుండు వీరు ప్రభవింపక ము
న్నతను సాక్షి [ ] నతని
ధాతము నోవ దుష్ఠి [ ] దాఁ జెల్లింపన్.
దృశ్యాపాగ [ ]
దృశ్యత నోవర్తించి పిదప దెలుపగ [ ]
వశ్యముతో [ ] యిబిన
నశ్యంబగు కార్య మొరిగి నడిచెన మేదిన్.

ఈ పద్యములలో కుండలీకరణములలోని భాగము క్రిమిదష్టమైపోయినది అర్థమును సుబోధకముగ లేదు.

22 వ్యవహారకాండ 2 వ పద్యమున విషసర్పదివ్య విధానము చెప్ప బడినది ఈ పద్యము తాళపత్ర ప్రతులలో లేదు

23 ప్రాయశ్చిత కాండములోని 'పదియు నరసంబు మాషంబు పదియు నాఋ' (వి -ప్రా -<sup></sup>) అను పద్యము అకాదమీ తాళ ప్రతిలో లేదు.

24 'వేఱొకని సొమ్ము మ్రుచ్చిలి'(వి -ప్రా -23) అను పద్యము చివర 'రాఁ బదియాఱు పణము కొనగు దండు మహిపాలకిన్' అని యున్నది. మూలమున నిచట "అనివేద్య నృపే దంత స్వాకు షణ్ణవతిం పణాన్"(యాజ్ఞ.- వ్య -170) అని గలదు కాని అకాదమీ తాళప్రతియందు 'తొంబదియాఱు పణము'లనియే గలదు. ఇది కేతన కాలానుగుణముగ కావించిన మార్పు కావలెను లేదా తాళపత్రప్రతి లేఖకుని దోషమైన కావలెను.

25. ప్రాయశ్చిత్తకాండ 49 వ పద్యమున "వేపణము" లని ఒక ప్రయోగమున్నది దీనిని పలువురు వ్యాకర్తలు గసడదవాదేశసంధికి అప వాదముగా చెప్పినారు కాని ఇచ్చట అకాదమీ తాళప్రతియందు "వేయు పణముల నెనిమిదియు" అని పాఠాంతర మొకటి కలదు దీనివలన కేతన ప్రయోగమునందలి అసాధుత తొలగిపోవును కాని ఇచట ప్రాసభంగ మగును ఆకాలమున తెలుగుపదములపైన సంస్కృతపదములకు గూడ గసడదవాదేశ మయ్యెడిది

నన్నయకు పూర్వపు శాసనములలో ''వెన్నమ ప్రకాశముగాన్" (ఆం. భా చ -పుట 1347)ఇత్యాది స్థలములలోను, నన్నయ భారతమున పెద్దగాలంబు (ఆది. 3-31) ఇత్యాది స్థలములలోను, ఇది అంగీకరింప బడినది. కావున 'వేవణములు' అనునది సరిగనే తోచుచున్నది

26. ప్రాయశ్చిత్త కాండములోని 54, 55, 56 పద్యములు అకాదమీ వారి తాళపత్రప్రతిలో లేవు. ఇందలి 56 వ పద్యము వాక్పారుష్య ప్రక రణములోనిది కాని వాక్పారుష్య ప్రకరణము 42 నుండి 49 వఱకును నున్నది. 42 నుండి 49 వఱకు నున్న వరసలో నుండవలసిన పద్యము 56 గా వచ్చి పడినది.

27. గోమహత్త్వమును తెల్పు 57, 58, 59 పద్యములు (ప్రాయశ్చిత్త కాండము) మూలమున పూర్తిగా వదలబడిన ప్రాయశ్చిత్తకాండములోనివి. అవి అనువాదమున నే సంబంధమును లేక దండపారుష్య సాహస ప్రకరణ ముల నడుమ చేరినవి కాని యివి, తాళపత్ర ప్రతులందును నచ్చటనే గలవు.

23 ప్రాయశ్చిత్తకాం డారంభమునందలి 1,2,3 పద్యము లమూకములు. ఇవి యెక్కడినుండియో వచ్చి ప్రాయశ్చిత్తకాండమందు పడినవి· కాని యివియను తాళపత్రప్రతులం దచ్చటనే గలవు.

29. ప్రాయశ్చిత్త కాండలోని 57 వ పద్యమున 'పిన్నదాని' యను దానికి మూలము "శిశౌ" (యాజ్ఞ.-26) అనునది దీనిని 'పిన్నవాని' యని మార్చినచో మూలానుగుణముగ నుండును.

30. అన్యు లెవ్వరి ధనమైన నపహరించినచో ఉత్తమ సాహస దండన మని మూలము అనువాదమున నచట "అన్యు లెవ్వరి ధనమైనను గొనజేయ నెనిమిది పణములు గొనగ వలయు" (వి -ప్రా -99) అని యున్నది. ఇందులో 'గొనఁజేయ నెనిమిది పణము'లను దానిని'గొన వేయు నెనిమిది పణము' లని ఇంచుక మార్చినచో మూలమునకు సరిపోవును.

31. "అరయక విల్చిన సరకు మెచ్చక యున్న" (వి -ప్రా.-30) అను పద్యమున, 'సరకు మూడవనాడు మరల నీ దలచిన వెల పదేడవ పాలు విడవ వలయు' అని యున్నది· ఇచ్చట మూలమున 'పదునేనవపా'లని (మితా -వ్య -175) యున్నది. కావున అనువాదములోని 'పదేడవ' అనుదానిని 'పదేనవ' అని కొంచెము మార్చినచో మూలమునకు సరిపోవును.

32 ఒడబడని పణ్యకాంతల శరీరముపై బలవంతమున నఖదంత క్షతము లొనర్చిన వానికి రోవెల కెనిమిది రెట్లని మూలమున (యాజ్ఞ -290) యున్నది అనువాదమున నిచట 'నెనిమిది పణము'లనియే గలదు. కాని విశ్వ విద్యాలయ ప్రతి ననుసరించి 'ఎనిమిది గుణంబు' లని సవరించినచో మూల మునకు సరిపోవును.

33. మూలమున ఈ 18 వ్యవహార పదములును ఒక వరుసలో చెప్ప బడినవి. కేతన అనువాదమున నివి తారు మారైనవి. కాని ఈ తారుమారు కూడ 'విజ్ఞానేశ్వరము' లోని వ్యవహార కాండమున నేమియును జరుగలేదు. కేవలము ప్రాయశ్చిత్త కాండముననే జరిగినది. అయినను మూలమునందలి యే వ్యవహారపదమును వదలక కేతన అన్నింటిని వివరించినాడు ఏ ప్రకరణము న

కా ప్రకరణము స్వతంత్రము లగుటచే అట్లు తారుమా రగుటవలన కల్గిన ప్రమాద మేమియును లేదు అదియునుగాక, విజ్ఞానేశ్వరుడు కూడ ఇట్లే ప్రకరణములను పట్టికలో చూపినట్లు చెప్పక రారుమారుచేసి, స్వామి పాలవివాద ప్రకరణారంభమున "వ్యవహార పదానాం పరస్పర హేతు మద్భావాభావా త్తేషా మాద్య మృణాదాన మిత్యాదినా పాఠకయో న వివక్షితః" (మితా -వ్య.-157) అని చెప్పకొనినాడు.

తాళప్రతులలో క్రిమిదష్టములై కొన్ని భాగములు చదువుటకు కూడ శక్యము కాకపోవుటచే కొన్నింటికి మూలము ననుసరించి మార్పులు సూచింపవలసి వచ్చినది

ఇట్లు విజ్ఞానేశ్వరమును సంస్కరించినచో నెంతయో బాగుండును

# దశకుమారచరిత్రము

## గ్రంథసూచిక


1. తెలుగు -

1. ఆంధ్రకవితరంగిణి - శ్రీ చాగంటి శేషయ్య
2. ఆంధ్ర దశకుమార చరిత్ర - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి
3. ఆంధ్ర నవలా సాహిత్య పరిణామము - డా॥ బి. వి. కుటుంబరావు
4 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము - శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రి
5. కవిత్రయ కవితారీతులు - తరువాతి కవులపై వారి ప్రభావము - శ్రీమతి దేవిరాజు భారతీదేవి
6 కేయూరబాహు చరిత్రము - మంచెన
7 తిక్కన - కావ్యశిల్పము - తత్త్వదర్శనము - డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి
8 తిక్కన సోమయాజి - శ్రీ చిలుకూరి వీరభద్రరావు
9 తెలుగు కావ్యాదర్శము - శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి
10. తెలుగు విజ్ఞాన సర్వస్వము - 1, 2, 3 భాగములు
11. దశకుమారచరిత్రము - శ్రీ ఎనమచింతల సంజీవరాయ శాస్త్రి
12. నిర్వచనోత్తరరామాయణము - తిక్కనసోమయాజి
13. పంచతంత్రము - దూబగుంట నారాయణకవి
14. పంచతంత్రము - వైచరాజు వేంకటనాథుడు
15. పతివ్రతాచరిత్రము
16. బసవపురాణము - పాల్కురికి సోమనాథుడు
17. భానుకవి పంచతంత్రి - భానుకవి
18. భోజరాజీయము - అనంతామాత్యుడు
19 విక్రమార్కచరిత్రము - జక్కన
20. శుకసప్తతి - పాలవేకరి కదరీపతి

21. షోడశకుమార చరిత్రము - వెన్నలకంటి అన్నయ
22. సకలనీతికథానిధానము - ఎఱ్ఱయ
23. సింహాసనద్వాత్రింశిక - కొఱవి గోపరాజు
24. సిద్ధేశ్వరచరిత్రము - కాసె సర్వప్ప
25. సి.పి బ్రౌన్ - డా॥ కొత్తపల్లి వీరభద్రరావు
26. హంసవింశతి- అయ్యలరాజు నారాయణామాత్యుడు

**2.** సంస్కృతము -

1. అవంతిసుందరి కథా - దండి
2. అవంతిసుందరి కథాసార - దండి
3. కావ్యాలంకార సంగ్రహమ్ - భామహః
4. దశకుమారచరితా - 'పదచంద్రికా', 'భూషణ', 'లఘుదీపికా' సహితమ్

**3.** కన్నడము :-

1. అభినవ దశకుమారచరితె - చౌండరాజు
2. కథామృతం - ఏ. ఆర్. కృష్ణశాస్త్రి

**4. ENGLISH:-**

1. A History of Sanskrit Literature – A. B. Keith
2. An Introduction to the Study of Literature–William Henry Hudson
3. History of Classical Sanskrit Literature- M. Krishnamachariar
4. History of Sanskrit Literature. – S. K De
5. Introduction to Dasakumaracharita – M. R. Kale
6. Introduction to Sahitya Darpana – P. V. Kane
7. Katha Sahitya in Telugu Literature (Upto 1800 A. D.)— Smt. C. Vijayalakshmi
8. Studies in Dasakumaracharita – Dr. B. R. Sastry
9. The Foundations of Indian Poetry – J. Noble
10. The Geographical Data of the Raghuvamsa & Daskumara Charita – Mark Collins
11. Vasavadatta of Subandhu – (Trans) Louis. H. Gray

# ఆంధ్రభాషాభూషణము

## గ్రంథసూచిక

1. తెలుగు -

1. అప్పకవీయము - కాకునూరు శ్రీ అప్పకవి
2. ఆంధ్రకౌముది - గణపవరపు వేంకటకవి
3 ఆంధ్రభాషాచరిత్రము - 1,2 భాగములు - డా॥ చిలుకూరి నారాయణరావు
4. ఆంధ్రభాషానుశాసనము - శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
5. ఆంధ్రభాషావికాసము - శ్రీ గంటిజోగి సోమయాజి
6. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము - 1, 2, 3 భాగములు
7. కవిసంశయ విచ్ఛేదము - అదిదము సూరకవి
8. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
9. కౌముదీ శరదాగమము
10. చింతామణీ విషయ పరిశోధనము - శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి
11. ఛందోదర్పణము - అనంతామాత్యుడు
12. నన్నయభారతము - డా॥ దివాకర్ల వేంకటవధాని
13. పేటికావ్యాఖ్య - శ్రీ దూసి శ్రీరామమూర్తి
14. ప్రాఙ్నన్నయ యుగము - డా॥ దివాకర్ల వేంకటవధాని
15. ప్రౌఢవ్యాకరణము - శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు
16. బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక - శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి
17. బాలవ్యాకరణము - చిన్నయసూరి
18. బాలవ్యాకరణోద్ద్యోతము - శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి
19. బాలసరస్వతీయము - ఎలకూచి బాలసరస్వతి
20. భాషోత్పత్తిక్రమము - కోరాడ రామకృష్ణయ్య
21. వైయాకరణ పారిజాతము - శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి
22. వ్యాకరణ సంహితా సర్వస్వము - 1, 2 భాగములు—
వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి

23. వ్యాకరణములు - కవిప్రయోగసరళి - శ్రీ నిడదవోలు వేంకటరావు
మద్రాసు విశ్వవిద్యాలయము - వా. 16-1959...60
పత్రికలనుండి పునర్ముద్రితములు
అ మద్రాసు విశ్వవిద్యాలయము వా. 16 1959-60
ఆ. ,, వా. 15 1958-59
ఇ. ,, వా. 15 1958-59
ఈ. ,, వా. 16 1959-60
24. శకటరేవ నిర్ణయము
25. సంధి - శ్రీ కోరాడ రామకృష్ణయ్య
26 సర్వలక్షణసారసంగ్రహము - కూచిమంచి తిమ్మకవి

**2.** సంస్కృతము :-

1. అగ్ని పురాణమ్ - మహర్షి వేదవ్యాసః
2. అథర్వణ కారికావళి - అథర్వణాచార్యః
3. అష్టాధ్యాయి - పాణిని
4. అహోబల పండితీయమ్ (కవిశిరోభూషణమ్) - అహోబలపండితః
5. ఆంధ్రశబ్ద చింతామణి
6. కథాసరిత్సాగరమ్
7. కవిజనమండనటీక - ద్వితింత్రిణీ శ్రీసీతారామకవి
8. లఘుసిద్ధాంత కౌముది

**3.** కన్నడము :-

1. కర్ణాటకభాషాభూషణము - నాగవర్మ (2)
2. కావ్యావలోకనం — నాగవర్మ
3. శబ్దమణిదర్పణము - కేశిరాజు - లింగణారాధ్య విరచిత వృత్తి సహితమ్.

**4.** హిందీ :-

1. సంస్కృత వ్యాకరణశాస్త్ర కా ఇతిహాస్ - శ్రీ యుధిష్ఠర మీమాంసక్

**5. ENGLISH :-**

1. Systems of Sanskrit Grammar - Dr. S. K. Belvalkar

# విజ్ఞానేశ్వరము

## గ్రంథసూచిక


**1. తెలుగు :-**

1. కౌటిలీయార్థశాస్త్రము – శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య
2 ధర్మప్రవృత్తి – నారాయణభట్టు
3. పురాణోక్త కర్మప్రకాశిక – చల్లా లక్ష్మీనృసింహ శాస్త్రి
4. భారతీయతత్త్వశాస్త్రము – (అను) శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
5. మానవ ధర్మచంద్రిక - శ్రీ తెన్మరం వేంకటాచార్య పండిట్
6. యాజ్ఞవల్క్యమహాముని చరిత్రము – కొలకుల పిచ్చనకవి
7 విజ్ఞానసర్వస్వము – 1, 2, 3 భాగములు
8. విజ్ఞానేశ్వరము – (తాళప్రతి - 13) – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
9. విజ్ఞానేశ్వరము – (తాళప్రతి - 322) – సంస్కృత అకాడమీ – ఉస్మానియా విశ్వవిద్యాలయము.
10. శుక్రనీతి సారము – శ్రీ పురాణపండ మల్లయ్య శాస్త్రి
11. సంస్కార సముచ్చయము
12. సదాచారము – కనుపర్తి మార్కండేయ శర్మ
13. సనాతనధర్మ ప్రశ్నోత్తరావళి - శ్రీ కనుపర్తి మార్కండేయ శర్మ
14. సర్వసిద్ధాంత సౌరభము – 3వభాగము – అనుభవానంద
15. హిందూ అధికృత – శ్రీ దాసు దామోదర రావు
16. హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము – చిన్నయసూరి
17. హేమాద్రి పాయశ్చిత్తకాండము

**2. సంస్కృతము :-**

1 గౌతమ ధర్మసూత్రాణి – హరదత్త మితాక్షరా సహితమ్
2. చతుర్వర్గచింతామణి – ప్రాయాశ్చిత్తకాండం – హేమాద్రిసూరి
3. చరక సంహితా – సూత్రస్థానమ్ – అగ్నివేశ మహర్షి

4. పరాశర స్మృతి ః - పరాశరః
5. మను స్మృతిః - కల్లూకభట్ట కృత మిటాక్షరా సహితమ్
6. విజ్ఞానేశ్వరీయమ్ (మితాక్షరా, - విజ్ఞానేశ్వరః
7. యాజ్ఞవల్క్య స్మృతిః - యాజ్ఞవల్క్యః
8 స్మృతిముక్తాఫలమ్ - వైద్యనాధదీక్షితః

**3. హిందీ —**

1. ధర్మశాస్త్ర కా ఇతిహాస్ - భాగ్ 2 - (అను) శ్రీ అర్జున చౌబే కాశ్యప్

**4. ENGLISH :-**

1. Ancient Hindu Judicature — Guru Raja Rao
2. Dharma Kosam — Vyavahara Kanada — Vol I Parts I&2
3. Down Fall of Hindu India — C V.Vaidya
4. History of Dharma Sastra- Vols I,2 (Parts-I & 2), 3,4 & 5– Bharata Ratna, Maha Mahopadhyaya, Sri P.V Kane
5. History of Sanskrit Literature — Mcdownell
6. Rigvedic Culture — Mcdownell
7. Social & Economic Conditions in "Estern Deccan" (from A.D. 1000 to 1250) Mrs. A.Vaidehi Krishna Murthy
8. Studies in Ancient Law & Justice — R K.Chowdhary

